

శ్రీమదాంధ్ర వాల్మీకి

# వచన రామాయణము

## సుందర కాండము



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిస్టర్డ్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)

శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.



వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు

తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు.

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.



ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.

(signature)

(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక

# సుందర కాండము



పరిష్కర్త

శ్రీ వింజమూరి శేషఫణి శర్మ


ముద్రణా సహకారం

pravachanam.com బృందం

# సుందర కాండము

**శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి.రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్

**ముద్రిక ప్రింటర్స్, విజయవాడ**

# నివేదన

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ నారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తిచేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమ పదవాసులు శ్రీమాన్ వేంకటరాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్రశాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్షజ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకటనరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును

అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తర కాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆధ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధా కృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ-ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము'లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు - లీల దంపతులును, 'సుందరకాడము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య - భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు - విజయలక్ష్మి దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారికి సర్వహక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా

సంపుటీకరణములైన సన్మార్గదర్శనము, ఆత్మజ్ఞానమునకాధారము, అహం వేద్మి మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచ వలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృపజేసినందున ఆమె మఱియు ఆమె కుటుంబము తరఫున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'ప్రవచనం.కాం' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగును గాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి.

ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ముందుమాటలు

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృత మైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియైయున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావుగారిచే రచింపబడినది. కనుక

దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించు చుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాలస్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకటరాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తలపైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్‌లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచన లిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయిభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము,

శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీనారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

(సం) **శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారిరుద్రవరము)**






**శ్రీ**మాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞానవైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రతయగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

"సీతాయాశ్చరితం మహత్" అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పుకొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము – కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మికమైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష–విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో – గ్రాంథికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు – వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండ ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠకలోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింపచేసిన ధన్యచరిత మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీసంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

**26-12-1989**



**శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

# ఆశీస్సు



**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖాపేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుషశేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనము లేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షాపేక్ష మగుట చేతనున్నూ – ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాస ముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు

అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతఃప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్ఛరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదఃప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా

సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె – గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**"మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయా శ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యములగు నటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

**(సం) మొలుగు రామానుజాచార్యులు**
**ముగ్గుళ్ళ**

# విషయసూచిక

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

## సుందర కాండము

కం॥ శ్రీ శరణ! యాజవంజవ
దాశరథి గురుతరికర్ణ ధారా! శ్రద్ధా
శ్రీ శస్త భక్తి తరవ
ణ్యా! శర్మద జానకీ మనోంబుజధామా!

## మొదటి సర్గము

**హనుమంతుడు మహేంద్ర పర్వతమున విహరించుట :**

ఆ తరువాత శత్రు సంహారుడును రామదూతయునగు హనుమంతుడు రావణాసురుని చేత దొంగిలింపబడిన భూపుత్రుని వెదకుటకై చారణులు సంచరించు ఆకాశమార్గమున వేగముగా వెళ్లదలచెను. తలను మెడను నిక్కించి ఆబోతువలె అందముగలవాడై యెప్పుడు నెవ్వరికిని శక్యముగానిదైన గొప్ప పనిని చేయుటకై మనస్సునందు తలచెను. మంచి వైడూర్యముల కాంతి గలిగి మంచునీటివలె అందముగానున్న పచ్చిక బయళ్లయందు ఇష్టముతో ఆ వానరేశ్వరుడు విహరించెను. పక్షులను బెదరించుచు, మృగసంఘముల నదలించుచు, రొమ్ముతో గొట్టి చెట్లను నేలగూల్చుచు పర్వతమును గంపింప

జేయుచు విజృంభించిన సింహమో యనునట్లు తిరిగెను. ఎఱ్ఱగాను, పచ్చగాను, నీలముగాను, ఆకుపచ్చగను, ఇంకను అనేక విధములైన రంగులు గల ధాతువుల చేతను, అందమైన యక్ష కిన్నెర గంధర్వాది దేవతా స్త్రీలచేతను నిండి యున్నదియు, మనోహరమైనదియునగు నామహేంద్ర పర్వతమునందు మదించిన ఏనుగులు స్వేచ్ఛగా సంచరించుచుండును. ఆ పర్వతమునందు హనుమంతుడు ఆనందముతో మడుగులో విహరించు ఏనుగువలె ప్రకాశించెను. సూర్యునకును, ఇంద్రునకును, వాయువునకును, బ్రహ్మకును, ఇంకను అనేకులగు దేవతలకును భక్తిగా నమస్కరించి వాయుపుత్రుడు సముద్రమును దాటుటకై ప్రయాణమయ్యెను. తూర్పు దిక్కుగా తిరిగి, తన తండ్రియైన వాయుదేవునకు చేతులు జోడించి నమస్కరించి, ఆ కార్యదక్షుడు దక్షిణ దిక్కుగా తిరిగి సముద్రమును దాటుటకై తన శరీరమును పెంచెను. వాయుపుత్రుడైన హనుమంతుడు స్థిరమైన ఆలోచన గలవాడై, రామచంద్రుని కార్యమును సాధించుటకై వానరులందఱు తనను చూచుచుండగా, పర్వదివసములందలి సముద్రమో యనునట్లు తన శరీరమును బెంచెను.

**హనుమంతుని విక్రమమునకు మహేంద్రగిరి చీకాకుపడుట :**

అపరిమితముగా పెరిగిన శరీరముతో సముద్రమును దాటవలెననెడు నిశ్చయముతో వాయుపుత్రుడు చేతులతోడను, కాళ్లతోడను ఆ పర్వతము నిటునటు కదలజేసెను. అట్లు వానర శ్రేష్ఠునిచే పీడింపబడిన పర్వతము అచలమయ్యును ఒక్క ముహూర్త కాలము కంపించినదయ్యెను. ఆ పర్వతము మీదనున్న చెట్లు మంచి సువాసన గల పువ్వులనెల్ల ఆ కొండ నిండునట్లుగా రాల్చెను. గుమ్మను సువాసనలు వెదజల్లుచు రాలిన పుష్ప సమూహముతో నిండి ఆ పర్వతము మిక్కిలి రమ్యముగా నుండెను. ఉత్తమమైన పరాక్రమము గలిగిన ఆ వానర వీరునిచే పీడింపబడినదై, ఆ పర్వతము మదించిన ఏనుగు మదజలమును స్రవించినట్లు నీటిని అధికముగా కార్చెను. గడగడ వణకుచునున్న

ఆ పర్వతము నడుమ వెండి, బంగారము, కాటుక ఉండెడి పొరల వరుసలు క్రమముగా ముసుగు తీసిన విధముగా కానబడెను. ధగ ధగమను నడి జ్వాల గలిగి చుట్టు పొగలు గలిగిన అగ్నివలె మహేంద్ర పర్వతము మణిశిలలతో గూడిన పెద్ద పెద్ద బండరాళ్లను వేగముగా క్రిందబడునట్లు త్రోసెను. ఆ పర్వతము గడగడలాడుచుండగా తడబడుచు గుహలందున్న వన మృగములన్నియు భీతిచెంది అరచు ధ్వనులు దిక్కులను భూమిని వ్యాపించెను. ప్రఖ్యాతమగు నామహేంద్ర పర్వతమునందు జరించు సర్ప సమూహములు స్వస్తిక చిహ్నములుగల పడగలను భయంకరముగా విప్పి గొప్ప తీక్షణమైన అగ్నితో సమానమగు విషమును అధికముగా వెడలగ్రక్కుచు తమ వంకరలైన కోరలతో రాళ్లను కొఱకగా నవి పఠీలున వేయి ముక్కలై పగిలెను. ఎంతటి విషమునైనను ఒక్క నిమిషములో నిశ్శేషముగా తొలగించగలిగినవైనను ఆ పర్వతము నందలి వనమూలికలు ఆ విషమును తొలగింపలేనివయ్యెను. ఆ సర్పముల విషమెంత తీవ్రమో కదా! ఇట్లు బ్రద్దలగుచున్న పర్వతమును చూచి నిర్వేఱ చెందినవారై పారిపోదలచి వేగముగా తమ చేతనున్న పానపాత్రలును, భక్ష్యములును, పాయసములును, తమ మొలలందున్న బంగారు పిడులు గల బాకులును, వృషభ చర్మ నిర్మితములైన కవచములు తొలగిపోగా వానినన్నిటిని వదలి, హారములును, కంకణములును, కేయూరములును, ఘల ఘల మ్రోయుచున్న అందెలును కలిగి అంగనలు తమ వెంటరాగా, విద్యాధరులు ఎఱ్ఱని పద్మముల వంటి కన్నులు గలవారై, మెడలలో హారములు తూగాడుచుండగా ఆకాశవీధి కెగసిరి. ఆ వానరనాథుని పనికి విస్మయము పొందినవారై నిశ్చేష్టులై, అసుర విరోధియైన వాయుపుత్రుని ఆకాశమునందున్న దేవతా స్త్రీలు చూచిరి. విద్యాధరులును, మహర్షులును, తమ విద్యా ప్రభావముచే ఆకాశమున గుంపులు గుంపులుగా గూడి నిలబడి అప్పుడా పర్వతము యొక్క చోద్యమును జూచిరి. సిద్ధచారణ సమూహములు “పర్వతాకారుడై అంజనా తనయుడు అదిగో రాముని

పనికై సుగ్రీవుని కొరకై అత్యధికమైన వేగముతో ఔద్ధత్యముతో దుష్కరమైన పనిని బూని సమీపింపరాని సముద్రము యొక్క ఆవలి తీరమును చేరదలంచుచున్నాడు చూడుడు” అని పల్కుచుండగా విద్యాధరులు వినిరి. ఆ మహాత్ముల మాటలను విని, పర్వత శిఖరముననున్న ఎన్నరాని బలముగల వాయుపుత్రుని చూచి విద్యాధరుల సమూహము అద్భుత రసమును పొందెను. పెద్దకొండవలెనున్న ఆ వానరశ్రేష్ఠుడు శరీరము నొక్కసారి విదలించి రోమములను నిగూడించి, వర్షించెడు మేఘము వలె గట్టిగా ధ్వని దిక్కులను తాకునట్లు గర్జించెను. రోమములతో నిండి యున్నదియు, భయంకరమై వంకర దిరిగియున్నదియునైన తోకను, విష్ణుమూర్తి వాహనమైన గరుత్మంతుడు పామునువలె విదల్చెను. ఆ మహా వేగముగల హనుమంతుని వంకరయగు వాలము గరుత్మంతునిచే పట్టుకొనబడియున్న సర్పము వలె నొప్పుచుండెను.

**హనుమంతుడాకాశమున కెగిరి కపులచే సెలవు గైకొనుట :**

వాయుపుత్రుడు గొప్ప యినుప గుదియల వంటి చేతులను బిగబట్టి భుజమును, మెడను కుంచించి మోకాళ్లు సగము వఱకు ముందుకు వంచి పాదములు రెండును దగ్గరగా నుంచి వేగముగా కుదించి, చెవులను చిన్నవగునట్లు చేసి, పెదవులను బిగబట్టి నడుము భాగమును లోపలికి పోవునట్లు కుంచించి కనురెప్పలను పైకెత్తి చాలదూరము చూచి, కాళ్లతో పర్వతమును నొక్కిపట్టి ఊపిరి బిగబట్టి సముద్రమును దాటుటకు సిద్ధపడి చుట్టుప్రక్కలను జూచి, భయము లేని మనస్సు గలవాడై, తాను చేయవలసి యున్న కార్యమును తలంచి, తన పరాక్రమమును తలంచి ధైర్యము వహించి అట్టె కుప్పించి ఎగసెను. అట్లు పైకెగయుచు ఆ వాయుపుత్రుడచ్చటనున్న వానరులతో సంతోషముతో తన మగటిమిని దెల్పు మాటలతో నిట్లనెను. “అతి వేగముతో వాయువుతో సమానమగునట్టి శ్రీరాముని బాణము వలె నేను లంకలో ప్రవేశించెదను. అచ్చట రామపత్ని కనబడకున్నచో నట్లే స్వర్గమునకు వెళ్లెదను. అచ్చట గూడ

జానకి కనబడకపోయినచో రావణుని బంధించి తీసికొని వచ్చెదను. ఏ విధముగానైనను ఆ రాముని పత్నిని తీసికొని వచ్చెదను సుమండీ! లేకున్న ఆ లంకా పట్టణమునే ఇచ్చటికి దెచ్చెదను. రావణుని పట్టి క్రూరముగా నొప్పించెదను. ఓ వానరులారా! నేను కార్యమును సాధించిన వాడనై తిరిగి వచ్చెదను సెలవిచ్చెదరా"?

**హనుమంతుడు వెళ్లు వేగమును వర్ణించుట :**

అని చెప్పుచు చివుక్కున నెగిరి హనుమంతుడు తన మనసునందు తనను వినతాపుత్రుడైన గరుత్మంతునిగా దలంచుకొని వెళ్లుచుండగా ఆ వేగమునకు చెట్లన్నియు, పక్షుల తోడను, పువ్వుల తోడను వేగముగా ఆకాశమున కెగిరి అతనితో గూడ దూరదేశమునకేగు చుట్టమును సాగనంపుచున్న బంధువుల వలె వెంట వెళ్లెను. సైన్యాధిపతిని వెన్నంటుచున్న సైన్యములా యనునట్లు మద్ది చెట్ల గుంపులప్పుడు ఆ వాయునందనుని వేగముచే పెకలింపబడినవై యతని ననుసరించ వెళ్లెను. ఒత్తుగా పూచియున్న కొమ్మలతో మొదళ్లతోనున్న చెట్ల సమూహములు వెంట వెళ్లుచుండగా ఆ కపికుంజరుడు ఒక పర్వతము వలె అద్భుతముగా తోచెను. ఇట్లు వెంట వచ్చిన చెట్లు వజ్రధరుడగు నింద్రుని వలన భయముతో సముద్రమున మునుగు పర్వతములవలె గభాలున సముద్రమునబడి మునిగిపోయెను. మేఘము వంటి యాకృతి గల ఆ హనుమంతుడు మొగ్గలతో గూడియున్న పూవు గుత్తులతో గూడి రాత్రియందు మిణుగురు పురువులతో గూడియున్న పర్వతము వలె ప్రకాశించెను. వేగముగా వెంట వెళ్లజాలక చిక్కిన వృక్ష సమూహములు తమ పువ్వులన్నియు రాలు చుండగా, జలపూరము వఱకు సాగనంపు హితుల సమూహము వలె నీటిలో బడెను. ఆ వానరశ్రేష్ఠుని వేగము గల గాలిచే కదలి, వెంట వెళ్లిన కుసుమములు తేలికవగుటచే ఎక్కువ దూరము వెళ్లజాలక వేలకొలదిగా సముద్రమునందు పడెను. అంతటను అట్టి పువ్వులతో నిండియున్న సముద్ర మప్పుడు నక్షత్ర

సహస్రములతో నిండియున్న ఆకసమువలె నొప్పారెను. వివిధ వర్ణములు గల పువ్వులతో ఆవరింపబడియున్న వాయుపుత్రుడు మెరపులతో గూడిన మేఘము వలె వింతగా ప్రకాశించెను. వాయుపుత్రుని వేగముచే వేగముగా రాలిపడిన పుష్ప సమూహముతో సముద్రము నక్షత్ర సమూహముతో మనోహరమై యున్న ఆకాశము వలె నొప్పుచుండెను. ఆకాశ మార్గమున వెళ్లుచున్న హనుమంతుని చేతులు పర్వతము నుండి తలలు నిక్కించి పరువెత్తుచున్న ఐదు తలల సర్పము వలె భయంకరములై యుండెను. ఆ వానరశ్రేష్ఠుడు జివ్వున సముద్రమును దాటునప్పుడు ఆ యాగమన విశేషములచే ఆకాశమార్గమును ద్రావుచున్నాడో యనునట్లుండెను. వాయుపుత్రుడు పరాక్రమముతో వేగముగా నాకాశమార్గమున జనుచుండగా అతని పింగళవర్ణముతో వెల్గుచున్న రెండు నేత్రములు మండుచున్న కొండమంటలో యనునట్లును, ఒకేమారుదయించిన సూర్యచంద్రబింబములో యనునట్లును ఒప్పుచుండెను. ఎఱ్ఱనికాంతితో గూడిన ఆతని ముఖము ఎఱ్ఱనైయున్న ముక్కుతో సంధ్యాకాలపు టెఱ్ఱకాంతితో నందగించిన సూర్యమండలమో యనునట్లు మెఱయుచుండెను. వాయుపుత్రుడట్లు వాయు వేగముతో వెడలుచు ఆకాశమున తన తోకను పైకెత్తగా అది ఎత్తైన ఇంద్రధ్వజము వలె పొడవుగా నుండెను. ప్రకాశించుచున్న తెల్లని కోఱలతో గుండ్రముగా చుట్టుకొనిన తోకతో స్థిరమైన మనస్సు గల హనుమంతుడు ఆకాశమందు పరివేష మధ్యముననున్న సూర్యునివలె కనిపించెను. ఎఱ్ఱని రంగు గల పిరుదుల ఔన్నత్యముతో వానరశ్రేష్ఠుడు జేగురు ధాతువులు తెరపలు తెరపలుగా గల పర్వతము వలె కనిపించెను. వడిసెల నుంచి విసరబడిన రాతివలె ఆకాశ మార్గమున వేగముగా వెళ్లుచున్న వాయుదేవుని ముద్దుల కుమారుని యొక్క రెండు చంకలనుండి వెడలెడి వాయువు, మేఘము నుండి వెలువడు పెద్ద ఉరుమో యనునట్లు భయంకరముగా మ్రోగెను. ఉత్తరదిక్కు నుండి దక్షిణ దిక్కునకు పరువెత్తుచున్న పెద్ద తోకచుక్క విధముగా పెద్ద తోకతోడి శరీరము

ప్రకాశించుచుండగా సందేహములేని మనస్సుతో లంక వైపునకు హనుమంతుడు వెళ్లుచుండెను. (రావణుడు పాలించు దిక్కుగా వెళ్ళు తోకచుక్క వలె హనుమంతు డుండెను. తోకచుక్క రాజారిష్టమును తెలుపును. కనుక రావణునికరిష్టము తెలుపు తోకచుక్కవలె వెళ్ళెను) ఆకాశమున వెళ్లుచున్న సూర్యుని వలె పొంగుచు వెడలుచున్న వానరశ్రేష్ఠుడు నడుమునందు త్రాటిచే గట్టబడిన మదించిన పెద్ద యేనుగు వలె గనిపించెను. సముద్ర జలములో ప్రతిబింబమును, ఆకాశమున శరీరమును ప్రకాశించుచుండగా హనుమంతుడు సగము జలములో మునిగిని వేగముగా గాలికి కదలిపోవుచున్న తెప్పవలె తోచెను. వాయుపుత్రుడట్లు పోవు చున్న మార్గ మంతయును అతని గొప్పవేగముచే కలత నొంది సముద్రమంతయు అల్లకల్లోలముగా నుండెను. ఆకాశమును మ్రింగుచున్నవా యనునట్లుగా ఎగయుచున్న సముద్ర తరంగములను వానరశ్రేష్ఠుడు తన శరీర వేగముచే వచ్చుచున్న గాలిచే దన్నుచు భయంకరముగా సాగిపోవుచుండెను. వానరశ్రేష్ఠుని వేగముచేత పుట్టిన గాలియు, మేఘముల గాలియు నొక్కటై అప్పుడు సముద్రమును మిక్కిలి కలతబెట్టినవి. అంజనాపుత్రుడు సముద్రతరంగములను పైకి లాగుచున్నాడో యనునట్లును భూమ్యాకాశముల అవధి నేర్పరచుచున్నాడో యనునట్లును వేగముగా సముద్రము దాటుచుండెను. ఎత్తైన మేరు మందర పర్వతములవంటివగు ఆ సముద్ర తరంగములను వేగముగా వరుసగా లెక్కించు చున్నాడో యనునట్లు శౌర్యము ప్రకటమగునట్లు హనుమంతుడు వేగముగా వెళ్లసాగెను. వాయుపుత్రుడు వెళ్లెడు వేగమున బుట్టిన గాలిచే అందముగా నెగజిమ్మబడిన సముద్రపు తెల్లని నీటి బిందువులు అచ్చటి మేఘములను జేరి శరన్మేఘముల వలె తోచెను. మానవులకు వస్త్రమును తీసివేసినచో అవయవములు కనిపించు విధముగా నీరిగిరిపోవుటచే తిములు, తాబేళ్లు, మొసళ్లు, చేపలు మొదలైన జలజంతువులు స్పష్టముగా కనిపించుచుండెను. ఆకాశమునందు వెడలుచున్న వాయుపుత్రుని జూచి సముద్రముననున్న

సర్పములన్నియు గరుత్మంతుడేమోయని భయము చెందినవై కలతనొంది నిస్త్రాణ చెంది సొమ్మసిల్లి పోయినవి. పది యామడల వెడల్పును, ముప్పది యామడల పొడవును గలదై అందముగా హనుమంతుని నీడ సముద్రము పైబడి తెల్లని మేఘపంక్తియో యనునట్లు చనుచుండెను. ఆకాశమార్గమున నేయాధారము లేకుండ వెళ్లుచున్న కపిశ్రేష్ఠుడు రెక్కలు గల పర్వతము వలె ప్రకాశించెను. పెద్ద సంరంభముతో ఆ వాయుపుత్రుడు వెళ్లు సముద్ర మార్గమంతయు దొన్నెగా జేయబడినట్లుండెను. ఆకాశమున బోవుచున్న పక్షుల మధ్య గరుత్మంతుడో యనునట్లు వెళ్లుచున్న హనుమంతుడు గాలివలె మేఘముల నెగురగొట్టెను. ఆ వానరశ్రేష్ఠునిచే ఆకర్షింపబడినవై తెలుపు, నలుపు, ఎఱుపు, మాంజిష్ఠ వర్ణములు గల మేఘము లాకాశమున వ్యాపించెను. కొంత సేపు కనిపించక మఱికొంతసేపు ప్రకాశించుచు కపిచంద్రుడు మబ్బుల నడుమ నుండు చంద్రుని వలె ప్రకాశించెను. సముద్రమును వేగముగా దాటుచున్న హనుమంతునకు వాయువు చల్లగా వీచెను. దేవతలందఱు భళి! భళీ!! యని మెచ్చిరి. కిన్నరులు బాపురే! యని స్తోత్రములు చేసిరి. మునులు బాగు బాగని ప్రశంసించిరి. బ్రాహ్మణ సంఘములు మనస్సులందు సై సై యని పొగడిరి. భయము లేక సముద్రము నిట్లు దాటుచున్న కేసరిపుత్రుని యక్షులు మేలు మేలని మెచ్చిరి.

**సముద్రుడు హనుమంతునకు దోడ్పడ యోజించుట :**

కపిశ్రేష్ఠుడగు హనుమంతుడట్లు సముద్రమును దాటుచుండ "ఇక్ష్వాకు కులమున బుట్టిన రామచంద్రుని కార్యమును సాధింపదలచిన ఈ వానరునకు ఈ సమయమున నేనెట్లు మేలు చేయుదు"నని సముద్రుడు తలపోసెను. "నేను పూర్వము సగర చక్రవర్తి చేత వృద్ధి గాంచితిని. వీడును ఆ వంశము నందు పుట్టినవాడును, ప్రఖ్యాతుడును అయిన రఘురాముని కార్యమునకై పరాక్రమముతో నిరాటంకముగా వెళ్లుచున్నాడు. అతని శ్రమ తీరునట్లుగా నేడు నేననురాగముతో ఇచ్చట మేలు చేయదగును. ఆ పుండరీకాక్షుని దూతకు

నేను చక్కని సహాయమును చేయకున్నచో నన్ను లోకులు, దయలేనివాడు, జడధి (మందబుద్ధి) యని నిందింపరా? ఇతడిప్పుడిక్కడ విశ్రమించినచో తక్కిన మార్గమును దాటుట ఇతని కవలీల కాగలదు" అని ఆలోచించినవాడై ఆ జడనిధి తనలో అణగియున్న మైనాకుని జూచి యిట్లనెను.

**సముద్రుడు మైనాకునితో సంభాషించుట :**

"ఓయీ! బంగారు శిఖరములు గలిగిన పర్వత శ్రేష్ఠమా! నేనొక మాట చెప్పెదను వినుము. పాతాళము నుండి రాక్షసులు భూలోకమునకు రాకుండుటకై ఆ దేవేంద్రుడు నన్ను భయంకరమైన ఇనుప పరిఘ ఆకారముతో అడ్డముగా నిల్పినాడు. నాలుగు దిక్కులను పక్షివలె నెగురుటకు నీవే సమర్థుడవు. ఇప్పుడు రామ కార్యార్థమై సీతను వెదకుటకు హనుమంతుడు వెళ్లుచున్నాడు. నాకిక్ష్వాకులు పూజ్యులు. ఓ పర్వత శ్రేష్ఠుడా! వారు నీకును పరమపూజ్యులే కదా. స్నేహము చేతను నీవొక్క చక్కని పని చేయవలసియున్నది. చేయదగిన పనిని చేయకున్నచో సజ్జనులు దుష్టుడని కోపింతురు. నీవు జలముల నుండి యవలీలగా లెమ్ము. మన కతిథియు, పూజ్యుడును వాయుపుత్రుడు. కాన నీవెదురేగి, అతని బడలిక తీరునట్లు నీ శిఖరములపై సంతోషముతో విశ్రమింపజేయుము. అట్లు కొంచెము సేపు విశ్రమించి, సేద తీర్చుకొని, సముద్రమును దాటుటకై తిరిగి వెళ్లును గాక! నీవు రఘురాముని యొక్క సౌజన్యమును, అతడు సీతాదేవిని గోలుపోవుట యును, రాక్షసుని పురమున కేగుచున్న వానరశ్రేష్ఠుని శ్రమను ఆలోచించి, సంతోషముతో నీటి నుండి వెడలి రమ్ము. ఇక లెమ్ము. నీకు శుభము కలుగు గాక."

**మైనాకుడాంజనేయుని కెదురు వచ్చుట :**

అట్లు చెప్పుచున్న సముద్రుని మాటలను విన్నవాడై ఆ పర్వతశ్రేష్ఠుడగు మైనాకుడు వేగముగా మబ్బులను జీల్చుకొని వచ్చుచున్న సూర్యుని వలె సముద్ర

జలములు రెండు పాయలుగా చీలుచుండగా గొప్ప నాగులు కిన్నరులు మొదలగువారు నివసించియున్న బాలభాను సమాన కాంతిగలిగిన శిఖరముల కాంతిచే నల్లని యాకాశము బంగారము వలె మెరయునట్లు చేయుచు ఆకాశ మార్గమున కెగయగా నూర్గురు సూర్యుల వలె ప్రకాశించుచు మార్గ మధ్యముననున్న ఆ గొప్ప పర్వతమును జూచి హనుమంతుడు తన కార్యమున కిట్లు విఘ్నము కల్గుచున్నదే యని తలంచి భయంకరమైన గొప్ప వేగము గలవాడై వగర్చుచు ఢీ కొట్టి ఆ కొండ డీలుపడి వ్రాలునల్గొనర్చెను. అట్లు హనుమంతుడు పిడుగువలె తనను తాకగా కలత జెంది గాలికి కొట్టుకొనిపోవు మబ్బువలె పరువెత్తియు, సంతోషించి, పొంగిపోయి, అతని వేగమును తెలిసికొని ప్రీతితో ఆ పర్వతము ఆకాశమార్గమున మానవ రూపముతో తన శిఖరముపై నిలిచి “ఓ వాయుపుత్రా! వానరశ్రేష్ఠా! నీవు దుష్కరమైన పని చేసితివి. ఆహా! నిన్నేమని కొనియాడుదును? నిర్మలమైన తేజము గలిగిన హనుమా! నీ బలము నీ వేగము చూడగా మెచ్చదగియున్నవి. నా బంగారు శిఖరములపై కొంతసేపు నిలిచి నీ అలసట తీర్చికొని వెళ్లుము. తనకు మేలు చేసినవారికి తిరిగి ఉపకారము చేయుట సనాతనమైన ధర్మము గాన ఈ సాగరుడు ఎంతయో ప్రత్యుపకారము చేయు తలంపు గలవాడై యున్నాడు. తాను రఘువంశమున బుట్టిన యొకానొక రాజుచే వృద్ధిని పొంది ప్రఖ్యాతి చెందుటచే నీవు రఘువీరుని కార్యము దీర్పనేగుచుండుటచే ప్రేమతో నీకు సాయము చేయదలచినాడు. అందుకై నా యొద్దకు వచ్చి సగౌరవముగా ఓ పర్వత రాజా! అదిగో ఆకాశమున జూచితివా. పవిత్రుడగు వానరశ్రేష్ఠుడు నూరు యోజనముల సముద్రమును దాటబూనినాడు వేగముగా నీవును ఎదురేగుము. అతడు నీ శిఖరముల మీద బడలిక దీర విశ్రమించి మిగిలిన దూరము ననాయాసముగా దాటును అని స్వచ్ఛమైన ప్రేమతో సముద్రుడు చెప్పగా ఓ వాయుపుత్రా! నేను నీ కొరకు వచ్చితిని. ఇచ్చట నిలిచి, తియ్యని ఫలమును కందమూలములను మక్కువతో

ఆరగించి శ్రమ తీరునట్లు హాయిగా విశ్రమింపుము. తరువాత మిగిలిన దూరము నాయాసము లేకుండ వెళ్లుట సుకరము గదా వానరశ్రేష్ఠా! క్రొత్తవారలనైనను సజ్జనులను ప్రేమతో పూజించినచో పండిత శ్రేష్ఠులందఱు ప్రశస్తమని మెచ్చెదరు. అది యట్లుండనిమ్ము. దేవతలలో శ్రేష్టుడవు. మహాత్ముడవు. బలముగల వారలలో శ్రేష్టుడవునైన ఓ వాయుపుత్రా! నాకిప్పుడతిథివైతివి. నా ఆతిథ్యమును స్వీకరింపుము. ధర్మము నెఱుగగోరు వారలకును, ధర్మము నెఱిగిన వారికిని అతిథి సామాన్యుడైనను పూజింపదగినవాడే. కాన నింక నీవంటి శ్రేష్ఠుని విషయము చెప్పనేల? పైగా మనకు బాంధవ్యమున్నది. నేను క్రొత్తవాడను గాను సుమా! వేగమునందు తండ్రితో సమానుడవైన నిన్ను పూజించినచో ఆ శుభ చరిత్రుడగు వాయుదేవుని నేను తగు విధముగా పూజించినట్లగును.

## మైనాకుడు తన పూర్వ వృత్తాంతము హనుమకు దెల్పుట :

మహాత్మా! నా తండ్రీ! ఆంజనేయా! దీనికొక కారణము కలదు. చెప్పెదను వినుము. పూర్వము కృతయుగమున పర్వతములకు రెక్కలుండెడివి. అవి గరుత్మంతునితో వాయువుతో సమానమైన వేగముతో ఆకాశమునందు విచ్చలవిడిగా సంచరించుచుండగా మునులు, దేవతలు, మొదలగు భూతకోటి తమ తలల మీద పడునేమోయని మనస్సులలో భయమందెను. అంతట ఇంద్రుడు కోపించినవాడై వజ్రాయుధముబూని పర్వతముల రెక్కలన్నియును ముక్కలుగా నఱికి నా మీదకు వచ్చుచుండగా అప్పుడు నీ తండ్రి ఒక్కడు దయతో నన్నెగురగొట్టుకొని వచ్చి ఈ సాగరమున బడద్రోసెను. నీ తండ్రియొక్క దయచేతనే నేనిట్లు రెక్కల సొంపు చెడకుండ ప్రకాశించుచున్నాను. మన సంబంధము నెఱిగితివి గదా. నీ తండ్రి నాకు పూజింపతగినవాడు. ఓ పావనీ! నిన్నాకారణము చేత గౌరవించుచుంటిని. ప్రేమను వీడక నా మైత్రిని మన్నించి నేను చేయు సపర్యలనెల్ల స్వీకరించి ప్రీతితో శ్రమ తీర్చికొని నన్నును సాగరుని సంతుష్ట చిత్తులను చేయుము. నీవు సంతుష్టి చెంది మమ్మును సంతోషపరపుము.

నేను చేయుచున్న పూజను స్వీకరింపుము. నీ శ్రమను పోగొట్టుకొనుము. ఓ వాయుపుత్రా! నిన్ను చూచుటచే సంతోషమును జెందితిని. నా కోరికను సార్థకము చేయుమని ప్రార్థించుచున్నాను." అని చెప్పుచున్న పర్వతరాజునకు హనుమంతు డిట్లనెను. "ఓ పర్వత రాజా! నీవిచ్చుచున్న సపర్యలు నాకందినవి. సంతోషమును పొందితిని. కాని నేనిచ్చట నిలుచుటకు వీలుకాదు. కార్యమును కాలమును నన్ను తొందర పెట్టుచుండెను. నేను బయలుదేరునప్పుడే త్రోవలో ఆగనని ప్రతిజ్ఞ చేసితిని. ప్రొద్దు పోవుచున్నది. కాన నేను వేగముగా వెళ్లుదును. ఇక్కడ నిలువనైతినని మిత్రమా! కోపగించుకొనకుము." అని చెప్పి వాయుపుత్రు డాదరముతో ఆ పర్వతశ్రేష్ఠమును తన చేతితో తాకి నవ్వుతో కూడిన ముఖము గలవాడై వెళ్లి వచ్చెదనని వీడుకోలు వడసి అతి వేగముగా ఆకాశమునకెగిరి ఆ సముద్రుని యొక్కయు, పర్వతము యొక్కయు శుభవాక్కుల నందుకొని – ఆకాశమార్గమున నిరాలంబముగా ఆ పర్వతమును జూచుచు వెళ్లెను. హనుమంతుని ఈ రెండవ ఘనకార్యమును జూచి దేవతలు పొగడిరి. మైనాకుడు చేసిన స్నేహ కృత్యమును దలంచి ఆకాశమార్గమున చూచుటకై నిలిచియున్న ఆ దేవతా సమూహము పర్వత శ్రేష్ఠుని గూడ పొగడిరి. స్వర్గాధిపతియగు నింద్రుడు మిక్కిలి సంతసించి మైనాకుని జూచి "ఓ పర్వతమా! నిన్ను జూచి సంతసించితిని. నీ కభయమిచ్చితిని. నీవే విధమైన భయము లేక పూర్వము వలె సుఖముగా లోకములందు సంచరింపుము. మనస్సునందు భయమును వదలి పెట్టుము. హనుమ నూఱు యోజనముల సముద్రమెట్లు దాటునాయని మాకు మనస్సులందు దడ కల్లెను. ఆతడు గొప్ప ధైర్యముతో వెళ్లుచుండగా రామ కార్యమును దీర్చుటకై వెళ్లు మారుతినెంతయో ఆదరించితివని నిన్ను మెచ్చుచున్నాను సుమా! మిత్రమా!" అని శచీపతి చెప్పగా వరము పొందిన ఆ పర్వతరాజు సంతసించెను. హనుమంతుడట్లే ఆకాశమార్గమున వెళ్లుచుండెను.

**హనుమంతునకు సురస యడ్డుపడుట :**

దేవతలును, ఋషులును, సిద్ధులును, శూరుడగు వానరశ్రేష్ఠుని బలము తెలిసికొనదలంచినవారై సూర్య సమానకాంతి గలదియగు నాగమాతను సురసయను దానిని జూచి "అదిగో సురసా! చూచితివా! వాయుపుత్రుడు గొప్ప వేగముతో సముద్రమును దాటుచున్నాడు. రాక్షస రూపమును ధరించి నీవు వేగముగా వెళ్లి అతని నడ్డగించి ఒక్క ముహూర్తకాల మాలస్య మొనరింపుము. పెద్ద కోఱలును ఆకాశమునురాయునంత నోరును కావిరంగు గల మిడిగ్రుడ్లు గల రూపమును దాల్చి అడ్డగింపుము. నిన్ను యుక్తితో దాటి వెళ్లునో లేక చిక్కి బాధనొందునో చూచెదముగాక" అని చెప్పగానే సురస సరే! యని సముద్రము పై సకల ప్రాణులకు భయము కల్గించునట్లు ఎప్పుడును చూడనట్టి వికారమైన రూపమును ధరించి సంచరించును. అతి వేగముతో వెళ్లుచున్న హనుమంతుని మార్గమున కడ్డముగా నిలబడి యిట్లనెను. "వానరుడా! ఎక్కడికి వెళ్లెదవు. ఆగుము. నిన్ను నాకిప్పుడా హారమగునట్లు దేవతలు నిర్ణయించినారు. నన్ను నీవెట్లైనను దాటి వెళ్లలేవు. నా నోటియందు ప్రవేశింపుము. మ్రింగి వైచెదను. ఇక నీ యాటలు సాగవు సుమా!" యనుచున్న సురసను జూచి హనుమంతుడు చేతులను జోడించి నమస్కరించుచు నిట్లనెను. "దేవీ! దశరథ మహారాజు పుత్రుడైన శ్రీరామచంద్రుడు తన భార్యయగు సీత తోడను తమ్ముడగు లక్ష్మణుని తోడను గూడి అడవులలో సంచరించుచు, రాక్షసవైరియై వేరొక పనియందుండ రాక్షస రాజైన రావణుడా రాముని భార్యను దొంగిలించెను. రాముని ఆజ్ఞతో నేను సాధ్వీమణియగు సీతను చూచుటకై వెళ్లుచుంటిని. నీవును ఆ రాముని, రాజ్యమునందుంటివి గాన రాముని కార్యమునకు సహకరించుట నీకును తగును. కాన క్షేమముగా నన్ను వెళ్లనిమ్ము. కాదందువేని ఆ జానకి యొక్క క్షేమమును రామచంద్రునకు తెలియజేసి వేగముగా వచ్చి నీ నోటియందు ప్రవేశించెదను. ఇది నిజమని నమ్ముము" అని చెప్పగా "కపిశ్రేష్ఠ! ఇవెక్కడి

మాటలు? నా చేత జిక్కి తిరిగి ప్రాణములతో వెళ్లగలవా? ఇది నాకు వరము సుమా"! అని యిట్లు కామరూపిణియైన సురస చెప్పినను స్వేచ్ఛగా వెళ్లుచున్న ఆంజనేయుని జూచి అతని బలమును తెలిసికొనగోరినదై "ఓరి! వేగముగా ఎక్కడకు వెళ్లెదవు? నానోటియందు ప్రవేశింపుము. ఓ వానర రాజా! ఇట్లు పూర్వము బ్రహ్మ నాకు వరమిచ్చియుండెను సుమా!" అని పల్కుచు వేగముగా వెళ్లి తన నోటిని తెరచి వాయుపుత్రుని ముందు నిలబడగా చూచి వాయుపుత్రుడు కోపముతో "కాంతా! ఏదీ నన్ను మ్రింగగల నోటిని చూపించుము" అని పది యామడల పొడవుగా శరీరమును బెంచి నిలబడగా (సురస తన నోటిని ఇరువది యామడలుగా పెంచెను. దానిని జూచిన హనుమ తన శరీరమును ముప్పది యామడల పొడవుగా పెంచెను. అపుడా దేవకాంత తన నోటిని నలువది యామడలుగా చేసెను. కోతుల రాజు తన దేహమును డెబ్బది యామడలుగా జేయగా ఆ నాగమాత తన నోటి నెనుబది యామడలుగా బెంచెను. అప్పుడు వాయుపుత్రుడు తన శరీరమును తొంబదామడలు చేయగా) ఆ సురస "ఓ కోతీ! నన్ను తప్పించుకొని వెళ్లుట నీ తరమా?" యనుచు తన ముఖబిలమును నూఱు యోజనములుగా బెంచెను. ఆ రక్కసి యొక్క సకల భూత భయంకరము నరక సమానమునయిన నోటిని చూచి ఆంజనేయుడు తన శరీరమును చిన్నదిగా చేయుచు బొటన వ్రేలియంత మాత్రముగా నయ్యెను.

**హనుమంతుడు సురస నోట ప్రవేశించి బయల్వెడలుట :**

అట్లంగుష్ఠ మాత్ర శరీరుడై వానరశ్రేష్ఠుడు సురస నోటియందు తటాలున ప్రవేశించి చెంగున వెలికివచ్చి వేగముగా ఆకసమందు నిల్చి ఆ దేవకాంతతో నిట్లనెను. "ఓ దాక్షాయణీ! నీ నోటియందు ప్రవేశించితిని. నీ కోరిక నిజమయ్యెను గదా. కాన ఓ తల్లీ! కరుణించి నా నమస్కారమును స్వీకరింపుము. నేను సంతోషముతో జానకీదేవిని వెదకుటకై వెళ్లెదను. నీ మనస్సునందు నాకు శుభము కలుగునట్లు తలంపుము తల్లీ!" అని పలుకగా రాహువు వదనము

నుండి బయటపడిన చంద్రునివలె తన నోటినుండి బయల్వెడలిన హనుమంతుని నాదేవతాస్త్రీ చూచినదై సంతోషముతో తన నిజరూపమును ధరించి 'ఓ హనుమా! యథా సౌఖ్యముగా వెళ్లుము. నీ పనులన్నియు సులభము అవును సుమా! సంతోషముగా ఆ జానకీదేవిని రామచంద్రునితో కలియునట్లుగా చేయుము" అని చెప్పి సురస వెడలెను. ఆ విధమును దేవతలు మొదలైనవారు చూచి మూడవదియైన ఆంజనేయుని దుస్సాధ్యమైన కార్యమును మేలు మేలని పొగడ దొడగిరి. వేగమునందు గరుడునితో సమానుడగు హనుమంతుడు భయంకర మైన ఆ సముద్రముపై నుండి ఆకాశమార్గమున నెప్పటి వలె ప్రయాణించు చుండెను. గుంపులుగానున్న పెద్ద మేఘములును, పరుగులు తీయు పక్షులును, సంగీతము లాలపించు విద్యాధరులును, ప్రకాశించుచున్న ఐరావతమును, పెద్దపులి, యేనుగు, సింహములు మొదలగునవి వాహనములుగా గలవారును, సుందరమైన విమానములనెక్కి సంచరించెడివారును, పిడుగు మొదలగు వాటివలన బుట్టిన యగ్నిజ్వాలలును, పుణ్యములు చేసి స్వర్గమునకు బోవునట్టి మహాత్ములును, హవ్యమును మోసికొనిపోవు అగ్నిదేవుడును, చంద్రుడును, సూర్యుడును, గ్రహములును, నక్షత్రములును, దేవముని సమూహములును ఆకాశ సంచారులగు నాగులు, యక్షులు, విశ్వావసువులు, కిన్నరులు మున్నగు వారును, దిగ్గజములును వెడలు త్రోవలు దాటి సమస్త లోకములకు మేల్కట్టువలె నొప్పుచు మంగళకరమై బ్రహ్మ నివాసమై యొప్పు నాకాశమార్గమున గరుత్మంతుని వలెను, రెక్కలు గల పర్వతమువలెను నిరాలంబనముగా ఆకసమును వెల్గజేయుచు మారుతాత్మజుడు వెళ్లుచుండెను.

**ఆంజనేయుడు సింహికను వధించుట :**

అట్లు వాయువేగముతో వెళ్లుచున్న హనుమంతుని జూచి సింహికయను పెద్ద రక్కసి పాపభావముతో తన మనస్సునందిట్లు తలంచెను. "ఎన్ని దినములనుండియో ఇంచుకంతయైనను ఆహారము లభింపదయ్యెను. ఇప్పటికి

గదా నాకిట్టి పెద్దజంతువు దొరకిన”దని ఆకలిగొన్నదై తన శరీరమును బెంచి యా క్రూర రాక్షసి ఆంజనేయుని నీడను బట్టి లాగుచుండగా ఆంజనేయుడు మనస్సునందు చింతనొంది యిట్లు తలంచెను. “ఓరుగాలికి ఎదురువెళ్ళుచున్న ఓడవలె నైతిని. నా వేగము తగ్గినది. బలము క్షీణించినది. కారణమేమియో”? యని నలుదిక్కులు చూచి సముద్రమునుండి లేచిన ఒక పెద్దభూతమును జూచెను. “వానర రాజగు సుగ్రీవుడు చెప్పిన ఛాయాగ్రాహియే యది. సందియములేదు” అని తలచి క్రోధమును పొందినవాడై గొప్ప పర్వతమువలెను వర్షాకాలపు మేఘము వలెను శరీరమును పెంచెను. తగ్గిపోకుండ తన శరీరమును పెంచుచున్న వానరశ్రేష్ఠుని చూచి పాతాళగుహవంటి భయంకరమైన తన నోటిని తెరిచి కారుమేఘము వలె గర్జించి యవలీలగా తనను పట్టుకొన వచ్చుచున్న ఆ సింహికను, భయంకరమైన శరీరమును బాగుగా తెరచియున్న నోటిని జూచి వజ్రము వంటి కఠినమైన శరీరము గల హనుమంతుడు తన శరీరమును మిక్కిలి చిన్నదిగా చేసి ఆ సింహిక నోటిలో ప్రవేశించెను. అప్పుడు దేవతలు “అక్కటా! పర్వ సమయమున రాహువు వాతబడిన చంద్రుని వలె నీతడీ రాక్షసి నోట బడెనే!” యని చింతనొందిరి. అప్పుడు వాయు నందనుడు తనవాడి గోళ్లచో ఆ రక్కసి ప్రేవులను త్రెంచి వెంటనే మనో వేగముతో ఆమె నోటినుండి బయటపడెను. ధైర్యముతోను, నేర్పుతోను వేగముగా దాని గర్వమణచి తన పూర్వ రూపమును బొంది మరల వెళ్లుచుండెను. ఆ రాక్షసియు తన మర్మ స్థానములన్నియు త్రెంపబడుటచే సముద్రమున బడి మృతినందెను. ఆకాశ సంచారులైన దేవతలు మొదలగువారు “ఓ వానర నాయకా! బాగు బాగు! భళీ! లెస్సగా చేసితివి. ఇటువంటి కార్యమునొరులెవ్వరు చేయజాలరు. చేయదలంచిన కార్యమును పూర్తి చేయుటకు సాగిపొమ్ము. నీకు క్షేమము కలుగును. వానరశ్రేష్ఠా! నీవలె ధైర్యము, బుద్ధి సూక్ష్మత, దూరదృష్టి, సామర్థ్యము కలవాడెన్నడును ఎట్టి కార్యమునందైనను పరాజయము పొందడు” అనిరి.

**హనుమంతుడు లంకా తీరమును జూచుట :**

వారి మాటలను వినుచు హనుమంతుడు తాను చేయవలసిన కార్యమును స్మరించుచు గరుత్మంతుని వలె ఆకాశమున వెడలి దిగుచు గొప్ప అందమైన చెట్లతో సుందరమైనదియు, మిక్కిలి విశాలమైనదియునగు ఆవలి తీరమును జూచెను. చూచి అందలి మనోహరమగు మలయపర్వతమును, అందు చెట్ల గుంపులు గల ప్రదేశములను, సముద్రమును, తీరమును, తీరముననున్న చెట్లను, సముద్రుని భార్యలగు నదులు నాథుని కలియచేరు ప్రదేశములను దర్శించెను. అవలీలగా ఆకాశమును మ్రింగునట్లున్న తన శరీరమును చూచుకొని వాయు నందనుడు తన మనస్సు నందిట్లాలోచించెను. "ఈ విధముగా పెరిగిన నా శరీరమును గొప్పవేగమును జూచినచో రాక్షసులు తామిది యొక వింతయన్నట్లు నన్నే చూడ గోరుదురు. అప్పుడు నేనే విధముగా నా కార్యమును చేయవీలు కలుగును?" అని తలంచి గొప్ప పర్వతమువలెనున్న తన శరీరమును వాయు పుత్రుడాక్షణమందే తగ్గించుకొని మోహమును తొలగించుకొనిన ప్రాజ్ఞుని వలెను, బలినణగద్రొక్కి త్రివిక్రముడు తన పూర్వ రూపమును బొందినట్లును, నిజ స్వరూపమును ధరించెను. అనేక విధములగు అందమైన రూపములను ధరించిన కపిరాజు సాగరము యొక్క అవ్వలి తీరమును జేరి నిజరూపమును దాల్చి తాను చేయవలసిన కార్యమును పలుమార్లు తలంచినవాడై తన రూపమును చక్కగా చూచుకొని మొగలి పొదలతో సొంపునింపుచున్న లంబశిఖరముపై దిగెను. సముద్రతీరముననున్న త్రికూట పర్వతము పైనున్న లంకా నగరమును, దేవేంద్ర నగరమగు అమరావతిని పోలియున్న దానిని హనుమంతుడు పారజూచెను.



# రెండవ సర్గము

## హనుమంతుడు లంక వెలుపలి యుద్యానములందు విహరించుట :

దాట శక్యముగాని సముద్రమును తలంచి సుఖముగా త్రికూట పర్వత శిఖరముననున్న లంకను జూచి హనుమ స్వస్థత చెందెను. అందమైన ఉద్యానవనముల యందలి వృక్ష సమూహములన్నియు ప్రియము కల్గజేయుచు పువ్వులను జలజల వెదజల్లుటచేత ఆ వాయుపుత్రుడు పుష్పమయుడై ప్రకాశించెను. ఇట్లు నూరామడ ఒక్క పెట్టున దాటినను గొప్ప విక్రమముగల ఆ వానరశ్రేష్ఠుడొక్క నిట్టూర్పునైనను విడువడయ్యెను. అలసటనైనను చెందడయ్యెను. 'ఎన్నివేల యామడలైనను శ్రమ లేకుండా దాటగల్గుదును. ఈ నూరామడ యేమి లెక్క?' యని మనస్సునందు తలంచుచు మంచి సుగంథములను వెదజల్లు తోటలను, అందమైన పచ్చిక బయళ్లను, చిన్న చిన్న కొండలను చూచుచు వెళ్లి పర్వత శిఖరము నుండి లంకా పట్టణమును జూచెను. హనుమంతుడచట సరళ వృక్షములు, కొండగోగులు, కొండవిసె చెట్లు, చిఱు నిమ్మచెట్లు, కొండమల్లె చెట్లు, రేగు చెట్లు, అరటి చెట్లు, గన్నేరు చెట్లు, మోరటి చెట్లు, కడిమి చెట్లు, మొగలి చెట్లు మొదలగు వృక్షములను, విరగబూచి కాయలుకాచి యరవిచ్చిన మొగ్గలు గల్గి, చిరు పిందెలుగలిగి వాటి బరువున నేలకు వంగియుండగా చూచెను. గాలికి గదలు కొమ్మలు రెమ్మలు కలిగి పక్షులతో నిండి కడు మనోహరములయి యున్న వృక్షములను హనుమంతుడు చూచెను. హంసలు, కారండవ పక్షులు, పద్మములు, కలువలు మొదలగు వానితో సుందరమైన దిగుడుబావులు, పలు విధములైన అందమైన క్రీడా స్థానములు, మంచి సరస్సులు, అన్ని ఋతువులలో పండిన పండ్లతో పూచిన

పూలతో అందముగా నుండు చెట్లతో సుందరమైన ఉద్యానవనములను, పద్మములతో నొప్పు అగడ్తలను హనుమంతుడు చూచెను. సీతను దొంగిలించి తెచ్చిన కారణముచే రావణుడు రక్షణకు నియోగింపగా అన్ని ప్రదేశములందును ధనుర్బాణ పాణులై సంచరించుచున్న రాక్షస నాయకులు, చుట్టును బంగారు ప్రాకారము ప్రకాశింపగా గ్రహములను, శరన్మేఘములను తాకగలుగు ఎత్తైన మేడలు, పాండు వర్ణముతో నొప్పు పెద్ద వీథులు, అరుగులు, జెండాల వరుసలు, వింతైన బంగారు తీగలతో వేడుక గొలుపు తోరణములును గలిగి సాటిలేనిదై కొండశిఖరముననున్న కారణమున ఆకాశము నందలి స్వర్గమోయను విధమున లంకా పట్టణము ప్రకాశించుచుండెను.

**హనుమంతుడు లంకను జూచుట :**

ఆకాశము నుండి వ్రేలాడుచున్నదా! యనునట్లున్నదియు, అవలీలగా ఆకాశమునందు నడయాడుచున్నదా! యనునట్లున్నదియు ఎల్లప్పుడును రాక్షస నాయకులచేత రక్షింపబడుచున్నదియు, పట్టణములలో శ్రేష్ఠమైనదియు, చుట్టును దుర్గములతో నొప్పుచున్నదియు, పూర్వము కుబేరునకు నివాసమై యున్నదియు, దానియంద మిట్టిదని మనస్సునందైన లెక్కించుటకు వీలుగానిదియు ప్రాకారమనెడు జఘనముతోడను అధికమగు జలమనెడి క్రొత్త వస్త్రముతోడను, శూలములు, శతఘ్నులు ననెడి శిరోజములతోను, అట్టములనెడు శిరో భూషణము తోడను నొప్పుచు మనోహరియైన స్త్రీ వలె విశ్వకర్మచే నిర్మింపబడి నదియు, రాక్షసుల చేతను, సర్పముల చేతను ఆశ్రయింపబడి భోగవతి వలె నొప్పుచున్నదియు అగు లంకా పట్టణపు ఉత్తర ద్వార సమీపమునకు వెళ్లి వెండి కొండవలె ఆకాశము నంటుచున్న ఎత్తైన భవన పంక్తులతో కూడి భయంకరులు, వికృతాకారులునైన రాక్షసుల గుంపులు పట్టిసములు, శూలములు చేతులందు ధరించి సర్పముల పెద్ద గుహను గాచుచున్న విధముగా కాచుచున్న లంకా పట్టణమును, వినిర్మలమై అందములు చిందుచున్న దానిని ఎవ్వరును

నిర్మింపకయే యేర్పడిన కందకము వలె చుట్టునున్న సముద్రమును చూచి దేవతల విరోధియైన రావణుని శౌర్యమును దలంచుచు హనుమంతుడిట్లు చింతించెను.

**హనుమంతుడు లంకను జూచి నివ్వెఱ గొనుట :**

"వానరు లేవిధముగా నిచ్చటికి వచ్చెదరు? ఒకవేళ వచ్చినను తమశ్రమ యంతయు వ్యర్థమై బాధ నొందెదరు. దేవతలకైనను ఈ లంకను జయించుట శక్యమా? ఎన్నరాని బలము గలిగిన ఆ రాముడే యిచ్చటికి వచ్చినను గొప్ప దుర్గము గలదియు రావణునిచే పాలింపబడుచున్నదియు, చాల కఠినమైనదియు నగు ఈ లంకా నగరమునేమి చేయగలుగును? వారు దుర్మార్గులైన రాక్షసులు గాన వారితో మంచితనపు మాటల కవకాశమేమియు లేదు. లంచము లిచ్చి వశపరచుకొందమన్నను అది విఫలమే యగును. మఱి వారిలో వారికి కలహములు పెట్టి సాధించుటయు నసాధ్యమే. ఎంతగా ఆలోచించినను రాక్షస సమూహమును యుద్ధమున గెల్చుట ఎవ్వరికిని శక్యముగాదు. నీలుడును, అంగదుడును, నేనును, మంచి తెలివిగలవాడును మా ప్రభువునైన సుగ్రీవుడును ఈ సముద్రమును దాటి లంకా పట్టణము చేరగలవారము. అంతమాత్రముచే ఏమి సాధింపబడును? సరియే. ఇంతకును ఆ శ్రీరామచంద్రుని భార్యయైన జానకి జీవించి యున్నదో లేదో అను వృత్తాంతము తెలిసికొని సీతను చూచి తరువాత చేయవలసిన కార్యమును గుఱించి ఆలోచించెదను గాక!"

**హనుమంతుడు లంకలో జొచ్చునుపాయ మాలోచించుట :**

ఎట్లు ప్రవర్తించిన రాముని కార్యము మేలుగా అగునో ఆ క్రమమును గూర్చి పర్వత శృంగముపై కూర్చుండి ఒక్క ముహూర్తకాలము ఆలోచించి "భయంకరమైన యిట్టి రూపముతో క్రూర రాక్షస మహా సైన్యముచే రక్షింపబడుచున్న లంకను ప్రవేశించుట అసాధ్యము. ఈ రాక్షసులందఱు పరాక్రమవంతులు, గొప్ప బలవంతులు. జానకిని వెదకుచోట ఈ సర్వ రాక్షస

సమూహములను వంచించి కనిపించీ కనిపించని వేషము దాల్చి రాత్రి సమయమునందు లంకలో బ్రవేశించి నే చేయబూనిన కార్యమును సాధింప వలయును." అని తలంచుచు ప్రవేశింప శక్యముగాని ఆ లంకా నగరమునట్టె జూచుచు హనుమంతుడు పలుమార్లు నిట్టూర్చెను. 'దుష్టుడైన ఆ రాక్షస రాజునకు కనబడకుండ ఒంటరిగానున్న సీతాదేవిని చూడగల్గుదునా? నేనెట్లు కార్యమును సాధింతునో గదా! ఐనట్లే తోచిన పనులైనను దేశకాల పరిజ్ఞానములేని దూత చేయబూనినచో ఆ పనులు సూర్యుని జూచిన చీకట్ల వలె చెడిపోవును గదా! దీనినీ విధముగా జేసినచో ఫలవంతమగునని సర్వజ్ఞులైన పండితులు విధించినట్టి పనియైనను తెలివిలేనివాడయ్యు తనకన్నియు తెలియుననుకొనునట్టి దూత తాను శక్తిలేని వాడగుటచే ఆ పనిని చెడగొట్టును. ఏ రీతిగా ఈ కార్యము చేయవలయునో, తెలివి తప్పక దీనినెట్లు నెరవేర్పగలనో, లవణ సముద్రమును దాటుట మంతయు ఏ విధముగా వ్యర్థము కాకుండునో గదా! ఈ రాక్షసులు నన్ను జూచినచో రాముని కార్యమంతయు చీకాకగును. నేను రాక్షస రూపమునే ధరించినను గుర్తింతురు. ఇంక ఇతరమైన రూపముల విధమును చెప్పనేల? ఈ రాక్షసులకు తెలియరాని దొక్కటియు లేదు. ఇది యథార్థము. గాలియైన వీరలు చూడకుండ వీచుట నామదికి కల్లయని తోచును. నేనీ రూపముతో ఈ విధముగా నిచ్చట నున్నచో నేను నశించుటయే గాదు రాముని కార్యము కూడ అపాయమును పొందును. కాన ఇది తగిన పనిగాదు. కాన నలుదిక్కుల చీకట్లు గ్రమ్మగనే చిన్న వానర రూపమును ధరించి ప్రవేశింపరానిదైన రావణుని పట్టణమును వేగముగా బ్రవేశించి అందు రాక్షసుల గృహములందు జానకిని వెదకి ఆ రాముని కార్యమును పూర్తిగావింతునని హనుమంతుడు మనస్సునందు తలంచి 'ఎప్పుడెప్పుడు సూర్యాస్తమయమగునో గదా! నే నెప్పుడెప్పుడు వైదేహిని చూచెదనో గదా!' యని ఎదురు చూచుచుండుగా అంతట పద్మ బాంధవుడు పడమటి కొండపై అస్తమించెను. అట్లు సూర్యుడస్తమించుటను జూచి తరువాత

హనుమంతుడు అద్భుతమగు విధముగా పిల్లియంత రూపమును దాల్చి ప్రదోష కాలమున లంకా పట్టణమును ఒక గంతువేసి వేగముగా ప్రవేశించి దానిని చూచెను.

**హనుమంతుడు లంకలో బ్రవేశించుట :**

నలుచదరముగా నుండి ప్రాసాద మాలికలతో నందముగానున్న వీధులును, బంగారు స్తంభములు బంగారు కిటికీలు ద్వారబంధములు గలవియై యేడెనిమిది అంతస్తులు గలిగి గంధర్వ నగరము వలె ప్రకాశించు సౌధములును స్ఫటికములు, బంగారు, వజ్రములు, వైడూర్యములు, ముత్యములు, పగడములు మున్నగువానిచే నిర్మితములయిన రాక్షసుల గృహములును, చిత్ర విచిత్రములైన తోరణముల వరుసలును గలదై ఎప్పుడును అలంకరింపబడినదై, గొప్ప శౌర్యముతో కూడిన కఠిన రాక్షస వర్గముతో గూడినదై, అద్భుతమును, అచింత్య మును, రాక్షస రాజుచే రక్షింపబడుచున్నదియునై యొప్పు లంకాపురమును చక్కగా జూచి హనుమంతుడు చింత నొందియును జనకపుత్రిని చూడదలంచి యుండుటచే సంతోషమును పొందిన వాడయ్యెను. అప్పుడు చంద్రుడు హనుమంతునకు సహాయపడుటకో యనునట్లు తన వెన్నెలలతో భూమ్యాకాశము లను వెలుగొందజేయుచు చుక్కల వరుసల మధ్య అందముగా నేతెంచెను. శంఖము వంటి కాంతియు, పాల రంగును, తామర తూడులలోని దారపు తెల్లని కాంతియు గలిగి సుందరమైన రూపముతో కనిపించి ప్రకాశించుచున్న చంద్రుని, సరోవర జలములో క్రీడించుచున్న బ్రహ్మ వాహనమగు హంసను వలె హనుమంతుడు సంతోషముతో దర్శించెను.



## మూడవ సర్గము

వ్రేలాడుచున్న మేఘములు గల లంబ పర్వత శిఖరము నుండి ఆ రాత్రి వనముల తోడను, అందమైన నీటి తోడను, శరత్కాల మేఘముల వలెనున్న భవనములతోడను, సముద్రపు గాలులతోడను, సముద్ర ఘోషము వంటి శబ్దములతోడను, మనోహరములైన ద్వార తోరణములతోడను, మందమందముగా వీచు గాలులతోడను, బంగారుమయములైన గొప్ప గృహ ప్రాకార మంటపములతోడను, మువ్వల సవ్వడులతోడను ప్రఖ్యాతి చెందిన ఇంద్రుని పట్టణము వలెను, సాటిలేని సర్పరాజులచే రక్షింపబడుచున్న భోగవతీ పురము వలెను అందముగానున్న పట్టణమును చూచుచు ప్రాణుడైన వానరశ్రేష్ఠుడు ప్రవేశించెను. అలకా పట్టణమును బోలుచు సుందరమై దండిగానున్న సైన్యముతో నిండియున్నదై మెఱుపులు మేఘములు గలదై గజ్జెల ధ్వనులతో గూడియున్న లంకను హనుమంతుడు ఔరా! యని విస్మయమందుచు చూచెను.

**హనుమంతుడు ప్రాకారమును జేరి యాలోచించుట :**

అట్లు వెళ్లి ప్రాకారము నొద్దజేరి హనుమంతుడు లంకాపురమును కలయజూచెను. బంగారు ద్వారములును, వైడూర్యపు టరుగులును, వజ్రములు, ముత్తెములు పొదిగిన కుట్టిమములును, బంగారు దిండ్లును, స్వచ్ఛమైన మెట్లును, ఆకాశమున కెగురునట్లు మెరయుచున్న చతుశ్శాలలును, ఆకాశమును నింపుచున్న హంస మయూర ధ్వనులును, వాద్యముల యొక్కయు భూషణముల యొక్కయు అధికమైన శబ్దములును గలిగి అలకా పట్టణమో యనునట్లున్న ఆ

రాక్షస నగరపు సొంపు జూచి సంతోషమును బొంది వాయుపుత్రుడిట్లు తలంచెను. "ఎల్లప్పుడును విచ్చు కత్తులను బూనిన సైన్యముచే రక్షింపబడుచున్న యీ పురమును గెల్చుటకు పరులెవ్వరికైనను శక్యమగునా? అంగదుడు, ద్వివిదుడు, సుగ్రీవుడు, మైందుడు, సుషేణుడు, ఋక్షుడు, కుముదుడు, కుశపర్వుడు, కేతుమాలుడు నేను మాత్రమే ఈ పట్టణమును బలముతో ప్రవేశింప గలవారము." అని బలశాలులగు వానరులను లెక్కించి సుమిత్రాపుత్రుడైన లక్ష్మణుని బలమును, శ్రీరాముని ప్రతాపమును తలంచినవాడై అనఘుడైన పావని సంతుష్టిని పొందెను. మఱల నొకసారి మణులనెడు వస్త్రములు గలదియు, సామగ్రిని నిలువజేయు కొట్లే కర్ణావతంసములుగా గలదియు, యంత్రాగారములే స్తనములుగా గలదియునై గజగమనముగల స్త్రీవలెనున్న లంకా పట్టణమును హనుమంతుడు చూచెను.

**హనుమంతుడు లంకాధి దేవతను జయించుట :**

నవరత్నములతో నిండియున్న శాలల సమూహముచే చీకట్లను పారద్రోలు చున్న రాక్షసరాజు పట్టణమును ప్రవేశించుచున్న కోతిని లంకాధిదేవతయు నిజరూపమును దాల్చి చూచెను. అట్లు చూచి కోపించి వికారమైన ముఖము తోడను, ఘోరమైన రూపముతోడను లేచి గర్జించి ఆ వానర వీరున కడ్డముగా నిల్చి యిట్లు పల్కెను. "ఓరీ! యెవ్వడవురా నీవు? చావకముందే ఓ వనచరుడా! నీవేమి పనిగా నిక్కడకు వచ్చితివో చెప్పుము. ఎల్లవేళలందును ఎల్లచోటులందును రావణాసురుని బలములచే రక్షింపబడుచున్న లంకను నీవా ప్రవేశించువాడవు? దేవతలైన నిందు ప్రవేశించి బ్రతుకు మార్గమున్నదా?" అనుచున్న లంకిణితో వాయుపుత్రుడు 'నా చరిత్రమంతయు చెప్పెదను గాని వికృతములైన నేత్రములు గలిగి ఏమి పనిగలదానవై నీవీ నగరపు వాకిటి నుండెదవు? ఇట్లు గర్జింపుచు నన్నేల యిట్లడగించెదవు? నాకిది తెల్పు' మనగా నామె ఆ వాయుపుత్రుని

చూచి క్రోధముతో మండిపడుచున్నదై భయంకరమైన మాటలతో నిట్లనెను. “రావణాసురుని యాజ్ఞ పొంది ఎల్లవేళలందును ఈ నగరమును గాచు చుండెదను. నా కనులు గప్పి నీవీ విధముగా నిందు ప్రవేశింప నేర్తువా? ఓరీ! వనచారీ! ఇప్పుడే చావగలవురా! స్వయముగా నేనే లంకనురా. ఇదియే నా చరిత్రము. నీ కథను చెప్పుము వినెద” ననగా ఆ వాయుపుత్రుడును లంక చెప్పిన మాటలను విని పర్వతము వలె నిల్చి ఇంచుకంతయును భయపడక వికృతమగు స్త్రీ రూపముతో నిల్చిన లంకను జూచి ‘సముద్రముచే చుట్టబడి ప్రాకారములు, గోపురములు, విశాల గృహ ప్రాంగణములు, ఉద్యానవనములు మున్నగువాటితో అలంకరింపబడిన లంకా పట్టణమును చూచు కోర్కెతో వచ్చితిని” అని చెప్పగా లంక “ఓరీ! నన్ను జయింపకుండ యే విధముగా రావణునిచే పాలింపబడిన ఈ లంకా నగరమును చూచెదవురా? దుర్మార్గుడా!” అని పరుషమైన వాక్కులను ఆ స్త్రీ పలుకగా, ఆ రాక్షసిని జూచి వానర వీరుడిట్లనెను. ‘ఈ పురమునంతయు జూచి నేను వేగముగా వచ్చిన త్రోవనే పోయెదను.’ అనగా విని లంక భయంకరమైన క్రోధ గర్జనలతో తన అరచేతితో వానరవీరుని గొట్టెను. వానర నాథుడా విధముగా దెబ్బపడి బొబ్బ పెట్టుచు ‘స్త్రీ గదా’ యని తలంచి తీవ్రమైన రోషమును పొందక కొలది కోపముతో తన యెడమ పిడికిలితో నామెను పొడిచెను.

**లంక తన్ను రక్షింప హనుమంతుని వేడుట :**

ఆ ముష్టి ఘాతము చేతనే భూమి పైబడి నోరు తెరచిన ఆ స్త్రీని హనుమంతుడు దయా మతితో చూచెను. లంకయు గర్వము తొలగినదై యతనితో నిట్లనెను! “ఓ వానరశ్రేష్ఠా! నా పై దయదలచి కాపాడుము. నీవు గొప్ప పరాక్రమశాలివి. గొప్ప బలవంతులు ఎందైనను ఎప్పుడైనను స్త్రీలను చంపరాదనెడు మరియాదను దాటరు గదా! ఓ కపిశ్రేష్ఠా! నేనే స్వయముగా

లంకను. నీ పరాక్రమము కనిపించునట్లు పోరాటములో నన్ను నీవు గెల్చితివి. పూర్వము బ్రహ్మ వరము లిచ్చునప్పుడు 'ఎవ్వడైనను వానరుడు నిన్ను ఎప్పుడు గెలుచునో ఆనాడు మొదలుగా రాక్షస కోట్లకు వినాశము ప్రారంభమగు'నని చెప్పెను. నిజము చెప్పితిని. బ్రహ్మ కూడ సత్యమునే చెప్పెను. ఇది దేనిచేతను తప్పదు. భూ పుత్రిక కారణముగా దైత్యులకును, దశాస్యునకును మృత్యువు దాపురించినది. కాన నిక నీవు వెళ్లి పట్టణము నెల్ల చూడుము. వానర నాయకా! నీ యిష్టము వచ్చినట్లుగా నీ పనుల నన్నిటిని నిర్వర్తించుకొనుము. శాపముచే గొట్టబడిన ఈ లంకాపురమును ప్రవేశించి జనకరాజపుత్రిని జూచి, నీ మనస్సంకల్పము తీరగా ఓ వానరకుల దీపకా! హనుమంతా! యథాసుఖముగా తిరిగి వెళ్లుము" అని చెప్పెను.



# నాలుగవ సర్గము

**హనుమంతుడు లంకలో సంచరించుట :**

సత్య పరాక్రమము గల హనుమంతుడు కామరూపిణియైన లంకను పరాక్రమముతో గెలిచి ఆలస్యము చేయక ఆ పట్టణమును ద్వారములు లేనిచోట ప్రాకారమును దాటి ప్రవేశించెను. (విరోధుల యింఢ్ల ద్వారమున వెళ్లరాదు గాన) వానరరాజగు సుగ్రీవునకు హితమొనరించునట్టి వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు విరోధుల శిరస్సునందు బలముతో తన యెడమ పాదమును ముందుగా నుంచిన విధముగా నుంచి లంకా పట్టణమున బ్రవేశించెను. పూవుల చేతను ముత్తెముల చేతను అలంకరింపబడిన రాజమార్గమును చేరి మనోహరమైన ఆ పట్టణము యొక్క నాల్గుప్రక్కలు చూచి దాని సంపదల ఉన్నతిని పావని మెచ్చుకొనెను. విశేషముగా మ్రోగుచున్న వాద్యముల ధ్వనులును, పకపకమని నవ్వుచున్న హాసముల వైభవములును, వజ్రాయుధము, అంకుశము వంటి యాకారముగల వజ్ర సమూహపు భూషణములచే అలంకరింపబడిన ఇండ్లనెడు మేఘములును గలిగి మేఘములతో నొప్పు ఆకాశమో యనునట్లు ప్రకాశించును. మఱియు తెల్లని మేఘము వలె నొప్పుచున్న స్వస్తిక పద్మాకారములతోనున్న రాక్షస గృహములతో విలసిల్లుచు, రంగు రంగుల పూలదండలతో సుందరమై యున్న పురమును జూచి సంతోషమును పొందినవాడై సుగ్రీవ హితుడగు హనుమంతుడు శ్రీరామ కార్యార్థమై చూడ మొదలిడి చాల సంతోషమును పొందెను. ఈ విధముగా ఇంటింటికి వెదుకుటకు వెళ్లుచోట అనేక విధమైన రూపములతో నున్నవియు సాటిలేని సౌందర్యము

గలవియునగు మందిరములను వాయునందనుడు కన్నుల పండువుగా జూచెను. చెవులకు వినసొంపు కలుగజేయుచు, అచ్చట దేవతా స్త్రీలను బోలియున్న రాక్షసకాంతలు మూడు (స్థాయిలందును) మనోహర స్వరములతో మధురముగా తమ గానామృతమును నింపుటను, మనోజ్ఞములైన రత్న ఖచితములైన వడ్డాణముల ధ్వనులను, అందెల విశిష్ట ఝుళం ఝుల రవములను, సోపానముల నెక్కుచు దిగుచునున్న వారి ధ్వనులను, భయంకరములైన కంఠ ధ్వనులను, జపింపబడుచున్న మంత్ర ధ్వనులను హనుమంతుడు వినుచు వెళ్లెను. వేదమంత్రములతో రాక్షస రాజును నుతించుచున్న వారలను చక్కగా జూచెను. రాజమార్గమునందలి కూడలి స్థలములందు గూఢచారులను, గర్జించుచున్న రాక్షసులను, దీక్షతో జడలు గట్టిన శిరస్సుల వారిని, బోడి తలల వారిని, ఎద్దు చర్మములు దాల్చిన వారిని, దర్భలను చేతులందు పూని హోరీమము చేయుటకై అగ్ని కుండముల యొద్దనున్న వారిని, కూట ముద్గరాద్యాయుధములను దాల్చిన వారిని, ఒక్కకన్ను వారిని, ఒక్క చెవిగలవారిని, వ్రేలాడు పొట్టగలవారిని, వ్రేలు ఱొమ్ములు గలవారిని హనుమంతుడు వేడుకతో చూచెను. వికారమైన ముఖములు గలవారిని, పెద్ద విండ్లు దాల్చిన వారిని, పొట్టివారిని, వంకరనోళు గలవారిని, ఖడ్గములను, ముసలములను, కవచములను ధరించినవారిని, పరిఘాయుధములను ధరించినవారిని, శతఘ్ని అను ఆయుధము గలవారిని, మఱియు మిక్కిలి స్థూలముగా లేనివారిని, మిక్కిలి కృశింపని వారిని, ఎక్కువ పొడవుగానివారలను, ఎక్కువ పొట్టిగానివారిని, మిక్కిలి తెల్లగాలేనివారిని, అధికమగునలుపుగానివారిని, అనేక విధములైన రూపములుగలవారిని, వికార రూపము గలవారిని, సురూపులను, మంచి వర్చస్సుగలవారిని, జెండాలను ధరించినవారిని, ధ్వజములను పట్టినవారిని, వివిధాయుధ ధారులను, శక్తి, పట్టిసము మొదలగు నాయుధములు పట్టినవారిని వాయునందనుడు చూచెను.

విసరివేయు పాశములను ధరించిన వారిని, పుష్పమాలలు ధరించినవారిని, చందనము నలందినవారిని, శ్రేష్ఠములగు ఆభరణములను ధరించిన వారిని, అనేక విధములైన వేషములు దాల్చి స్వేచ్ఛగా సంచరించుచున్న వారిని వేలకొలదిగా ఆ మహాబలశాలి చూచెను. పట్టణమునకు మధ్యనున్న భవనమును గాచుటకై రావణునిచేత ఆజ్ఞాపింపబడి ఏమరుపాటు లేక మిగుల హెచ్చరికతో కాపలా కాయుచున్న మూలబలమును హనుమంతుడు చూచెను. బంగారు తోరణములు గలిగి గిరి శిఖరములను తెల్లపద్మములతో నొప్పారు అగడ్తచే పరివేష్టితమయిన ప్రాకారము నందు దేవతల నివాసముతో సమానమై, మనోహర ధ్వనులతో గూడినదై, గుఱ్ఱముల యొక్క గొప్ప సకిలింతలు గలదై, మనోజ్ఞములగు ఆభరణముల ధ్వనులు గలదై, అందమైన విమానములు, రథములు గలదై, మదపుటేనుగులును, మదించిన పక్షుల సమూహములును, మృగములునుగలదై, గొప్ప యోధులచే సురక్షితమై యొప్పుచున్నదియు, బంగారము రత్నములు మొదలగు వానిచే ప్రకాశించుచున్నదియు, మిక్కిలి వెలగల ముత్తెములతోడను, మణులతోడను అలంకరింపబడినదియు, నల్లని మేఘములవలె వ్యాపించిన అగరు ధూమములచే సువాసితమైనదియు నగు రావణాసురుని యొక్క రాణులుండు నివాసమును వాయుపుత్రుడు చూచెను.



# ఐదవ సర్గము

**చంద్రవర్ణనము :**

దానిని జూచి కేసరినందనుడగు హనుమంతుడు రామచంద్రుని భార్యను వెదకుటకై లోనికి వెళ్లెను. ఆకాశమధ్యమునందు జనులకు నేత్రపర్వముగా చంద్రుడు ప్రకాశించుచుండెను. అంత వింతలైన వెన్నెలల కాంతులు వెలుగు చుండగా, అందమైన ఆలమందలో సంచరించు ఆబోతువలె తిరుగుచు, జగమునందంతట అత్యధికమగు కాంతి వ్యాపింపగా మనస్సులు హాయిని పొందునట్లుగా, సంతోషముతో సముద్రుడు తరంగములతో గంతులు వేసి దిగంతములు తాకునట్లు ఉప్పొంగగా, జనుల పాప సమూహములను నశింప జేయు నక్షత్రనాథుని హనుమంతుడు కాంచెను. భూమిపై మందర పర్వతమున కెట్టి కాంతిగలదో సంధ్యావేళ సముద్రమున నెట్టి ప్రకాశముండునో, సరోవరములలోనున్న పద్మములందెట్టి వెలుగుగడునో అట్టి ప్రకాశమే చంద్రునియందు సుందరమై యుండెను. వెండి పంజరముననున్న హంసవలెను, మందర పర్వతపు గుహయందున్న సింహము వలెను, మదపుటేనుగు నెక్కిన వీరునివలెను, అప్పుడా కాశముననున్న చంద్రుడు కాంతాముఖము వలె నందమైనవాడై ప్రకాశించెను. వాడి కొమ్ములు గలిగిన తెల్లని యెద్దు వలెను, బంగారు శృంగములు గల ఏనుగు వలెను, ఎత్తైన శిఖరములు గల పర్వతరాజు వలెను, సకల కళలతో గూడి విశ్వమనోజ్ఞ కాంతియుతుడై చంద్రుడు ప్రకాశించెను. చల్లని నీటి తుంపురుల వలన నశించిన మాలిన్యము గలవాడును, శుక్రాది గ్రహములను గప్పి నిర్మలమైనవాడును, గొప్ప గ్రహమైన సూర్యుని కిరణములను గ్రహించుటచే అంధకారమును పోగొట్టినవాడును, గొప్పకాంతిచే

విశదముగా కనిపించుచున్నవాడును, మహాప్రభావముగలవాడును, మచ్చకల వాడునునై చంద్రుడు ప్రకాశించెను. విశాల పర్వతముపైనున్న సింహమువలెను, గొప్ప యుద్ధముననున్న యేనుగువలెను, రాజ్యమును సంపాదించిన రాజువలెను, తెల్లని గరుత్మంతుని వలెను చంద్రుడు ప్రకాశించెను. ఆ ప్రదోష సమయము ప్రకాశించుచున్న చంద్రునిచే తొలగిపోయిన చీకటులు గలదియు, మాంసమును భుజించి రాక్షసులు విరివిగా సంచరించుటయను దోషము గలదియు, సుందరమైన స్త్రీలు విటప్రియుల మాటలచే క్రోధములు వీడు సమయమైనదియు, స్వర్గము వలె సంతసమును శుభమును కలగించునదియునై యొప్పెను. ఆ సమయమున చెవుల పండువు సేయునట్లుగా వీణా నాదములు వినయ్యెను, కాంతల సమూహములు తమ కాంతులచే కౌగిలింపబడినవారై శయనించిరి. క్రూర స్వభావము గల రాక్షస సమూహము భయంకర కృత్యములను జేయుచు సంచరింపసాగెను. పతుల నెడబాసిన స్త్రీలు మన్మథబాణములచే కొట్టబడి భయకంపితలైరి. పరాక్రమశాలియైన హనుమంతుడచ్చట మద్యము తావుటచే మత్తుచెందిన వారితో గూడినవియును, రథములు, ఏనుగులు, గుఱ్ఱములు ఉత్తమమైన ఆసనములు గలవియు, వీరలక్ష్మితో నొప్పునవియు నయిన గృహములను చూచెను.

**హనుమంతుడు లంకలో రాక్షస స్త్రీ పురుషులను జూచుట :**

ఒకరినొకరాక్షేపించు వారును, గొప్ప భుజములతో నొకరినొకరు పొడుచుకొనుచున్నవారును, మదిరాపానమత్తతచే ఒకరినొక రధిక్షేపించుకొను వారును అయిన రాక్షసులను హనుమంతుడు చూచెను. రొమ్ముల యందాచ్ఛాదన లేకుండ పరుండి నిద్రించెడివారిని, స్త్రీ శరీరముల పై కాలు చేయి సుందరముగా వేసి పరున్నవారిని, అనేక విధముల రూపములతోనున్న వారిని, గొప్ప విండ్లను మ్రోగించుచున్న వారిని, పవన నందనుడు చూచెను. ముచ్చటలాడుచున్న వారును, నవ్వులతో ముద్దులొలుకు మొగములు గలవారును, నిద్రచేత కన్నులు

మూయుచున్నవారును, అధికమైన నర్మకోపముచే పెద్ద నిట్టూర్పులను విడచు చున్నవారును, ఎంతో అందము చిందునట్లు తమ భర్తలను ప్రార్థించు చున్నవారును అయిన స్త్రీలను చూచెను. ఘీంకారములు చేయు మదపు టేనుగులతోడను, సభ్యులకు నమస్కరించుచున్న పూజ్యులతోడను, సరస్సులలో నుండి పూత్కారములు చేయు సర్పములవలె బుసలు కొట్టుచున్న వీరభటుల తోడను, ఆ పట్టణమొప్పెను. మహాబుద్ధి శాలులును, శ్రద్ధావంతులును, అందమైన పేరులు గలవారును, ప్రఖ్యాతి చెందినవారును, అనేక విధములగు విధానములు గలవారును, మిక్కిలి మనోహర రూపముగలవారును, మంచి గుణములు గలవారును, వికార రూపము గలవారును అయిన లంకలోని రాక్షసులను, పరిశుద్ధమైన స్వభావములు గల మహాత్ములగు స్త్రీలను, మన్మధ వికారము గల మనస్సులు గల స్త్రీలను, నక్షత్రముల వంటి కాంతిగల స్త్రీలను, ఆనంద సముద్రములో మునిగియున్న స్త్రీలను సౌధముల పైభాగములయందు మారుతి చూచెను. అచ్చట అధికమగు సిగ్గుచే నావరింప బడిన వారిని, మోహరసమున మునిగియున్నవారిని, భర్తలచే కౌగిలింపబడిన వారిని, ప్రియ భర్తను మోహింపజేయుటెరుగని వారిని, అందమైన పువ్వుల నాశ్రయించిన పక్షులవంటివారిని, స్త్రీలచే కౌగిలింపబడినవారిని, బుద్ధిమంతు లగు భర్తలచే పెంపొందినవారిని, క్రొత్త పెండ్లి కూతుండ్రను వానర నాయకుడు చూచెను. బంగరు మేడలలో కూర్చున్నవారిని, భర్తల తొడలపై గూర్చున్న వారిని, వినయముగా భర్తల కభీష్టములైన నృత్యములు చేయుచున్నవారిని, ధర్మ తత్పరలైన వారిని, మదన పరవశలైన వారిని, వికార రహితములైన సుందర చేష్టలు గలవారిని, మిక్కిలి యానందమునందియున్న వారిని చూచెను. బంగారు రంగు గలిగిన వారిని, భర్త యెడబాటుచే తెల్లబడినవారిని, మన్మధ కేళియందాసక్తలగువారిని, జారిపోయిన పైటచెఱగుల వారిని, భర్తలచే చల్లబడిన సుగంధ చూర్ణము గలవారిని, అలసిపోవుటచే చెదరిన ముంగురులు గలవారిని

వాయుదేవుని పుత్రుడు చూచెను. భర్త కౌగిలి లభించుటచే మిగుల ఆనందించు చున్న స్త్రీలను, తమ మందిరములలో విహరించుటయందాసక్తులైన యౌవనవతులను, ప్రేమరస నిదానములై, సుకుమార శరీరములు గలవారగు కాంతలను రాక్షసుల యొక్క కేళీ గృహములందు రామచంద్రుని దూత దర్శించెను. చంద్రబింబమువంటి ముఖములు గలవారును, వంకరలగు రెప్పతుదల వెంద్రుకలచే మంజులతరములైన సోగకన్నులు గలవారును, భూషణములు దాల్చి మెఱుగు తీగలను బోలువారును అగు బాలికలను చూచెను. కాని రాజవంశమందు పుట్టినదియు, పరమ పతివ్రతయు, మిగుల ఆభిజాత్యము గలదియు, పూచిన తీగవలె చక్కని పుట్టుక గలదియు, తన సంకల్పముచేతనే అయోనిజగా పుట్టినదియునగు సీతను మాత్రము కపిశ్రేష్ఠుడు కానదయ్యెను. సనాతనమైన ధర్మ మార్గమునందు నడచునదియు, భర్త ముఖమును చూచుటచేత మాత్రమే సంతసించునదియు, భర్తయందలి కామముచే నిండియున్నదియు, ఉత్తమ స్త్రీ రత్నమును, తన భర్త హృదయమున ప్రవేశించినదియు, విరహతాపముచే విడువకుండ కన్నీరు విడుచుచున్నదియు, రమ్యములైన రెప్పతుదల వెంట్రుకలు గలదియు, పూర్వము మంచి యాభరణములను ధరించినదియు, వనమున విహరించు ఆడు నెమలి వంటిదియు, చంద్రరేఖవలె అవ్యక్తముగా నున్నదియు, ధూళిగప్పిన బంగరు కడ్డీవలె నున్నదియు, వ్రణము నందు నాటిన బాణము వలెను, గాలిచే చెదరగొట్టబడిన మేఘము వలెను ఉన్నదియు అగు సీతను రాముని భార్యను చాల తడవు భీతిల్లక వెదకి ఆ పట్టణమందామెను గానక వాయుపుత్రుడు గొప్ప వ్యధతో చింతింపసాగెను.



# ఆఱవ సర్గము

**హనుమంతుడు రావణుని నివాసము చూచుట :**

అట్లు రాక్షస నిలయము లన్నియు వెదకి వెదకి సీతను గానక విషాదమును పొందినవాడై కనిపించని రూపమును పొంది వేగముగా మఱియొకమారు సీతను వెదకుటకై లంకలో తిరిగెను. సింహములచే రక్షింపబడిన మహారణ్యమువలె దుష్టులు, క్రూరులునగు రాక్షస సమూహముచే రక్షింప బడుచున్నదియుబీ సూర్యునివలె ప్రకాశించు ప్రాకారము గలదియుబీ ప్రకాశమానమై యున్నదియునైన రావణాసురుని భవనమును జూచి ముక్కున వ్రేలిడికొని వెండితోను, బంగారముతోను, అలంకరింపబడి మణులు పొదుగబడిన భూషణములతో ప్రకాశించు తోరణములు గలిగి పలువిధములైన గదులతోడను, అందమైన ద్వారములతోడను ఒప్పుచున్నదియుబీ ఏనుగులనెక్కి శ్రమ తెలియని హరులచే రక్షితమైనదియుబీ ఒకచోట నిలువక సంచరించు గుఱ్ఱములు గలిగి, పులుల, సింహముల చర్మములు పరువబడి వెండి బంగారములతో నిర్మింపబడిన రథములు గలదియుబీ అనేక రత్నములతో గూడినదియుబీ శ్రేష్ఠమైన ఆసనములు గలగియుబీ మహారథులైన రాక్షసులకు నివాసమైనదియుబీ సాటిలేని రథములును సాటిలేని ఆసనములును గలదియుబీ అనేక విధములైన మృగములతోడను, పక్షి సమూహములచేతను శోభిల్లుచున్నదియుబీ నిర్భయముగా విజృంభించు అంతఃపుర రక్షకులచే రక్షింపబడినదియుబీ మనస్సునకు నచ్చిన సుందర స్త్రీలతో నిండియున్నదియుబీ బలిసిన చకోరపక్షులను పరిహసించు కన్నులుగల స్త్రీల యొక్క బంగరు రత్నభూషణము లొండొంటిని రాచుకొని పుట్టిన ధ్వనులతో సముద్ర ఘోషమును తిరస్కరించుచున్నదియుబీ చందనము, అగరు ధూపము మొదలగువాని సువాసనలు వ్యాపించుచుండగా భేరుల, మద్దెలల మ్రోతలు మ్రోయుచుండగా, రాక్షసులచే నిరంతరము పూజింపదగినదై సముద్రమువలె గంభీరమై

వెలుగుచున్నదియునైన రావణుని భవనమునుబీ అందముగా గుఱ్ఱములు, ఏనుగులు సంచరించుచున్న దానిని, వివిధ రత్నములు గల గృహములు గల దానిని చూచి హనుమంతుడు ఇది లంకకే ఆభరణమని తలచెను. హనుమంతుడు రాక్షసుల వీడు వీడంతయు, వాడవాడలను, తోటలను, దొడ్లను విడువకుండ వెదకెను. మేడ మేడయు, ఇల్లిల్లును, మూలమూలయును మనస్సునందు భయము లేకుండా, విసువు చెందక కార్యావసరము వలన మానక వెదకుచుండెను.

**హనుమ రాక్షస ముఖ్యుల యిండ్లయందు సీతాదేవిని వెదకుట :**

గొప్ప వేగము గలవాడు పరాక్రమశాలి యగు హనుమ వేగముగా ప్రహస్తుని యింట దిగి వెదకి, అటనుండి మహాపార్శ్వుని భవనమును చేరెను. పిమ్మట మేఘతుల్యమైన కుంభకర్ణుని మేడయందు వెదకి, అనంతరము విభీషణుని యింట చూచి, యటనుండి మహోదర విరూపాక్ష విద్యుజ్జిహ్వుల యిండ్లను, విద్యున్మాలి గృహమును వెదకి, వజ్రదంష్ట్రుని భవనమును జాగ్రత్తగా వెదకి, శుక సారణుల యిండ్లను, ఇంద్రజిత్తు గృహమును వెదకి, జంబుమాలి సుమాలుల భవనములను, రశ్మికేతు సూర్యశత్రులనువారల గృహములను, వజ్రకాయుని గేహమును వరుసగా వెదకెను. విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, వికటుడు, వక్రుడు, శరుడు, శుకనాసుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, ధ్వజగ్రీవుడు, యుధోన్మత్తుడు, మత్తుడు, రోమశుడు, విద్యుజ్జిహ్వుడు, హస్తి ముఖుడు, ఇంద్రజిహ్వుడు, శోణితాక్షుడు, పిశాచుడు, కరాళుడు అను రాక్షస వీరుల గృహములకు వరుసగా పోయి వెదకుచుండెను.

**హనుమంతుడు రావణు గృహంబు జొచ్చుట :**

ఈ విధముగా వారు వారు నివసించు గృహములన్నింటిని వెదకి ఆ పావని పాశ తోమర కృపాణ ముద్గర శూలములను హస్తములందు ధరించి కావలి గాచుచున్న స్త్రీలను, మొగసాలయందు శయనించుచున్న వారిని ఆ

రావణుని గృహమందు జూచి తరువాత లోపలి భాగమునందు, నానావిధములైన సాధనములు ధరించి యుద్ధ మర్మజ్ఞులైన రాక్షస సైనికులను, వేగవంతములైన ఎఱ్ఱని తెల్ల గుఱ్ఱములను జూచెను. యుద్ధమునందితర గజములను పీడించునవియు, పరసేనలను నలగ ద్రొక్కునవియు, శ్రేష్ఠమైన కులమున బుట్టినవియును, ఇంద్రుని ఐరావతమును బోలియున్నవియును, రూప సంపన్నములునైన ఏనుగులను కేసరి పుత్రుడు చూచెను. వర్షించు మేఘములో యనునట్లును, సెలయేటి ప్రవాహములు గల పర్వతములో యనునట్లును, గొప్ప గర్జనలతో గూడిన మేఘములో యనునట్లును ఒప్పుచు శత్రువులకు జయింప శక్యముగాని గజశ్రేష్ఠములను జూచెను. బంగారు ఆభరణములు గలిగి సూర్యతేజస్సుతో వెలుగొందు సైన్య సమూహములును, వివిధాకారములతో పల్లకీలును, విచిత్రములగు లతా గృహములు గలిగి చిత్రములతోనున్న కేళీ గృహములును, వేడుకగా క్రీడించుటకై చెక్కతో నిర్మించిన పర్వతములును, రతిక్రీడా గృహములును, పగటివేళలందు విహరించుటకై ఏర్పరుపబడిన మందర పర్వతము వంటి యెత్తైన గృహములును, అందమైన టెక్కెముల దండములును, ఎంచి చూడదగిన నిధులును గలిగి, ధగద్ధగాయమానముగా ప్రకాశించుచు కైలాస పర్వతముతో సమానమైన రావణుని భవనమును రామదూత చూచెను. రావణుని తేజస్సుచేతను, గొప్పమణులయొక్క రత్నముల యొక్క కాంతి సమూహముల చేతను నిండినదై రావణుని మందిరము కిరణములచే వెలుగొందు సూర్యునివలె వెలుగొందెను. మేడల సమూహములతో గూడినదై, ప్రకాశించు మణులతో నొప్పు పాత్రలు గలదై, మద్యము లొలుకుటచే తడిసినదై, ఇంపైన మృదంగ నాదములు గలదై, బంగారు శయ్యలు, మెఱయుచున్న బంగారు పాత్రలు, మనస్సులను హరించునట్టి మన్మథుని వారువములా యనునట్లున్న శ్రేష్ఠ వనితలు, మణుల వడ్డాణముల యందెల ధ్వనులు గలిగి మిగుల మనోహరమై విశాలమై యొప్పుచున్న రావణాసురుని శ్రేష్ఠమైన గృహమును, మందిర సమూహములను మారుతి జూచెను.

# ఏడవ సర్గము

## హనుమంతుడు నగళ్లలో సంచరించుట :

అవి మనోహరమైన మణులతో వైడూర్యములతో బంగారుతో నిర్మితములైనవి. మెఱుపు తీగలు పక్షులు విహరించుచున్న వర్షాకాల మేఘములవలె వివిధములై భాసిల్లుచున్న శాలలు గలిగి యుండెను. శంఖములు విండ్లు మొదలగు ఆయుధములు గల చిన్నశాలలు గలిగి యుండెను. సుందరములైన గృహోపరి చంద్రశాలలు గలిగి యుండెను. అవి అనేకములైన రత్నముల కాంతులతో ప్రకాశించుచుండెను. ఇంద్రాది దేవతలచే పూజింపబడుచుండెను. అవి శ్రేష్ఠములు దోషరహితములు. వానిని రావణుడు తన భుజబలముతో సంపాదించెను. అవి మయుడను రాక్షస శిల్పిచే నిర్మింపబడినవి. మణి భూషణములచే నలంకరింపబడినవి. అట్టి రావణుని గృహమును హనుమంతుడు కొంచెమైనను జంకులేక వేడుకతో వెదకి చూచెను.

## హనుమంతుడు పుష్పక విమానమును జూచుట :

గొప్పనైన మేఘమువంటి యాకృతి గలదియు, బంగారుమయమైన సుందర రూపము గలదియు, రాక్షసరాజు యొక్క బలమునకు తగినదియు, భూమియందు సాటిలేని రూపము గలదియు, భూమికవతరించిన స్వర్గమువలెనున్నదియు, గొప్పకాంతిగల్గిన రత్నములతో గూడినదియు, సుందరమైన వృక్షముల పూవులతో నొప్పునదియు, పుప్పొడులు వ్యాపించిన కొండకొనవలెనున్నదియు, మెఱుపు తీగలవంటి స్త్రీలతో గూడి మెఱుపులతోడి మేఘమువలె నున్నదియు, ఒప్పుచున్న హంసలచే మోయబడుచున్న బ్రహ్మదేవుని విమానముతో సమానమైనదియు,

అనేక ధాతువులచే విచిత్రమై పర్వతమోయనునట్లున్నదియు, అనేక వర్ణములు గల మేఘముల చేతను, గ్రహముల చేతను చంద్రుని చేతను వెలుగొందుచున్న ఆకాశమోయను నట్లున్నదియు, నయిన రత్నఖచితమైన పుష్పక విమానమును జూచెను. ఆ విమానముపై భూమి పర్వతములతో నిండినదిగను, ఆ పర్వతము చెట్ల సమూహములతో నిండినవిగను, ఆ చెట్లన్నియు పువ్వులతో నిండినవిగను, ఆ పువ్వులు రేకులతోడను, కేసరములతోడను గూడినవిగా నున్నవి. ఆ విమానమునందు తెల్లనైన భవనములు, చక్కని తామరలతో గూడిన కొలనులు, కేసరములతో గూడిన తామరలును ఆశ్చర్యమును గలిగించు గొప్ప వనములును సృష్టింపబడినవి. ఎంతయో ప్రకాశించుచు రత్నముల కాంతులు వృద్ధి చెందుచు ఉత్తమమైన భవనములకంటెను శ్రేష్ఠమైన పుష్పకమను పేరుగల మహా విమానమును హనుమంతుడు చూచెను. ఆ విమానముపై కొన్ని పక్షులు వైడూర్యములచే నిర్మింపబడినవి. మఱికొన్ని వెండితోను, పగడములతోను నిర్మింపబడినవి. అనేక రత్నములచే నిర్మితములైన సర్పములును మంచి జాతి గుఱ్ఱములును గలవు. బంగారము, పగడములతో నిర్మింపబడిన పువ్వులు రేకుగలవియై కొంచెము వంగి మన్మథ బాణము వలెనున్నవి. చక్కని ముఖములు రెక్కలు కలవిగా అందు పక్షులు నిర్మింపబడియున్నవి. తామర కొలనులలో తమంత తామే ఏనుగులు తొండములతో వికసించిన కలువలు గల నీటిని తీసికొని పద్మహస్తయైన లక్ష్మీదేవి నభిషేకించుచున్నట్లు నిర్మింపబడినవి. కమ్మని సువాసనలు గల వృక్షమువలెను, దరులతో గూడిన పర్వతమువలెను, హృదయమున కాహ్లాదము కలిగించు నాపుష్పక విమానమును జూచి హనుమంతుడాశ్చర్యము నొందెను. ఇట్లెన్నో వింతలు పురమునందు అంతటను చూచుచు పోయి పోయి యెచ్చటను సీతను గానక యేమి చేయుదుననుచు హనుమంతుడు చింతాక్రాంతుడయ్యెను.

# ఎనిమిదవ సర్గము

**పుష్పక విమాన వర్ణనము :**

ఆ భవన మధ్యమందు విచిత్ర రత్నములతో ధగద్ధగాయమానమై, పుటము పెట్టిన బంగారుతో నిర్మితమై ఆకాశ మార్గమున సంచరింపగల్గుటచే గౌరవింపబడినదై, సాటిలేనిదై, కొలువరాని గొప్పదనము కలదై ఆకాశము నుండి మాత్రమే చూడదగినదై యొప్పు విమానశ్రేష్ఠమును హనుమంతుడు చూచెను. ఆ విమానమున గొప్ప నేర్పరితనముతో గొప్ప యత్నముతో తీర్చిదిద్దబడనిది లేదు. ఎచ్చటను దివ్యములైన మణులు, వజ్రములు లేనిచోటు లేదు. దాని సౌందర్యమేవిమానములందును లేదు. దాని జూడగా నెవ్వరికైనను ఆశ్చర్యము కలుగక మానదు. తపోబలము చేతను, పరాక్రమము చేతను దానిని రావణుడు సంపాదించెను. అది అతని యిష్టము చొప్పున నేప్రదేశమునకైనను పోగల్గినది. అనేకమైన విమానములతోను, గోపురములతోను నిర్మింపబడినది. వాయువేగము గలది. వారింప శక్యము గానిది. పుణ్యాత్ములకు మాత్రమే నివాసము కాదగినది. చిత్రములైన కూటములు గలది. మనోహరమైనది. శరచ్చంద్రునివలె తెల్లనైనది. కుండలములలంకంరించుకొనిన ముఖములు గలవారును, గొప్పవేగము గలవారును అయిన గగనచరులు, రాక్షసులు, భూతగణములు మున్నుగా గల వేయిమందిచే మోయబడుచున్నట్లుండెను. హనుమంతుడు సుగంధ సుమములచే నలంకరింపబడి సుందరమైనదియు, సుగంధములు గలదియు, వసంతఋతువు కంటెను సుందరమైనదియు, దేవశిల్పియగు విశ్వకర్మచే నిర్మింపబడినదియు అగు పుష్పక విమానమును చూచెను.

# తొమ్మిదవ సర్గము

**హనుమంతుడు రావణునంతఃపురంబు చూచుట :**

పుష్పక విమాన మధ్య భాగము నుంచి యోజనము వెడల్పును ఒక యోజనము పొడవును గలదైన రావణుని మందిరమును ప్రవేశించి యావానరశ్రేష్ఠుడు సీతాదేవిని వెదకెను. పెక్కుమేడలుగల ఆ రాక్షసరాజు నగరిలో బలవంతులైన రాక్షసుల యిండ్లనన్నిటిని వరుసగా వెదకి తుదకు ప్రధానమగు రావణుని యింటిని చూడదొడగెను. మూడును నాల్గును కోఱలు గలిగిన యేనుగు లచ్చటచ్చట కట్టబడియుండుటను భయంకరములగు నాయుధములను బూని యోధులు దానిని రక్షించుచుండుటను, ఆ రాక్షసరాజు భార్యలచేతను, పరాక్రమముచే చెరబట్టి రావణుడు తెచ్చిన రాజకన్యల సమూహముల చేతను నిండియుండుటను, తిమి తిమింగిలములు మొసళ్లు పెద్దచేపలు మున్నగువానిచే కలతచెందినట్టి సముద్రమో యనునట్లు కల్లోలితమై యుండుటను, విష్ణుమూర్తి యొక్క లక్ష్మియు, ఇంద్రుని సిరియును, ఎల్లప్పుడు రావణుని బంధువుల యిండ్లను వీడకుండుటను, యమకుబేర వరుణాదుల సిరియు నంతకుముందే అచ్చట వెలసియుండుటను హనుమంతుడు చూచెను. ఆ అందమైన మేడమధ్య భాగమున, పూర్వము విశ్వకర్మ బ్రహ్మ కొఱకై వివిధములైన శ్రేష్ఠమణులతో నిర్మించి యీయగా అనంతరము కుబేరుడు బ్రహ్మను సేవించి తాను సంపాదించుకొనగా అతనిని యుద్ధరంగమున గెల్చి రావణాసురునిచే పొందబడినదగు పుష్పక విమానమును హనునుంతుడధిరోహించెను. అది బంగారముచే నిర్మింపబడిన స్తంభములు గలది. సుందరముగా ధగద్ధగత్కాంతులచే ప్రకాశించునది. మేరు మందర పర్వతములవలె ఆకాశము నొరయు

మేడల సమూహముచే అలంకరింపబడినది. మధ్యాహ్న సూర్యుని పరిహసించు కాంతి గలది. బంగారు సోపాన పంక్తులు గలది. అందమైన యరుగులు గలది. ఇంద్ర నీలములు, పగడములు, ముత్తెములు మొదలగునవి పొదిగిన కిటికీలు గలది. అందు ప్రవేశింపగనే మద్యములు పిండివంటలు వివిధములైన అన్నములు మున్నగు వానినుండి వెల్వడిన మనోహరములయిన సువాసన లతనిని సమీపించి బంధువు వలె మనస్సును రంజిల్ల జేయుచు రాక్షసరాజగు రావణుడిక్కడ ఉన్నాడు ఇటురమ్ము, ఇటురమ్ము అని ఆ మహావీరుని పిలుచు చున్నట్లుండెను. అతడట్లు బయలుదేరి రావణుని మనస్సునకు ప్రీతిని కలిగించు యోగ్యమయిన స్త్రీవలె మంగళకరమైన విశాలమైన రావణుని నివాసశాలను చూచెను. అది రత్నములు పొదిగిన మెట్లు గలది, బంగారు కిటికీలతో గూడినది, స్ఫటిక మణులతో నిర్మింపబడిన అరుగులు గలది. గజదంతములచే నిర్మింప బడిన బొమ్మలతోడను, ముత్యములు, పగడములు, వెండి, బంగారములతో నిర్మింపబడిన స్తంభములతోడను అలంకరింపబడి ఆకాశమున కెగురుచున్నదా యనునట్లున్నది. అందు భూమియందుగల చిత్రములన్ని వ్రాయబడిన రత్న కంబళములు పరువబడినవి. ఘుమ్మని కమ్మనివాసనలు క్రమ్ముచున్నవి. పక్షులు కలకలములు ఆకాశమును సోకుచున్నవి. మృదువులైన పాన్పులు గలిగియున్నది. ఆ భవనము స్వచ్ఛముగా తెల్లగా నున్నను అగురు ధూపములచే బూడిద రంగుగా నుండెను. అది మనస్సునకు ఆనందము గలిగించుచుండెను. రంగులకు మేలిరంగు గూర్చుచుండెను. శోకమును తొలగించగలిగి యుండెను. కాంతులకు పుట్టినిల్లై యుండెను. రావణుని రక్షణలోనున్న ఆ భవనము హనుమంతుని పంచేంద్రియములకు ఐదు విషయములచే (శబ్దాదులగు ఇంద్రియ విషయములచే) తల్లివలె తృప్తిని సంతోషమును గలిగించెను. అప్పుడు హనుమంతుడు ఇది స్వర్గమా? లేక యింద్రుని అమరావతియా? బ్రహ్మ లోకమా? యని ఆశ్చర్యపడుచు బంగారు దీపపాత్రలలో వెలుగు దీపములు గొప్ప జూదరులకు ధనములోడిపోయి దిక్కు తోచనివారై నిశ్చేష్టులై చూచు

చిన్న జూదరుల వలె నిశ్చలముగా వెలుగుచుండగా సాటి లేక ప్రకాశించుచున్న మణిదీపపు సమ్మెలను హనుమంతుడా భవనాంతరమునందు జూచెను. దీపముల కాంతిచేతను, రావణాసురుని దేహకాంతిచేతను, అతని శరీరముపై ధరించిన బంగారు భూషణముల కాంతిచేతను మండుచున్నదా యనునట్లా శాల వెలుగొందుచుండెను. దానిని జూచి హనుమంతుడాత్మలో మెచ్చుకొనెను.

**నిద్రించు రావణుని యంతఃపుర స్త్రీలను హనుమంతుడు చూచుట :**

అంతట వివిధ వర్ణములు గల వస్త్రములు, మాలలు దాల్చి నానావేషములతో అలంకరించుకొనిన యువతులు మద్యపానము చేసి నిదురజెంది యుండుటను చూచెను. కదలిక లేకుండుటచే ఆభరణముల మ్రోత లేక నిద్రలో మున్గియున్న రాక్షసస్త్రీల సమూహము హంసలు తుమ్మెదలు లేని అందమైన తామరకొలను వలె నుండెను. నోళ్లు మూసియుండుటచే కొంచెమైనను కనిపించని దంతములును, మూసిన నేత్రములును, పద్మ సుగంధములుగల ముఖములును గల ఉత్తమజాతి యువతులను చూచెను. పద్మములవలె వారల ముఖములు సూర్యోదయమున అందముగా వికసించును. రాత్రి కాగానే అవి తామే దళములు ముకుళించుకొని యొప్పును, వీరి ముఖములు పద్మములే కాని యెడల తుమ్మెదలు పద్మములనువలె ఏల మాటిమాటికి మకరందమును గోరుచుండును? అందచందములచేతను, చల్లదనముచేతను, సుగంధముచేతను, సుకుమారాకృతులచేతను ఈ ముఖములు పద్మములేయని పావని తలంచెను. ఆ స్త్రీలతో విరాజిల్లుచున్న రావణ భవనము నక్షత్రములతో నొప్పుచున్న శరత్కాలపుటాకాశము వలె నుండెను. ఆ స్త్రీలతో గూడిన రాక్షసరాజైన రావణుడు నక్షత్రములతో పరివృతుడైన చంద్రుడోయనునట్లు మిక్కిలి ప్రకాశించెను. ఆ వనితలందఱును పుణ్యము క్షీణించుటచే భూమిపై వ్రాలిన నక్షత్ర సమూహమా! యని హనుమంతుడు మనస్సుననెంచెను. రావణుని భవనమున నిద్రించుచున్న స్త్రీలయందు తళుకు తళుక్కను పెద్ద నక్షత్రముల కాంతియు, నిర్మలత్వమును, వన్నెయు సొంపుమీరి యుండెను. మధుపానము చేయుటచేతను, పిమ్మట

రతికేళిచేతను, పుష్పమాలలు భూషణములు చిక్కులు పడినను, రాలినను ఆ స్త్రీ సమూహము ఒడలు తెలియక నిద్రించుచుండెను. అందు కొందఱు స్త్రీలు ధరించిన తిలకములు చెదిరిపోయి యుండెను. కొందటి యందెలూడి యుండెను. కొందటి హారములు రాలినవి. కొందఱి చీరలు సడలియుండెను. కొందటి ముత్యాల సరములు తెగియున్నవి. కొందఱి మొలనూళ్లు తెగిపోయినవి. కొందఱు అలసటదీరునట్లు పండుకొనియున్న గుఱ్ఱపు పిల్లలను బోలియుండిరి. కొందఱు చక్కని కమ్మలు ధరించి యుండిరి. నలిగి తెగిపోయిన పుష్పమాలికలు గలిగి కొందఱు స్త్రీలు అరణ్యమున గొప్ప గజముచే త్రెంపి పారవేయబడిన పూదీగలవలె నుండిరి. కొందఱు స్త్రీలు నిద్రించుచుండగా వారి స్తనముల మధ్య సూర్యచంద్రకిరణముల బోలె తెల్లని కాంతిగల పెద్ద పెద్ద ముత్యముల పేర్లు నిద్ర జెందుచున్న హంసలవలె నుండెను. కొందఱి స్తనమధ్యములందు దాల్చిన వైడూర్యములు కాదంబ పక్షులవలె నుండెను. మఱికొందఱు ధరించిన బంగరు హారములు చక్రవాక పక్షులవలె చూపట్టెను. అందమైన జఘన భాగములు గలిగి నిదురించుచున్న ఆ స్త్రీలు అంచులతో, కారండవ పక్షులతో, చక్రవాకములతో ఇసుక తిన్నెలతో నొప్పుచున్న నదులవలె ప్రకాశించుచుండిరి. విహార శ్రమచే అలసి నిద్రించియున్న ఆ స్త్రీలు తాము ధరించిన గజ్జెలే మొగ్గల వలెను, బంగారు ఆభరణములే వికసించిన పద్మముల వలెను, శృంగారమైన హావభావములే మొసళ్ల వలెను, ప్రకాశమానమైన కాంతులే గట్లుగాను కలిగిన నదుల వలె ప్రకాశించుచుండిరి. గొప్పనైన స్తనముల యొక్క అంచులును, సుకుమారములై మనోహరములైన శరీరములును, అందమైన మణిమయ భూషణములును గలిగి నిద్రించుచున్న యువతులు, తమను చూచిన పురుషులు మన్మథునిచే కొట్టబడినవారై మీద సోలిపడునంతటి యందము గలిగి మనోహరలై యుండిరి. ఆ సమయమున నిద్రించుచున్న ఆ స్త్రీల ముఖముల నుండి వెడలు నిశ్వాస మారుతములు పయ్యెద కొంగులను గదలించుచు వారి ముఖములకు వీవన విసరుచున్నట్లుండెను. ఆ స్త్రీలు ముఖములపై కప్పుకొనిన పైటకొంగులు

అనేక వర్ణములు గలిగి మనోహరములై మన్మథుని జెండాల వలె ప్రకాశించెను. కొందఱి కురువింద మణుల చెవుల పోగులు తోటివారి నిట్టూర్పులచే వచ్చిన గాలిచే మెల్లగా కదలుచుండెను. సహజముగా సువాసనలు గలవియు, చక్కెరతో గూడిన మద్యము త్రావుటచే సువాసనలు గలవియునయిన ఆ స్త్రీల నిశ్వాస వాయువులు రావణాసురుని మీద మత్తుగలుగునట్లుగా వ్యాపించుచున్నవి. కొందఱు స్త్రీలు సవతుల ముఖములను రావణుని ముఖములని తలంచి ముద్దిడుచున్నారు. ఆ సవతులు తమ నాయకుడే ముద్దిడుచున్నాడని మత్తుచే తెలియనివారై వారలపై కోపింపక తిరిగి వారిని ముద్దులాడుచుండిరి. కొందరు స్త్రీలు కంకణములు ధరించిన చేతులను, సుందరమైన సన్నని వస్త్రములను తలగడలుగా చేసికొని శయనించిరి. వారిలో నొకతె వేరొక యువతి ఱొమ్ముపై తలనుంచి పరుండగా వేరొకతె ఆమె భుజముపై తలనుంచి నిద్రించుచుండెను. మఱియొకతె వేరొక స్త్రీతొడపై తలనుంచి నిద్రించగా ఆమె భుజముపై తలనుంచి వేఱొకతె నిద్రించెను. మద్యము వలన గలిగిన మత్తుచే పరవశత్వము నొందిన స్త్రీలు ఒండొరుల తొడలు ప్రక్కలు మొలభాగములపై తలలుంచియు, ఒకరిపై నొకరు తమ కాళ్లను చేతులును వైచియు నిదురించుచుండగా హనుమంతుడు చూచెను. వరుసలుగా పరుండుటచే ఒకరి భుజములొకరికి చుట్టుకొని దారములతో కట్టబడినట్లా స్త్రీల సమూహముండెను. వారికురులు నల్లని తుమ్మెదలచారువలె నొప్పెను. వసంత ఋతువునందు మందమారుతము వీచుటచే పువ్వులు పూచిన వనములెట్లు కదులుచుండునో అట్లే రావణుని స్త్రీలు ధరించిన చీరలకొంగులు నిట్టూర్పు గాడ్పులచే కదలుచుండెను. రావణుని స్త్రీల భుజములొకటొకటి పైన వైచుకొనుటచే తీగల మాలికల వలె నొప్పారెను. ఆ స్త్రీల చేతులు సర్పముల వలెనుండెను. తెల్లనిపూవులతో గూడి వారి నల్లని కురులు పువ్వులపై వ్రాలిన తుమ్మెదలవలె నుండెను. ఆ సమయమున రాక్షసాంగనలొకరినొకరు పెనవైచుకొని యుండుటచే వారి ఆభరణములు, అవయవముల నాచ్ఛాదించు వస్త్రములు పుష్పమాలలును ఇవి వీరివి ఇవి

వీరివని నిశ్చయించుటకు వీలుకాకుండెను. రావణుడు నిద్రించుచుండగా బంగారు దీపపాత్రలలోని దీపములు నిశ్చింతగా నిద్రించుచున్న రాక్షస స్త్రీలను రెప్పపాటు లేక చూచుచున్నట్లుండెను. (రావణుడు మేల్కొనియుండగా దీపములైనను వాని భార్యలను కన్నెత్తి చూడలేవని అర్థము) రాజర్షుల స్త్రీలును, పితృదేవతల వనితలును, రాక్షస స్త్రీలును రావణుని కోరి అతనికి వశపడిరి. రావణుడు యుద్ధమందు జయించి తీసికొని వచ్చినవారు కొందరుందురు గాని అతడు మోహించి తెచ్చినవారు కారు. మఱియు కొందఱు మదముచే తామే మోహించి వచ్చినవారు. ఒక్క సీతాదేవి తప్ప ఆ స్త్రీలలో బలాత్కారముగా రావణునిచే కొనితేబడినవారు లేరు. వారి యిష్టము ప్రకారముగా వచ్చినవారేగాని అంతకుముందు వేఱొకని ప్రేమించినవారుగాని, ఇంకొక ప్రియుడు కలవారుగాని అందెవ్వరును లేరు. వారిలో మంచి వంశమున పుట్టనిదిగాని, విరూపగాని, బలములేనిదిగాని, భర్తయైన రావణునకు ప్రీతి లేనట్టిదిగాని ఒక్కతెయు లేదు. హనుమంతుడు శత్రువునకైనను మంచి కోరువాడగుటచేత 'రావణుడి భార్యల నెప్పుడు విడువకుండగా ఎట్లున్నాడో అట్లే శ్రీరామచంద్రుడు కూడ సీతను గలసియున్నచో ఈ రావణుని సంపద యిట్లే ఎల్లకాలము తరుగక యుండును గదా' అని తలంచెను. తరువాత హనుమంతుడు 'సీతాదేవి గొప్ప పాతివ్రత్యము గలది. మంచి కులమున బుట్టినది. ఈ రావణుడు సీతను దొంగిలించుటయను నీచకార్యమును చేసినాడు. ఎంతటి కష్టము కలిగినను సీతాదేవి దృఢమైన మనస్సు గలది కాన ఆ పాతివ్రత్యమున కెట్టి భంగము కలుగదు గాని యీ రావణుడు ఆమెను తెచ్చి ఉత్త అపవాదును సృష్టించినాడు' అని మిక్కిలి దుఃఖించెను.



# పదియవ సర్గము

**హనుమంతుడు నిద్రించుచున్న రావణుని జూచుట :**

అట్లు విచారించి హనుమంతుడు రావణుని భవనమును పరికించుచు రావణుని శయన గృహమును జూచెను. అది స్ఫటికపు రాళ్లచేతను, రత్నముల తోను నిర్మితమై శ్రేష్ఠమైన దేవతల శయనాగారము వలె నుండెను. అచ్చట నమూల్యములగు మంచములుండెను. అవి వైడూర్య మణులచే పొదుగబడి యనేక వర్ణములు గలిగి యుండెను. ఆ మంచములపై గొప్ప వెలగల పరుపులు వేయబడియుండెను. ఆ గొప్పదైన మంచము పుష్పమాలలచే అలంకరింపబడి చంద్రునివలె ప్రకాశించెను. ఆ మంచమునకు తలవైపున తెల్లని గొడుగును హనుమంతుడు చూచెను. ఆ శ్రేష్ఠమైన మంచము బంగారు పూతగలదగుటచే సూర్యునివలె ప్రకాశించుచు అశోక పుష్పమాలలచే అలంకరింపబడి యుండెను. అందమైన స్త్రీల బొమ్మలు ఆ మంచమునకు నాల్గువైపులను నిల్చి చేతులతో వింజామరలు వీచుచున్నంట్లుండెను. అనేక విధములైన సువాసనల చేతనా శయన ప్రదేశమంతయు పరిమళించుచుండెను. ఉత్తమమైన ధూప మంతటను సువాసనలను వెదజల్లుచుండెను. ఆ మంచముపై జిలుగు పరుపులు పరువబడి యుండెను. దానిపై మేక చర్మములు కప్పబడియుండెను. శ్రేష్టమైన పూలమాల లామంచమున కలంకరింపబడి యుండెను. ఆ మంచముపై పవళించియున్న వీరుడగు రాక్షసరాజును హనుమంతుడు చూచెను. ఆ రావణుడు మేఘము వలె నల్లగా నుండెను. గొప్ప కుండలములను ధరించి యుండెను. ఎఱ్ఱని కన్నులును పెద్ద బాహువులును గలవాడై బంగరు వస్త్రమును ధరించి యుండెను. సువాసనగల రక్తచందనము పూసికొని యుండెను. ఇట్లుండుటచే ఆకాశమున

సంధ్యాకాలమున ఎఱ్ఱని మెఱుపు తీగలతో గూడిన మేఘమువలె నుండెను. సుందరమైన రూపము కలవాడును, కామరూపుడును, దివ్యమైన ఆభరణములు ధరించినవాడును అగు రావణుడు వృక్షములు వనములు పొదలు మొదలగు వానితోగూడి నిదురించుచున్న మందర పర్వతము వలె నుండెను. రాక్షసులకు సుఖమును గలుగజేయు వాడును, రాక్షస కన్యలకు ప్రియుడును అగు రావణుడు మంచి ఆభరణములను ధరించి యుండెను. రాత్రివేళ అతడు స్త్రీలతో క్రీడించి మద్యమును త్రావి కాంతిగల శయ్యపై శయనించి నిద్రించెను. ఎఱ్ఱని వస్త్రములు ధరించినవాడును, పొడవైన చేతులు గలవాడును, చెట్లతో నిండిన పర్వతమువలెనున్న వాడును, బుసలు కొట్టుచున్న సర్పము వలె నిశ్వాసములు విడుచుచున్నవాడును అగు రావణుని యొద్దకు వెళ్లి హనుమంతుడు భయము చెందిన వానివలె ఉద్వేగములో ఒక్కింత దూరము వెనుకకు వెడలెను. మెట్లపైనుండి వెడలి ఇంకొక వేదికనెక్కి నిలబడి అచ్చటి నుండియే రావణుని జూచెను. రావణుడు శయనించిన ఆ శయ్య మదపుటేనుగు శయనించిన ప్రస్రవణ పర్వతమువలె నుండెను. హనుమంతుడా రావణుని బాహువులను చూచెను. అవి బంగారు బాహుపురులతో ఇంద్ర ధ్వజములవలె నుండెను. పూర్వమైరావతముతో పోరాడినప్పుడు కలిగిన గాయపు మచ్చలు గలవై దేవేంద్రుని వజ్రాయుధపు గాడులకల్గి చక్రపుదెబ్బలు గలవై మంచి లక్షణములు గల గోళ్లు వ్రేళ్లు అరచేతులు గలవై లావైన మ్రానులవలె నుండి గుండ్రముగా ఏనుగుల తుండములవలె నుండి ఒప్పారుచున్న ఆ రావణుని బాహువులు శయ్యపై పవళించిన ఐదు తలల పాములవలె నుండెను. కుందేలు నెత్తురువలె నెఱ్ఱనై మిక్కిలి చల్లనై సువాసనలు గలదైన మంచి చందనముచే పూయబడి అలంకృతములైయున్న ఆ రావణుని బాహువులను హనుమంతుడు చూచెను. అవి యక్షులను, పన్నగులను, గంధర్వులను, దేవతలను, దానవులను ఎన్నో యుద్ధములలో పీడించినవి. బలసిన ఆ బాహువులతో రావణుడు రెండు

శిఖరములతో నొప్పారు మందర పర్వతము వలె ప్రకాశించెను. అట్లు నిదురించు చున్న రావణుని పెద్ద నోటినుండి వెలువడుచున్న నిట్టూర్పులు మామిడి పొన్న పొగడ పూల సువాసనలతో పాయసాదుల సువాసనలతో మద్య గంధములతో నొప్పెను. ముత్యములు పొదిగిన బంగరు కిరీటము నిద్రించు సమయమగుటచే కొంచెము ప్రక్కకు తొలగి ప్రకాశించుచుండెను. కుండల కాంతులతో ప్రకాశించు ముఖము గలవాడును, విశాలమై చందనలిప్తమై ముత్యాల హారములతో శోభిల్లు బలిసిన వక్షస్థలము గలవాడును, తెల్లని యుత్తరీయమును ధరించినవాడును, విలువగల మంచి వస్త్రములను దాల్చినవాడును, మినుముల రాశివలె నల్లగానున్నవాడును, గంగానది జలముల నడుమ పడుకొనియున్న ఏనుగువలె నున్నవాడును, నాలుగు దిక్కులందును నాలుగు దీప పాత్రలందు దీపములు వెలుగుచుండుటచే నలుదిక్కులందును ప్రకాశము గలవాడును, శరత్కాల మేఘము వలె ప్రకాశించువాడును అగు రావణుని మారుతి చూచెను.

**హనుమంతుడు నిద్రించుచున్న రావణు భార్యలను చూచుట :**

అట్లు చూచి ఆ రాక్షసరాజు పాదముల యొద్ద శయనించిన యౌవనవతులును సుందరులును అగు ఆతని భార్యల నాదివ్య భవనమున నిష్కల్మషమైన మనస్సుతో వాయుపుత్రుడు చూచెను. ఆ హనుమంతుడు చంద్రునివలె ప్రకాశించు మోముల గలవారును, సుందరముగానున్న కర్ణాభరణములను దాల్చినవారును, వాడని మాలలను ధరించినవారును అగు రావణుని భార్యలను గాంచెను. అచ్చట నృత్తమునందును, వాద్యములందును నేర్పుగలవారై భర్తయొడిలోనేపడి నిద్రించుచున్న రావణు పత్నులను మారుతి చూచెను. ఆ స్త్రీలు తమ భుజములపై తలలుంచుకొని నిద్రించుటచే వారు చెవులందు ధరించిన వజ్ర వైడూర్యమయాభరణములును, చేతులందు ధరించిన చేబొందులు (బాహుపురులు) ను చెవులకంటియున్నట్లుగా మారుతి చూచెను. చంద్రునితో సమానమగు కాంతి గలిగి అందమైన చెవుల కమ్మలుగల రాక్షస స్త్రీల ముఖములు

ఆ విమానమున ఆకాశమున నక్షత్రములతో గూడిన చంద్రబింబములవలె కన్పించెను. సన్నని నడుములుగల ఆ రావణుని భార్యలు మద్యమును త్రావిన వారై రతిక్రీడాది వినోదములచే అలసి వీలున్నచోటు లందెల్ల శయనించిరి. వారిలోనొక ఉత్తమ వనిత నాట్యమందు నేర్పరియగుట చేత నిద్రలో గూడ అందముగా తన అవయవములను నాట్యయోగ్యముగ కదుపుచు గాఢనిద్రలో నుండెను. నదీ ప్రవాహమున కొట్టుకొని పోవుచున్న తామరతీగ తలవని తలంపుగా దొరకిన పడవను చుట్టుకొన్న విధమున ఒకతె వీణను చుట్టుకొని నిద్రించుచుండెను. నల్లని కన్నులు గల ఇంకొక స్త్రీ తన చంకలోనే మడ్డుక వాద్యమునుంచుకొని నిద్రించుచు ప్రేమతో శిశువును తన ప్రక్కలో పొదివికొన్న తల్లివలె ప్రకాశించెను. చాలా కాలమునకు వచ్చిన ప్రియుని కౌగిలించుకొను కాంతవలె మఱియొక స్త్రీ సర్వాంగ సుందరి పటహ వాద్యమును తన స్తనములపై నదుముకొని నిద్రించుచుండెను. నృత్తమునందు నేర్పు గలిగిన మఱొక వనిత విపంచి యనబడు నేడు తీగల వీణను కౌగిలించుకొని నిద్రించుచు ప్రియునితో గూడి శయనించిన కాంతవలె ప్రకాశించెను. మఱియొక కురంగాక్షి బంగారు వన్నెగలవియు, మృదువులును, బలిసినవియునైన తన సుందరావయవములతో మద్దెలను ప్రియునివోలె గట్టిగా కౌగిలించుకొని నిద్రించెను. మఱియొక సుందరి మదముచే నలసి పణవమను వాద్య విశేషమును చంకలో నుంచుకొని గాఢ నిద్ర జెందెను. వేఱొకతె యొక డిండిమమును కౌగలించుకొని వెనుక వేరొక డిండిమముండగా ఒకవైపు ప్రియుడును వేఱొకవైపు పుత్రుడును పరుండియుండ మధ్యను శయనించిన దానివలె నొప్పారెను. తామరరేకుల వంటి కన్నులు గల వేఱొకతె మద్యము త్రావి మత్తెక్కి ఆడంబరమనునొక వాద్యమును కౌగిలించు కొని నిద్రించెను. మఱియొకతె సర్వాభరణములను ధరించి నిద్రావశమున నీటితో నున్న కలశమును దొరలించి ఆ నీటిలో తడిసినదై వసంత కాలమున వాడిపోకుండుటకై నీటిచే తడుపబడిన చిత్రవర్ణముల పూలమాలవలె శోభిల్లు

చుండెను. ఆడ తుమ్మెదలవంటి కురులు గల యొక స్త్రీ బంగారు కలశముల వలెనున్న తన స్తనములను చేతులతో గట్టిగా మూసికొని నిద్రపరవశమయ్యెను. కమల పత్రములవంటి కన్నులు గలదియు, పున్నమ చంద్రునిబోలు మోము గలదియునగు నొక వనిత చక్కని పిరుదులు గల వేఱొకతెను మోహముతో కౌగిలించుకొని నిద్రించెను. సుందరాంగనలు కొందఱు విచిత్రములైన చతుర్విధ వాద్యములను కౌగిలించుకొని ప్రియులను తమ స్తనములతో నొత్తుచున్న కాంతల వలె ప్రకాశించుచుండిరి. అట్లు వారందరిని చూచుచు వెళ్లి హనుమంతుడొకచోట ఉత్తమమైన శయ్యయందు పరుండి యున్న మిక్కిలి సుందరాంగి యగు నొక వనితను చూచెను.

**హనుమంతుడు మండోదరిని జూచుట :**

ఆమె ముత్యముల హారములతోను మాణిక్యాభరణములతోను అలంకరింప బడినదై ఆ గొప్ప భవనమునే ప్రకాశింపజేయుచున్నదా యనునట్లుండెను. ఆమె మేలిమి బంగారు వలె మెరసిపోవుచుండెను. సుందరమైన రూపము గలదియు, రావణున కత్యంత ప్రీతిపాత్రురాలును అంతఃపుర స్త్రీలలో ముఖ్యురా లగు నామండోదరిని హనుమంతుడు చూచెను. గొప్ప పరాక్రమవంతుడగు హనుమంతు డట్లలంకృతయై యున్న మండోదరిని చూచి సౌందర్య యౌవన విశేషముల చేత నామె సీతయే యని తలంచి వెంటనే శరీరము పులకించగా మిక్కిలి యానందించెను. ఆయానందమున హనుమంతుడు వానర సహజము లగు చేష్టలు కన్పడునట్లు జబ్బలను చఱచుకొనెను. తోకను ముద్దు పెట్టుకొనెను. ఆనంద పారవశ్యము నొంది క్రిందకు దుమికెను. ఇట్టి విచిత్రములైన చేష్టలను చేయుచు తాను మహానందమును ప్రకటించెను.



# పదునొకండవ సర్గము

## హనుమ సీతాదేవిని పానశాలయందు వెదకుట :

అట్లు హనుమంతుడు రఘూత్తముని కాంతను జూచితినని స్వస్థత చెందినవాడై ఇంచుకసేపు చూచి "ఈ స్త్రీ సీతయెట్లగును? సీతాదేవి రాము నెడబాసి నిదురింపదు, భుజింపదు, అలంకరించుకొనదు. పానీయాదులు త్రాగదు, ఇతరుడైన పురుషుడు దేవేంద్రుడైనను వాని చెంతకేగదు. రామునకు సాటియైనవాడు దేవతలలోనైనను లేడు. కాన నీమె సీత కాదు. వేఱొకతె యై యుండును." అని నిశ్చయించి హనుమంతుడు మద్యములు త్రావు చోటునకు వెళ్లి వెదుక దొడగెను. అచ్చట ఆటలచేతను, పాటలచేతలను అలసి నిద్రించు వారిని, మద్యము త్రావుటచే శరీరములు తెలియకపడియున్న వారిని దర్శించెను. కొందఱు క్రీడించుటచేతను కొందఱు నృత్యములచేతను అలసి యుండిరి. వారు మద్దెలలపైనను, పీటలపైనను, పాన్పులపై వలె నిద్రించుచుండిరి. అట్లు వివిధాలంకారములతోనున్న వారును, రావణుని సౌందర్యమును వర్ణించుకొను వారును, ఆయా సమయమునకు తగిన పాటలు పాడి వాని యర్థములను చెప్పుచున్నవారును, దేశకాలోచితముగా వ్యవహరించువారును, తగిన విధము తెలిసి మాటలాడువారునైన స్త్రీ సహస్రమును భోగేచ్ఛతో ననుభవించి నిద్రించు చున్న రావణుని హనుమంతుడు చూచెను. ఆ స్త్రీల నడుమనున్న రావణుడు మందలోని శ్రేష్ఠములైన గోవుల సమూహము నడుమనున్న వృషభము వలె ప్రకాశించెను. కాంతలచే పరివేష్టింపబడిన గజరాజువలె విరాజిల్లెను. అట్టి అందమైన వస్తువులచే నిండియున్న రావణుని పానశాలను వాయుపుత్రుడు చూచెను. హనుమంతుడచ్చట మృగముల సూకరముల దున్నల మాంసము

లచ్చటచ్చట ప్రోగులు ప్రోగులుగా హెచ్చుగా నుండుటను చూచెను. విశాలమగు వెండి పాత్రలలో సగము సగము తినబడిన నెమలి, కోడి మాంసములను హనుమ చూచెను. వరాహములు, లేళ్లు, ఖడ్గ మృగములు ముండ్లపందులు, నెమళ్లు మున్నగువాని మాంసములును, పెరుగును, సౌవర్చలమనబడు ఉప్పును నంజుకొనుట కచ్చటచ్చట పాత్రలలో నుంచబడియుండుటను చూచెను. చక్కగా ఉడకబెట్టబడిన కొంగల మాంసములను, సగము తినబడిన చకోర మాంసములను, దున్నల మాంసములను, చాల మీనములను, చక్కగా జేయ బడిన వివిధములైన పచ్చళ్లను, త్రాగుటకు తగిన చారు, పాయసము మొదలగు వానిని, వివిధములైన భుజింపదగిన పదార్థములను హనుమంతుడు చూచెను. మఱియు వివిధములైన పలుచన, చిక్కన, ఉప్పన, పుల్లన అయిన పదార్థములను చూచెను. రత్నములతో పొదుగబడిన హారములు, అందెలు, బాహుపురులు నచ్చటచ్చట పడియుండెను. పెద్ద పెద్ద పాన పాత్రలందుంచబడిన ఫలముల తోడను, అంతట అలంకారముగా చల్లబడిన పుష్పములతోడను, కానుకలతోడను ఆచోటధికముగా ప్రకాశించుచుండెను. ఆ పానశాల చక్కగా వండి తగిన ద్రవ్యములు కలిపి సిద్ధము చేయబడిన పలు విధములగు మాంసములును ఆయా ప్రదేశములందాలస్యము కలుగకుండు నట్లేర్పాటు చేయబడిన మంచము లును ఆసనములును కలిగి వెలిగి పోవుచుండెను. హనుమంతడచ్చట నిర్మల ములు శ్రేష్ఠములునగు పలు విధములైన తేనెలను, మద్యములను చూచెను. అవి పంచదారతో కొన్ని, తేనెతో కొన్ని, ఫలరసములతో కొన్ని చేయబడి యుండెను. వానిలో అనేక విధములైన ఏలకులు మొదలైన సుగంధ ద్రవ్యములు కలుపబడి వేర్వేరు పాత్రలలో నుంపబడెను. పూలమాలలన్ని వైపులను అలంకరింపబడియుండెను. బంగారు పాత్రలు, స్ఫటిక పాత్రలు మున్నగువానితో ఆపానశాల మిగుల సుందరముగా నుండెను. హనుమంతుడచ్చట వెండి పాత్రలతో, బంగారు కలశములతో సమృద్ధిగానున్న దివ్యమైన మద్యమును

చూచెను. అచ్చటచ్చట బంగారు పాత్రలతో, మణులు పొదిగిన గిన్నెలతో వెండి గిన్నెలతోనున్న మద్యములను చూచెను. అందు కొన్నింటిలో గంధపు పొడి కలిపి నిండుగాను కొంచెముగానునున్న సారాయిని హనుమంతుడు చూచెను. ఒకచోట పగిలిన చెంబులును వేరొకచోట దొరలుచున్న కడవలును, మఱొక్క చోట పూలమాలలును, వెదజల్లబడిన నీరు పండ్లు మొదలగు వానిని హనుమ చూచెను. అందు స్త్రీలు నిదురించుచున్న పాన్పులను హనుమంతుడు చూచెను. వానిపై ఆ శ్రేష్ఠలైన స్త్రీలు ఒకరినొకరు కౌగిలించుకొని నిదురించియుండిరి. అందు కొందఱు నిద్రించుచున్న వేరొకరి చీరెలను లాగి తమపై కప్పుకొను చుండిరి. వారి శరీరముల మీదనున్న చీరెలను మాలలను వారి నిశ్వాసములు పిల్లగాలుల వలె కొలదిగా కదలించుచుండెను. చల్లని చందనము యొక్కయు, తీయని మద్యముల యొక్కయు, అనేక విధములయిన పూలమాలల యొక్కయు, వివిధములగు ధూపముల యొక్కయు సువాసనలను గ్రహించి వాయువు వీవసాగెను. అప్పుడు పుష్పక విమానమున స్నానమునకుపయోగించు చందనపు సుగంధము వ్యాపించెను. ఆ రావణుని కాంతలలో కొందఱు నల్లనివారును, కొందఱు బంగారు వర్ణముగలవారును, నలుపు తెలుపు మిశ్రమ వర్ణముగల వారును ఉండిరి. రతిక్రీడలు సల్పి నిద్రాపరవశమై యుండిరి. వారి రూపములు ముకుళించిన పద్మముల వలె నుండెను. ఇట్లు గొప్ప తేజస్సుగల హనుమంతుడు రావణుని అంతఃపురము నంతయు చూచెను. కాని సీతాదేవిని మాత్రము చూడజాలడయ్యెను. ఆ అట్లచ్చట నిద్రించుచున్న కమలనేత్రలనెల్లరను జూచి హనుమంతుడు "అయ్యయ్యో! ధర్మహాని వచ్చెనే. నిదురించుచున్న పరస్త్రీలను చూచుటయను నేను చేసిన ఈ ఘోరము మహాదోషము గదా!" యని తలపోసెను. "నేనింతకు ముందెన్నడును పరస్త్రీలనిట్లు చూడలేదు గదా! ఇచ్చట రావణుడు తనకాంతలతో మందిరమున శయనించి యుండుటను చూచితిని. ధర్మమార్గమును తొలగ ద్రోసితినే" యని ఆలోచింపసాగెను. ఇట్లాలోచించుచున్న

ఆతనికి వేఱొక విధమైన ఆలోచన కలిగెను. "నేను రావణాసురుని కాంతల నందఱును జూచితిని. దానివలన నామదిలో నెట్టి దుష్ట భావమును కలుగలేదు. మంచి కార్యమునుగాని, చెడు కార్యమునుగాని చేయుటలో సకలేంద్రియములను ప్రవర్తింపజేయునది మనస్సు. అది నాయందెంత మాత్రమును చెదరక స్థిరముగా నున్నది. నేను వేరొకచోట సీతాదేవిని వెదుకరాదు. స్త్రీలను స్త్రీలలోనే కదా వెదకవలెను! ఏ ప్రాణి ఏ జాతికి చెందినదో ఆ జాతిలోననే దానిని వెదకవలెను. తప్పిపోయిన వనితను ఆడు లేళ్లలో వెదకుట సాధ్యము కాదు. నేను చాల పరిశుద్ధమైన మనస్సుతో ఈ రావణాంతఃపురమునంతయును వెదకితిని. కాని ఆ జానకీదేవి కనుపించుటలేదు. "ఇట్లు తలంచి ధీశాలియగు హనుమంతుడు మఱల సీతాదేవికై వెదకుచు దేవకన్యలను, గంధర్వ కన్యలను, నాగ కన్యలను చూచెనుగాని, సీతాదేవి మాత్రమాతనికి కనిపించలేదు. వీరుడగు హనుమంతుడా భవనమున సీతాదేవిని గానక తక్కిన యుత్తమ కాంతలను చాలమందిని చూచుచు ఆమె యెచ్చట నుండునాయని ఆలోచింపసాగెను. ఇంకను మఱల ప్రయత్నము చేయుచు ఆ హనుమంతుడు ఆ పాన భూమిని వదలి తిరిగి ఆ రావణాంతఃపురముననే సీతాదేవిని వెదుకసాగెను.



# పం[డెండవ సర్గము

## హనుమంతుడు సీతాదేవిని గానక విచారించుట :

ఆ అంతఃపుర మధ్యమున లతలు మొదలైన విచి[తములు చి[తించిన చోటులందు లతా గృహములందును, రా[తి నివసించుటకు తగిన ఇండ్ల యందును వెదకి ఎచ్చటను సీతాదేవిని చూడజాలకపోయెను. ఆ వానర[శేష్ఠుడగు హనుమంతుడు రాముని ధర్మపత్నియగు సీతను గానక “అయ్యో! సీత తప్పక మరణించి యుండును. లేనిచో ఏల కనిపించదు?” అని తలంచెను. “మిక్కిలి మంచి మార్గమున [పవర్తించు సీతాదేవి రాక్షస ముఖ్యుడగు రావణుని బారినుండి తన శీలమును కాపాడుకొనుటకై తానే మరణించి యుండును. లేదా రావణుడే తన వశమునకు రాని ఆమెను చంపియుండును. లేక హీనమైన రూపము గలవారును, వికృత వేషములు గలవారును, తేజస్సు లేనివారును, పెద్ద మొగములు గలవారును, పెద్దవైన విరూపములైన కన్నులు గలవారును అయిన రావణుని [స్త్రీలను జూచి జానకి భయముతో మరణించి యుండును. సీతాదేవిని చూడక శ[తువులపై పరా[క్రమమును చూపక చాల తడవు వానరులతో గడపిన నాకు మా రాజైన సు[గీవుని యొద్దకు వెళ్లుటకు వీలుకాదు. ఆయన బలవంతుడు, తీ[వమైన దండన విధించువాడును అగుటచే నేను పోవుటకు వీలులేదు. రావణాంతఃపురమునంతయు వెదకితిని. రావణుని [స్త్రీలను జూచితిని. కాని పతి[వతయగు సీతాదేవి కనబడలేదు. నా [శమ యంతయును వృథా అయినది. సీతాదేవిని చూడకుండ నేను తిరిగి వెళ్లినచో నన్ను వానరులు చూచి వీరుడా! నీవు లంకకేగి చేసినదేమో తెలుపుమన్నచో సీతను చూడని నేనేమని చెప్పుదును?

అట్లు కాదని నేనిచ్చటనే కూర్చుందునా? ఆలస్యమయినచో వానరులు ప్రాయోపవేశము చేయుదురు. వృద్ధుడగు జాంబవంతుడు, యువరాజగు అంగదుడు, తక్కిన వానరులును వృథాగా తిరిగి వచ్చిన నన్నేమందురు?" అని చింతించి మరల ఇట్లనుకొనెను. "ఉత్సాహమే సంపదకు మూలము. ఉత్సాహమే మిక్కిలి సుఖదాయకము. ఉత్సాహమే ఎల్లప్పుడును మానవుని సకల కార్యములలో పాల్గొనునట్లు చేయును. అతడు చేయదలంచిన పనిని ఫలింపజేయును. కాన ఉత్సాహపూర్వకముగా గొప్ప ప్రయత్నమును చేసెదను. రావణునిచే రక్షింపబడు సకల ప్రదేశములను మఱల వెదకెదను. నేనిప్పటి వఱకును పానశాలలను, పుష్ప గృహములను, చిత్రశాలలను, క్రీడా గృహములను, ఉద్యానముల నడుమనున్న వీధులను, విమాన భాగములను వెదకితిని." అని తలంచి భూబిల గృహములను నాలుగు మార్గములున్న మంటపములను ఇండ్లకు దూరముగా స్వేచ్ఛగా విహరించుటకు నిర్మింపబడిన గృహములను వెదుక నారంభించెను.

**పరాంగనా దర్శనమునకు హనుమంతుడు చింతించుట :**

ఎగురుచు దుముకుచు, పోవుచు తలపులను తెరచుచు, మూయుచు లోన ప్రవేశించుచు వెలుపలికి వచ్చుచు, అనేకమైన అవకాశములలో హనుమంతుడు సంచరించెను. అట్లారంభించి వెదుకుచుండగా లంకలో నాతడు వెదుకనిచోటు నాలుగంగుళములైనను మిగులదయ్యెను. ప్రాకారములు, నడుమనున్న వీధులును, నలు చదరముగానున్న మంటపములును, దిగుడు బావులును, కొలనులును అన్నింటిని హనుమ వెదకెను. సాటిలేని సౌందర్యవతులగు విద్యాధర స్త్రీలను చూచెను గాని హనుమ రామునానందింపజేయు సీతను

చూడజాలక పోయెను. విరూపములు వికృత వేషములు గల రాక్షస స్త్రీలను హనుమంతుడు చూచెను గాని సీత కనబడలేదు. నిండు చంద్రునిబోలు ముఖములు గల నాగకన్యలను హనుమంతుడు చూచెను గాని సన్నని నడుముగల సీతను గనజాలడయ్యెను. రావణునిచే బలాత్కారముగా గొని తేబడిన నాగకన్యల నతడు చూచెనుగాని జనకునానందింపజేయు జానకిని గానడయ్యెను. ధైర్యశీలియగు వాయుపుత్రుడు సీతాదేవిని తప్ప తక్కిన శ్రేష్ఠవనితలనెందటినో చూచి మరల విషాదము నందెను. వానరశ్రేష్ఠుల ప్రయత్నము, తాను సముద్రమును దాటుట వృథాయని తలంచి హనుమ మరల చింతాక్రాంతుడయ్యెను. వాయునందనుడంతనా విమానము నుండి దిగి శోకాకులుడై మిక్కిలి చింతించెను.



# పదమూడవ సర్గము

## హనుమ ప్రాకారమును జేరి సీతను గానక వ్యథ చెందుట :

వానరయూథ నాయకుడగు హనుమంతుడట్లు ప్రాకారము మీదకు చేరి మేఘముల నడుమ మెరుపు వలె ప్రకాశించెను. రావణుని విమానము నుండి వెడలిన హనుమంతుడు జానకిని గానక తనలోనిట్లు తలంచెను. “రామునకు ప్రియము కలుగజేయుటకై నేను లంకనంతయును పూర్తిగా వెదకితిని గాని సర్వాంగసుందరియగు సీత మాత్రము నాకు కనబడలేదు. నీటి గుంటలు, చెఱువులు, సరస్సులు, సెలయేళ్ళు, నదులు, నీటి చెంతనుండు వనములు కొండలు ప్రవేశింప వీలులేని ప్రదేశములు, ఒకటన నేల? అన్ని ప్రదేశము లందును వెదకితిని. సీత కనుపింపలేదు. పక్షిరాజగు సంపాతి సీత రావణుని యింటనున్నదని చెప్పియున్నాడు కాని నాకామె యిచ్చట కానరాకున్నది. ఏమి చేయుదును. నాగేటి చాలున బుట్టినదియు, సదాచారము గల మిథిలా రాజవంశమున నుద్భవించినదియు, తపస్సంపన్నుడగు జనకరాజు పుత్రికయు అగు సీతాదేవి కామవశయై రావణుని చేరునా? అట్టి యాగడముండునా? ఉండదే! రావణుడు రామ బాణములకు భయము చెందుచు సీతను తీసికొని ఆకాశమున వేగముగా నెగిరిపోవుచుండగా భయముచే జానకి నడుమ నెచ్చటనో పడిపోయి యుండును. లేదా సిద్ధులు సంచరించు ఆకాశమార్గమున సీత తీసికొని పోబడుచుండగా నడుమ సముద్రమును చూచి ఆమె హృదయము చెదరి సముద్రమున బడియుండునేమో. రావణుడు సీతను తీసికొని వచ్చునప్పు డాతని మహావేగముచే చేతులతో గట్టిగా పట్టుకొనుటచే ఆ విశాలములగు కన్నులుగలదైన పూజ్యురాలగు సీత ప్రాణములు విడిచియుండును. పైనుండి

సముద్రమును దాటుచుండగా దొరలి సముద్రమున బడియుండును. అయ్యో బంధువులు చెంతలేని సీత తన శీలమును కాపాడుకొను టకై పెనగుచు నీచుడగు రావణునిచే భక్షింపబడియుండును. మంచి మనస్సుగల ఆ సీతను దుష్టబుద్ధిగల రావణుని భార్యలు తినియుందురేమో! లేదా పూర్ణ చంద్రునివంటి మోముతో తామర రేకులవంటి కన్నులు గలవాడగు ఆ రామునిమోమునే తలంచుకొనుచు దీనురాలై మరణించి యుండును. అయ్యో! రామా! లక్ష్మణా! ఓ అయోధ్యా! అని పలుమార్లు విలపించుచు సీత చివఱకు మరణించియుండును. లేక పంజరమున బంధింపబడిన చిలుకవలె రావణు నింటనే నిర్బంధింపబడి మిక్కిలి దుఃఖించుచుచుండెనా? జనకుని కూతురును, రాముని ధర్మపత్నియు, సన్నని నడుము, కలువల వంటి కన్నులు గలిగిన సీత ఎట్లు రావణుని వశమగును? సీత పాతాళ గృహములలో దాచబడి కనుపించ కున్నను, సముద్రమున బడుటచే ప్రాణములను విడిచినను, రాముని నెడబాయుటచే స్వయముగా జీవములను బాసినను, భార్యయందు మిక్కిలి యనురక్తి గలిగిన రామునకీ వార్త నెరింగింప దగదు. ఏమని చెప్పుదును?

## సీతాదేవి లేదని రామునితో చెప్పినచో వచ్చు ననర్థములను హనుమంతుడు తలంచుట :

రామునకీ వార్త చెప్పినచో అనర్థము వాటిల్లును. అట్లు చెప్పకుందునా? స్వామిని వంచించిన దోషము సంక్రమించును. కాన నేనేమి చేయవలయును? ఇట్టి విషమ సమస్య సంప్రాప్తమయ్యెనే? ఏమియును తోచకున్నది గదా! పరస్పర విరుద్ధముగా నున్నదీ సమస్య. ఇప్పుడు కాలోచితమైన కార్యమేది? ఎట్లు చేయదగు'నని వాయుపుత్రుడు ఆలోచింపసాగెను. "నేను సీతను చూడకుండ వానరరాజు పురమును చేరినచో ప్రయోజనమేమున్నది? నేను సముద్రమును దాటుట, లంకలో ప్రవేశించుట, రాక్షసులను చూచుట అంతయును వ్యర్థమగును కదా! మారాజు సుగ్రీవుడు తక్కిన వానరులు కిష్కింధకేతెంచిన నన్ను చూచి యేమందురు? నేను కిష్కింధకు వెళ్లి సీత నాకగపడలేదని రామునకు మిక్కిలి

దుఃఖమును కలిగించు మాటను చెప్పుదునా? ఆయన వెంటనే ప్రాణములు విడుచును. కర్ణ కఠోరము, భయంకరము, ఉగ్రము, అసహ్యము, ఇంద్రియ క్షోభకరము అయిన 'సీత కనిపించలేదను' వార్తను విని రాముడు బ్రతుకడు. అన్నగారు గొప్ప కష్టస్థితిలో నుండి మరణింప నిశ్చయించుకొనగా అన్నయం దెంతయో అనురక్తి కలిగిన బుద్ధిశాలియగు లక్ష్మణుడు ఎట్లు జీవించియుండును? ఇట్లు రామలక్ష్మణులు మరణించిరని వినినచో భరతుడును మరణించును. భరతుని మరణమును చూచిన శత్రుఘ్నుడు జీవములను విడుచును. తమ కుమారులు మరణింపగా జూచిన తల్లులగు కౌసల్య, సుమిత్ర, కైకలును జీవింపరు. ఇది నిస్సంశయము సుమా! కృతజ్ఞుడు, సత్యసంధుడు అయిన వానరరాజు సుగ్రీవుడు రాముని దురవస్థను జూచి వెంటనే ప్రాణములను విడుచును. అప్పుడు పతివ్రతయగు రుమయు భర్తృశోకముచే మనస్సు చెడి బాధనొంది ఆనందములేనిదై దీనురాలై మరణించును. వాలి మరణము చేతనే దుఃఖిపీడితురాలైన తార రాజు కూడ మరణించుట చూడగనే తానును ప్రాణములను విడచును. తల్లిదండ్రులు మరణింపగా కుమారుడగు అంగదుడు మాత్రమెట్లు జీవించును? తమ ప్రభువు మరణించుటచే కలిగిన శోకముచే పీడింపబడిన వానరులు పిడికిళ్లతో తమను దాము కొట్టుకొని రాళ్లకు తలలను బాదుకొని కొండల మీది నుండి దొర్లిపడి మరణింతురు. మంచి మాటలతోను, బహుమానములతోను గౌరవించుటలతోను లాలింపబడిన వానరులు సుగ్రీవుడు లేక జీవింపరు. సుగ్రీవుని వియోగమునందిన వానరులు అరణ్యములందు కాని కొండలందు గాని గృహములందుగాని క్రీడింపజాలరు. తమ ప్రభువు మరణించెనను క్లేశముచే పీడింపబడినవారై వానరశ్రేష్ఠులు తమ ఆలుబిడ్డలతో మంత్రులతో గూడ కొండకోనల నుండి మిట్టపల్లములబడి మడియుదురు. విషము త్రాగియో ఉరిపోసికొనియో అగ్ని ప్రవేశము చేసియో ఉపవాసము లుండియో ఆయుధములచే పొడుచుకొనియో వానరులందఱును చత్తురు గదా! కావున నేను కిష్కింధకు పోవుటచే ఇక్ష్వాకు వంశము, వానర సమూహము నశించుటచే, రోదనమే మిగులును. నేనిచ్చటి నుండి కిష్కింధా నగరమునకు

పోరాదు. సీతాదేవిని చూడకుండ నేను నా ప్రభువగు సుగ్రీవుని చూడజాలను. నేనిచ్చటి నుండి పోకుండా ఇచ్చటనే యున్నచో ధర్మాత్ములు మహారథులునగు రామలక్ష్మణులు, అభిమానవంతులగు వానరులును, సీతాదేవిని చూడగలమను ఆశతో జీవించియుండెదరు.

**హనుమంతుడు ప్రాణత్యాగము చేయదలంచుట :**

సీతాదేవి కనబడనిచో చేతికందినది నోటబడినది మాత్రము తినుచు వృక్షముల మొదట నివసించుచు వానప్రస్థుడనయ్యేదను. లేదా అధికముగా దుంపలు, పండ్లు, నీరు గల సముద్ర తీరమున అగ్నిని ప్రజ్వలిపంజేసికొని జీవములపై ఆశనువీడి అందుబడి మరణించెదను. లేదా సన్యాసినై చలనము లేకుండ శ్వాసను కుంభించెదను. నా శరీరమును కాకులు, మృగములు, పక్షులు, పులులు మున్నగునవి భక్షించును. ఇది మహర్షులుపదేశించిన మరణ మార్గమని తలంతును. సీతను చూడజాలనిచో నీటమునిగియైన మరణింతును. ఈ రాత్రి మొదట లంకాధి దేవతను జయించుటయే ఉత్తమమైనదిగాను, చంద్రోదయముచే అందమైనదిగాను సముద్రమును దాటి హనుమంతుడీ రాత్రియే లంకను ప్రవేశించుచున్న నా కీర్తితో నిండినదిగాను భావింపబడినది. కాని ఇప్పుడు సీత కనబడకపోవుటచే చాలచాల దీర్ఘమయినదిగా తోచుచున్నది. సీతాదేవిని చూడకుండగా వెనుకకు మాత్రము పోజాలను. లేదా వృక్షమూలముల నిల్చి నియమము గలవాడనై తపస్వినయ్యెదను. సీతాదేవిని చూడకుండ నేనిట నుండి వెళ్లినచో నాకై యెదురు చూచుచున్న అంగదుడు వానరులు బ్రతుకరు. మరణము గలిగెనేని దోషము వచ్చును. అట్లుగాక జీవింతుమేని శుభముల బడయవచ్చును. కావున నేను మరణింపను. జీవించియున్నచో తప్పక శ్రేయమును పొంద వచ్చును. రావణుడపహరించి తెచ్చిన సీత యెట్టైన నుండుగాక. మహాబలవంతు డైన రావణుని వధింతును. దీనిచే వైరి నిర్మూలనమగును. లేదా రావణు నెత్తికొని సముద్రము మీదుగా వెళ్లి రామునకిత్తును. యజ్ఞ పశువును యజ్ఞమునకై తీసికొని వెళ్లినట్లు తీసికొని వెళ్లెదను. "ఇట్లా కపిశ్రేష్ఠుడగు హనుమంతు డనేక విధముల

మనస్సునందు దుఃఖమును పొందినవాడై శోకము నుండి బయటపడడయ్యెను. అట్లు సీతను గానక దుఃఖముతోనున్న, హనుమంతుడు తాను సీతను వెదకుటకు నిరంతర ప్రయత్నము చేయతలంచి 'సీతను చూడకుండ వెళ్ళను. ఈ పట్టణ మును వీడక వెదకెదను గాక" అని నిర్ణయించుకొని మఱల నిట్లాలోచించెను. "గొప్ప కీర్తి గలదియగు సీతాదేవి కనిపించు వఱకు ఈ నగరమున నేను మాటిమాటికి వెదకెదను గాక! సంపాతి చెప్పిన కథను బట్టి నేను రామునిటకు తెచ్చితినా రాముడు తన భార్యను గానక వానరులనెల్లను చంపి వైచును. కాననేనాహార నియమమును పాటించి జితేంద్రియుడనై ఇచ్చటనే నివసించెదను. నాకై వానరులందఱును నశింపరాదు" అని తలంచి, ఇటునటు చూచి "ఈ అశోకవనము పెద్ద పెద్ద చెట్లతో గూడియున్నది. సీత యిందున్నదేమో చూచెదను. ఈ వనమింతకు మున్ను నేను వెదకినది గాదు. దీని నేల విడువవలెను? నేను వసువులకు రుద్రులకు నమస్కరించెదను. ఆదిత్యులకును, మరుత్తులకును, వాయువునకును నమస్కరించి వెళ్లి రాక్షసుల కండ కావరమును క్రక్కించెదను. సర్వ రాక్షసులను జయించి తపస్సుచేయువాడు సిద్ధిని పొందినట్లు ఇక్ష్వాకు వంశము నానందింపజేయు సీతను రాక్షసులు హెూయని యేడ్చుచుండగా రామునకు సమర్పించెదను." అని యొక్క ముహూర్తకాలము ఆలోచించి మహా తేజశ్శాలియగు వాయుపుత్రుడు చింతచే వ్యాకులత చెందిన మనస్సు గలవాడై మఱల ధైర్యము తెచ్చుకొని యుత్సాహముతో లేచి నిలబడెను.

**హనుమంతు డశోకవనమును జూచుట :**

'ఆ రామచంద్రునకు నమస్కరించెదను. రామసహెూదరుడైన లక్ష్మణునకు నమస్కరించెదను. సీతాదేవికి నమస్కరించెదను. రుద్రేంద్ర యమ వాయువులకు నమస్కరించెదను. చంద్ర సూర్య మరుద్గణములకు నమస్కారములు చేసెదను.' అని మ్రొక్కి పిమ్మట వానరులకు రాజగు సుగ్రీవునకు నమస్కరించి దిక్కులన్నియు గలయజూచి ఆ యశోక వనము నందు మనస్సు నిల్పి అచ్చటికి వెళ్లదలంచి మఱియు నీ విధముగా మనస్సునందు తలంచెను. "ఈ అశోకవనమున తప్పక

అనేక రాక్షసులుందురు. వృక్షములు, జలములు విస్తారముగా నుండును. దుమ్ని, గడ్డి మున్నగునవి తీసివేసి బాగు చేయబడినదియైన ఈ అశోకవనము తప్పక వెదుకదగినదే యగును. తప్పక రాక్షసులిచటి వృక్షములకు కావలియుందురు. సర్వ వ్యాపియగు వాయువు మెల్లగా వీచుచు అమితముగా చెట్లను కదల్పడు. రాముని ప్రయోజనము సాధించుటకు రావణునికి కనిపించకుండుటకును నాశరీరమును సూక్ష్మముగా చేసికొంటిని గదా. దేవతలు, ఋషులు నాకు కార్యసిద్ధిని కలుగజేసెదరు గాక! స్వయంభువగు బ్రహ్మయు, దేవతలును, అగ్నియు, వాయువును, వజ్రాయుధుడగు నింద్రుడును, పాశహస్తుడగు వరుణుడును, సూర్యచంద్రులును, మహాత్ములగు నశ్వినీ దేవతలును, మరుత్తులును, శివుడును నాకు కార్యసిద్ధిని కలిగింతురు గాక! సర్వ భూతములును, భూతములు గానివియును, ఇదివఱకు చెప్పబడిన దేవతల కధిపతియైన విష్ణువును, నాకు సిద్ధిని గూర్తురు గాక. అట్లే నాకు కనిపించకయే మార్గమును చూపించువారైన తక్కిన దేవతలును నాకు కార్యసిద్ధిని కలుగజేయుదురు గాక! ఉన్నతమైన నాసిక గలదియు, తెల్లని పలువరుస గలదియు, సాటిలేనిదియు, తెల్లని చిరునగవు గలదియు, నిర్మల చంద్రుని వలె సంతోషము కలిగించు దర్శనము గలదియునగు సీతాదేవి నెప్పుడు చూచెదనో గదా! నీచుడు, పాపి, క్రూర కార్యములు చేయువాడు, భయంకరుడయ్యును అలంకారములతో ప్రసన్నమైన రూపముగలవాడును అగు రావణుని బలముచే పీడింపబడినదైన సాధువగు సీతాదేవి ఎప్పుడు నా దృష్టికి గోచర మగునో ?" యని హనుమంతుడు తలంచెను.



# పదునాలుగవ సర్గము

## హనుమంతు డశోకవనమున ప్రవేశించుట :

గొప్ప తేజస్సు గల హనుమంతు డొకింత తడవాలోచించి సీతాదేవిని మదిలో తలంచి ఆ వనప్రాకారముపై కెగరెను. అట్లు ప్రాకారముపై నిలిచిన హనుమంతుడు సంతుష్టి చెందిన సర్వాంగములు గలవాడై వసంతారంభమున పూచిన శాఖాగ్రములు గల అనేక వృక్షములను జూచెను. సాల తమాల తక్కోల హింతాల కోద్దాల రసాల చంపకాదులగు వృక్షములు చక్కగా పుష్పించి యుండుటను చూచెను. పిమ్మట హనుమ మామిడిచెట్లతో నిండినదియు వందలకొలది తీగలతో ఆవరింపబడినదియు అగు ఆ వనములో నారినుండి ఏ విడువబడిన బాణము వలె రివ్వున దుమికి అశోకవనమున ప్రవేశించెను. అట్లు ప్రవేశించి హనుమంతుడు పక్షుల కలకలముతో గూడినదియుబీ వెండి, బంగారు రంగుగల వృక్షములతో నిండినదియుబీ పక్షులతో జంతువులతో ఆశ్చర్యము గలిగించునదియు, అనేకవర్ణములు గల చివుళ్లు లేత ఆకులు గలదై ఉదయించిన సూర్యునివలెనున్నదియు, పుష్ప ఫలములతో గూడిన వృక్షములు గలదియు, మదించిన కోకిలలతోడను, శ్రేష్ఠమైన తుమ్మెదలతోడను ఎల్లప్పుడు సేవింపబడుచున్నదియుబీ మదముతో గూడిన నెమళ్లు గలదియుబీ అనేక పక్షి సంఘములు గలదియునగు ఆ వనమునందు రాజపుత్రియగు సీతాదేవికై వెదకుచుండగా అతని సంచారము సుఖముగా నిద్రించుచున్న పక్షులను మేలు కొల్పెను. అవి ఎగురుచుండగా వాటి రెక్కల గొడ్డులచే కదలిన చెట్ల కొమ్మలు రంగురంగుల పుష్పములను వర్షించెను. వాయుపుత్రుడా పుష్పములతో నిండినవాడై అశోకవన మధ్యమున పూలకొండవలె ప్రకాశించెను. చెట్ల మధ్య

పుష్పమయుడైన హనుమంతుడన్ని దిక్కులకు పరువెత్తుచుండ అతనిని జూచి భూతములన్నియు వసంతుడని తలంచెను. ఆ వనమందలి నేల యంతయును చెట్ల నుండి రాలిపడిన పువ్వులతో నిండినదై అలకంరించుకొనిన స్త్రీవలె ప్రకాశించెను. వాయుపుత్రుని గమన వేగముచే కదల్పబడిన చెట్లు వివిధ వర్ణములు గల పూలనాతనిపై వర్షించెను. ఆకులు, పూవులు పండ్లు రాలిన వృక్షములు జూదమున తమ సమస్తమును నోడిపోయి తమ అమూల్యములగు వస్త్రములను భూషణములను కోల్పోయిన జూదరుల వలె నుండెను. పక్షి సంఘము లెగిరిపోవుట చేతను, పువ్వులు, పండ్లు రాలిపోయినవగుట చేతను శూన్యములైన చెట్లు బంధువులచే మిత్రులచే వదలబడిన మానవుల వలె ఇంపులేనివై యుండెను. హనుమంతుని తోకతోను, చేతులచేతను, కాళ్లతోడను విరుగగొట్టబడిన వృక్షములు జుట్టు ముడివీడి చందనాద్యంగ రాగములు రాలిపోయి దంతక్షతములు గల పెదవులతోను, నఖక్షతములు గల దేహముతోను ఒప్పు స్త్రీవలె అశోకవనము కనిపించెను.

**హనుమంతు డశోకవనమున సంచరించుట :**

వింధ్య పర్వత శిఖరములందు వర్షించుచున్న మేఘములను వాయువు చెదరగొట్టినట్లు హనుమంతు డశోకవనమునందలి పెద్ద తీవ గుంపులను చెదరగొట్టెను. హనుమంతుడట్లు తిరుగుచు పచ్చలతో పొదుగబడిన వెండి బంగారులచే నిర్మింపబడిన ప్రదేశములను చూచెను. రత్నములు మణులు పొదుగబడిన సోపానములు గలిగి నిర్మలమైన జలముగల దిగుడుబావులను చూచెను. స్ఫటిక నిర్మితములైన అరుగులతోడను, ముత్యముల పగడముల పొడులతో గూడిన యిసుక తిన్నెలతోడను, తీరములందు మొలచిన సంపెంగ చెట్లతోడను అవి ప్రకాశించుచుండెను. ఆ దిగుడు బావులు వికసించిన తామరలతోను, కలువలతోడను నిండియుండెను. చక్రవాకములు, హంసలు, భరత పక్షులు, సారసములు మొదలగు జలపక్షుల కూజితములతో అవి

మనోహరములై యుండెను. వానికన్నివైపుల అమృత సమానమైన నీటితో గూడి చిన్న వాగులుండెను. ఆ యుద్యానవనములో వాయుపుత్రుడొకచో మంచి శిఖములతోడను అందమైన కందరముల తోడను సుందరమైన కేళీ పర్వతమును చూచెను. ఆ కొండపై నుండి పడుచున్న సెలయేటిని చూడగా అది ప్రియుని తొడపై నుండి కోపముతో దిగి వచ్చుచున్న ప్రియురాలివలె నుండెను. కొండపై నున్న చెట్ల కొమ్మలు ఆమెను వారించుచున్న చుట్టముల వలె నుండెను. ఒక్కచో వెనుకకు మఱలిన ఆ సెలయేఱు భర్తపై కోపమును వీడి మరలుచున్న ప్రియురాలివలె నుండెను. దానికి సమీపమున వివిధ పక్షి సమూహములతో కూడిన సరోవరమును హనుమంతుడు కాంచెను. చల్లని నీటితో నిండినవియు, వివిధములగు మణులు పొదుగబడిన మెట్లుగలవియు, వివిధ జంతువులు గల కృత్రిమ వనములు గలవియు అయిన దిగుడుబావుల ననేకములను హనుమంతు డచ్చట చూచెను. విశ్వకర్మ నిర్మితములైన సౌధములును, ఫల పుష్ప భరితములగు వృక్షములును గొడుగులక్రింద నిర్మింపబడిన బంగరు అరుగులు నుండెను. హనుమంతుడచ్చట బంగారు వర్ణము గలదియు, తీగలు ఆకులు మొదలగు వానిచే దట్టముగా నున్నదియునగు నొక శింశుపా వృక్షమును జూచెను. దానిచుట్టును బంగారు వేదికలుండెను. బంగారు అరుగుల కాంతులతో వెలుగుచు అగ్నివలె ప్రకాశించుచున్న అనేక వృక్షములను హనుమంతుడు చూచెను. మేరు పర్వతకాంతులచే సూర్యునివలె బంగారు వృక్షముల కాంతిచే, ప్రకాశించు హనుమంతుడు తాను బంగారు శరీరముగల వాడనాయని తలంచెను. తనచుట్టు బంగారు చెట్లు గలదియు, బంగారు గజ్జెల మ్రోతలు గలదియు అగు శింశుపా వృక్షమును జూచి హనుమంతుడు మిక్కిలి యాశ్చర్యమును పొందెను. గొప్ప భుజములు గల హనుమంతుడు పువ్వులతో నిండిన కొమ్మలు గలదియు ఆకులచే దట్టముగా కప్పబడినదియునగు ఆ శింశు పా వృక్షము నెక్కి "రాముని చూడవలెనని పదే పదే కోరుచున్న సీతనిచ్చట

చూచెదను. దుఃఖముచే పీడింపబడి అప్రయత్నముగా నిటునటు తిరుగుచున్న సీతాదేవి నిచ్చట చూచెదను ఇది నిజము. పాపాత్ముడైన రావణునిదీ అశోకవనము. సంపెంగ తీగలతో పొగడచెట్లతో అందముగా నున్నది. పక్షుల సమూహములు చెంతనున్న ఈ తామరతీగలెంతయో యందముగా నున్నవి. రాముని పట్టమహిషియైన సీత ఇచ్చటనే యుండును. రామునకు ప్రియము కలుగజేయునది అడవులలో తిరుగు నేర్పుగలది యగు జానకి యిచ్చటనే తప్పక యుండును. లేదా లేడిపిల్లవంటి చూపులుగలదియు, ఈ వనమందు సంచరింపగలదియు పూజ్యురాలును అగు సీత రాముని గూర్చిన విచారముతో కృశించి ఈ వనమునకు వచ్చును. సుందర నేత్రములు గలదియు, రాముని విరహము వలన గలిగిన శోకముచే పీడింపబడునదియు నిత్యము వనవాసమందాసక్తి గలదియు అగు సీతాదేవి ఈ వనమునకు తప్పక రాగలదు. అందమైన రూపము గలదియు, యౌవనవతియు, సంధ్యా సమయ మెప్పుడాయని యెదురు చూచునదియునగు జానకి పవిత్ర జలములు గల ఈ నదికి సంధ్యోపాసనకై తప్పక రాగలదు. రాజులలో శ్రేష్ఠుడగు రాముని పత్నికి, మంగళకరములగు క్రియలచే భర్తకు ప్రీతి గూర్చునదియగు సీతాదేవికి ఈ శుభమగు అశోకవనము తగియున్నది. చంద్రునిబోలు మోముగల సీతాదేవి జీవించియున్నచో పవిత్రజలములు గల యీ నదికి తప్పక వచ్చును.” అని యిట్లు హనుమంతుడు తలంచుచు రాజశ్రేష్ఠుడగు రాముని భార్యకై యెదురు చూచుచు బాగుగా పూచి ఆకులతో దట్టముగానున్న శింశుపా వృక్షము పై దాగియుండి అన్నియును చూచుచుండెను.



# పదునైదవ సర్గము

## హనుమంతు డశోకవనమున సీతను చూచుట :

అంతట హనుమంతుడు శింశుపా వృక్షముపై గూర్చుండి యచ్చట నుండి సీతకై భూమినంతయును పరిశీలించుచు తన దృష్టిని ప్రసరింపజేసెను. సంతానకములనబడు తీగలతోడను, వృక్షముల తోడను ప్రకాశించుచున్నదియు, ప్రశస్తమైన సువాసనలుగల పుష్పములతోను మంచి రుచిగల ఫలములతోడను అంతటను అలంకరింపబడి దేవేంద్రుని నందనమువలె నున్నదియు, మృగములతోడను పక్షులతోడను గూడినదియు, గొప్ప భవనములతో నిండినదియు, అనేకములగు పీఠములు ఆస్తరణములతో గూడినదియు, అనేక పాతాళ గృహములు గలదియు, అన్ని ఋతువులలోను పూచు పూలతోను, ఫలములతోడను నిండిన చెట్లతో సుందరమైనదియు, వికసించిన అశోకముల కాంతిచే సూర్యోదయపుటందము గలదై కాంతులను చిమ్ముచున్నట్లున్నదియునగు ఆ వనమును హనుమంతుడు చూచెను. మాటిమాటికి తమ రెక్కలను విదలించు కొను పక్షులచే ఆ అశోకవనము ఆకులు కొమ్మలు లేకుండునట్లు చేయబడు చున్నదా యనునట్లుండెను. వందల కొలదిగా చెట్లనుండి పడుచున్నట్టియు చిత్ర చిత్రములగు వర్ణములు గలవియు అగు పుష్పములే శిరోభూషణములా యనునట్లున్నవియు, ఆ పుష్పములంతటను వ్యాపించి చూచువారలకు శోకమును పోగొట్టుచున్నవియు, అమితమైన పువ్వుల బరువుచే వంగి నేలను ముట్టుచున్నవో యనునట్లున్నవియు నగు అశోక వృక్షములతో ఆ వనము ప్రకాశించుచుండెను. పూచిన కొండ గోగులతోను, పూచిన మోదుగు చెట్లతోను ఆ వనము మిక్కిలి ప్రకాశించుటను హనుమ చూచెను. పుష్పముల కాంతితో ఆ ప్రదేశమంతయు వెలుగుచున్నదా యనిపించుచుండెను. పున్నాగములు,

ఏడాకుల అరటులు, సంపెంగలు, ఉద్దాలకములను చెట్లు బాగుగా విస్తరించిన మొదళ్ళు గలవై వికసించి ప్రకాశించుచుండెను. ఆ పుష్పములలో కొన్ని బంగారు రంగు, కొన్ని అగ్నివర్ణము, కొన్ని కాటుకరంగు గలిగి యుండెను. అవి అనేక సహస్ర సంఖ్యలో నుండెను. ఆ యశోకవనము వివిధములగు పూలతోటలతో ఇంద్రుని నందనవనము వలె నుండెను. కుబేరుని చైత్రరథమను నుద్యానమును నిరసించు నట్లుండెను. ఊహింపరాని దివ్య సౌందర్యములో నొప్పుచున్నదియు, పూచిన తామరలతో రెండవ ఆకాశమో యనదగినదియునై యుండెను. అన్ని ఋతువులలో పూచు పువ్వులు గలిగి సుగంధయుక్తములైన తరువులతోడను, బహు పక్షి మృగములతోడను గూడి ఆ వనము రెండవ గంధ మాదనమో యనునట్లుండెను. అట్టి అశోకవనమందు హనుమంతుడు సమీపముననే యొక గొప్ప భవనమును చూచెను. అది వేయి స్తంభములు గలిగి మిగుల ఎత్తైనదై కైలాస పర్వతమువలె తెల్లనిదై ప్రకాశించుచుండెను. ఆ భవనపు మెట్లు పగడములు పొదగబడి యుండెను. వేదికలు బంగారముతో నిర్మింపబడెను. ఆ భవనము చూచు వారలకు కన్నులు మిఱుమిట్లు గొల్పుచు, చూపును పోగొట్టునా యనిపించుచుండెను. కాంతితో భవనమంతయు విరాజిల్లుచుండెను. ఆ భవనము స్వచ్ఛముగా నుండెను. మిగుల ఎత్తుగా ఆకసము నంటుచున్నదా యన్నట్లుండెను.

**హనుమంతుడు సీతాదేవిని చూచుట :**

మాసిన చీరగట్టినదియు, చుట్టును రాక్షస స్త్రీలు గలదియు, ఆహారమును తీసికొనకుండుటచే మిగుల కృశించినదియు, దీనముగా నున్నదియు, మాటిమాటికి నిట్టూర్పుచున్నదియు, శుక్ల పక్షారంభమున నిర్మలముగా ప్రకాశించు సన్నని చంద్రరేఖవలె నున్నదియు, ఆకారమును బట్టి సీతయని గుర్తింపరాకున్నను సుందరమగు ప్రకాశము గలదై పొగచే కప్పబడిన అగ్నివలె కనుపించుచున్నదియు, చినిగిన పసుపు పచ్చని యొకే ప్రధాన వస్త్రమును ధరించి, శరీరమునకు సంస్కారములు లేకుండుటచే భూమి నుండి పుట్టినదా

యనునట్లు ధూళి ధూసరితమై ఆభరణములు ధరింపక పద్మములులేని తామర కొలనువలె నున్నదియు, మిగుల దుఃఖముతో శోభ తరిగి వాడినదియు, దయ కలిగించు స్థితియందున్నదియు, కుజగ్రహముచే పీడింపబడిన రోహిణివలె కనబడుచున్నదియు, కన్నుల నీరుగారుచుండ ఆహారము మాని ముఖమునందు మిగుల దైన్యము కనిపించగా తనస్థితికి నగచుచు ఎల్లప్పుడు రామునే తలంచుచు దుఃఖించుచున్నదియు, తనకిష్టమైన వారు కనిపింపక క్రూరమైన స్వభావముగల రాక్షస స్త్రీలే కనిపించుచుండగా తమజాతి మృగములకు దూరమై వేటకుక్కల నడుమనున్న ఆడలేడివలె నున్నదియు, నల్లగానున్న జడ కృష్ణ సర్పము వలె పిఱుదల వలకు వ్రేలాడుచున్నదియు, రాజపుత్రియగుటచే సుఖముల ననుభవింపదగి యుండియు దుఃఖము ననుభవించుచున్నదియు, విశాలమైన కన్నులు గలదియునగు సీతను చూచి హనుమంతుడు కారణములన్నిటిని కలయజూచి ఆమె సీతయేయని నిశ్చయించెను.

**హనుమ సీతాదేవిని చూచి తనలో వితర్కించుకొనుట :**

ఆనాడు మాయవేషమున రావణుడపహరించినప్పుడు సీత యే రూపముతో నుండినదో ఆ రూపముతోనే ఈమె యిప్పుడు కనిపించుచున్నది. పున్నమ చంద్రుని బోలు మోముతో చక్కని కనుబొమలతో సుందరములైన స్తనములతో నున్నదియు, చాలకాలము స్నానము చేయకున్నను, తన శరీర కాంతిచే దిక్కుల చీకట్లను పోగొట్టజాలిన తేజస్సు గలదియు, నల్లని కేశములు గలదియు, దొండపండు వంటి పెదవులు గలదియు, చక్కని నడుము గలిగి కుదురుగా కూర్చొని యున్నదియు, తామరరేకుల వంటి కన్నులు గలదియు, మన్మథుని భార్యయగు రతీదేవివలె నున్నదియు, వెన్నెల వలె సర్వులకు ప్రీతిపాత్రమైదియు, చక్కని శరీరము గలదియు, తపస్సు చేయుచున్న దానివలెను, నియమములు గల దానివలెను భూమిపై కూర్చున్నదియు, ఆడపామువలె నిట్టూర్పులు విడుచుచు భయము చెందుచున్నదియు, మిక్కిలి ఉబికి వచ్చుచున్న శోకముచే పొగ క్రమ్మిన అగ్నివలె ప్రకాశము లేనిదియు, సందేహాస్పదమగు అర్థముగల

వేదవాక్కువలెను, క్షీణించిన సంపదవలెను, అబద్ధమైన అపవాదుచే చెడిపోయిన కీర్తివలెను, విడువబడిన శ్రద్ధవలెను, ప్రయోజనములేని ఆశవలెను, కపటముతో కప్పబడిన మంచి ఆలోచనవలెను, సీతాదేవి కన్పట్టెను. సమాగమమున కంతరాయము గలిగి మిగుల వ్యథ చెందునదియు, రావణునిచే తీసికొని రాబడి మిగుల కృశించినదియు, బలము లేనిదియు, లేడిపిల్ల నేత్రములవంటి విశాల నేత్రములతో తన భర్త ఎప్పుడు వచ్చునాయని భయముచే నిటునటు చూచు చున్నదియునగు సీతాదేవి హనుమంతునకు గనిపించెను. నల్లని కనురెప్పలుగల ఆమె కన్నులు కన్నీటితో నిండి యుండెను. ఆమె శరీరము ధూళి ధూసరితమై యుండెను. ముఖమున దైన్యముట్టి పడుచుండెను. అలంకరించుకొనదగిన దయ్యు ఆమె అలంకరించుకొనలేదు. ఇట్లామె కారుమేఘములు గ్రమ్మిన చంద్రుని కాంతివలె నుండెను. చిక్కిపోవుట, మురికిగా నుండుట మొదలైన కారణములచే సీత అభ్యాసములేని విద్యవలె కనిపించుచుండుటచే ఈమె సీతాయేనా? అను సందేహము హనుమంతునకు కలిగెను. ఈమె సీతయగునో కాదోయని తలంచుచు అలంకార రహితమైన వాక్కువలె భూషణములు దాల్పని సీతాదేవిని హనుమంతుడు మిగుల కష్టముతో పోల్చుకొనగలిగెను. ఈమెయే సీతయని యెట్టకేల కాతడు నిశ్చయించుకొనెను.

**హనుమ తాను చూచిన స్త్రీ సీతాదేవియే యని నిశ్చయించుకొనుట :**

హనుమంతుడామెను జూచి యుక్తియుక్తములగు కారణములచేత ఆమెను సీతగా నిట్లూహించెను. నాడు సీతను వెదకుటకై బయలుదేరునపుడు రాముడు సీతాదేవి అవయవములందే యేయాభరణములను ధరించెనని వర్ణించెనో వానినాంజనేయుడు చెట్టుకొమ్మలకు వ్రేలుచుండగా జూచెను. చక్కని కుండలములు, మేలైన బొగడలు, మణులు, ప్రవాళములతో చేయబడిన చేతుల ధరించు ఆభరణములునవియే. అవి చాలా కాలమునుండి ధరింపక పోవుటచే నల్లగానున్నవి. అట్లే చాలకాలము ఆయాభరణములు ధరించి తీసివేయుటచే ఆ ఆభరణములు ధరించు చోటులందు ఆభరణముల గుర్తులు కనిపించుచున్నవి.

రాముడే యే ఆభరణములను గూర్చి చెప్పియుండెనో అవి యివియేయని నేను తలంచుచున్నాను. నాడు సీతాదేవి ఋశ్యమూకముపై ఏ నగలను జారవిడచినవో ఆ నగలీమెచెంత కనబడుటలేదు. ఆమె ఏ నగలు విడువలేదో ఆ నగలే యిట గనబడుచున్నవి. సందియము లేదు. పసుపు పచ్చని రంగు గలిగి బంగారముతో చేయబడినదో యనునట్లున్న శుభప్రదమైన ఈమె యుత్తరీయము నాడు ఋష్యమూకపై జారిపడగా సుగ్రీవుడు మొదలగు వానరులెల్లరును చూచిరి. ఈమె చాలాకాలము నుండి ధరించుటచే చీర మిగుల నలిగియున్నది. అయినను దానికాంతి యచట విడిచిన యుత్తరీయపు కాంతికే మాత్రమును తీసిపోవుట లేదు. రామునకు మిక్కిలి ప్రీతి గలిగించునదగుటచే రాక్షసునిచే దొంగిలింపబడి దూరమైనను మనస్సు నందు మాత్రము నిత్యము రామునకు దగ్గరగానున్నట్టి బంగారుచాయ గల రాముని భార్య ఈమెయే. ఈమె కొఱకై రాముడు దయతోను, అనుతాపముతోను, దుఃఖముతోను, ప్రేమతోను పీడితుడగుచున్నాడు. (ఒక స్త్రీ కనిపించలేదను జాలి, తన్నాశ్రయించిన ఆమె కనిపించలేదని యను తాపము, భార్య కనిపించలేదని దుఃఖము. తనకిష్టమైనదని మదనబాధ వీనిచే రాముడు మిగుల పరితపించుచున్నాడు.) ఈమె శరీరాకారమునకు తగిన ఆకృతిని రాముడును, రాముని అవయవములకు తగిన చక్కని అమరిక నామెయు గలిగి ఒకరికొకరు తగియున్నారు. ఈమె మనస్సు రాముని యందును రాముని మనస్సీమె యందును స్థిరముగా నిలిచి యండుటచే వీరిరువురు జీవించగలుగు చున్నారు. ఈమె చెంత లేక రాముడు చాల కష్టమైన పనినే చేయుచున్నాడు. సీతా వియోగియై శరీరముతో నుండుట మిక్కిలి కష్టము. అట్టిచో ఆయన కష్టముతో జీవించుచున్నాడు. శోకముతో నశించుట లేదు. ఉత్తమురాలైన ఈ సీత లేక రాముడొక్క క్షణమైనను జీవించుట శక్యము గాదు. అట్టిచో ఆతడు చేయనలవిగాని పనిని చేయుచున్నాడు." ఈ విధముగా సీతను జూచి హనుమంతుడు మనస్సు నందు సంతోషము నిండినవాడై ప్రభువగు రాముని దలంచి లోలోననే యాతని గుణములను ప్రశంసించెను.

# పదునాఱవ సర్గము

## హనుమంతుడు సీతాదేవి స్థితికి దుఃఖించుట :

వానరశ్రేష్ఠుడగు హనుమంతుడట్లు ప్రశంసింప దగియున్న గుణములు గల సీతాదేవిని, గుణగణములచే ప్రకాశించు రాముని పొగడి మరలనిట్లు చింతాక్రాంతుడయ్యెను. పరాక్రమవంతుడగు హనుమంతుడు సీతను గూర్చి యొకింత ఆలోచించి కన్నుల నిండ నీరు నిండగా నిట్లు విలపించెను. "గురువుల కడ సుశిక్షితుడైన లక్ష్మణునకు పూజ్యురాలును, రామునకు ప్రియురాలును అగు సీతాదేవి కూడ యిట్లు దుఃఖములచే పీడితురాలగుట చూడగా కాలమెవ్వరికిని దాటరానిదని స్పష్టమగుచున్నది." (జగద్రక్షకులగు రామ లక్ష్మణులు రక్షించుచున్న సీతాదేవికే యిట్టి దుఃఖము కలిగెననగా కాలమెట్టి బలవత్తరమో తెలియును) క్రొత్త బంగారము వలె ప్రకాశించుచు లోకములకెల్ల ప్రియమగు లక్ష్మీదేవివలెనున్న ఆమెను జూచి హనుమంతుడు వెంటనే రాముని దలంచి తనలో తానట్లు చెప్పుకొనెను. (విశాలములగు కన్నులు గల ఈమె కొఱకే రాముడు మహాబలుడగు వాలిని బరిమార్చెను. పరాక్రమమున రావణునకు సాటియైన కబంధుని చంపినాడు. భీకర పరాక్రమముగల విరాధుడను రాక్షసుడును ఈమె కారణముగనే చంపబడినాడు. జనస్థానమున భయంకర కృత్యముల నొనర్చు ఖర దూషణాదులగు పదునాల్గు వేల రాక్షసులను అగ్నిజ్వాలల వంటి బాణములచే రాముడీమె కారణముననే చంపినాడు. ఈమె కారణముననే వాలిచే పాలింపబడినదియు, పొంద శక్యము గానిదియు, గౌరవ స్థానమైనదియునగు వానర రాజ్యాధిపత్యమును సుగ్రీవుడు పొందినాడు. విశాల నేత్రములు గల ఈమె నిమిత్తమే నదీనదాధి పతియగు సముద్రుని దాటి వచ్చి నేనీ పురమును

జూచితిని. ఈమె కొఱకై రాముడు సముద్ర పర్యంతముగల భూమిని తలక్రిందులు చేసినను ప్రపంచముననే తలక్రిందులు జేసినను తగిన పనియేయని నాకు తోచుచున్నది. మూడు లోకముల యాధిపత్యమా? లేక జనకుని కూతురగు సీతయా? ఏది గొప్పదని తలంచినచోఁ సమస్తమైన మూడు లోకముల రాజ్యమును సీతతో నించుకయును సాటిగాదని చెప్పగలను. ధర్మశీలుడును మహాత్ముడును మిథాలాధిపతియునగు జనకమహారాజు పుత్రికయే ఈమె. భర్తయందు దృఢమైన భక్తిగలదియు, పవిత్రమైన యజ్ఞక్షేత్ర పరాగముచే ఆవరింపబడి నాగటికఱ్ఱుచే దున్నబడిన యజ్ఞభూమిని భేదించుకొని పైకి వచ్చిన దీమెయే. పరాక్రమము గలవాడు, మంచి స్వభావము గలవాడు, యుద్ధమునందు వెన్నుచూపనివాడు నగు దశరథ మహారాజు యొక్క పెద్దకోడలీ యశశ్శాలిని యగు సీతయే. ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, ఆత్మజ్ఞుడునగు రామునకు ప్రియపత్నియగునీమె రాక్షస స్త్రీలకు చిక్కినది. చిలుకలు, గోరువంకలు, బంతులు మున్నగు క్రీడా సాధనములకును, అత్తలు, తల్లులు మున్నగు ఆత్మీయులకును దూరమై వానియందాశ లేనిదై భర్తయందున్న స్నేహమునకు పరవశమై దుఃఖములను లెక్కజేయక భర్తననుసరించి భక్తితో నిర్జనమైన వనము ప్రవేశించినది. అడవులలో పండ్లను దుంపలను దినుచు సంతుష్టి చెందినదై భర్తను సేవించుట యందాసక్తి గలదై అడవులందు కూడ రాజభవనములందు వలెనే మిక్కిలి సంతసమందినది. బంగారు రంగు గలిగిన శరీరము గలదియు, ఎల్లప్పుడును చిఱునగవుతో మాటలాడునదియు బాధల నందుటకు తగనిదియునగు నీమె ఈ కష్టములను సహించుచున్నది. దాహము గొన్నవారు పానీయములను చూచినట్లు రావణునిచే బాధలు పెట్టబడుచున్న శీలవతియైన ఈ సీతను రాముడు చూడవలసి యున్నాడు. ముందుగా రాజ్యమును పోగొట్టుకొని తిరిగి దానిని సంపాదించిన రాజువలె రాముడు సీత లభించుటచే మిక్కిలి ప్రీతినందును. శరీరమును పులకింపజేయు భోగములను వీడి

బంధువులకు దూరమై ఈమె రాముని సమాగమమునే కోరుచు ప్రాణములను నిలుపుకొనుచున్నది. ఈమె రాక్షస స్త్రీలను గాని, పూలమొక్కలను గాని, ఫల వృక్షములను గాని చూచుట లేదు. ఏకాగ్రతతో రామునే ధ్యానించుచున్నది. స్త్రీలకు తక్కిన సర్వాభరణముల కంటెను భర్తయే శ్రేష్ఠమగు ఆభరణము. అట్టి భర్తయను నాభరణములేక ఆభరణములను ధరింప యోగ్యురాలయ్యును నీమె శోభించుట లేదయ్యెను. రాజగు రాముడీమె నెడబాసి దుఃఖముతో నశింపక తన దేశమును నిలుపుకొనుచు దుష్కరమైన కృత్యమునే చేయుచున్నాడు. నల్లని కురులు గలదియు, కమలముల వంటి కన్నులు గలదియు, సుఖముల ననుభవింప దగినదియునైన నీమె దుఃఖముతో నుండుట చూడగా నావంటివాని మనస్సు కూడ వ్యథను చెందుచున్నది. (పరమ దయాళువగు రాముని విషయము వేఱుగా చెప్పవలెనా) సహనమునకు భూదేవితో సాటియైనది, పద్మముల వంటి కన్నులు గలదియునగు నీమె పూర్వము రామలక్ష్మణులచే రక్షింపబడినది. ఇప్పుడో వికృతమైన కన్నులు గల రాక్షసాంగనలచే శింశుపా వృక్ష మూలమున కావలి కాయబడుచున్నది. మంచు తగిలి వాడి సొంపుచెడిన తీగవలె ఎడతెగని కష్టములచే బాధ పెట్టబడిన జనక పుత్రియగు సీతాదేవి, తోటి పక్షి నెడబాసిన ఆడ చక్రవాకము వలె చాలా దీనస్థితిని పొందియున్నది. శోకమును పోగొట్టునట్టి పుష్పములచే వంగినవగు అశోక వృక్షములు కూడ నీమెకు శోకమునే గలిగించుచున్నవి.” అని యిట్లు బలవంతుడును, వానరశ్రేష్ఠుడును నగు హనుమంతుడు అన్ని విషయములను తనలో తాను చర్చించి ఈమె సీతయే యని నిశ్చయించి యా శింశుపా వృక్షము పై గూర్చుండి యుండెను.



# పదునేడవ సర్గము

## హనుమంతుడు సీతకు గాపున్న స్త్రీలను చూచుట :

అటు పిమ్మట నిర్మలుడును, తెల్ల కలువల సమూహమువలె ప్రకాశించు వాడునునగు చంద్రుడు, హంస నల్లని జలములలో సంచరించునట్లు నీలమైన పశ్చిమాకాశమున ప్రకాశించెను. సీతను వెదకుచున్న హనుమంతునకు బాసటగా వెలసెనేమో యనునట్లు తన ప్రకాశవంతమగు వెన్నెలలను ప్రసరింప జేసెను. బరువుతో నిండిన పడవ నీటిలో మునిగి పోవునట్లు సీత శోక భారముతో క్రుంగిపోయి యుండుటను హనుమంతుడు చూచెను. వాయుపుత్రుడా సీతాదేవి పార్శ్వమున ఒకే కన్ను గలది, ఒకే చెవి గలది, పెద్ద చెవులతో తలను గప్పికొన్నది, చెవులే లేనిది, మేకులవంటి చెవులు గలది, చిన్నమెడ గలది, పొడవు మెడ గలది, పైకి చూచు ముక్కు గలది, పెద్ద తల గలది, స్వల్పమైన జుట్టుగలది, వెంద్రుకలే లేనిది, కంబళివలె నున్న తలగలది, వ్రేలాడు చెవులు గలది, వ్రేలాడు నొసలు గలది, వ్రేలాడు పొట్టగలది, వ్రేలాడు స్తనములు గలది, గడ్డమునందు పెదవి గలది, వ్రేలాడు ముఖము గలది, వ్రేలాడుచున్న మోకాళ్లు గలది, పొట్టిది, పొడవైనది, గూనిది, వంకరయైనది, మఱుగుజ్జుది, పెద్దపండ్లు గలది, సొట్టమొగము గలది, మున్నగు వివిధములైన భయంకరాకారులగు రాక్షస స్త్రీలను చూచెను. వికృత వేషము గలవారును, గోరోజనపు వర్ణము గలవారును, నల్లనివారును, కోపముతోనున్న వారును, పోట్లాట యందిష్టము గలవారును, ఉక్కుతో చేయబడిన పెద్ద శూలములను, కఱ్ఱలను ఇనుప గుదియలను ధరించినవారును, పంది మొగములు గలవారును, లేడి మొగములు గలవారును, పులి మొగములు గలవారును, ఎనుబోతు మొగముల వారును, మేకమొగము

వారును, నక్క మొగముల వారును, ఏనుగు పాదముల వారును, ఒంటెకాళ్లవారును, గాడిద చెవుల వారును, గుఱ్ఱపు చెవుల వారును, ఆవు చెవులవారును, పెద్దముక్కులవారును, అడ్డముక్కు గలవారును, ముక్కు తెగినవారును, ఏనుగు ముక్కుగలవారును, పైకి ముక్కుగలవారును, గోవు పాదములవారును, పాదములందు జుట్టుగలవారును, పెద్దతల, మెడ గలవారును, పెద్ద కుచములు పొట్ట కలవారును, పెద్ద ముఖము కన్నులు గలవారును, గుఱ్ఱపు మొగమువారును, ఒంటి మొగము వారును, గాడిద మొగమువారును, అయిన భయంకరాకారులగు రాక్షసులచ్చట దిరుగు చుండిరి. వారు సదా మద్యమును ద్రావుచు మాంసములను దినుచు, మాంసమును రక్తమును ఒడలికి పూసికొనుచు చూచుటతోడనే భయముతో గగుర్పాటు గలిగించుచుండిరి.

**హనుమంతుడు సీతాదేవిని జూచి సంతోషించుట :**

సీతను జూచితినను సంతోషమున నున్న హనుమంతుడా చెట్టు క్రింద ఎన్నరాని సౌందర్యము గలదియు, రాజపుత్రికయునగు జానకిని చూచెను. ఆమె కాంతి తగ్గినదై శోకముచే పీడింపబడినదై పుణ్యము క్షీణింపగా తమ చోటును విడచి నేల వ్రాలిన నక్షత్రమువలె నుండెను. పతివ్రతా ధర్మముచే కీర్తి సంపన్నురాలును పతిని గానక తల్లడిల్లుచున్నదియు, భూషణ రహితురాలును, భర్త యెక్క స్నేహమే భూషణముగా భావించినదియు, రావణునిచే చెరపట్టబడినదియు, బంధువులకు దూరమైనదియు తన గుంపునెడ బాసి సింహముచే నడ్డగింపబడి బంధింపబడిన ఆడయేనుగువలె నున్నదియు, శరత్కాల మేఘముచే కప్పబడిన చంద్రలేఖ వలె నున్నదియు, తీగలు తెగిన వీణవలెను, అంగరాగములు పూయని మేనివలెను, సౌందర్యము తగ్గియున్నదియునగు సీతాదేవిని హనుమంతుడు చూచెను. తన భర్తకు మాత్రమే వశమందుండి నదియు, రాక్షసులకు వశము కానిదియు, అశోకవనము నడుమ శోక సముద్రమున

మునిగినదియు, దుష్ట గ్రహములచే చుట్టబడిన రోహిణీ నక్షత్రము వలె రాక్షస స్త్రీలచే చుట్టుముట్టబడినదియు, అలంకారములు లేక పూలులేని తీగవలె నున్నదియు నయిన సీతను హనుమంతుడు చూచెను. సహజ సుందరములగు నవయవములు కలిగియున్నను మలినమైయున్న దేహముచే నామె బురద యంటుకొనిన తామర తీగవలె నొకింత ప్రకాశము కలిగియు కలుగకయు నుండెను. మాసి నలిగియున్న చీరను దాల్చినదియు, లేడివంటి కన్నులు గలదియు, దీనమగు ముఖము గలదియు, తన భర్త పరాక్రమమును దలంచి ధైర్యము వహించినదియు, తన శీలమే తనకు రక్షణముగా గలదియు, నల్లని నేత్రములు గలదియు, అగు నా సీతాదేవిని హనుమంతుడు చూచెను. ఆడలేడివలె బెదరుచూపులు చూచుచున్నదియు, చిగురించిన చెట్లను తన వేడి నిట్టూర్పులచే వాడిపోజేయుచున్నదియు, ఆకృతి గొన్న దుఃఖ సమూహమువలె నున్నదియు, సహన శీలము గలదియు, చక్కని అవయవముల సొంపు గలదియు, ఆభరణములు లేకయే ప్రకాశించు చున్నదియునగు సీతాదేవిని చూచి హనుమంతుడు మిక్కిలి సంతోషించెను. మత్తు గొనియున్న కన్నులుగల సీతను చూచిన హనుమంతుడానంద పరవశుడై కన్నుల నీరు రాల్చెను. వెంటనే రామునకు లక్ష్మణునకు నమస్కరించెను. పరాక్రమవంతుడగు హనుమంతుడట్లు సీతను జూచిన సంతోషముతో రామలక్ష్మణులకు నమస్కరించి శింశుపా వృక్షపుటాకుల నడుమ దాగియుండెను.



# పదునెనిమిదవ సర్గము

## రావణుడశోకవనమునకు వచ్చుట :

హనుమంతుడట్లు పుష్పించిన వృక్షములు గల ఆ వనమును వెదకుచుండగా రాత్రి చివరిజాము మాత్రము మిగిలెను. అంతట షడంగములతో గూడిన వేదముల నధ్యయనము చేసినవారును, యజ్ఞకర్మముల నెఱిగిన వారును అగు బ్రహ్మ రాక్షసులు వేగు జామున మేల్కొని ఏవిధమైన మాంద్యము లేక శుచులై చదువుచుండెడి వేద ధ్వనులును, మంగళ వాద్య ఘోషములును వినిపించెను. చెవుల పండుగ చేయు ఆ మంగళ ధ్వనులను వినుచు రాక్షస రాజైన రావణుడు మేలుకొని వస్త్ర మాల్యాదుల తొలగుచుండగా లేచుచు, అనురాగ పరవశుడై సుందరియగు సీతను స్మరించెను. మదము కలవాడైన ఆ రావణుడు మదన పరవశుడై సీతయందే మనస్సు నిల్పినవాడై కామము యొక్క వేగము నదుపు నందుంచజాలకపోయెను. సర్వాభరణములను ధరించి సాటిలేని కాంతితో ప్రకాశించుచు మణులతోను బంగారముతోను నిర్మింపబడిన ఉద్యాన వీధులను జూచుచు శ్రేష్ఠములైన పుష్పములు ఫలములు గలిగిన వివిధ వృక్షములు గలదియు, వివిధ పుష్పములతోడి కొలనులతో గూడినదియు, చిత్రమైన వర్ణములతో చూచువారల కాశ్చర్యము కలుగజేయునదియు, వివిధ మృగములతో చూడముచ్చటయైనదియు, నేలరాలిన పండ్లతో గూడిన వృక్షములు గలదియు నయిన యశోక వనమును రావణుడు ప్రవేశించెను. దేవేంద్రుని, దేవకాంతలు గంధర్వకాంతల వలె, వెళ్లుచున్న రావణు ననుసరించి నూఱుగురు రాక్షస కాంతలు వెళ్లిరి. అందు కొంతమంది స్త్రీలు బంగారు దీప స్తంభములను పట్టుకొనగా మఱి కొందఱు చామరములను, వేఱొక కొందఱు విసనకర్రలను

ధరించిరి. కొందఱు బంగారు పాత్రలతో జలములు నింపుకొని ముందు నడచిరి. కొందఱు కత్తులను మణిమయాసనములను తీసికొని వెనుక నడచిరి. చాతుర్యము గల యొకతె మద్యముతో నింపబడి మణిపాత్రికను తన కుడిచేత ధరించి నడచెను. పూర్ణచంద్రుని బోలు కాంతిగలదై రాజహంస వలెనున్న గొడుగును చేతబట్టి ఒక స్త్రీ వెనుక నడచెను. బంగారు దండము నొకతె పట్టుకొని వచ్చుచుండెను. నిద్రమత్తు వీడని కనులతో రావణుడును అతని యుత్తమ కాంతలును మేఘము మెరుపు తీగలవలె నుద్యానవనమున బ్రవేశించిరి. నిద్రచే తమ చోటు వీడిన హారములును బాహుపురులును గలవారును, ఏలిన కొప్పులు గలవారును, తొలగిన అంగరాగములు గల వారును, మద్యము త్రావిన మత్తు వీడనివారును, పూర్తిగా నిద్రలేక కలత జెందినవారును, అందమైన ముఖములు గలవారును, చెమటకు తడిసి వాడిపోయిన పూలమాలలు గలవారును, మంచి పూలమాలలతో గూడి చెదరిన జుట్టు గలవారలును, అగు అతని ప్రియకాంతలు అతని పైనున్న ఆదరము చేతను మదన పారవశ్యము చేతను ఆ రావణు ననుసరించిరి. ఆ కాంతలకు భర్తయు, దుర్మతియు, గొప్ప బలవంతుడునగు రావణుడు కామపరవశుడై సీతయందాసక్తి గల మనస్సు గలవాడై మత్తుతో తేలు అడుగులు వేయుచు వచ్చెను. హనుమంతుడా శ్రేష్ఠ వనితలు నడుచుచుండగా వారి మొలనూలి చిఱు గజ్జెల యొక్కయు, నూపురముల యొక్కయు ధ్వనిని తొలుత వినెను. తరువాత సాటిలేని గొప్ప కార్యములను సాధించువాడును, ఊహింపనలవి కాని బలము గలవాడును, పౌరుషవంతుడును, విశ్రవసుని పుత్రుడును అగు రావణుని అశోకవన ద్వారము కడకేతెంచిన వానిని జూచెను. పరిమళవంతమగు నూనెచే వెలిగింపబడిన దీపముల కాంతిచే అంతటను ప్రకాశించుచున్నవాడును, మదన బాధ, గర్వము, మద్యపానములచే గలిగిన వికారములు గలవాడును, వంకరలై యెఱ్ఱనైన విశాల నేత్రములు గలవాడును, తన విల్లైన చెఱుకు గడను

విడచి యరుదెంచుచున్న మన్మథుని వలె నున్నవాడును, మజ్జిగ వలెను, గుమ్మపాల నురుగు వలెను తెల్లనై నిర్మలమైన నుత్తరీయముపై నుండి జారి చేతుల కడ్డుపడుచుండగా దానిని విలాసముగా పైకి లాగుకొనుచున్నవాడును అగు రావణుని హనుమంతుడు చూచెను. దట్టమగు పూలచే ఆకులచే గప్పబడి చెట్టుకొమ్మల మాటున నుండి హనుమంతుడు దూరము నుండియే తన తేజస్సుచే దగ్గరకు వచ్చినట్లున్న రావణుని జూడసాగెను. సౌందర్యము యౌవనము గల సుందరాంగనలచే పరివేష్టితుడై మహా కీర్తిశాలియగు రావణుడు, మృగపక్షి సంకులమై అంతఃపురకాంతల విహారమున కుచితమైయున్న అశోకవనమున ప్రవేశించెను. వాయుపుత్రుడు మహాభుజుడగు నీతడే రావణుడని నిశ్చయించి అతని సకల చేష్టలను స్పష్టముగా చూడదలచి తానెక్కియున్న కొమ్మపైనుండి క్రింది కొమ్మకు దిగెను. హనుమంతుడు భయంకర తేజము గలవాడయ్యును, రావణుని తేజమును జూచి కంపితుడై ఆకులతో నిండుగానున్నచోట కనిపించ కుండునట్లు దాగెను. రావణుడును నల్లని కురులు గలదియు, చక్కని పిరుదులు గలదియు, బలిసినవై నడుమ నెడములేని స్తనములు గలదియు, నల్లని కనుగొనలు గలదియు నగు సీతను చూడగోరి యామెచెంత కేతెంచెను.



# పందొమ్మిదవ సర్గము

**అం**త రాజపుత్రియు, ద్రోహము లేనిదియు, సుశ్రోణియునగు సీత, చక్కని రూపము, మవనము గలవాడును, మంచి యాభరణములు ధరించినవాడును రాక్షసుల రాజును అగు రావణుని చూడగనే పెద్దగాలికి కదలిపోవు అరటిచెట్టువలె వణకిపోయెను. విశాలములగు కన్నులు కలిగిన యా యుత్తమ వనిత భయముచే తన తొడలచే పొట్టను చేతులతో స్తనములను కప్పుకొని ఏడ్చుచు గూర్చుండెను. అంత దశకంఠుడు రాకాసి మూకలు కావలి కాయుటచే మిక్కిలి ఆర్తిజెందినదియు, జలములలో పగిలిన నావ బోలినదియు, వట్టినేలపై కూర్చున్నదియు, పూలు రాల్చి వేసిన కొమ్మవలెనున్నదియు, నియమములు గలదియు, మాలిన్యము శరీరమున నిండియున్నను ఆశ్చర్యకరమగు శరీర కాంతి గలదియు, భూషణములు ధరింపనిదియు, అలంకరించుకొననిదియు, అట్లగుటచే బురదతో గూడిన తామర తీగవలె ప్రకాశించియు ప్రకాశింపకయు నున్నదియు, రాజశ్రేష్ఠుడు ఆత్మవంతుడునగు రాముని కడకు సంకల్పాశ్వములు పూన్చబడిన మనోరథముచే పోవుచున్నట్లున్నదియు, రామునెడబాయుట చేత వాడిపోయి విలపించుచు ఆయనకై విచారించుచు అతనినే ఎల్లప్పుడు స్మరించుచు దుఃఖమున కంతమును జూడజాలకున్నదియు, మణిచేతనో మంత్రముచేతనో కట్టువడిన ఆడసర్పము వలె చుట్టుకొని ఉన్నదియు, ధూమకేతువుచే నావరింప బడిన రోహిణీ నక్షత్రమువలె నున్నదియు, నగు సీతను రావణుడు గాంచెను. ఆమె దృఢమైన స్వభావము సదాచారము యాజ్ఞాది ధర్మ క్రియలు గల సద్వంశమున బుట్టినదయ్యును, వివాహ సంస్కారమును బొందిన దయ్యును, (కుమారునకుపనయనమెట్లో కూతులకునట్లే వివాహము రెండవ జన్మము)

దుర్వంశమున బుట్టిన దానివలె నుండెను, అసత్యమగు నపవాదముచే చెడిపోయిన కీర్తివలె నుండెను మఱియు మరుగుపడిన విద్యవలెను, అవమానింప బడిన శ్రద్ధవలెను, అల్పమగు పూజా ద్రవ్యములతో కూడిన పూజవలెను, ప్రయోజనము లేని ఆశవలెను, తరిగిపోయిన సంపదవలెను, ఆచరింపబడని ఆజ్ఞవలెను, వాడిపోయిన పద్మమువలెను, కాలిపోయిన దిక్కువలెను, అపహరింపబడిన పూజాద్రవ్యములు గల పూజవలెను, శూరులు నశించిన సేనవలెను, చీకట్లచే నావరింపబడిన వెలుగువలెను, వేసవి యందు కృశించిన యేటివలె నుండెను. మఱియు నాసీత రాహువు మ్రింగగా బాధనొందు చంద్రుడు గల రాత్రివలెను, చల్లారిన అగ్నివలెను, అపవిత్రము చేయబడిన యజ్ఞవేదివలెను, ఏనుగు ప్రవేశించి పద్మలతలను పీకివేసి పక్షులు చెదరగొట్టి గలత నొందింపగా బురదతో కలుషితమై యున్న సరోవరము వలెను ఉండెను. మగని తలచి యేడ్చుటచే కట్టలు తెగిన ప్రవాహము వలెను, ఉచితమైన శరీర సంస్కారములు లేక కృశించి కృష్ణపక్షచంద్రుని వలె నుండెను. సుకుమారమైన శరీరము గలదియు, సుందరమైన రూపము గలదియు, మణిమయ సౌధములలో నుండదగినదియు అయిన సీత అప్పుడే యెండకు వేయబడిన తామర తూడువలె వాడిపోయి యుండెను. తనవారి గుంపునుండి వేరుచేయబడి నాథునకు దూరమై రాటకు బంధింపబడి నిట్టూర్చుచున్న ఆడయేనుగువలె నుండెను. సంస్కార రహితమైన యొంటి జడను దాల్చి నగలేమియు ధరింపకపోవుటచేత శరత్కాలమందు నల్లని నీడలతో నొప్పు భూమివలె నుండెను. భయముచేతను దుఃఖముచేతను, ఉపవాసములచేతను రాముని ధ్యానించుచుండుట చేతను, అంతకంతకు కృశించి పోవుచు దీనురాలై కళావిహీనమై యుండెను. “ఓ దేవతలారా! నా భర్తకు తేజస్సును గలుగుజేసి ఆ దశకంఠుని బరాభవింపజేయు” దని చేతులు జోడించి భక్తితో మనస్సున వేడుకొనుచుండెను. అట్టి సీతాదేవిని, ప్రక్కల చూచుచు నేడ్చుచున్న దాని, పవిత్రురాలిని పాపాత్ముడగు దశకంఠుడు మంచిమాటలచే వంచించుటకు సమీపించెను.

# ఇరువదవ సర్గము

**ఆ** విధముగ సమీపించి రాక్షసవీరుడగు రావణుడ సీతాదేవితో తన మనస్సునందలి భావము స్పష్టమగునట్లు మధురమైన మాటలతో నిట్లనెను. "ఓ పద్మము వంటి కన్నులు గలదానా! నన్ను జూచి స్తనములను ఉదరమును మాటుకొననేల? ఏమిటికిట్లు వణకుచున్నావు? ఓ కరభోరూ! ఇచ్చట పరులెవ్వరు? నా ప్రియురాలా! నా మాటలను పాటిగా గ్రహింపుము. నన్ను గౌరవింపుము. ఓ జగదేక మోహినీ! మేటి సౌందర్యరాశివి నీవే కాదా! మనుష్యులు గాని మనుష్యులు గాని కామరూపము దాల్చు రాక్షసులు గాని వేరెవ్వరు నిచ్చట లేదు. ఏల భయపడెదవు? నాకు నీవు వెరవవలదు. ఓ పద్మముల వంటి కనులు గలదానా! ఓ చంద్రవదనా! పరస్త్రీలతో, రమించుట బలవంతముగా వారిని తీసికొని వచ్చుట నిస్సంశయముగా రాక్షసులకు కులధర్మము. కాన నేను చేసిన పని యధర్మమని తలంపబోకుము. అట్లయ్యును సీతా! నాపై వలపు చూపని నిన్ను ముట్టబోను. దానిచే నా శరీరము మన్మథ బాధ చెందినను చెందనిమ్ము. ఓ దేవీ! నీవిచ్చట భయపడవలసిన పనిలేదు. ఓ ప్రియురాలా! నా మాట నమ్ముము. యథార్థముగా నిన్ను ప్రేమించుచున్నాను. నీవును దయతో నన్ను ప్రేమింపుము. అంతేకాని యిట్లు శోకముతో నిండినదానవు కాకుము. ఒంటిజడయు, నేలపై శయనించుటయు పరధ్యానముగా నుండుటయు, మాసిన వస్త్రము ధరించుటయు, సుఖములకుచితమైన యీ ప్రదేశమున ఉపవాసములుండుటయు, నీకు తగునా? నన్ను జేరి అనేక విధములైన పూలమాలలను, చందనాది

సుగంధపు మైపూతలను, వివిధ వస్త్రమలును, దివ్యమైన ఆభరణములను, గొప్ప విలువగలిగిన పానీయములను, శయ్యలను, ఆసనములను, నృత్య గీతవాద్యములను, సకల భోగములను అనుభవింపుము. నీవు స్త్రీలలో శ్రేష్ఠమైన దానవు. నీవిటులుండ దగదు. నీ శరీరము నందలంకారములను ధరింపుము. నన్ను చేరియు నీవీ భోగముల నేల పొందజాలకున్నావు? సీతా! అందమైన నీ యౌవనము వృథా గడచి పోవుచున్నది. ప్రవహించిన నీటివలె గడచిపోయిన యౌవనము తిరిగి రాదు. విశ్వమును సృజించిన బ్రహ్మ నిన్ను సృష్టించి తరువాత సుందర స్త్రీలను సృష్టించుట మానివేసి యుండును. అందులకే నిన్ను బోలు సుందరి మరియొకతె నేడు కానరాకున్నది. కనుక ఇంత సుందరివగు నిన్ను బడసిన పురుషుడెవ్వడైనను ఓ పద్మముఖీ! నిన్ను వీడి పోవునా? ఓ చంద్రవదనా! నా దృష్టి నీ శరీరమందు ఎచ్చటెచ్చట ప్రసరించునో ఆ చోటుల నుండి మరలకున్నది. ఓ సీతా! నీ సౌందర్యమింతయని లెక్కించుటకు నాకు శక్య మగునా? ఈ మోహమును వీడుము. నీవు నా భార్యవు కమ్ము. నేనాయా ప్రదేశములనుండి బాహుబలముతో తీసికొని వచ్చిన శ్రేష్ఠమైన స్త్రీల కందఱకును పట్టపురాణి వగుము. నా పరాక్రమముతో నాయా లోకములనుండి సంపాదించిన సకలమైన రత్నములు, నా యీ లంకారాజ్యము, నేనును నీవారమే గదా. ఓ విలాసములుగల సీతా! అనేక నగరములుగల ఈ భూమినంతయును నీ కొఱకై జయించి నీ తండ్రియైన జనకున కిచ్చెదను. నా యెదుట బడి యుద్ధమున నిలబడగలవాడు గాని నాకు సాటియైన పరాక్రమము గలవాడుగాని యుండునా? అనేక పర్యాయములు దేవతలు రాక్షసులు నాతో యుద్ధమునకు దిగి విరిగి నిలువజాలకపోయిరి. స్వేచ్ఛగా ఇప్పుడు నీవు నీ శరీరము నలంకరించుకొమ్ము. ప్రకాశమానములైన భూషణములను నీ శరీరమున

ధరింపుము. అలంకరింపబడిన అందమైన నీ శరీరమును చూచెదను. చక్కగా నలంకరించుకొని మద్యము త్రావుచు నాతో క్రీడింపుము. భోగముల ననుభవింపుము. నీవు స్వేచ్ఛగా భూమిని గాని ధనమును గాని దానము చేయుము. నా యందు నమ్మకముతో నన్ను ప్రేమింపుము. నన్ను నీవనుగ్రహించి సుఖములను పొందుచుండగా నీవలన నీ బంధుజనులు ధనాదులచే ఆనందించెదరు గాక! ఓ మంగళకరమైన రూపము గలదానా! సంపదను సౌఖ్యమును కీర్తిని తలంచి చూడుము. సుందరీ! నార వస్త్రములు ధరించిన రామునితో నేమి చేయుదువు? రాముడు జయమునొందనివాడై, సంపద హరింపబడినవాడై, వనసంచారియై, చినిగిన వస్త్రములు ధరించి, నియమములు బూని, కటిక నేలపై నిదురించుచు జీవించియున్నాడో లేదో గూడ సందేహమే కదా! సీతా! ముందు కొంగలు పోవుచుండ వెనుక పెద్ద మేఘములచే మరుగుపడిన వెన్నెల వలె రాముడు నిన్ను చూడజాలడు. ఇంద్రుని చేజిక్కిన కీర్తిని హిరణ్యకశిపుడు పొందజాలని విధముగా దర్భల మీద శయనించు రాముడు నాచేతికి చిక్కిన నిన్ను పొందజాలడు. సుందరమైన చిరునగవు, అందములైన దంతములును, సుందర నేత్రములును గలదానా! ఓ విలాసినీ! గరుత్మంతుడు సర్పమును హరించునట్లు నీవు నా మనస్సును హరించినావు. నలిగిన వస్త్రము దాల్చి కృశించి, అలకంరించుకొనకున్నను, నిన్ను జూచిన పిమ్మట నా భార్యలందు ప్రీతి నందకున్నాను. దేవతవైన నిన్ను జూచిన పిమ్మట నా భార్యలందు ప్రీతినందకున్నాను. దేవతవైన నిన్నుజూచి నా ధనము పైనను, భార్యల పైనను ప్రీతినందుట విడచితిని. (ఇష్టదేవతవగు నీ దర్శన మాత్రముననే ఆనందపూర్ణుడనై నేనన్ని భోగభాగ్యముల నుండి విముఖుడనైతిని) ఓ జానకీ! సకలమైన సద్గుణములతో విలసిల్లు నా అంతఃపురకాంతలపై యాధిపత్యమును

వహింపుము. ఓ నల్లని కురుల కొనలు గలదానా! ముల్లోకములలోను నుత్తములగు నా యంతఃపురకాంతలు లక్ష్మీదేవి నప్సరసలు సేవించునట్లు నీకు సపర్యలు చేయుదురు. ఓ సుందరములైన కనుబొమ్మలు గలదానా! కుబేరుని కడనే రత్నములు, ధనరాసులు నున్నవో వానిని, లోకముల నుండి తెచ్చిన విలువ గలిగిన భోగ్య వస్తువులను, నన్నును సుఖముగా ననుభవింపుము. ఓ దేవీ! తపముచేగాని, బలముచేగాని, ధనముచేగాని, తేజస్సుచేగాని, కీర్తిచేగాని, రాముడు నాకు సాటికాడు. ఓ అబలా! నీవు నాతోగూడి పానము చేయుము, విహరింపుము, క్రీడింపుము, భోగముల ననుభవింపుము. నీకు ధనరాసుల నిచ్చెదను. ఈ భూమినంతయును నీకొసంగెదను. నీవు నాయందనురాగమును గలిగి యుండుము. నిన్ను గలిసి నీ బంధువులును సంతోషించెదరు గాక! ఓ పిరికిదానా! ఎడతెగక పూయుచున్న పుష్ప సమూహములు గలవియు, తుమ్మెదలతో గూడినవియునగు సముద్ర తీర వనములలో మేలిమి బంగారు హారములను ధరించినదానవై నాతోగూడి విహరింపుము".



# ఇరువది యొకటవ సర్గము

## సీతాదేవి రావణునకు బుద్ధి చెప్పుట :

భయంకరుడగు ఆ రావణుని మాటలు విని దుఃఖము నొంది దీనయై సీతాదేవి దీన స్వరముతో మెల్లగా నిట్లనెను. ఆమె భయముచే వణకుచు వినువారికి దయకలిగించునట్లుగా తనపతినే హృదయమున ధ్యానించుచున్నదై తనకు రావణునకు నడుమ నొక గడ్డిపోచను వైచి (పర పురుషుని ముఖము చూచుచు ముఖాముఖి మాటలాడ రాదను మర్యాదను పాటించుచు) ఇట్లు సమాధానమును చెప్పెను. 'రావణా! నీ మనస్సును నానుండి మరల్చి నీ భార్యలయందు ప్రవర్తింపజేయుము. పాపము చేసినవాడు మోక్షమునెట్లు కోరదగడో నీవును నన్నట్లే కోరదగవు. శ్రేష్ఠమైన వంశమున బుట్టి ఉత్తమమగు నిక్ష్వాకు వంశమున ప్రవేశించిన పతివ్రతనగు నేను నింద్యమైన నీ కోరిక నాదరింపదగదు.' కీర్తిమతి యగు సీత రావణునితో నిట్లు పల్కి ఆతనికి వెనుదిరిగి అతని ననాదరము చేయుచు మరల నిట్లనెను. "నేను పరభార్యనగుటచే నీకు భార్యనగుట తగదు. నీవు సజ్జనుల ధర్మమును పరిశీలింపుము. సజ్జనుల యాచారమునే యనుసరింపుము. ఓ రాక్షసుడా! పనిబూని నిష్కారణముగా పాపము నెందుకొడిగట్టుకొనవలెను? నీకు నీ భార్యలెట్లు కాపాడతగినవారో అట్లే పరభార్యలును వారి శీలమును రక్షింపదగినవారేయని నిన్నే ఉపమానముగా చేసికొని నీ భార్యలతోనే రమింపుము. తన భార్యలతోనే సంతృప్తినందక చపల చిత్తుడై చంచలములగు నింద్రియములకు వశుడై శరుడై పరభార్యలను గోరువాని ప్రజ్ఞ, ఆయుస్సును, ఐశ్వర్యమును, సంతతిని పరాంగనలు నశింపజేయుట సత్యము. నీకు బుద్ధిచెప్పు పెద్దలెవ్వరును లేరా? ఈ పట్టణమందే లేకుందురా?

ఉన్నను వారిని సమీపింపవా ధర్మమార్గము తెలియుటకు? నీ దురాచారములు, సత్కార్యములను దూరముగా నుండుటలు నిన్ను సజ్జనులకు దూరస్థునిగా తెల్పుచున్నవి. ఓరీ! లేకున్నచో నన్నిట్లు విపరీతపు మాటలందువా? కావున జ్ఞానులగు వారికి నమస్కరించి ప్రశ్నించి జ్ఞానమును తెలిసికొనుము. తత్త్వము తెలిసిన ఆ జ్ఞానులు నీకు జ్ఞానము నుపదేశింతురు. ఐనను వారికి వందనము చేయక వారు నీకుపదేశింపరు. నీ వెన్నడు నట్టివారికి నమస్కరించి యుండవు. అది యెట్లు తెలిసినదందువా? నీ బుద్ధి వైపరీత్యమే తెల్పుచున్నది. లేక నీవసత్యమగు స్నేహమును రాక్షసులయెడ ప్రదర్శించుచు, సజ్జనులు హితమును బోధింపగా సకల రాక్షస వినాశమును గోరినవాడవై వారి హిత వాక్యములను నీవంగీకరింప కుందువేమో? మంచి యుపదేశమును గ్రహింపనివాడును, నీతిమాలిన కర్మములం దాసక్తుడగువాడును అయిన రాజు పాలనలో సుసంపన్నమగు రాష్ట్రములును, నగరములును వినాశమును బొందును. అట్లే రత్న సమూహములతో గూడిన ఈ లంకానగరము నీ యొక్కని దోషము వలన కొద్ది కాలములోనే నశింపనున్నది. తాను చేసిన పాపకార్యములచేతనే చంపబడనున్నవాడును, దూరదృష్టి లేనివాడును, పాపాచారము గలవాడును నశించినచో జీవులన్నియు ఆనందించును. ఇట్లు నీచే వంచింపబడిన వారెల్లరును నిన్ను పాపకార్యములు చేసినవానినిగా చెప్పుదురు. ఈ భయంకరుడైన రావణుడు మన భాగ్యవశముచే నిట్టి వినాశమును పొందెనని వారు సంతోషింతురు. నీ యైశ్వర్యముచే గాని ధనముచేగాని నన్ను లోభపెట్ట జాలవు. నేను సూర్యునినుండి వేఱుకాని ఛాయవలె రాముని నుండి వేఱుకాని దానను. లోకములకు నాథుడగు రాముని దక్షిణ బాహువును ప్రధానముగా జేసికొని (ఆయనచే కౌగిలింపబడి) ప్రశంసింపబడిన నేను వేఱొకని అపవిత్ర బాహువు నెట్లా ధారము చేసికొనగలను? సాంగముగ వేదాధ్యయనము చేసినవాడును, ధీమంతుడును, సజ్జన సాంగత్యముగలవాడును, జ్ఞానియునగు

వాని కాత్మ విద్యవలె శీలసంపన్నుడును, భూపతియునగు ఆ రామునికే నేను తగిన భార్యను. రావణా! నేను నీ శరీరమును కాలితోనైన తాకుదునా? నీకీ భ్రాంతి యేలరా? రామ విరహముచే నేను దుఃఖితనై యున్నాను. అడవిలో తప్పిపోయి తిరుగుచున్న ఆడయేనుగు గజరాజును గూర్చినట్లే రాముని గొనివచ్చి నాతో గూర్పుము. నీవింకను కొన్నినాళ్లు లంకాపురము నేలగోరుదువేని బంధుమిత్ర సుతాది సహితముగ నీ చిత్రవధను ఇచ్ఛగింపవేని రామునితో మైత్రి నొందు టుచితము. రాముడు ధర్మమెఱిగినవాడని శరణాగత వత్సలుడని జగత్తునకు తెలిసినదే. పర దోషములను మరచిపోవుటాయన స్వభావము, కాన నీపై కోపింపడు. ఈ విప్పటికైనను నీ మదిలోని దోషమును విడచి పెట్టి నన్నాయనకు సమర్పింపుము. రావణా! నీవట్లు రఘు రామునకు సమర్పింతువేని నీకు శుభము కలుగును. వేరొక విధముగా ప్రవర్తింతువేని నీకు వినాశము తప్పదు. ఇంద్రుడు విడచిన వజ్రాయుధమైనను నిన్ను విడచునేమో కాని, యముని చూపైనను కొంతకాలము నిన్ను విడువవచ్చునేమో కాని, లోకనాథుడగు రాముడే కోపించినచో నీవంటి వారిని ముహూర్త మాత్రమున చీల్చివేయగలడు. దేవేంద్రుడు విడచిన వజ్రాయుధపు మ్రోతవలె పెద్ద ధ్వనిగల రాముని శరముల మ్రోతను తొందరలో వినెదవురా! ఇకనైన వివేకము గనరా! ఘోరమైన విషాగ్ని జ్వాలలను గుప్పున క్రక్కుచు కోఱలను కనబరచుచు అత్యధికముగా సర్పములు మీదకు వచ్చునట్లు రామలక్ష్మణ నామాకింతములైన బాణములు మిక్కిలి వాడియై భయంకరములైనవి క్రూరముగా పయి పయికి రాగా నీలంకయంతయు దుఃఖాక్రాంత మగును. రామలక్ష్మణులచే విడువబడిన బాణ సమూహములు లంకయంతయును వ్యాపించి దానవుల నందఱిని పీనుగుల పెంట చేయగా ఇంటింట రోదన ధ్వనులు చెలిగి ఆకాశమునంటును. గరుత్మంతుడెట్లు తన ముక్కుతో పాములను చంపునో యట్లే మహాత్ముడు రామచంద్రుడును, రాక్షసులను తన బాణములతో నశింపజేయగలడు. నా

చేతినుండి రాముడు నిన్ను పొందజాలడంటివి గదా. శత్రువుల నణచి వేయగల నా భర్తయైన రాముడు బలిచక్రవర్తి వశమైన ఇంద్రరాజ్యమును త్రివిక్రమాకృతితో క్షణములో వశము చేసికొనుటన్లు నీనుండి తప్పించగలడు. ఓరీ రాక్షసుడా! జనస్థానమున రాక్షస సైన్యమంతయును రామునిచే నశింపగా ఏమియును జేయజాలక ధైర్యవిహీనుడవై పర్ణశాల యందొంటరిగ నున్న నన్ను దొంగిలి తీసికొని వచ్చితివి. రాజశ్రేష్ఠులగు రామలక్ష్మణులు లేకుండుట వలన నీకిది సాధ్యమైనది. ఇది దొంగతనమందురా? శౌర్యమందురా? దుష్టుడా! పరాక్రమ హీనుడా! పులులను చూచిన నక్క వాని యెదుట యెట్లు నిలువజాలదో అట్లే రామలక్ష్మణుల ముందు యుద్ధమున నీవు నిలువజాలవు. నీ శక్తి యెఱుగక మహాత్ములతో వైరము తెచ్చికొంటివి. నీవు దుర్బలుడవు, వారితో పోరుట నీకు శక్యమా? రెండు చేతులతో ఇంద్రుడు పోరాడుచుండ ఒంటిచేత వృత్రాసురుడెంత విజృంభించినను జయము పొందనట్లు యుద్ధములో వారిరువురతో తలపడు నీకపజయము తప్పదు. శీఘ్రమే నా నాథుడగు రామచంద్రుడు లక్ష్మణునితో గూడి సూర్యుడు తన కిరణములతో స్వల్ప జలములను హరించినట్లు బాణము లతో నీ ప్రాణములను హరింపగలడు. నీకు చెడు కాలము దాపురించినది గాన రాముని బారినుండి తప్పించుకొనుటకు పారిపోయి కైలాస పర్వతమున కేగినను వరుణుని పాలనతోనున్న పాతాళ లోకములో తలదాచుకొన్నను కాలవశమున గొప్ప వృక్షము పిడుగుపాటును తప్పించుకొనలేనట్లు నీవు తప్పించుకొనజాలవు. ఇది నిశ్చయము."



# ఇరువది రెండవ సర్గము

**అ**ని పరుషములగు మాటలను సీత వచింపగా రావణుడు సుందరాంగి యగు నామె మాటలనాలకించి తిరిగి యిట్లనెను. "ఎంతెంత బ్రతిమాలునో పురుషుడు, స్త్రీలకంతంత వశ్యుడగును. ఎంతెంత ప్రీతి కలుగునట్లు మాట్లాడునో పురుషుడంతగా స్త్రీలచే నవమానింపబడును. దారితప్పి సంచరించు గుఱ్ఱములను సమర్థుడగు సారథివలె నీపై పెల్లుగానున్న కామము నీ మాటలవలన రేగిన నాకోపము నడ్డగించుచున్నది. కామము మనుజులకు ప్రతికూలమైనది. ఎవరి యందాకామము నిలుచునో వారు దండ్యులయినను వారియందు దయ ప్రేమ కలుగును. ఆ కారణముననే నీవు చంపదగిన దానవైనను అవమానింపదగిన దానవైనను తగని విధముగ ఆ కపట తాపసి యగు రామునందే ప్రేమ కలిగిన దానవైనను నిన్ను చంపుట కాఙ్క్షింపలే కున్నాను. సీతా! నీవు నన్నాడిన ఆ యా కఠినోక్తులకు ఫలముగ నిన్ను క్రూరముగా వధించుట యుక్తము" అని పల్కి రాక్షసరాజగు రావణుడు కోపము ప్రణయ తాపము కలవాడై మరల నిట్లనెను. "ఓ సీతా! నేను నీకిచ్చిన పండ్రెండు నెలల గడువులో ఇంక రెండు నెలలే మిగిలియున్నది. కావున నీవు నాతో శయ్యపై పరుండుము. ఈ రెండు నెలలు గడచులోపుగా నన్ను నీవు భర్తగా నంగీకరింపకున్నచో నిన్ను నా ప్రాతఃకాలపు భోజనమునకై వంటగదిలో చంపి వండుట కారంభించెదరు సుమా!" అని పలికి సీతనట్లు రావణుడు భయ పెట్టుచుండగా దేవకన్యలును, గంధర్వ కన్యలును కన్నుల నుండి నీరు గార్చుచు విషాదము చెందిరి. దుఃఖముచే కలతచెందిన సీతను పెదవుల కదలికచే కొందఱు, ముఖ వికారములచే కొందఱు కనుసన్నలచే కొందఱు దేవకాంత లోదార్చిరి.

**సీతాదేవి రావణుని పరుషములు పలుకుట :**

అట్లా కాంతల సంజ్ఞలచే సీత కొంత ధైర్యము పొందినదై తన పాతివ్రత్యమును దలంచి గర్వపడినదై తన హితమును గోరి రావణునితో ఏ మాత్రము దిగులు చెందక యిట్లు పలికెను. "ఓరీ! దుష్టమతీ! ఇచ్చట నీమేలు గోరువా రొక్కరును లేరు. ఉన్నచో నీవిట్లు నిందింపదగిన పనిని చేయుచున్నను వారింపకుందురా? వారిట్ల అధర్మమును వారింపకున్నచో నిది నీయొక్కనితో పోవునది కాదు. ఇంద్రునకు శచీదేవివలె నేను రామునకు భార్యను. ఇట్టి నన్ను మూడు లోకములందును నీవు తప్ప మఱెవ్వరును మనస్సునందైనను కోరరు. ఓ తుచ్ఛ రాక్షసుడా! గొప్ప పరాక్రమము గల్గిన రాముని భార్యనగు నన్ను ఏయే మాటలాడితివో నీవెందుబోయినను వాని ఫలము ననుభవింపక తప్పించుకొనజాలవు. నీవు నా నాథునితో తలపడ జూచుట అడవిలో మదపుటేనుగుతో నీచమైన చెవులపిల్లి యుద్ధము చేయగోరుట వంటిది. నీ మాయలతో రాముని దూరముగా తీసికొనిపోయి నన్ను దొంగతనముగా తీసికొని వచ్చి నీ మనస్సునందు కొంచెమైనను సిగ్గుపడకున్నావు. ఇది అభిమానవంతుని లక్షణమా? నీవాయన కంటబడవైతివి. కనబడి యుండినచో యుద్ధము నందాయన బలమును, పరాక్రమమును చూచియుండెడివాడవు. ఓ రాక్షసుడా! నన్ను పాపదృష్టితో చూచుచు క్రూరములై నడుమ నల్లగా నుండి గోరోజన వర్ణము గలిగి వికృతములైయున్న నీ కన్నులు పగిలి నేల వ్రాలవేల? ఓ పాపాత్ముడా! రాముని భార్యను, దశరథుని కోడలినను యశస్సుగల నన్ను ఈ విధముగా బల్కిన నీ నాలుక చీలికలు కాకున్నదేమి? ఓ దశముఖుడా! నీకాపద తల పెట్టిన వారిని శపించుమని రాముని యాజ్ఞ లేకుండుట చేతను నా పాతివ్రత్యమను తపస్సునకు భంగము వాటిల్లుననియు నూరకుంటిని. లేకున్న నిన్ను భస్మము చేసియుందును. ధీరుడగు రాముని భార్యనగు నేనిట్లు దొంగలింపబడవలసినదానను గాను. దైవము నీ చావు కొఱకే నీకిట్టి బుద్ధి

పుట్టించెను. ఇందుకు సంశయము లేదు. నీవు శూరుడ వయ్యును యక్షరాజగు కుబేరున కనుజుడవయ్యును, సైన్య సమేతుడవయ్యును, మాయా మృగ వ్యాజమున రాముని దూరముగా బంపి, ఆయన భార్యనైన నన్ను అపహరించితివి. ఇది నీకు తగియున్నదా?" యని..

## సీతాదేవిపై నాగ్రహముతో రావణుడు పల్కుట :

సీత యాడిన కఠినమైన మాటలను విని రావణుడు క్రూరముగా కన్నులను త్రిప్పుచు చూచెను. నల్లని మేఘమువలె నున్నవాడును, పెద్ద భుజములు మెడగలవాడును, సింహబలుడును, సింహగమనుడును, ప్రకాశించు నాలుక కొన, లోచనములు గలవాడును, ప్రకాశించు కిరీటము దాల్చి యున్నతుడై కనిపించువాడును, చిత్రవర్ణములు గల మాలలు చందనము దాల్చినవాడును, ఎఱ్ఱని మాలలు వస్త్రములు ధరించినవాడును, మేలిమి బంగారు భుజకీర్తులు తక్కిన ఆభరణములు గలవాడును, అమృత సంపాదనమునకై వాసుకిచే చుట్టబడిన మందర పర్వతము వలె బంగారు కటిసూత్రముచే చక్కగా చుట్టబడినవాడును, బలమైన భుజములు గలవాడై రెండు శిఖరములతోనున్న మందర పర్వతమువలెనున్నవాడునునై ఆ రావణుడు ఉదయ సూర్యునివలె మెరయుచున్న కుండలములను ధరించి, ఎఱ్ఱనైన చిగురుటాకులు పుష్పములు గలిగిన అశోక వృక్షములతో ప్రకాశించు పర్వతమువలె నొప్పెను. చందనము పూసికొన్న దేహముగలవాడును, అందమైన భూషణములు దాల్చినవాడునునై ఆకృతి దాల్చిన వసంతునివలె నున్నను, స్మశాన మండపము వలె మహా భయంకరుడై యుండెను. కోపముతో నెఱ్ఱనైన కన్నులతో సీతను చూచుచు పామువలె బుసలు కొట్టుచు ఆ రావణుడిట్లు పల్కెను. 'ఓ గుణహీనురాలా! నన్ను గాదని నీతిరహితుడు నిర్ధనుడు నయిన రాముని బాగని యాశ్రయింతువా? సూర్యుడు సంధ్యను వలె నా తేజస్సుతో నిన్నిప్పుడే నాశనము చేయుదును. నా కోపమును నీ వెఱుంగవు" అని చెప్పుచు రావణు డచ్చటనున్న రాక్షస స్త్రీలలో ఒంటికంటిది, ఒంటి చెవిది, చేట చెవులది, ఆవు చెవులది, ఏనుగు చెవులది,

వేలాడు చెవులు గలది, చెవులు లేనిది, ఏనుగు కాళ్లు గలది, గుఱ్ఱపు కాళ్లది, గోపాదములు గలది, పాదములందు వెంట్రుకలు గలది, ఒంటి కాలిది, పెద్ద కాళ్లు గలది, కాళ్లు లేనిది, పెద్దతల గలది, పెద్ద కుచములు గలది, పెద్ద మొగము కన్నులు గలది, పెద్ద నాలుక గలది, నాలుకే లేనిది, ముక్కు లేనిది, సింహము ముఖము వంటి ముఖము గలది, గోముఖము వంటి ముఖము గలది, పంది ముఖము వంటి ముఖము గలది మున్నగు భయంకర రూపములు గల రాక్షసాంగనల కిట్లా జ్ఞాపించెను. "మీరందఱును గలిసి ఈమెకు అనుకూలముగనో ప్రతికూలముగనో బోధించి సామ దాన భేదోపాయములచే లేదా తుదకు దండోపాయముచే నైనను ఈ సీత నాకు శీఘ్రమే వశమగునట్లు చేయుడు". అని చెప్పుచు ఆ రాక్షసరాజగు రావణుడు మరల మరల సీతను చూచుచు బెదరించుచు గర్జించుచు నుండగా ఆ రాక్షసరాజునకడ్డము వచ్చి ధాన్యమాలిని యను రాక్షసి యతనిని కౌగిలించుకొని యిట్లనెను.

**ధాన్యమాలిని రావణున కడ్డము వచ్చుట :**

ఓ మహారాజా! నాతో క్రీడింపుము. రాక్షసేశ్వరా! మనుష్య రూప లక్షణములు గల ఈ సీత దీనురాలు, ఈమెతో నేమి? మహారాజా! నీవు దిక్కులను గెలిచి తెచ్చిన ఆశ్చర్యకరమగు సంపదలనెల్ల అనుభవించెడి వ్రాత బ్రహ్మదేవుడీమె నొసట వ్రాయలేదు. ఇది నిజము. తనను ప్రేమించని స్త్రీని పొందువాని దేహము, తాపమునే పొందును. తనను ప్రేమించిన వనితను కామించువానికి మిక్కిలి ప్రీతి చేకూరును. అని ధాన్యమాలిని పలుకగా బలిష్ఠుడును మేఘము వలె నల్లనైనవాడునునగు ఆ రాక్షసుడు నవ్వుచు అటనుండి మరలి వెడలెను. అట్లు బయలుదేరిన రావణుడు భూమి యదరు నట్లడుగులు వేయుచు సువర్ణ కాంతులతో నొప్పు తన భవనమును ప్రవేశించెను. ఈ విధముగా ధర్మ నిష్ఠ గలదియు, భయముచే వణకుచున్నది యునగు సీతను భయ పెట్టి, యామెను విడచి, కామముచే పీడింపబడుచున్నవాడై, రావణుడు రాక్షస కన్యలు తన వెంట రాగా తన భవనమునకు వెడలెను.

# ఇరువది మూడవ సర్గము

**ఆ** విధముగా రావణుడు కాపలా కాయుచున్న రాక్షస స్త్రీలకాజ్ఞనిచ్చి అంతఃపురమునకు వెడలిపోవగనే భయంకరాకారము గల యా రాక్షసాంగనలు సీత చెంతకు వెడలి తీవ్రమగు కోపముతో మిక్కిలి కఠినములైన మాటలతో నిట్లు పల్కిరి. 'సీతా! రావణుడు పులస్త్య బ్రహ్మ వంశమువాడు. నీవాతని భార్యవగుట నేల గౌరవముగా తలంపవు?' – వారిలో నేకజట యను రాక్షసి యిట్లనెను. ఓ సీతా! మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అనునాసురు బ్రహ్మ మానసపుత్రులైన ప్రజాపతులు. అందు నాల్గవవాడగు పులస్త్యుని మనస్సంకల్పముచే పుట్టిన తేజశ్శాలి, మహర్షి విశ్రవస్సు. అతని కుమారుడే యుద్ధమున శత్రవులను దుఃఖ పెట్టు ఈ రావణుడు. రాక్షస రాజగు రావణునకు నీవు భార్యవు కాదగుదువు. రావణుడు తానే బతిమాలుచుండగా నీకీ బిగువు తగునా? ప్రేమ చూపు కొలది నిక్కి పడుచున్నావు. ఓ విలాసవతీ! నా మాట నమ్మవా?' తరువాత పిల్లికన్నుల వంటి కన్నులు గలదియగు హరిజటయను రాక్షసి కోపముతో కన్నులు త్రిప్పుచు నిట్లనెను. "ముప్పది మూడు కోట్ల దేవతలను, దేవేంద్రుని గూడ జయించిన రాక్షస రాజగు రావణునకు నీవు భార్యవు కాదగుదువు' అనెను. అప్పుడు ప్రఘస యను రాక్షసి మిక్కిలి కోపించి సీతను బెదరించుచు భయంకరముగా నిట్లు బల్కెను. 'బలగర్వితుడు, శూరుడు, యుద్ధమున వెన్ను జూపనివాడు, శక్తిమంతుడు, పరాక్రమవంతుడునైన రావణునకేల నీవు భార్యవు కాకున్నావు?' రావణుని భార్యలందరిలోను ప్రియమైనది, మిక్కిలి గౌరవము గలది యగు మండోదరిని వీడి, తన భార్యలలో కెల్ల గొప్ప భాగ్యవతిగా జేసి రావణుడు

నిన్ను చేరగలడు. వేలకొలది స్త్రీలతో శోభిల్లుచున్నది, వివిధ రత్నములతో నిండి యున్నది యగు నంతఃపురమును వీడి రావణుడు నిన్ను చేరగలడు'. అంతట వికటయను రాక్షసి యిట్లనెను. "యుద్ధమునందనేక పర్యాయములు దేవతలను, ఉరగులను, గంధర్వులను జయించినట్టి రావణుడు నీ చెంతకు వచ్చినాడు. ఓ అధమురాలా! రావణుడు రాక్షసరాజు. సర్వ సంపన్నుడు. నీవేల ఆయనకు భార్యవు కాగోరకున్నావు?' అపుడు దుర్ముఖి యను రాక్షసి యిట్లనెను. 'విశాల నయనములు గల ఓ సీతా! ఎవని వలన భయముతో సూర్యుడు ఎంత తీవ్రముగా కాయడో, వాయువు వేగముగా వీచడో, అట్టి రావణుని పతిగా వరింపుము. ఓ సుందరమైన కనుబొమ్మలు గలదానా! ఎవని వలన భయముతో వృక్షములాతనిపై పూలవాన కురిపించునో, మబ్బులు కావలసినపుడు వర్షములు గురియునో అట్టి రాజాధిరాజగు రావణునకు నీవు భార్యవు కావలెనని యేల తలంపవు? నా మాట వినుము. శుభము నొందుము. సౌఖ్యము ననుభవింపుము. మా రావణుని భార్య వగుట కింత సంశయమేల?'



# ఇరువది నాలుగవ సర్గము

**మ**఼ఱియు వికృతా కారములు గల ఆ రాక్షస స్త్రీలందఱును సీతను సమీపించి క్రూరమైన గద్దింపులతో ఆమెనిట్లు బెదరించిరి. “ఓ సీతా! యెల్ల జీవులకు మనోహరమైనది గొప్ప విలువైన శయనములతో గూడినది యగు రావణుని యంతఃపురము నివాసమునకేల నీ విష్టపడవు? నీవు మనుష్య స్త్రీవి గనుక మనుష్యుడగు రామునకు భార్యవగుటయే గొప్పగా భావించుచున్నావు. ఇంకనెక్కడి రాముడే? ఏల అతని మీద మనసు పెట్టుకొని కష్టపడుచున్నావు? ఓ సీతా! నీవింక ఆ రాముని జూచుట యనునది కల్లయే, కాన రాక్షసాధిపతి యగు రావణుని భర్తగా ప్రీతితో స్వీకరింపుము. మనుష్య స్త్రీవగుటచే రాజ్యహీనుడు దీనుడు దుర్బలుడు అయిన ఆ రామునే భర్తగా ప్రియునిగా దలంచుచున్నావు. నీ మనస్సును రాముని నుండి మరల్చుకొనకున్నచో నీవు బ్రదుకవు. మూడు లోకముల సంపదల ననుభవించువాడు రాక్షసరాజునగు రావణుని నీవు భర్తగా పొంది సుఖముల ననుభవించుచు క్రీడింపుము” అని చెప్పుచున్న రాక్షస స్త్రీల మాటలను విని పద్మముల వంటి కనులు గల ఆ సీత కన్నుల నీరు నిండి కారుచుండగా కొనగోట మీటుచు నిట్లనెను.

**సీత రాక్షస స్త్రీలకు తన మనో నిశ్చయమును చెప్పుట :**

“ఓ రాక్షస కాంతలారా? వినుడు. మీరందఱు కలిసి జనులు నిందించు నిట్టి మాటలను పలుకుచున్నారే? మీ మాటల వలన పాపములు కలుగునని తోచుట లేదా? మనుష్య స్త్రీ రాక్షసునకు భార్యయగుట తగదు. మీకిష్టమైనచో మీరందఱును గలిసి, నన్ను తినివేసినను సరే. మీ మాటలననుసరింపను.

దీనుడైనను, రాజ్యములేనివాడైనను, నాకు నా భర్తయే గొప్పవాడు. సువర్చల సూర్యుని విడువనట్లుగా నేనాయనను నిత్యమును ప్రేమింతును. శచీదేవి దేవేంద్రుని వలెను, వశిష్ఠుని నరుంధతి వలెను, చంద్రుని రోహిణివలెను, అగస్త్యుని లోపాముద్ర వలెను, చ్యవనుని సుకన్యవలెను, నలుని దమయంతి వలెను, సగరుని కేశిని వలెను, ఇక్ష్వాకు కులశ్రేష్ఠుడగు రామచంద్రునే నేనును అనుసరించి యున్నదానను" అని జానకి ఈ విధముగా పలికిన మాటలను విని మిక్కిలి కోపించిన రాక్షస కాంతలు రావణుని యాదేశమును ననుసరించి కఠినమైన మాటలతో దీనురాలగు ఆ సీత నింకను బాధ పెట్టసాగిరి. అట్లు శింశుపా వృక్షము పై దాగియున్న హనుమంతుడు రాక్షసాంగనలట్లు సీతను బెదరించుట చూచియు నేమియు మాటలాడక వినసాగెను.

**రాక్షస స్త్రీలు సీతాదేవిని కలఅకులాడుట :**

మిక్కిలి కోపము గలవారైన యా రాక్షస స్త్రీలు సీతను చుట్టుముట్టి ఆమె భయపడిన చిత్తముతో వణకుచుండ వ్రేలాడుచున్న తమ పెదవులను గదలించుచు వేగముగా గొడ్డండ్లను త్రిప్పుచు తమ కోపమును బ్రకటించుచు నిట్లనిరి. "నీవేల యంగీకరింపవే రావణుని? ఏల ప్రతిఘటింతువే?" యని పల్కుచుండగా వారి బెదరింపు మాటలను విని అందమైన ముఖము గల సీత కన్నులనుండి కన్నీరు వాన కురియుచుండ కన్నీరు తుడుచుకొనుచు హనుమంతు డెక్కియున్న శింశు పా వృక్షము చెంతకే పోయెను. అప్పుడు భయంకరములైన నేత్రములు వ్రేలాడు పొట్ట బుఱ్ఱముక్కు గలిగి వికట రూపము గలిగిన వినతయను నొక్క రాక్షసి చిఱ్ఱు బుఱ్ఱులాడుచు వచ్చి యిట్లనెను. "సీతా! నీవింతవఱకు నీ భర్తపై స్నేహమును జూపించితివి. ఇక చాలును. ఓ శుభాంగీ! యెచ్చటనైనను మితిమీరి యేది చేసినను కీడు కలుగునని వినలేదా? అది కష్టములకే కారణము. నీ పతిభక్తికి మెచ్చితిని. మనుష్య స్త్రీకి తగిన పాతివ్రత్యమును నీవింతవఱకు కనబరచితివి. సీతా! ఇంక నేను చెప్పు హితవును గూడ నొక్కింత వినుము.

రావణుని నీ భర్తగా సేవింపుము. దేవతలకింద్రుని వలె ఆయన సర్వ రాక్షసులకు ప్రభువు. పరాక్రమశాలి. రూపవంతుడు. ప్రీతి పాత్రుడు. మనుష్యుడు, దీనుడునగు రాముని విడచి నీవింక రావణు నాశ్రయింపుము. దివ్యములైన చందనము మొదలయినవి పూసికొని దివ్యాభరణముల నలంకరించుకొని అగ్నికి స్వాహాదేవివలెను, ఇంద్రునకు శచీదేవివలెను నేటి నుండి రావణునకు భార్యవై సకలలోకములకు నధీశ్వరివి కమ్ము. ఓ సీతా! రాముడు దీనుడై యున్నాడు. అతని కాయువు తీరిపోయినది. అతనితో నీకెందుకు? నేను చెప్పినట్లు చేయవేని నిన్నిప్పుడే భక్షించెదము" అనుచుండ, అప్పుడు వ్రేలాడుచున్న స్తనములుగల వికటయను రాక్షసి పిడికిలి బిగించి యెత్తి గర్జించుచు నిట్లనియె. "ఓ దుష్ట బుద్ధిగల సీతా! నీవు మాకు హితవుగాని మాటలనెన్నో మాటాడినను, నీపై దయచేతను, మా మంచి స్వభావముచేతను, సహించితిమి. సమయమునకు తగినట్లు మేము చెప్పు మంచి మాటలను నీవు వినకున్నావు. ఓ సీతా! ఎవ్వరు చేరరాని సముద్రపు ఈవలి ఒడ్డునకు తేబడినావు. రావణుని భయంకరమగు అంతఃపురమున గూడ ప్రవేశించినావు. మాచే కావలికాయబడుచున్నావు. నిన్ను సాక్షాత్తు దేవేంద్రుడు వచ్చినను రక్షింపజాలడు. హితమైన మా మాటల నాచరింపుము. కన్నీరు కార్చకుము. ఫలితములేని ఈ విచారమును వీడుము. నీవు స్నేహమును ఆనందమును పొందుము. ఎల్లప్పుడును దైన్యము నొందుట విడువుము. సీతా! నీవు రాక్షసరాజగు రావణునితో క్రీడింపుము. ఈ జగత్తునందు స్త్రీలకు యౌవనము శాశ్వతమా? ఆ యౌవనము గడచిపోవు లోపలనే సుఖింపుము. ఓ మత్తు కనులదానా! నీవు రాక్షసరాజైన రావణునితో గూడి సుందరమైన వనములలో పర్వత సమీపమునందున్న ఉద్యానవనములలో విహరింపుము. ఓ సుందరీ! ఏడు వేలమంది రాక్షస స్త్రీలు నీ యధీనమున నుందురు. కావున సకల రాక్షసరాజగు రావణుని భర్తగా స్వీకరింపుము. సీతా! నేను చెప్పిన దానిని నీవు చేయకుంటివేని నీ గుండెలను పీకి తినివేసెదను"

అని చెప్పగా చండోదరి యను రాక్షసి తీవ్రమైన కోపముతో శూలమును త్రిప్పుచు నిట్లనెను. ‘లేడికన్నుల వలె చంచలములగు కన్నులు గలదియు, రావణునిచే దొంగలించి తేబడినదియు అయిన ఈమెను చూడగనే నాకు తినివేయవలెనని మిక్కిలి కోరిక కలుగుచున్నది. కడుపునకు కుడివైపున నుండు కాలఖండమను మాంస పిండమును గుల్మమును ఎడమవైపున నుండు మాంసపిండమును, దాని పైనుండు మాంసమును, పద్మకోశమువలె నుండు గుండె రూపమగు మాంసమును దానిని నిలిపియుంచు అడుగు మాంసమును ప్రేగులను తలను తినవలెనని నా కోరిక’ అనెను. అంత ప్రఘసయను రాక్షసి యిట్లు పల్కెను. “ఇంకను ఉపేక్షించుటేల? ఈ క్రూరురాలి మెడ నొక్కి వేయుదము. తరువాత ఆ మనుష్య స్త్రీ మరణించెనని రాజునకు చెప్పుదము. దానిని మీరే తినివేయుడని ఆయన చెప్పును. ఇందు సందేహమేమియు లేదు” అనెను. అప్పుడజాముఖి యను రాక్షసి యిట్లనెను.” ఈమెను చంపి యందఱకును సమానముగా మాంస ఖండములుగా జేయుడు. నాకు తగవనిన నిష్టముండదు. శీఘ్రమే మద్యము మున్నగు ద్రవములను సువాసన ద్రవ్యములను తేనె మొదలైన అనేక విధముల లేహ్య పదార్థములను తీసికొని రండు” అనెను. అంత శూర్పణఖ యను రాక్షస స్త్రీ యిట్లనెను. “అజాముఖి చెప్పినదే నాకును నచ్చిన మాట. సర్వ శోకమును పోగొట్టు మద్యమును వేగముగా తెండు. మనుష్య మాంసము తిని లంకానగరి పడమటి ద్వార ప్రదేశమున నుండు భద్రకాళి ప్రీతికై నృత్యము చేయుదము” దేవకన్యవలె సుందరాంగియగు ఆ సీత యిట్లా భయంకర రాక్షసాంగనలచే బెదరింపబడుచున్నదై ధైర్యము కోల్పోయి ‘హా రామా!’ యని యేడ్వ దొడంగెను.



# ఇరువది యైదవ సర్గము

## రాక్షస స్త్రీల మాటలకు భయపడి సీత యేడ్చుట :

అట్లు కఠినాత్మలగు రాక్షస వనితలు పరుషముగాను భీకరముగాను అనేకమైన పలుకులను పలుకుచుండగా సీత యేడ్వసాగెను. తన పాతివ్రత్యముచే మనోధైర్యము గలదై గద్గద స్వరముతో నిట్లనెను. "నేను మనుష్య స్త్రీని. రాక్షసునకు భార్యయగుట మనుష్య స్త్రీకి తగిన పనికాదు. కాన కావలసినచో మీరందరు నన్ను తినివేయుడు. అంతేగాని మీ మాటల ప్రకారము నేను చేయను" దేవతా స్త్రీని బోలిన ఆ సీత రాక్షస స్త్రీల నడుమ చిక్కి రావణునిచే భయ పెట్టబడినదై దుఃఖముచే పీడింపబడుచు సుఖము లేనిదయ్యెను. అడవిలో తమ జాతి గుంపునెడబాసి తోడేళ్లచే పీడింపబడుచున్న ఆడలేడివలె సీత తన శరీరమును ముడుచుకొని భయముచే వణక దొడగెను. ఆమె బాగుగా వికసించిన పువ్వులు గల చెట్టుకొమ్మ నొకదానిని పట్టుకొని యున్నదై కలగిన మనస్సుగలదై దుఃఖించుచు తన భర్తనే తలంచుచుండెను. ఆమె తన పెద్దవగు స్తనములను కన్నీటితో తడుపుచు రామునే ధ్యానించుచు అంతులేని దుఃఖము గలదయ్యెను. పెద్దగాలికి అరటి చెట్టువలె ఆమె వణకుచు రాక్షస స్త్రీలను జూచి భయపడుచు వివర్ణమైన ముఖముగలదై యుండెను. అట్లు వణుకుచున్న సీత యొక్క పొడవైె వెడల్పు గలిగియున్న జడ కదలుచు పారిపోవుచున్న పామువలె కనిపించు చుండెను. సీత నిట్టూర్చుచు రాక్షస స్త్రీల మాటల వలన కలిగిన దుఃఖముచే బాధనొందుచున్నదై, రామ విరహముచే నొచ్చిన మనస్సుగలదై కన్నీరు గార్చుచు "హా! రామా! లక్ష్మణా! హా అత్తయగు కౌసల్యా! సుమిత్రా!"యనుచు నేడ్చెను.

“స్త్రీలకు గాని, పురుషులకు గాని యకాల మృత్యువు సంభవించుట కష్టమని పండితులు పలుకు మాట యథార్థము. ఏలయనగా నేనింతటి క్రూరాత్ములగు రాక్షస స్త్రీలచే పీడింపబడుచు రామునెడ బాసియుండజాలని దాననయ్యును జీవింపగలుగుచున్నాను. నాకకాల మృత్యువు కలుగుట లేదు. దీనురాలనై ‘కొంచెము పున్నెము’ చేసికొన్న నేను సముద్ర మధ్యమున పెనుగాలిచే గొట్టబడిన సరకులతో నిండియున్న యోడవలె ఆధారములేని దాననై నశింతును. నా భర్తయగు రఘురాముడు కనిపించ ఈ రాక్షస స్త్రీలకు చిక్కుపడి నీటియొరవడిచే కోసి వేయబడిన నదీ తీరమువలె నశింతును. వికసించిన పద్మముల వంటి కనులు గలవాడు, సింహమువలె నడచువాడు, కృతజ్ఞుడు, ప్రియమును పలుకువాడు నయిన నా నాథుని ధన్యులగువారు చూచెదరు గాక. తీవ్రమైన విషము పానము చేసిన వానివలె (ఆత్మవంతుడు) అభిమానవంతుడైన రామునెడబాసియున్న నేను జీవించుట కష్టము. పూర్వజన్మమున నేనెంతయో ఘోరమైన పాపమును చేసియుందును. దానివలననే నేనీ భయంకర దుఃఖమును పొందుచున్నాను. ఈ మహాభయంకర దుఃఖము ననుభవించుచున్న నేను మరణమును కోరుకొనుచున్నాను. ఈ రాక్షస స్త్రీలచే కాపాడ బడుచున్న నేను రాముని చేరజాలకున్నాను. నేను కోరినప్పుడు నాకు చావు వచ్చుట లేదు. ఇట్లు పరుల అధీనమున నున్నదాననై జీవించుటేల? ఛీ, ఈ మనుష్య జన్మమేల? ఇష్టము వచ్చినపుడు మరణింపరాకున్నది” అని సీత బహువిధముల విలపించెను.



# ఇరువది యాఱవ సర్గము

## సీతాదేవి శ్రీరాముని దలంచుకొని దుఃఖించుట :

మరల ఆ జనకపుత్రిక కన్నుల నుండి కన్నీరు కారుచుండ వంచిన ముఖముగలదై భూమిపై దొరలాడు ఆడగుఱ్ఱమువలె కన్పట్టుచు పిచ్చియెత్తిన దానివలెను, మత్తు ఆవహించిన దానివలెను చిత్తము భ్రాంతి నొందినదయ్యెను, మరల ఆమె యిట్లు వాపోవదొడగెను. “రాముడేమరుపాటుగ నుండ కామరూపధారియగు రావణుడు విలపించుచున్న నన్ను బలాత్కారముగా ఇచ్చటకు గొనివచ్చెను. నేనిచ్చట నీ రాక్షస స్త్రీల చేతులలో చిక్కి దారుణముగా బెదరింపబడుచున్నదాననై నా భర్తనే తలంచుచు దుఃఖముచే పీడింపబడుచు జీవించుటకిష్టము గలుగుట లేదు. రాక్షస స్త్రీల నడుమ చిక్కిన నాకు ధనము చేతను, భూషణములచేతను, ఈ జీవితముచేతనునేమి ప్రయోజనము? నా హృదయము ఇనుమువలె చాల గట్టిదై యుండును. లేదా చావు ముదిమి లేనిదైనదై యుండును. లేకున్న నింత దుఃఖము నందుచున్నను, నా హృదయము బ్రద్ధలగుట లేదు. నేను పాపాత్మురాలను లేదా దుర్మార్గురాలను. నాపతియగు రాముని విడచి యొక్క నిమిషమైనను జీవించి యుండవలసినది కాదు. అట్టిచో నిట్లు విరహమును భరించుచు జీవితము గడుపుచున్న నేను నిందింపబడు దాననగుదును. సముద్ర పర్యంతము వ్యాపించిన యీ భూమికి ప్రభువును, మంచినే పలుకువాడును అగు నా ప్రాణభర్త లేకుండ నాకీ బ్రతుకుపై గాని, సుఖములపై గాని ఆశయెందులకు? ఓ రాక్షసులారా! నన్ను ముక్కలు ముక్కలుగా చీల్చి తినివేయుడు. ఏదో విధముగా నేనీ శరీరమును విడతును. నా ప్రియమైన భర్తను విడచి చాలకాలమీ దుఃఖము భరింపలేను. నేనా రాక్షసుని నెడమకాలి

గోటితోనైనను ముట్టుకొనను గదా! అట్టిచో నిందింపదగిన యా రావణుని కామింపనని వేరుగా చెప్పవలెనా? దుర్మార్గమైన స్వభావముతో ఈ రావణుడు నన్ను కోరుచున్నాడే కాని తనను తన వంశమును నేను నిరాకరించుచున్నానని యాతడెఱుగ లేకున్నాడు.

**సీతాదేవి రాక్షస స్త్రీలకు కఠినముగా బదులు చెప్పుట :**

నన్ను కండలు కండలుగా నరికినను, చీల్చినను, నిప్పునందు కాల్చినను, రావణుని మాత్రము సేవింపను. మీ అధికమైన మాటలేల ? రాముడు కైకేయి వంటి దోషము చేసినవారిని గూడ మంచిగా చూచువాడు, తనకెవరు చిన్నయుపకారము చేసినను సంతోషమును పొందుటే కాక దానిని మరువనివాడు. అట్టివారికి కష్టము కలిగినచో మిక్కిలి విచారించువాడు. ఇతరుల యభివృద్ధి నెల్లప్పుడు మనస్సున గోరువాడు. జనస్థానమునందు పదునాల్గు వేలమంది రాక్షసుల నొంటరిగా చంపినవాడు. అట్టి రాముడు నాపై జాలి చూపి కనిపించుట లేదనగా అది నా దురదృష్టము కాని వేఱు కాదని తలంతును. కొద్ది పరాక్రమమే కల రావణుడు నన్నిచట కదలకుండ నిర్బంధించినాడు. నా భర్తయైన రాముడు యుద్ధమున రావణుని చంప సమర్థుడు. రాక్షస వీరుడగు విరాధుడు దండకారణ్యమున నెవనిచే చంపబడెనో ఆ రాముడేల నన్ను కాపాడకున్నాడు? సముద్రము నడుమ నున్న యీ లంక శత్రువుల కభేద్యమైనచో కావచ్చును. కాని మహాత్ముడని బ్రసిద్ధి చెందిన రాముని బాణముల వేగము నాపజాలినదిచ్చట యేదియును లేదు. దృఢ పరాక్రముడగు రాముడు తనకు ప్రియమైనది రావణునిచే దొంగలింపబడినదియైన తన భార్యనేల కాపాడడు? నేనీ లంకలో నున్నట్లు లక్ష్మణాగ్రజుడైన రాముడెరుగడని తలంతును. తెలిసియున్నచో తేజస్వియగు రాముడీ తిరస్కారమును సహించునా? నన్నట్లు రావణునిచే దొంగలింపబడిన దానినిగా రామునకు చెప్పగలవాడు నా వృత్తాంతము నెఱింగినవాడునయిన జటాయువు రామునకీ వృత్తాంతమును

దెల్పకుండగనే యుద్ధమున రావణునిచేత మరణించినాడు. ముసలివాడయ్యును నన్ను రక్షించుటకు రావణునితో ద్వంద్వయుద్ధము చేసి గొప్ప కార్యమునే చేసినాడు. నా దురదృష్టము అతనికి మృత్యువయినది. నేనిచ్చటనున్నట్లు రాముడెరిగియున్నచో ఇప్పుడే కోపించి లోకమున రాక్షసులే లేకుండునట్లు చేసియుండెడివాడు. లంకా పట్టణమును నాశనము చేయును. సముద్రము నెండించును. నీచుడగు రావణుని ప్రాణములను కీర్తిని ప్రతిష్ఠను నాశనము చేసియుండును. తరువాత తమ భర్తలు మరణించిన రాక్షసాంగనలు ప్రతి యింటను నేనిప్పుడెట్లేడ్చుచుంటినో అట్లే అనేక విధముల గోలు గోలున పెద్దగా నేడ్చెదరు గాక! ఇందు సందియము లేదు. రాముడు లక్ష్మణ సహితుడై లంకనెల్ల వెదకి శత్రువులైన రాక్షసులనెల్ల నాశనమొనర్చి యుండును. రామలక్ష్మణుల కంటబడిన శత్రువులు ఒక్క నిమిషమైనను జీవించి యుండలేరు. మార్గములందంతటను రాక్షసులను కాల్చుటచే వారి కాష్ఠములనుండి పైకి లేచిన పొగ క్రమ్ముకొని గ్రద్దల సమూహములు తిరుగుచుండ ఈ లంక శీఘ్రకాలములో శ్మశానము వలెనే యుండును. కొలది కాలముననే నా కోరిక తీరగలదు. మీ దుర్మార్గమే మీకు రాకున్న కీడును తెలియజేయున్నది. ఈ లంకలో కనబడుచున్న యపశకునములు చూడగా చాల దగ్గరలోనే కాంతి లేనిదై యమపురమును బోలియుండగలదు. పాపాత్ముడగు రావణునిచే పాలింపబడునీలంక రాజు నశింపగా అప్పటివరకు శోభతోనున్న సంపదలన్నియు నశించి భర్త మరణించిన యువతి వలె సొంపులేనిదై వెలవెల పోవును. ఇది నిశ్చయము. ఈ లంకా పట్టణము రాక్షసులు, రాక్షస భర్తయగు రావణుడును మరణింపగా భర్త మరణించిన స్త్రీవలె పుణ్య లక్షణములు లేనిదగును గాక! ఈ లంకలో రాక్షస స్త్రీలు దుఃఖముచే పీడింపబడినవారై యేడ్చుచుండగా వారి రోదన ధ్వనులను 'కొడుకా! యని మగడా! యని విలపించుటను నేను త్వరలోనే వినగలను. ఎట్టిని కనుగొనలు గల శూరుడగు

రాముడు లంకలో రావణుని గృహములో నేనున్నట్లు తెలిసికొనెనేని కొలది కాలముననే రామబాణములీ లంకాపురమును కాల్చివేయును. ఈ పురము చచ్చిన రాక్షస వీరులు గలదై యెల్లెడలను చీకటులు గ్రమ్మగా ప్రకాశము లేనిదై పోవును. క్రూరుడు నధముడునగు రావణుడు నాకిచ్చిన గడువు కూడ సమీపించినది. పాపకార్యములు చేయు రాక్షసులు వారి స్వభావము ననుసరించి చెడు కార్యమేదియో కూడ తెలిసికొనలేకున్నారు. వారలకిప్పుడు కీడే కలుగబోవుచున్నది. మాంసము తిను నీ రాక్షసులు ధర్మమును తెలిసికొనజాలరు. రావణుడు తప్పక నన్ను ప్రాతఃకాల భోజనములో వ్యంజనముగా నుపయోగించును. వికసించిన పద్మములవంటి కనులు గల ప్రియము గలిగించు రాముని గానక దుఃఖించు నేనిపుడేమి చేయగలదానను? నాకిప్పుడిచ్చట నెవ్వరైన దయతో విషము నిచ్చువారున్నచో భర్తృ విరహముతోనున్న నేను వేగముగా యమలోకమునకే పోయెదను. లక్ష్మణాగ్రజుడైన రాముడు నేను జీవించియున్నానని యెరిగి యుండడు. తెలిసియున్నచో రామలక్ష్మణులు తప్పక నాకై వచ్చియుందురు. నిజముగా నన్నెడబాసిన శోకముచే వీరుడగు రాముడు తన శరీరమును భూమిపై విడచి స్వర్గమునకేగి యుండును. అట్లు స్వర్గమునకు వెళ్లగా పద్మములవంటి నేత్రములుగల నా భర్తయగు రాముని చూడగలిగిన దేవతలు గంధర్వులు సిద్ధులు మహర్షులు ధన్యులు గదా! ఆయన శ్రేష్ఠమైన స్వభావముగలవాడు. కోరికలు లేనివాడు. ధర్మ మార్గముననే నడచు నియమము గలవాడు. ధైర్యవంతుడు, రాజర్షి. అట్టి రామునకు నావంటి భార్యతోనేమి పనియున్నది. చూచుచుండుట చేతనే ప్రీతి నిలుచును. చూడ కున్నచో ప్రీతి యుండదు. చాలాకాలము నన్ను చూడకుండుటచే రామునకు నాపై ప్రేమ తొలగిపోయి యుండునా? అట్లు జరుగదే? పూర్వము కలిగిన ప్రీతిని కృతఘ్నులు మరచెదరుగాని వీరుడగు రాముడట్లు మరువడు. నాకిష్టుడగు రాముడు నాకు కనిపించకుండగా నేనిట్లు దుఃఖముచే నశించుచున్నానే. ఇందులకు కారణము

నేను చేసిన పాపమో లేక నా దురదృష్టమో తెలియకున్నది. మహాత్ముడు, ఉత్తమమైన నడవడి గలవాడు శత్రువులను నశింపజేయువాడునగు నా భర్త నెడబాసి జీవించుటకంటె మరణమే శ్రేయస్కరము. నరులలో శ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు మునివృత్తి నవలంబించి దుంపలు పండ్లు తినుచు వనములందు నివసించువారై ఆయుధములను విడచివేసినారేమో? లేక దురాత్ముడగు రావణునిచే మాయోపాయమున రామలక్ష్మణులు వధింపబడలేదు గదా? కాలమహత్యమిట్లుండగా అన్ని విధముల నేను మరణించుటకే యిష్టపడు చున్నాను. ఇంతటి దుఃఖము కలుగుచున్నను నాకు మృత్యువు రాకున్నది గదా! గొప్ప ధైర్యము గలవారును, పాపములు లేనివారును మహాభాగ్యము గలవారును అగు మునులు ధన్యులు. ఎందుచేతననగా వారికిది మాకు ప్రియము. ఇది యప్రియము అని సంసారులకు వలె ప్రియాప్రియములుండవు. అనుకూల వస్తువులచే సుఖము ప్రతికూల వస్తువులచే అధికమైన భయమును కలుగు చున్నవి. ఎవ్వరీ యిష్టానిష్టముల నుండి విడువబడగలరో అట్టి మహాత్ములకు నా నమస్కారము. అట్టి మహాత్ములకు వలె కాక ప్రియాప్రియములు గల నేను నా ప్రియుడగు రామునిచే విడవబడినదాననై పాపాత్ముడైన రావణునకు చిక్కి జీవింపజాలను. అందుచే ప్రాణములను విడచెదను" అని సీత దుఃఖించు చుండెను.



# ఇరువది యేడవ సర్గము

## త్రిజట తన స్వప్న వృత్తాంతమును రాక్షస స్త్రీలకు చెప్పుట :

అని యిట్లు సీత పలుకగా రాక్షసాంగనలు తీవ్రకోపమును పొందిరి. అందుకొందఱు రాక్షస స్త్రీలు సీత మరణించుటకు నిశ్చయించుకొనుటను బలవంతుడగు రావణునకు చెప్పగోరి వెళ్లిరి. పిమ్మట యేకాక్షి మొదలైన భయంకరాకారలగు రాక్షస స్త్రీలు 'దుర్మార్గురాలా! పాప నిశ్చయము గల ఓ సీతా! మేమందఱమును గలసి మా రాక్షసులకు సంతోషము గలుగునట్లు నీ మాంసమును భుజించెదము! అప్పుడట్లు రాక్షస స్త్రీలు సీతను భయ పెట్టుటను చూచి అప్పటివఱకు నిద్రపోవుచున్నదై మేల్కొనిన త్రిజటయను వృద్ధ రాక్షసి వారితో నిట్లు చెప్పెను. "ఓ దుర్మార్గులైన రాక్షస వనితలారా! జనకుని కుమార్తెయు, దశరథుని కోడలును, జనులందఱకు నాదరింపదగినదియునైన సీతను మీరలు తినవలదు. అట్లు మీకు తినవలెననియున్నచో ఆమెకు బదులుగా నన్ను తినివేయుడు. నేను నేడు భయము కలిగించునదియు శరీరమున గగుర్పాటు కలిగించునదియు నయిన యెక కలను గంటిని. ఆ కల రాక్షసులకు వినాశమును, ఈమె భర్తకు మంచిని గలుగజేయునదియై ముందు వచ్చు ఫలితమును కనిపింపజేయునదై యుండెను" అని త్రిజట చెప్పగా ఆ రాక్షస స్త్రీలు భయమునందినవారై "త్రిజటా! ఈ రాత్రి నీకు వచ్చిన కల యెట్టిదో చెప్పు"మని కోరగా త్రిజట తనకు తెల్లవారుజామున వచ్చిన కలయొక్క అర్థమునిట్లు చెప్పెను. "రాముడు లక్ష్మణ సమేతుడై తెల్లని మాలలు వస్త్రములు ధరించి ఏనుగు దంతములతో జేయబడినదియు, సుందరమైనదియు,

ఆకాశమున ప్రయాణము చేయునదియు, వేయి హంసలతో గట్టబడినదియునగు విమానమునెక్కి వచ్చుటను చూచితిని. రామ లక్ష్మణులా పల్లకి నుండి నాలుగు దంతములు గలది, కొండవలె నున్నదియగు తెల్లనైన పెద్ద యేనుగుపై నధిరోహించిరి. అంత నారామలక్ష్మణులు తెల్లని మాలలతో వస్త్రములతో ప్రకాశించుచు సీత చెంత నిలిచిరి. పిమ్మట తెల్లని పర్వత శిఖరమువలెనున్న ఆ యేనుగు మెడపై రాముడు సీతయు నధిష్ఠించిరి. పద్మముల వంటి కన్నులుగల ఆ సీత అంతట రాముని యంకము నుండి లేచి సూర్యచంద్రులను తన చేతులతో పట్టుకొనుచుండినట్లు నాకలలో జూచితిని. పిమ్మట ఆ రాజపుత్రులును సీతయు నెక్కిన ఆ యేనుగు లంకా నగరముపై నిల్చియుండుట చూచితిని. పరాక్రమశాలియు పురుషోత్తముడునగు రాముడు సోదరుడైన లక్ష్మణునితో భార్యయైన సీతతో గూడి అతి సుందరమైనదియు, సూర్యునివలె ప్రకాశించునదియునగు పుష్పక విమానమునెక్కి యుత్తర దిక్కుగా వెళ్లుటను చూచితిని. ఈ విధముగా సాక్షాత్తు విష్ణువుతో సమానుడగు పరాక్రమముగల రాముడు సీతా లక్షణులతో గలసి నాకు కనిపించినాడు. ఇది నిజము సుమండీ! స్వర్గమెట్లు పాపాత్ములకు సాధింపరానిదో అట్లే, గొప్ప తేజశ్శాలియగు రాముడు దేవతలకు గాని, యక్షులకు గాని, రాక్షసులకు గాని, ఇతరులకు గాని జయింప శక్యముగానివాడు సుమండీ! ఇట్లే రావణుడు శరీరమందంతటను నూనె పూసికొని ఎఱ్ఱని వస్త్రములను గట్టి గన్నేరు పూలమాలను ధరించి మద్యమును ద్రావి మత్తెక్కినవాడై నూనెను త్రావుచు నేలపై పడియుండుటను చూచితిని. ఆ రావణుడెఱ్ఱని పూలమాలలు చందనాదులు దాల్చి నూనె త్రావుచు విపరీతముగా నవ్వుచు, నాట్యము చేయుచు, మతి చలించినవాడై యింద్రియము లదుపు తప్పగా గంతులు వేయుచు గాడిదలు కట్టిన రథమెక్కి పోవుచుండుటను కలలో చూచితిని. రాక్షసరాజగు రావణుడు గాడిదలను జూచి భయపడి తలక్రిందులుగా

భూమిపై పడుటను చూచితిని. అట్లు నేలమీదపడిన యా రాక్షసుడు వెంటనే లేచి భయము చెందినవాడై మత్తుచే తెలివి తప్పుచున్నవాడై చెడుమాటలను పలుకుచు చెడిపోయిన వాసనగలదియు, సహింపరానిదియు, భయంకరమైనదియు చీకట్లతో నిండి నరకమువలె నున్నదియు అగు బురద గోతియందు పడుచుండుటను జూచితిని. ఎఱ్ఱని వస్త్రములు గట్టి కాళికయో యను నట్లున్న యొక ఆడది ఒడలంతయు బురద పూసికొనినట్టిది రావణుని మెడకు త్రాడుగట్టి దక్షిణ దిక్కునకు లాగికొని పోవుటను చూచితిని. కుంభకర్ణుడును ఈ విధముగనే యగుటను నేను స్వప్నమున జూచితిని. ఆ రావణుని పుత్రులందఱును శరీరములకు నూనె పూసికొనియుండుటను చూచితిని. రావణుడు పందిని, ఇంద్రజిత్తు మొసలిని, కుంభకర్ణుడొంటెను నెక్కి దక్షిణదిశగా వెళ్లుటను నేను కలలో చూచితిని. ఒక్క విభీషణుడు మాత్రము తెల్లనైన గొడుగు ధరించి తెల్లని పుష్పమాలలు, తెల్లని వస్త్రము, తెల్లని చందనము దాల్చి శంఖము భేరులు ధ్వనించుచుండ నృత్యగానములు సాగుచుండ పర్వతమువలె నెత్తైనదియు, మేఘములు గర్జించునట్లు ఘీంకరించుచున్నదియు, నాలుగు దంతములతో ప్రకాశించునదియునగు గొప్ప యేనుగును నలువురు మంత్రులతో గలిసి యధిరోహించి ఆకాశమున నిలుచుటను నేను కలలో జూచితిని. నేనచ్చట ఎఱ్ఱని మాలలు ధరించి యెఱ్ఱని వస్త్రములను గట్టి నూనెను త్రావుచున్న రాక్షసుల పెద్ద గుంపును జూచితిని. వారు చేయు గానము నాట్యము మొదలగువాని ధ్వనులను వింటిని. గుఱ్ఱములు, ఏనుగులు కలదై యందమైన యీ లంకానగరము గోపురములు రాజమార్గమునకు బైటనున్న ద్వారములు విరిగి సముద్రమున బడుటను కలలో జూచితిని. రావణునిచే రక్షింపబడుచున్న యీ లంక రాముని దూతయు బలశాలియునయిన యొక క్రోతిచేత తగులబెట్టబడుటను కలలో జూచితిని. అట్లు కాలిపోయి ఘోరముగానున్న

లంకలో రాక్షస స్త్రీలు ప్రవేశించి నూనెను త్రావి పెద్ద ధ్వనులతో అట్టహాసముగా నృత్యము చేయుచుండిరి. కుంభకర్ణుడు మొదలైన శ్రేష్ఠులగు రాక్షసులెల్లరును ఎఱ్ఱని వస్త్రములు దాల్చి నిలువయున్న పేడ మడుగులో బడుటను జూచితిని. కాన ఓ రాక్షస కాంతలారా! మీరు దూరముగా వెళ్లిపొండు. మిక్కిలి కోప స్వభావముగల ఆ రాముడందఱు రాక్షసులతో బాటుగా మిమ్ముగూడ సంహరింపగలడు. ఆయన కిష్టమైనదియు, ఆదరింపదగినదియు, ధర్మ ప్రకారముగా వనవాసమునకు వచ్చినదియునగు అతని భార్యయైన సీతాదేవిని మీరు బెదిరించినను, భయ పెట్టినను ఆ రాముడు సహించి యూరకుండడు (ఆమె ప్రీతికైనను వధింపగలడు) చాలు చాలును. మీరింక సీతాదేవిని కఠినమైన మాటలాడకుడు. మంచివై మృదువులైన మాటలనే చెప్పుచు మనము సీతను శరణు వేడుదము. ఇదియే నాకు తగిన పద్ధతి యని తోచుచున్నది. ఇట్లు దుఃఖమును బొందుచున్న సీతకు క్షేమమును గలిగించు నేకలను గాంచితినో దానివలన ఆమె సకల సుఖములను పొంది దుఃఖములను వీడి తన భర్తను పొందునని తోచుచున్నది. ఓ రాక్షస వనితలారా! ఇప్పటివఱకును మనమీ సీతను బెదరించితిమి. అదలించితిమి గదా! ఇప్పుడు మమ్ము కాపాడుమని కోరుదము. రాముని వలన రాక్షసులకు గొప్ప భయము కలుగనున్నది. జనకపుత్రియగు సీత మన నమస్కారముల చేతనే ప్రసన్నురాలగును. ఓ రాక్షస స్త్రీలారా! రాబోవు నీ యాపదల నుండి మనలను రక్షింపగలది యీమెయే. అంతేగాదు. విశాలములగు నేత్రములు గల యీమె అవయవములలో యించుకైనను వైకల్యముగాని దుఃఖము ప్రాప్తించు లక్షణములు గాని కనిపించుట లేదు. ఈమె శరీరమున కాంతి మాత్రమించుక మారినది. దానిచే దుఃఖమున బడెనని యనుకొంటిమి గాని నిజమునకీమె దుఃఖమునకు తగినది కాదు. దివ్య భోగముల ననుభవింపగలదు. తామర రేకువలె విశాలమైన యీమె యెడమ కన్నదరుచున్నది చూచితిరా? ఇందువలన ఈమె తనకు మిక్కిలి

యిష్టమైన వార్తను వినగలదని తోచుచున్నది. మనలను రక్షింపదగిన శక్తిగల యీ సీతాదేవి యెడమ భుజము కొంచె మదరుచు నాకస్మికముగ గపించుచున్నది. ఇదియంతయు నాలోచించి చూడగా రాముడు జయమును బొందుటయను నీ గొప్ప కార్యసిద్ధి సీతాదేవికి దగ్గరలో నున్నట్లు నాకు కనిపించుచున్నది. ఏనుగు తొండము వంటి యీమె యెడమ తొడయు గొంచె మదరుచున్నది. ఇది రాముడు వెంటనే యీమె యెదుట నిలుచునని తెలియజేయుచున్నది. కొమ్మలపై నివసించు నీ గౌరవర్ణపు పక్షి మిక్కిలి సంతోషముతో మాటిమాటికి మధురముగా కూయుచు సీతకిష్టులగు బంధువులు వత్తురని స్వాగతము పలుకుచు రాముడు వచ్చునను వార్తను చెప్పుచున్నది వలె నున్నది సుమండీ!"



# ఇరువది యెనిమిదవ సర్గము

## సీతాదేవి శ్రీరాముడు రామికి అనేక విధముల దుఃఖించుట :

అంత సీత క్రూరుడైన రావణుని యాజ్ఞచే రాక్షస స్త్రీలు తన్ను పలికిన చెడు మాటలను విని దుఃఖించినదై అడవిలో సింహమునకు జిక్కు పడిన ఆడయేనుగు వలె భయకంపిత శరీరురాలయ్యెను. భీరువైన యా సీత బెదరించుచున్న రాక్షసస్త్రీల నడుమ జిక్కి రావణునిచే ఎక్కువగా భయ పెట్టబడినదై అడవిలో రక్షకులు లేని బాలికవలె విలపించెను. “అయ్యో! నేనిట్లు రాక్షసులచే భయ పెట్టబడియు, పుణ్యములు క్షీణించిన దాననగుటచే ప్రాణములు విడువక యింత కాలము బ్రదికి యున్నాను. కాలము తీరని వేళ మృత్యువు సంభవింపదని సజ్జనులు చెప్పుమాట యెంతయో నిజము కదా! సుఖముల నెడబాసి బహు దుఃఖములను భరించు నా హృదయము చాల గట్టిది. వజ్రాయుధముచే ముక్కలు చేయబడిన పర్వత శిఖరమువలె ఈ హృదయము వేయి ముక్కలగుట లేదేమి? నే నాత్మహత్య చేసికొనుట దోషము గాదు. చూచువారలకసహ్యమును గలిగించు రూపముగల రావణుని చేత నేనెట్లును చంపబడుట తప్పదు. అంతకంటె ఆత్మహత్య చేసికొనుటయే మేలు. అట్లు చేయక రావణునకు వశపడి జీవించుటయు తగిన పని కాదు. బ్రాహ్మణుడు శూద్రునకు మంత్రోపదేశము చేసిన విధముగా నేను నా హృదయమును రాక్షసునకర్పింపజాలను. లోకనాథుడగు నా భర్త యీ రెండు నెలల గడువు తీరులోపల నిచ్చటకు రాకున్నచో నయోగ్యుడగు నీరావణుడు గర్భముననే మృతి చెందిన బిడ్డను శస్త్రవైద్యుడు ముక్కలు ముక్కలు చేసి తీసినట్లు పదును గల యాయుధములతో నా అవయవములు ముక్కలు ముక్కలు చేయగలడు.

రాజునకపకారముచేసి యుదయకాలమున వధింపబడుటకై ఆ రాత్రి బంధింపబడిన దొంగ యెట్లు దు:ఖించునో అట్లే చాలాకాలము దు:ఖితురాలనైన నాకు ఈ రెండు నెలల గడువును సమీపించుచున్నదేయని విచారము కలుగుచున్నది. ఓ రామా! హా లక్ష్మణా! ఓ సుమిత్రా! ఓ నాతల్లీ! రామమాత యగు ఓ కౌసల్యా దేవీ! స్వల్ప భాగ్యముగల నేను మహా సముద్రమున సుడిగాలి తగిలిన యోడవలె ఆపద నందుచున్నాను. కన్నతల్లి కంటె దయతో నన్ను మన్నించునట్టి రామమాతయగు ఓ అత్తగారా! అత్తగారికంటె నెక్కువగా ప్రేమించునట్టి స్నేహితురాండ్రలో కెల్ల నుత్తమురాలైనయో సుమిత్రా దేవీ! కన్నతల్లి కంటె నెక్కువగా నన్ను సేవించు ఓ మరదియైన లక్ష్మణా! నీ ప్రాణములకంటె నెక్కువగా నన్ను ప్రేమించు ఓ రామభద్రా!" అని విలపించెను. "అయ్యో! నా నిమిత్తముగా మృగరూపమును ధరించిన యాదుష్టుని చేత రాజుపుత్రులగు రామలక్ష్మణు లిరువురు పిడుగుపాటున మరణించిన శ్రేష్ఠమైన ఎడ్లవలె వధింపబడి యుందురు. ఇంతకు మూలము నేనే గదా! నేనే సమయమున బుద్ధి హీనురాలినై రామలక్ష్మణులను బంపితినో ఆ సమయముననే నిజముగా నా రాక్షసుడు లేడి రూపము దాల్చి నన్ను లోభ పెట్టియుండెను. ఇంకపలు మాటలేల? అయ్యో! సత్యవ్రతుడవు. పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గలవాడవు. జీవులందఱకు హితమును ప్రియమును గలుగ జేయువాడవు. నేను రాక్షసులచే చంపబడబోవుచుండుటను నీవు తెలిసి కొనలేకున్నావు కదా! భర్తవగు నీవు తప్ప ఇతర దైవము లేదను నా మనో నిశ్చయము, నీ మధురము లగు మాటలను వినగోరి యీరాక్షసుల భయంకరమైన మాటలను వినునట్టి ఓర్పు, నీతో గలిసి శయనింపవలెనను కోరికచే ఈ కటికి నేలపై శయనించుట, నీవే రక్షించువాడవని రక్షకత్వము నీదేయని నమ్మి ధర్మము తప్పక నిలుచుట, భర్తననుసరించు నియమముతో నీతో గలసి యడవులకు వచ్చుట అను నా యీతపస్సు అంతయును కృతఘ్నునకు చేయు నుపకారము వలె నా దౌర్భాగ్య వశమున నిరర్థక మగుచ్నుది కదా! నా పాపమెంత యధికముగ నున్నదోగదా!

కృశించి కళతప్పితిని. నీవు దగ్గర లేక నిన్ను కలసి కొనగలనను నాశయు లేని దాననయితిని. ఓ పురుష పుంగవా! నా పుణ్యములు నశించినవి. నిర్మలమైన యేకపత్ని త్వనియమము కూడ వ్యర్థమై పోయెను. వనవాసము చేయుమని చెప్పిన నీ తండ్రి యాజ్ఞను నియమముతో పాలించి పట్టణము కేగి భూమికి పట్టాభిషిక్తుడవై నేనిచట మరణించగా నీవచ్చట పద్మదళ విలోచనలగు కాంతలతో నే భీతియులేక రమించెదవని తలంతును. ఓ రామా! నీ యందనురాగము గలదాననై నా నాశనమును గోరుకొని నీ యందే మనస్సు నిల్పి ఉపవాస నియమముల నూరకయే ఆచరించినాను. అయ్యో! తుదకు స్వల్ప భాగ్యముగల దాననై ప్రాణములను విడచుచున్నాను. ఈ రాక్షస గృహమున నాకు నింత విషమైన నిచ్చుదాతలు లేరే. క్రూరమైన ఖడ్గమునైన తీసికొమ్మని యొసగు వారు లేరే. అట్లెవ్వరైన నిచ్చినచో వెంటనే ఆ విషమును త్రాగియైనగాని లేదా వాడియైన ఆ ఖడ్గముతో ఖండించుకొనిగాని ఈ దుఃఖ నాశమగునట్లు మరణించి యుందును గదా” అని యిట్లు సీతాదేవి అనేక విధములుగా విలపించుచు భయముచే వణకుచు నోరెండి పోవుచుండగా పూచిన ఆ శింశుపావృక్షము క్రిందకు వచ్చెను. అచ్చట తన జడను చేత బట్టుకొని నేనీజడను మెడకురిపోసి కొని యముని చెంత కేగెదనని తలంచెను. సుందరములు మృదువులునైన అవయవములుగల ఆ సీత యిట్లు తలంచుచు పువ్వులతో నున్న శింశుపావృక్షపు కొమ్మను గట్టిగా పట్టుకొని నిలబడి రాముని లక్ష్మణుని తన వంశమును తలంచు కొనుచునుండగా ఆమెకు శుభప్రదమైనవియు, ధైర్యమును గలుగజేయునవియు, ప్రశస్తములయినవియు నగు శకునములు ఆనందము కలుగజేయునవై కనిపించెను.



# ఇరువది తొమ్మిదవ సర్గము

## మరణించుటకు సిద్ధపడిన సీతకు మంచి శకునములగుట :

అంతటి మహాదుఃఖమును బొందినదియు, సంతోషమునకు దూర మైనదియు, ఇటుపై నే కష్టములు వచ్చునోయను భయముతో నున్నదియు, దీనమైన మనస్సు గలదియు నగు సీతకు ధనవంతుని దగ్గరకు సేవకులు చేరినట్లు శుభశకునములు గనిపించినవి. శుభమైనది, వంకరలైన ఱెప్పతుద వెంట్రుకలు గలదియు నడుమ నల్లనై చుట్టును తెల్లనై చివఱలందు ఎఱ్ఱనిదైన సీతాదేవి యెడమకన్ను చేపచే కొట్టబడిన కమలము వలె అదరదొడగెను. సుందరమైనది, బలము గలది, గుండ్రనై మృదువైనది, చందనాగరు గంధములకరమైనది మహాపురుషుడగు రామునకు చాలకాలము తలగడవలె నున్నదియగు సీతాదేవి యెడమ భుజము కొంత సేపు వేగముగా అదరజొచ్చెను. ఏనుగు తొండమువలె నున్ననియు, మిగులలావై సుందరములైన ఆమె తొడలలో నెడమ తొడ బాగుగా కంపించుచు రాముడు నీముందే యున్నాడని తెలిపెను. నిర్మలములైన నేత్రములు మొదలు దేలిన పలువరుసయు గల సీతయొక్క బంగారు వన్నె గల మాసిన చీర కొంచెమె జారి రాముని యొక్క క్షేమమును తెలియజేసెను. మంచి ఫలములనిచ్చునవిగా పూర్వమునుండి తెలిసియున్న యీ శుభ శకునములను జూచి రామసమాగమమును తలంచుచు సీతాదేవి పెద్దగాలికి ఎండలకు వాడి చెడిపోనున్న విత్తనము వర్షముచే మొలకెత్తు విధముగా ఆనందించెను. సుందరములైన నేత్రములు గలదియు, అందమైన కనురెప్పలు, ముంగురులు కలదియు, మిక్కిలి తెల్లనైన దంతములు, గలదియు దొండపండువంటి పెదవి గలదియు, అగు సీతాదేవి ముఖము రాహువు నోటినుండి విడువబడిన చంద్రుని వలె ప్రకాశించెను. పూజ్యురాలగు ఆ సీతాదేవి ఆ శుభ శకునములచే శోకమును వీడినదై మాంద్యమును విడచి తాపము తగ్గినదై ఆనందము వలన మనోవైకల్యమును విడచి చంద్రోదయమైన శుక్లపక్ష రాత్రివలె శోభిల్లెను.

# ముప్పదవ సర్గము

## సీతాదేవితో నెట్లు సంభాషింపదగునని హనుమ యోజించుట :

అప్పుడు పరాక్రమశాలియగు హనుమంతుడు సీతాదేవి ఆవేదనను, రాక్షసులు పెట్టు బాధలను, త్రిజట స్వప్న వృత్తాంతమును, సర్వ వృత్తాంతమును వినెను. ఇంద్రుని నందనవనమందు దేవతా స్త్రీ వలె అశోకవనమున నొప్పుచున్న సీతాదేవిని హనుమంతుడు చూచి పరిపరి విధములుగా ఆలోచించెను. “ఏ స్త్రీకై వానరులందఱును నాల్గు దిక్కులను వెదకుచున్నారో ఆమెగా నీమెను చూడగలుచున్నాను. చక్కగా సీతాన్వేషణ కార్యమును చేయుటకై యాజ్ఞాపింప బడినవాడనై శత్రువగు రావణుని శక్తిని బరీక్షించుచు రహస్యముగా సంచ రించుచు నేనిచ్చట విశేషములను చూచితిని. రాక్షసుల గొప్పను, ఈ పట్టణ పరిసరములను, ఈ రాక్షసరాజగు రావణుని ప్రభావమును నేను పరిశీలించితిని. సాటిలేని మహిమగలవాడును, సకల జీవరాసులపై దయగలవాడునగు తన భర్తయైన రాముని చూడగోరుచున్న సీతను నేనోదార్చుట యుక్తము. పున్నమ చంద్రుని బోలు ముఖము గలదియు, దుఃఖములనెన్నడు ననుభవించనిదియు, ప్రస్తుతము దుఃఖమును బొందుచున్నదై యెంతకును శోకమునుండి బయటపడజాలకున్నదియు నగు నీమెను నేనోదార్చెదను. శోకముచే కలత నందిన యీ సీతాదేవి నోదార్పకయే తిరిగి కిష్కింధకు వెళ్లేదనేని నాకు దోషము వచ్చును. నేనట్లు వెళ్లుదునేని కీర్తిశాలినియగు నీ సీత రాక్షసుల బారి నుండి తప్పించుకొను మార్గములేక మరణించును. గొప్పబలము గలవాడును పూర్ణచంద్రుని వంటి ముఖముగలిగిన సీతను చూడవలెనని యువ్విళ్లూరు చున్నవాడునగు రామచంద్రు నూరడిల్లజేయుటే న్యాయము. నేనీ రాక్షల స్త్రీల

సమక్షమున సీతతో మాటాడరాదు. ఇప్పుడేమి చేయవలెను. నేనిప్పుడిరుకున బడితినే. నేనీ రాత్రి గడచులోపల నీమె నూరడింపజేయనిచో నీమె ప్రాణములను విడచును. సందియము లేదు. 'సీత నాకేమని చెప్పుమన్నది' అని రాముడడుగుచో నేనామెతో మాటాడకున్నచో నేమి సమాధానమిచ్చెదను? సీత యొద్ద నుండి సందేశము లేకుండ తొందరపాటుతో మరలి వచ్చిన నన్నుజూచి రాముడు కోపించి తీవ్రమైన చూపులతోనే కాల్చివేయును. నేను సీతాదేవి నోదార్చకయే తిరిగి వెళ్లి కిష్కింధలో రామునికై సుగ్రీవుని బ్రేరేపించి తీసికొని వత్తునేని అప్పటికి సీత తప్పక మరణించును. కనుక సైన్య సమేతముగా మారాజు వచ్చుట వృథాయగును గదా! నేనిచ్చటనే దాగియుండి రాక్షసులు లేనటువంటి యవకాశము లభించిన వెంటనే మిక్కిలి దుఃఖపడుచున్న సీత నోదార్తును. నేను మిక్కిలి చిన్నవాడను మరియు కోతిని. మనుష్యులవలె చక్కని వ్యాకరణముతో ప్రయోగ సంస్కారము గలిగిన సంస్కృత భాషలో నేనీమెతో మాటలాడుట తగునా? అట్లు నేను బ్రాహ్మణునివలె సంస్కృతమున మాటలాడుదునేని వానరుడెట్లీ విధముగా మాటలాడునని యీామె సందేహింపవచ్చును. నన్ను రావణుడని తలచి భయపడును. ఏమి చేయుదును, కోతిని నేనెట్టు పలుకదగును? నేనొక విధముగా ఏ దోషము లేని యీామె నోదార్పవలెను. మౌనముగా నుండిన ఓదార్చుటెట్లు? మఱియెట్లు మాటాడవలెను. మనుజ భాషలో మాటాడుట తప్ప వేరు గతిలేదు. కోతి రూపమును మనుష్యుల మాటలును గల నన్ను జూచి, ఇదివరకే రాక్షసుల వలన భయము చెందియున్న సీత, ఇప్పుడింకను భయపడును. పిమ్మట ఆమె భయము చెందినదై నన్ను కామరూపియగు రావణునిగా దలచి పెద్దగా కేకలు వేయును. అంత నలుప్రక్కల నుండి యీ వికృతాకారలగు రాక్షస స్త్రీలు పెద్దవి చిన్న వియగు కొమ్మలను చెట్ల మొదళ్లను బట్టుకొని నన్ను చుట్టుముట్టి బంధించుటకు వధించుటకు యథాశక్తి ప్రయత్నింతురు. నేను చెట్ల కొమ్మలు

చేపట్టి నన్ను రక్షించుకొనుచు వారిని వెంటాడుచు నలుదిక్కుల వనమందంతటను పరుగులు పెట్టుట చూచి వారు భయమంది వికృతమైన ముఖములతో వేగముగా వెళ్లి రావణుని గృహమునకు కావలియున్న రాక్షసులను పిలిచెదరు. అంతట నా రాక్షసులు శూలము శక్తి మున్నగు ఆయుధములు చేత ధరించి చూచువారలకు భయము గలిగించుచు వేగముగా యుద్ధమునకు వత్తురు. అన్ని వైపుల నుండి వారిచే అడ్డగింపబడినవాడనై రాక్షస సైన్యములను కొట్టగలనే గాని సముద్రమును దాటి ఆవలకు పోజాలను. వారు వేగముగా నా పైకెగిరి నన్ను పట్టుకొందురు. దీనిచే నా ప్రయాణము నిష్ఫలమై చెడిపోవుటే గాక నేనును బంధింపబడినవాడ నయ్యెదను. హింసయే స్వభావముగా వీరీమెను చంపుదురు. అట్టిచో రామసుగ్రీవుల పని సంకటమున బడును. సీతయు జలముచే చుట్టుముట్టబడినదియు, భూమార్గము లేకుండుటచే చేరరానిదియు, రాక్షసులచే నిండియున్నదియు అగు నీలంక యందెవ్వరికిని కనబడకుండ నుండి పోవును. యుద్ధమున నీ రాక్షసులు నన్ను చంపినను, బంధించినను, రామునకు సీతయున్న చోటును తెల్పగలవారిని వేరెవ్వరిని చూడజాలకున్నాను. నేనెంత యాలోచించినను నేను మరణించినచో నూరామడల సముద్రము దాటగలవాడక్కడ నెవ్వడును లేడు. వేలకొలది రాక్షసులను నేనొక్కడనే చంపగలను, గాని ఆ పైన తిరిగి యీ మహా సముద్రమును దాటి యావలి యొడ్డును చేరజాలను. యుద్ధమున జయాపజయములు తెలియరానివి, నిర్ణయింపరానివి. నాకు సంశయముగానున్న పనిని చేయుట యిష్టముగాదు. తెలివిగల వాడెవ్వడును సంశయింపదగిన పని ననాలోచితముగా చేయ సమకట్టడు. అట్లు చేసిన నీతి యెఱుగని వాడని నిందింపబడును. నేనీమెతో మాటలాడక వెడలితినేని తప్పక ఈమె మరణించును. పలుకరించుదమన్నచో పైన చెప్పిన మహా దోషములన్నియు కలుగును. దేశమును కాలమునాలోచింపక అవివేకియైన దూత చేయు పనులు అయినట్లున్నవి కూడ సూర్యోదయముచే

నశించు చీకటివలె చెడిపోవును. యజమాని యిది చేయదగును, ఇది చేయదగదు అని మంత్రులతో నాలోచించి నిర్ణయించినను తామే తెలివి గలవారమని తలంచు బుద్ధి హీనులగుదూతలా పనులను పాడు చేయుదురు. నా స్వామి కార్యమెట్లు చెడకుండునో? బుద్ధిహీనత యెట్లుండునో నేనీ సముద్రమును దాటుట వ్యర్థము కాక యెట్లు కలుగకుండునో నేనీ సముద్రమును దాటుట వ్యర్థముకాక యెట్లు ఫలవంతమగునో? ఈమె నేను చెప్పుమాటల వినుటెట్లో? విని భయపడకుండుటెట్లో?" యని యనేక విధముల నాలోచించి హనుమంతుడిట్లు నిశ్చయించెను. "నా రూపమును కనబడనీయక ఆ రాముని కీర్తించుచు ఆయనయందే లగ్నమైన మనస్సుగల యీామెకు భయము కలుగకుండ చేసెదను. ఇక్ష్వాకు వంశజులలో శ్రేష్ఠుడును, ఆత్మవంతుడునగు రాముని ధర్మ సమ్మతములైన మధురములైన మాటలతో స్తుతింతును. నేనెట్లు పల్కిన యీామె నా మాటలను నమ్మునో అట్లు పలికెదను.' అని యిట్లు తలంచుచు మహానుభావుడగు హనుమంతుడా జగదీశ్వరుడగు రాముని భార్యయగు సీతను జూచుచు దట్టమైన చెట్టుకొమ్మల నడుమనే యుండి వ్యర్థము కాని మధురము లైనవి యగు మాటలనిట్లు పలికెను.



# ముప్పది యొకటవ సర్గము

## హనుమ సీతాదేవి వినునట్లు రాముని ప్రశంసించుట :

అని యట్లు హనుమ పరిపరి విధముల తలపోసి తాను చేయవలసిన పనిని నిశ్చయించుకొని, సీతాదేవి సమీపముగా కొంచెము క్రింది కొమ్మ మీదకు దిగి మధురముగానిట్లు పలికెను. "శ్రేష్ఠములగు రథములు, ఏనుగులు, గుఱ్ఱములు అధికముగా గల దశరథుడను మహారాజుండెను. ఆయన పవిత్ర చరిత్ర గలవాడు. దాతగా గొప్పకీర్తిని బొందినవాడు. సత్యమైన స్వభావము గలవాడు. పరాక్రమవంతుడుగా ప్రసిద్ధి చెందినవాడు. గుణములలో రాజర్షు లందరిలో శ్రేష్ఠుడు. తపముచే ఋషులకు సాటియైనవాడు. చక్రవర్తుల వంశమున బుట్టినవాడు. బలమందు దేవేంద్రునితో సమానుడు. అహింసా ధర్మమందిష్టము గలవాడు. ఉదాత్తమైన స్వభావము గలవాడు. దయగలవాడు. తిరుగులేని పరాక్రమము గలవాడు. ఇక్ష్వాకు వంశజులలో పరాక్రమము, సంపదగల వాడు. తన్నాశ్రయించినవారి సంపదను వృద్ధి పొందించువాడు. సాముద్రిక శాస్త్రములో చెప్పబడిన సకల రాజలక్షణములు గలవాడు. గొప్పకాంతిగలవాడు, నాల్గు సముద్రముల వఱకునున్న భూమండలమున ప్రసిద్ధి చెందినవాడు. తాను సుఖముల ననుభవించుచు తన ప్రజలకు సుఖములు చేకూర్చు రాజు చంద్రబింబమును బోలు ముఖము గలవాడును, సకల ధర్మ విశేషముల నెరిగిన వాడును, విలుకాండ్రలో శ్రేష్ఠుడును, దుష్ట శత్రువులకు భయము కలిగించువాడును, తన వంశక్రమాగత ధర్మమును రక్షించువాడును, అగు రాముడాతని పెద్ద కుమారుడు. అట్టి వీరుడు పవిత్రుడు అయిన రాముడు సత్యమైన ప్రతిజ్ఞ కలవాడై వృద్ధుడగు తండ్రియాజ్ఞ వలన భార్యయగు సీత

తోడను సోదరుడగు లక్ష్మణుని తోడను అడవికి వెడలెను. ఆ మహారణ్యమున వేటయందాసక్తి గలవాడై తిరుగుచు శూరులు కామరూపులునయిన పెక్కుమంది రాక్షసులను చంపెను. అందు రావణ సోదరులగు ఖరుడు దూషణుడు త్రిశిరుడు గూడ గలరు. వారిని రాముడొక్కడే వధించెను. జనస్థానమున ఆ ఖరాదులగు రాక్షసుల మరణవార్త విని కోపముతో మారీచుని మాయా మృగ రూపమున బంపి రాముని మోసపుచ్చి అతని భార్యయగు సీతను రావణుడపహరించెను. రాముడప్పుడు శీలవతియైన సీతాదేవికై వెదకుచు ఆ అడవిలో సుగ్రీవుడను వానరునితో స్నేహము చేసెను. అతని నిమిత్తముగా వానరరాజగు వాలిని సంహరించి వానర రాజ్యమును సుగ్రీవుని కిచ్చెను. అంత సుగ్రీవుడాజ్ఞాపించుటచే కామ రూపధరులగు వానరులు సీతాదేవి నన్నిదిక్కుల వెదకుచున్నారు. అట్లు వెదకుచు జటాయువు సోదరుడగు సంపాతి చెప్పిన మాట ప్రకారముగా విశాలాక్షియగు సీతాదేవి కొఱకే నేనీ నూరు యోజనముల వెడల్పు గల సముద్రమును వేగముగా దాటితిని. రాముని భార్యయగు సీత ఎట్టి రూపము వర్ణము కాంతి గలదియని జానకీదేవి భర్తయైన రాముని వలన వింటినో, నా పుణ్య విశేషముగ అట్టి సీతాదేవి చెంతకే వచ్చినాను." అని వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు పలికి యూరకుండెను. సీతయు నతని మాటలను విని మిక్కలి యాశ్చర్యపడెను. అంత కొనలు వంకరలై సుందరములైన శిరోజములు గల సీత భయపడినదై తన కేశములను ముఖముపై నుండి పైకి త్రోయుచు ముఖమును పైకెత్తి శింశుపా వృక్షమును జూచెను. అట్లా సీతాదేవి హనుమంతుని వాక్యములను విని చుట్టును పరికించి చూచి రామునే సర్వదా ధ్యానించుచు మిక్కిలి హర్షమును బొందెను. సీత శింశుపా వృక్షపు ప్రక్కలందును ఆకాశమునను భూమి పైనను పరిశీలించుచు అందునొక్కచోట సుగ్రీవ మంత్రియగు హనుమంతుని జూచెను.

# ముప్పది రెండవ సర్గము

## సీతాదేవి హనుమంతుని జూచి భయపడుట :

అంత నా సీతాదేవి కొమ్మల నడుమ దాగినవాడును, తెల్లని వస్త్రమును ధరించినవాడును, మెఱపుల సమూహము వలె పింగళ వర్ణము గలవాడును, తూర్పుకొండపై అరుణుని వలె నొప్పుచున్నవాడును, ప్రకాశించుచున్న అశోక పుష్పముల వంటి కాంతిగలవాడును, ఊహింపరాని పరాక్రమము గలవాడును, బంగారువలె ప్రకాశించు నేత్రములు గలవాడును అగు హనుమంతుని దర్శించెను. అతనిని జూచి సీత తొలుత భయము చెంది పిదప ఆశ్చర్యమును పొంది యిట్లు తలంచెను. “అయ్యో! ఈ వానరుని రూపమింత భయంకరముగ నున్నదేమి? ఇది దేదీప్యమానమై చూడ శక్యము గాకున్నదేమి?” అని భయపడి తెలివి తప్పినదై తిరిగి లేచి “హా రామా! లక్ష్మణా!” యని పరి పరి విధములుగా మందస్వరముతో మెల్ల మెల్లగా నేడ్చెను. వినయవంతుడై దగ్గరగానున్న హనుమంతుని జూచి సీతాదేవి యిట్లు చూచుట కలగాదు గదా? యని తలంచెను. అట్లు తలంచి యామె తిరిగి పరీక్షగా చూచెను. వంకరయైన పెద్ద ముఖము గలవాడును, వానర రాజగు సుగ్రీవుని యాజ్ఞ పాలించువాడును, అతని మంత్రియు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడును వాయుపుత్రుడును అగు ఆ హనుమంతుని చూచుచునే ఆ విశాలాక్షియగు సీత ప్రాణములు లేని దానివలె తెలివి తప్పినదయ్యెను. చాల సేపటికామె తెలివినంది లేచి మఱల నిట్లాలోచించెను. “నేను కలలో నేడు వికృతమైన ఆకారముగల వానరుని జూచితిని. కోతి కలలో కనిపించుట నిషిద్ధమని శాస్త్రజ్ఞులు చెప్పిరి. అట్లు కనబడినచో నరిష్టము కలుగును. నా రామునకు లక్ష్మణునకు నేమయ్యెనో

గదా! రామునకును లక్ష్మణునకును శుభమగుగాక! అట్లే నా తండ్రి జనక మహారాజు క్షేమముగా నుండుగాక! కాని యిది కలకాదు. దుఃఖముతో పీడింపబడుచున్న నాకు నిద్రయే లేదే? అట్టిచో కలయే విధముగా వచ్చును? సుఖముగా నున్నగదా నిదుర వచ్చుట. పూర్ణచంద్రునకు సాటియగు నా భర్త నెడబాసియున్న నాకు సుఖమే లేదు గదా! ఆ రామునే మనస్సునందు తలంచుచు మాటలతో గూడ ఆ రామునే రామా! రామా! యని యెల్లప్పుడు పలుకుచు ఆయనకు సంబంధించినట్టి కథలను వినుచు, ఆ దృశ్యములనే మనో నేత్రముతో చూచుచున్నాను. నేనా రామునే తలంచుచు ఆయన యందే లగ్నమైన మనోభావము గలదాననై మన్మథునిచే పీడింపబడుచు ఆ రామునే చూచు చున్నాను. ఆయన గుణములనే వినుచున్నాను. ఇప్పుడీ రామ నామము వినిపించుచున్నది. ఇది నా భ్రాంతియా? అభిలాష మాత్రమా! యని యాలోచించుచున్నాను. కాని జాగ్రత్తగా నా బుద్ధితో ఆలోచింపగా ఈ రామ నామమును పలుకుట భ్రాంతి కాదని తలంచెదను. ఏలనన నా మనస్సు నందున్న కోరికయేయైనచో దానికి రూపముండదు గదా! కావున నెదుటనున్న వానరుడు నాకగపడుచు నిట్లు పలుకుచున్నాడేమో? దేవతల గురువైన బృహస్పతికి నా నమస్కారము. దేవేంద్రునకు వందనము. బ్రహ్మకు నా ప్రణామములు. అగ్నికభివాదములు. ఈ వానరుడు నా యెదుటనేమి పల్కెనో యది యథార్థమగు గాక. ఇది కల కాకుండుగాక" అని సీత భావించి యిట్లుందఱను వేడుకొనెను.



# ముప్పది మూడవ సర్గము

**హనుమంతుడు సీతాదేవితో సంభాషించుట :**

అప్పుడు పగడమువలె నెఱ్ఱనైన ముఖము గలవాడును, గొప్ప తేజస్సు గలవాడును, వాయుపుత్రుడునగు హనుమంతుడు వినయము గలవాడై సీతాదేవి దురవస్థను జూచి దీనుడై ఆ చెట్టునుండి క్రిందకు దిగి యామెను సమీపించి చేతులు జోడించి శిరస్సున నుంచి నమస్కరించి మధురమైన మాటలతో నిట్లు పలికెను. "తామర రేకులవంటి కనులు గలదానా! నలిగిన పట్టు వస్త్రము దాల్చిన దానా? నిందింపరాని సౌశీల్యము గలదానా! ఈ వృక్షపు కొమ్మను పట్టుకొని నిలిచిన నీవెవ్వరవు? అలల తాకిడికి తామరాకు పైబడి వెంటనే జారిపోవు నీటివలె నీ కన్నుల నుండి శోక బాష్పములు కారుచున్నవేల? మంగళ రూపిణీ! దేవతా స్త్రీవో, అసురకాంతవో, నాగకన్యవో, గంధర్వ స్త్రీవో, యక్ష కాంతవో, కిన్నర స్త్రీవో, ఋషికాంతవో, నీవే వర్గమునకు జెందినదానవో, ఓ సుందరమైన ముఖము గలదానా! రుద్రులలో మరుత్తులలో వసువులలో నీవెవ్వరవు? ఓ సుందరీ! నీవు నాకు దేవతవలె తోచుచున్నావు. నీవు చంద్రునెడ బాసి భూమిపై బడినదియు, తారలలో నుత్తమమైనదియు, సర్వ గుణములు గలదియునగు రోహిణీ నక్షత్రము వలె గనిపించుచున్నావు. దోషరహితమైన సుందర నేత్రములు గలదానా! నీవెవ్వతెవు? నీవు కోపముచే గాని అజ్ఞానముచే గాని భర్తయగు వశిష్ఠునకు దూరమై ఆకాశమునుండి భూమికి జారిపడినట్టి మంగళమూర్తియగు నరుంధతివి కావుగదా! ఓ చక్కని నడుము గలదానా! నీకు మంగళమగు గాక. ఓ సుందరీ! నీవెచ్చట నుండి యిచ్చటికి వచ్చితివి? ఇక్కడ ఇంత బాధనొందుటకు కారణమేమి? నీ తండ్రియెవ్వడు? సోదరుడెవ్వడు?

భర్త యెవ్వడు? పుత్రుడెవడమ్మా! నీ వేడ్చుచుండుట చేతను, మిక్కిలిగా నిట్టూర్చుట చేతను, నేలపై పాదములు మోపి నిలుచుట చేతను, నీయందున్న రాజ లక్షణముల చేతను నీవు దేవతవు కావని తోచుచున్నది. ఓ లలనా! నీ శుభ లక్షణములను చూడగా నీవు రాజకన్యవనియు, ఏ రాజునకో పట్టమహిషివనియు తోచుచున్నది. రావణుడు బలాత్కారముగా పట్టి తెచ్చిన రాజకాంతవగు సీతవా? అట్లయినచో తెల్పుము. నీకు శుభము కలుగును గాక! నీ ముఖమందలి దైన్యమును, మనుష్యకాంతలలో కనబడని సౌందర్యమును నీ తాపస వేషమును బుద్ధితో నాలోచింపగా నీవు నిశ్చయముగా రాముని భార్యవని తోచుచున్నది.” అనగా సీత హనుమంతుని మాటలను విని రామునే అతడు కీర్తించుటచే సంతోషమును పొందినదై కొమ్మపై గూర్చునియున్న ఆ హనుమంతునితో నిట్లనెను.

**సీతాదేవి హనుమంతునితో దనవృత్తాంతమును జెప్పుట :**

“ఈ భూమి యందున్న రాజశ్రేష్ఠులలో ప్రధానమైనవాడు, ఆత్మవిదుడు, శత్రుసేనల పీడించువాడునగు దశరథ మహారాజు కోడలినే నేను. మహాత్ముడైన విదేహరాజగు జనకుని పుత్రికను, నా పేరు సీత. ధైర్యవంతుడగు రాముని భార్యను. నేను నా వివాహమైన తరువాత అయోధ్యలో పండ్రెండు సంవత్సరములు మనుష్యుల కందుబాటులో నుండు భోగములన్నిటి ననుభవించుచు సమృద్ధిగా సకల భోగవస్తువులను కలదాననై యుంటిని. అంత పదమూడవ సంవత్సరము రాగానే దశరథ మహారాజు తన పెద్ద కుమారుడగు రాముని పట్టాభిషిక్తుని జేయవలెనని యుపాధ్యాయుడగు వశిష్ఠునితోడను, మంత్రులతోడను ఆలోచించి ప్రయత్నములు చేయసాగెను. అట్లు రామాభిషేకము నకై సకల సంభారములను సంపాదించుచుండగా కైకేయి యను రాణిరాజుతో నిట్లనెను. ‘రాజా! నీవు రామునకు పట్టాభి షేకము చేసినచో నేను నియమము పట్టి నిత్యమును భోజనము చేయక నీరు ముట్టక యుపవాసములు చేసి ప్రాణములను విడచెదను. నీవు నాయందు ప్రీతితో పూర్వము రెండు వరముల

నిచ్చెదనని చెప్పిన మాటలు వ్యర్థము కారాదనుకొన్నచో సత్యము పల్కు వాడవయినచో రామునడవికి బంపుమనెను. సత్యవ్రతుడగు దశరథ మహారాజు తాను దానముగా నిచ్చిన వరములను తలంచుచు కైక పల్కిన కఠినములై వినరానివైన మాటలను విని మూర్ఛనందెను. తరువాత ఆ ముసలిరాజు సత్యమును ధర్మమును కాపాడుకొనుటకై కీర్తిమంతుడును, ప్రీతిపాత్రుడునునైన రాముని 'నాయనా! నీకిచ్చెదనన్న రాజ్యమును నాకు వదలిపెట్టి నీవడవులకు వెళ్లుమని యాజ్ఞాపించెను. అంతట శ్రీమంతుడగు రాముడు అభిషేకముకంటే ప్రియమైన పితృవాక్యముని మనఃపూర్వకముగా అంగీకరించెను. ప్రాణముల కొఱకైనను నాభర్త సత్యమును దప్పడు. ఎవ్వరేది యడిగినను ఇచ్చువాడై గాని యెవ్వరిని యాచించువాడు కాడు. మహీకీర్తిశాలియగు రాముడు తండ్రి మీది భక్తితో అమూల్యములగు నుత్తరీయములను విడచి దర్భలు లేడి చర్మములు పట్టుకొని నారవస్త్రములు ధరించి రాజ్యమును మనఃపూర్వకముగా విడచి బయలుదేరుచు, నన్ను తన తల్లియగు కౌసల్య కడనుండుమనెను. నేను వేగముగా ఆయనకంటే ముందుగా అడవికి బయలుదేరితిని. రాముడు లేని స్వర్గము కూడ, నాకు నరక సమానమే గదా. మాకంటే ముందుగా స్వామికి సకలోపచారములను స్వయముగా చేయుభాగ్యము గలవాడగు లక్ష్మణుడన్న ననుసరించి వెళ్లుటకు నారవస్త్రములను ధరించెను. అట్లు మేము ముప్పురము రాజాజ్ఞను గౌరవించి ధైర్యము గలవారై యిదివఱకెన్నడును జూచి యెఱుగని భయంకరమగు అడవిలో ప్రవేశించితిమి. మేమట్లు దండకారణ్యమున నివసించుచుండగా మహాతేజశ్శాలియగు రామునియొక్క భార్యనగు నన్ను రాక్షసుడగు రావణుడు దొంగలించినాడు. అతడు నా ప్రాణములు తీయుట కింకను రెండు మాసముల వ్యవధి నిచ్చినాడు. ఆ రెండు నెలలు గడువవగనే నేను ప్రాణములను విడచెదను. అంతవఱకు మంచి చరిత్రగల రాముడు వచ్చి నన్ను రక్షించునని ప్రాణములను నిల్పియున్నాను." అని చెప్పుచున్న సీతాదేవి మాటలను వాయుపుత్రుడు విని ఆమె నూరడింజేయుచు నిట్లనెను.

# ముప్పది నాలుగవ సర్గము

**హనుమంతుడు సీతకు రామలక్ష్మణుల కుశలవార్త చెప్పుట :**

"ఓ సీతాదేవీ! నేను రాముని సందేశమును నీ కొఱకై తీసికొని వచ్చితిని. రాముడు క్షేమముగా నున్నాడు. తన క్షేమమును నీకు చెప్పుమనినాడు. బ్రహ్మాస్త్రమును వేదశాస్త్రములను నెఱిగినవాడగు రాముడు నిన్ను కుశల మడిగినాడు. మహాతేజశ్శాలియు నీభర్తకు తోడు నీడయు ప్రీతిపాత్రుడును అగు లక్ష్మణుడు శోకపీడితుడై శిరము వంచి నీకు నమస్కరించుచున్నాడు." ఆ మాటలు విని నరశ్రేష్ఠుడగు రామునకును లక్ష్మణకును క్షేమమని తెలిసి ప్రీతితో శరీరము పులకించగా సీత హనుమంతునితో నిట్లనెను. "మనుష్యుడు జీవించియున్నచో నూరు సంవత్సరములకైనను ఆనందమును బొందునను సామెత యథార్థమని నీ ప్రియమైన మాటలను వినుచటే నాకు తోచుచున్నది." అని తనకీ శుభవార్త తెలిపిన హనుమపై జనకపుత్రియగు సీత మిక్కిలి ప్రీతి నందెను. వారిరువురును నమ్మకముతో మాటలాడుకొనిరి. ఆమె మాటలు విని వానరయూథపతి యగు హనుమంతుడు శోకముచే దైన్యమునొందిన సీతాదేవి కడకు చెట్టుదిగి వచ్చెను. హనుమంతుడామె చెంతకు వచ్చిన కొలది నామె యాతనిని రావణుడని సందేహింపజొచ్చెను.

**సీతాదేవి హనుమంతుని రావణుడని శంకించుట :**

'అయ్యో! నేనీతనితో మాటలాడుట యుచితము గాదాయెనే! వేరొక రూపము ధరించి వచ్చిన రావణుడే యితడు' అని సీత భయము చెందినదయ్యెను. అని

శంకించుచు సీత అశోక వృక్షపు కొమ్మను విడచి శోకపీడితయై నేలపై గూలబడెను. మహాభుజుడగు హనుమంతుడు దుఃఖముచే పీడింపబడినదియు, భయముచే నిజము నెఱుగజాలకున్నదియు అగు నా సీతకు ప్రణమిల్లెను. సీతాదేవియు భయము చెందుచున్నదై హనుమంతుని జూడక దీర్ఘమగు నిట్టూర్పులు విడచుచు కలతచెందుచు నిట్లనెను. "ఓ రావణా! నీవు సహజము గానే మాయలు తెలిసినవాడు. ఇప్పుడు మాయచే నింకొక రూపము ధరించి నాకు సంతాపము గలిగించుచున్నచో అది నీకెంత మాత్రము తగదు. మున్ను జన స్థానమునందు నీ అసలు రూపమును వీడి సన్యాసి రూపమును ధరించి నాకు కనబడిన రావణుడవే నీవు. కామరూపములు గల రాక్షసుడా! ఉపవాసములచే చిక్కి భర్త నెడబాసి దీననై సంతాపము నందుచున్న నన్ను నీవు మఱల బాధింపదలంచుట మంచిది కాదు. నీవు రావణుడవే యని యనరా దనియు తోచుచున్నది. ఏలనన నిన్ను చూచి నా మనస్సు సంతసమందినది. నీవు నిజముగా రాముని దూతవై వచ్చినచో నీకు శుభమగు గాక! ఓ వానరశ్రేష్ఠుడా! నీకు రామకథయన్న నిష్టము. నాకు ప్రియుడగు రాముని గుణగణములను వర్ణింపుము. నాకు చాలా సంతోషము కలుగును. ఓ శాంతము గలవాడా! నదీ ప్రవాహమెట్లు గట్లను తన ఉరవడితో హరించునో అట్లు నీవు నీ మాటలచే నా చిత్తమును హరించుచున్నావు" అని పలికి మఱల సీత తన మదిలో నిట్లు తలపోసెను. ఎక్కడి రామదూత? ఇక్కడి కేవిధముగా వచ్చును? ఆహా! ఈ స్వప్నమెంత సుఖకరమైనది. చాల కాలమునకు పూర్వమే యిక్కడకు తీసికొని రాబడిన నేను నేడు కలలో రాముడు పంపగా వచ్చిన యీ వానరుని జూడగలిగితివి. అయ్యో! నా కలయును కరవే అయినది. నామీది మాత్సర్యము చేతనేమో నాకు కలలును రాకున్నవి. ఇంక కలలోనైన రాముని లక్ష్మణుని నెట్లు చూడగలను. కాని ఇది కలకాదు. కలలో కోతిని చూచిన ఆనందము

కలుగదు గదా! నాకిపుడు సంతోషము కలుగుచున్నది, గాన నేనిది కలయని తలంపను. లేక యిది యేమైన మతి చలించుటయా? లేక వాత ప్రకోపము చేత గలిగిన వికారమా? విరహముతోనున్న జనులకు సహజమైన ఉన్మాదమా? లేక యిది యేమైన యెండమావియా? అయినను ఇది పిచ్చికాదు. పిచ్చివంటి మోహము కూడ కాజాలదు. ఏలనన నేను నన్నును ఈ వానరుని గూడ గుర్తు పట్టుచున్నాను.' అని యిట్లు సీత తన యాలోచనలలో మోహము మొదలయిన వాని దుర్భలత్వమును, అతడు రావణుడే అనుటలోని బలమైన కారణములను తలంచి అతడు రావణుడే యని నిశ్చయించెను. ఇట్లు నిశ్చయించుకొని సన్నని నడుముగల సీత యా హనుమంతునితో నేమియును పలుకదయ్యెను.

**హనుమంతుడు సందేహము తీరునట్లు సీతాదేవితో భాషించుట :**

వాయుపుత్రుడగు హనుమంతుడు సీతాదేవి ఆలోచన లెఱిగినవాడై చెవులకింపగు మాటలతో నామె నానందింప జేసెను. "రాముడు సూర్యునివలె తేజస్సు గలవాడు, చంద్రుని వలె జనుల నానందింపజేయువాడు. నిధులరాజైన కుబేరుని వలె సకల లోకములకు రాజు. మహాకీర్తిశాలియగు విష్ణువు వలె పరాక్రమశాలి. దేవగురుడైన బృహస్పతి వలె సత్యములు మధురములు నగు మాటలను పలుకువాడు. ఆయన సౌందర్యము గలవాడు. అందములు చిందించుచున్నవాడు. ప్రకాశము గలవాడై మన్మథుని వంటి రూప సంపద గలవాడు. కోపింపదగిన చోటులందు కోపించును. ఎవ్వనిపై కోపించునో అతనిని దండింపగల సమర్థుడు. శ్రేష్ఠుడు మహారథుడు. ఈ లోకమంతయు నే మహాత్ముని భుజస్కంధములపై నాధారపడియున్నదో అట్టి రాముని బంగారు లేడి రూపము నాశ చూపించి యాశ్రమము నుండి దూరముగా బంపి ఎవ్వరును లేని సమయమున నిన్నపహరించుకొని పోవుటయను తన దుష్కృత్యమునకేది ఫలమో దానిని (మరణమును) రావణుడను భవించుటను చూచెదవు గాక!

పరాక్రమవంతుడగు నెవ్వడ చిరకాలముననే మిక్కిలి కోపించి యుద్ధమున మండుచున్న అగ్నులవలెనున్న బాణములను ప్రయోగించి రావణుని సంహరింప గలడో అట్టి రామునిచే బంపబడిన దూతనై నేను నీ యొద్దకు వచ్చితిని. రాముడు నిన్నెడబాసి దుఃఖముచే పీడింపబడుచు నిన్ను క్షేమమడిగినాడు. పరాక్రమశాలి, మహాభుజుడు, సుమిత్రాదేవి యానందమును వృద్ధి చేయువాడు నగు లక్ష్మణుడు నీకు నమస్కరించి నీ క్షేమ మడిగినాడు. సీతాదేవీ! రాముని స్నేహితుడు వానరశ్రేష్ఠులకు రాజునయిన సుగ్రీవుడను వానరుడు నిన్ను కుశలమడిగినాడు. ఓ విదేహ రాజపుత్రీ! రాముడును లక్ష్మణుడును నిన్ను తలంపని దినము లేదు. నీవు రాక్షసుల నడుమ జిక్కియు భాగ్యవశమున జీవించియున్నావు. కొలదికాలముననే నీవు రామలక్ష్మణులను సుగ్రీవుని వేలకొలది వానరులతో పరివేష్టింపబడి యిచ్చటకు వచ్చిన వారిని చూడగలవు. నేను సుగ్రీవుని మంత్రిని. హనుమంతుడను వానరుడును. ఈ మహా సముద్రమును దాటి లంకలో ప్రవేశించితిని. నా పరాక్రమముతో రావణునితో సమానమైన బలముగల లంకాధిదేవతను వశపరచుకొని రావణుని శిరముపై పాదముంచినట్లు నిన్ను చూడవచ్చితిని. అమ్మా! నీవు తలచినట్లు నేను వానర రూపముతో వచ్చిన రావణుడను గాను. నీవి యనుమానమును విడచి నా మాటయందు విశ్వాసముంచుదువు గాక!" అని..



# ముప్పది యైదవ సర్గము

**సీతాదేవి హనుమంతుని రామలక్ష్మణుల చిహ్నాంబు లడుగుట :**

హనుమంతుడు చెప్పిన రామకథను విని సీతాదేవి ప్రీతియుక్తముగా నిట్లు మాటలాడెను. "ఓ హనుమా! నీవు రామునెచ్చట గలిసికొంటివి? లక్ష్మణు నెట్లెరుగుదువు? వానరులగు మీరు రామలక్ష్మణులతో గలిసికొనుట యెట్లు జరిగినది? వానరుడవగు హనుమా! రాముని చిహ్నములేవో, లక్ష్మణుని గుర్తులేవో మఱల తెల్పుము. నీవట్లు తెలియజేసిన నాకు విచారము తగ్గును. రామలక్ష్మణుల అవయవ సౌష్ఠవము, రూపము, ఊరువులు (తొడలు), బాహువులు (చేతులు) ఎట్టివో నాకు తెలియజేయుము" అని సీత యిట్లు పలుకగా వాయుపుత్రుడగు హనుమంతుడు రాముని స్వరూపమున్నది యున్నట్లుగా నిట్లు వర్ణింపజొచ్చెను. "ఓ కమలముల వంటి కన్నులు గల విదేహరాజపుత్రీ! నీకు వారి యొక్క రూపములు తెలిసియుండియు నా భాగ్యముచే నన్నిట్లు నీ భర్తయగు రాముని యొక్కయు, మరదియగు లక్ష్మణుని యొక్కయు అవయవ సౌందర్యమును జెప్పుమని యడుగుచున్నావు. ఓ విశాలాక్షీ! రాముని చిహ్నములు, లక్ష్మణుని లక్షణములు నాకు తెలిసిన విధముగా చెప్పెదను వినుము. ఓ జనకరాజపుత్రీ! నీ భర్త రాముడు సర్వాంగ సుందరుడు. తామర రేకులవంటి కన్నులు గలవాడు. సకలజీవుల మనస్సులను ఆనందింపజేయువాడు సౌందర్యము మొదలగు దేహ గుణములు, దయ మొదలగు ఆత్మ గుణములు గలవాడుగా జన్మించెను. (ఇవి రామునికి సహజములైన గుణములు) ఆయన తేజమునందు సూర్యసమానుడు. కీర్తియందు దేవేంద్రుని బోలినవాడు. ఆయన సకలజీవులను గాపాడువాడు. తనవారిని రక్షించువాడు. తన నడవడిని ధర్మమును రక్షించుకొనువాడు. శత్రువు

లను పీడించువాడు. అమ్మా! రాముడు నాలుగు వర్ణములతో గూడిన సకల ప్రపంచమును రక్షించువాడు. లోకము యొక్క మర్యాద ప్రకారము తాను నడచి తక్కినవారిని నడిపించగలవాడు. ఆయన మహా తేజశ్శాలి. సజ్జనులచే అధికముగా పూజింపబడువాడు. బ్రహ్మచర్య వ్రత నిష్ఠగలవాడు. (గృహస్థాశ్రమము నందున్నవాడు బ్రహ్మచర్యమును బాటించుట యనగా ఋతు సమయములందు దప్ప తక్కిన సమయములలో స్త్రీలతో సంగమింపకుండుట యని యర్థము) సజ్జనులకుపకారము చేయనెరింగినవాడు. ఐహికములు నాముష్మికములునైన కర్మల వలన సంభవించు ఫలములను చక్కగా నెరిగిన వాడు. రాముడాన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతియను నీ నాల్గు విద్యలందును సుశిక్షితుడు, బ్రాహ్మణులను సేవించువాడు, ఆప్తహితుడు, సదాచార సంపన్నుడు, వినయవంతుడు, శత్రువుల నణచువాడు, యజుర్వేదమునందాసక్తి గలవాడు, వేదవిదులచే పూజింపబడువాడు. ధనుర్వేదమందును, తక్కిన వేదములందును, వేదాంగములందును నిష్ణాతుడు. రాముడు విశాలమైన మూపురము గలవాడు. పెద్ద బాహువులు గలవాడు. శంఖమువంటి కంఠము గలవాడు. శుభప్రదమైన ముఖము గలవాడు. కనబడని మెడక్రింద గల సంధుల సొంపు గలవాడు. చివఱలందెఱ్ఱనైన నేత్రములు గలవాడు. ఆయన జనులలో ప్రసిద్ధి పొందినవాడు. భేరీధ్వని బోలు కంఠధ్వని గలవాడు. నిగనిగలాడు దేహచ్ఛాయ గలవాడు. పరాక్రమశాలి, హెచ్చుతగ్గులు లేక సమమైన శరీర ప్రమాణములు గలవాడు. సమవిభక్తములైన అవయవముల పొందిక గలవాడు. శ్యామలమైన వర్ణము గలవాడు. సింహమువలె సన్నని నడుము గలిగినవాడు. గొప్ప హనునాసౌష్ఠములు గలిగి హనునాసౌష్ఠుడన బరగినవాడు. స్వచ్ఛమగు ప్రతాపము కీర్తి తెల్లని దంతములు నేత్రములు పరిశుద్ధములగు మాతృపితృ వంశముల వలన ద్విశుక్లుడనబడువాడు. దృఢ వక్షస్థలము, దృఢముష్టి, దృఢకరములు కలిగి త్రిస్థిరుడనబడువాడు. పొడవగు గొప్ప కనుబొమలు, బీజములు, చేతులు

శరీరము గలిగియుండి త్రిప్రలంబుడనబడువాడు. సమమగు వెంట్రుకల కొనలు, రెండువైపుల సమమగు వృషణములు, సమమగు జానువులు నుండి త్రిసము డనబడువాడు, ఉన్నతమగు ముక్కు, పొట్ట, వక్షస్తలము గలిగి త్ర్యున్నతు డనబడువాడు. అమ్మా! సీతాదేవీ సత్యధర్మపరుడగు రాముడు స్నిగ్ధమగు పాదరేఖలు, తలవెంట్రుకలు, శేషువు, గంభీరమైన నడక కంఠధ్వని నాభి కలిగి యుండి త్రిగంభీరుడుగా చెప్పబడువాడు. జానకీ! ప్రస్ఫుటమగు నరుణ కాంతితో నొప్పు అరచేతులు, అరకాళ్ళు, అందమైన కనురెప్పలు గలిగి శ్రీరాముడు త్రితామ్రుడనదగినవాడు. పొట్టపై మూడు కంఠమున మూడు రేఖలు గలిగి భూభృచ్ఛేఖరుడగు రాముడు తన శరీర వైఖరిచే త్రివళివంతుడుగా చెప్పబడు వాడు. జానకీ! ఆ శాంతమూర్తి స్తనములందు, స్తనాగ్రములందు, పాదములందు నిమ్నరేఖలు గలిగి త్ర్యవనతుడుగా నొప్పుచున్నాడు. తరుణీ! శ్రీరాముడు శిరమున నరుదైన మూడు సుడులు గలిగి యుండి త్రిశీర్షవంతునిగా నెన్న బడినవాడు, అబలా! పూర్వాహ్ణ, మధ్యాహ్న, అపరాహ్ణములందు ధర్మార్థకామములను నియమముతో అనుష్ఠించుట చేతను, త్రికాలములందు ధర్మానుష్ఠానము చేయువానిగా సూచించు చిహ్నముల చేతను దాశరథి త్రిభి ర్వ్యాప్తిగా ప్రసిద్ధి పొందియున్నాడు. అమ్మా! స్వేదముగాని నరములుగాని కన్పించని పాదములు, రోమ కూపమునందొక్కరోమముండుట, పొడవుగాని శేషము, మాంస రహితమైన వస్తి కలిగియుండి రామచంద్రుడు చతుర్వ్యంగు డైనాడు. మరియు నాలుగు వేదములను సూచించు నాతని తనువున నాలుగు రేఖలున్నందున చతుర్వ్యష్కలు డనదగియున్నాడు. ఎనిమిది యడుగుల పొడవుగల శరీరము గలిగియుండి అమోఘవీర్యుడై యున్నందున లక్ష్మణాగ్రజుడు చతుష్కిష్కుడని యెన్న దగినవాడు. ముఖమున పాదములందు దీర్ఘాయువును సూచించు నాలుగు రేఖలు వరుసగా నున్నందున చతుర్లేఖుడుగా కౌసల్యాసుతుడు ప్రసిద్ధుడై యున్నాడు. పంక్తిరథపుత్రడు సమమగు రెండు భుజములు సమమగు గండస్థలములు, సమమగు తొడలు, సమమగు జంఘును గలిగి చతుస్సము

డనబడుచున్నాడు. నిగ్రహానుగ్రహ సమర్థుడగు రాముడు రెండువైపుల నాలుగు కోరలు గలిగి చతుర్దంష్ట్రుడనబడుచున్నాడు. ఆయనఘుడు వృషభ మదగజ వ్యాఘ్ర సింహగతులు గలిగి చతుర్గతుడుగా ప్రసిద్ధుడు. శ్రీరాముడు మృదువగు ముఖము, గోళ్ళు, మెత్తని వెంట్రుకలు, మృదువగు మాటలు గలిగి పంచస్నిగ్ధుడన దగియున్నాడు. సీతాదేవీ! నీ ప్రాణనాథుడు కుక్షి, ముఖము, నాసిక కక్ష వక్షస్థలములు కంఠము నున్నతములుగా గలిగియుండి షడున్నతుడైయున్నాడు. ఆ సత్యవచనుడు దీర్ఘమగు వెన్నెముక హస్తములు పాదాంగుళులు, శరీరము, లోచనములు, కర్ణములు, నాసిక చేతులు గలిగి అష్టవంశ వంతుడనగా నొప్పి యున్నాడు. దాశరథి వ్రేళ్ళ కణుపులు, లేపము, వెంట్రుకలు, చర్మము, గోళ్ళు, బుద్ధి, శ్మశ్రువులు, దర్శనము, నడుము సూక్ష్మమయి, నవతనుడని విఖ్యాతి నొందినాడు. ఆ శౌర్యశాలి పద్మసదృశములగు వదనము, జిహ్వా, అధరము, కపాలము, పాణులు, నఖములు ముఖము, స్తనములు, నయనములు, పాదములు కలిగి యుండి దశపద్ముడైయున్నాడు. ఆ దేశకాల విభేదికి కంఠము, శిరస్సు, వక్షము, చెవులు, నుదురు, హృదయము, హస్తములు, చరణములు, పిరుదులు, అధరము గొప్పగా నుండి దశబృహత్తన బడుచున్నాడు. వైదేహీ! రామభద్రుడు కనుబొమ్మలు, నేత్రములు, చెవులు, నాసికాపుటములు, చూచుకములు, పెదవులు, మోకాళ్ళు, వృషణములు, మోచేతులు, కటి ప్రదేశము, మణికట్టులు, పాదులు, పిరుదులు, పాణితలములు ననుపదునాలుగు ద్వంద్వములు సమముగా గల్గి సమద్వంద్వుడనబడుచున్నాడు. రాముడు సత్యధర్మరతుడు. సత్య పరాక్రముడు. సత్యవర్తనుడు. సత్యవాది, శాంతుడు, అనఘుడు, దుందుభిస్వనుడు, శౌర్యశాలి, పురుషసింహుడు, దృఢవ్రతుడు, ప్రతిజ్ఞా పాలకుడు, నీలమేఘశ్యాముడు, ప్రజనుండి ధనమును సంగ్రహించుట యందును దానము నందును సాటిలేని నేర్పరి. ఆయన శ్రీమంతుడమ్మా! రాముని తమ్ముడు ద్వైమాతురుడు నగు లక్ష్మణుడు యుద్ధమున జయింపరాని వాడు. సద్గుణములచేతను, ప్రేమ చేతను శ్రీరాముని వంటివాడు.

**సీతాదేవికి హనుమంతుడు శ్రీ రామ సుగ్రీవుల సమాగమ విధము చెప్పుట:**

ఓ సీతాదేవీ! వారు నిన్ను భూమండలమున వెదకుచు మా ప్రదేశమునకు వచ్చిరి. (పైన జెప్పిన రాముని శరీర చిహ్నములు కొన్ని వస్త్రము మరుగున నుండి సీతకుదప్ప నితరులకు తెలియరానివి. అట్టివి శాస్త్రజ్ఞాన బలముచే నూహించి యౌచిత్యము ననుసరించి తనతో నెట్లు చెప్పవలెనో అట్లు సరిగా చెప్పగలిగెనేని నితడు నమ్మదగిన వాడని సీత తలంపు. కావుననే యిట్టి విషమ ప్రశ్న) (జన్మనిచ్చుటచే సుమిత్రయు రాముని వలె పెంచుటచే కౌసల్యయు లక్ష్మణునికి తల్లులే. ఇద్దఱు తల్లుల ముద్దుబిడ్డ గావుననే లక్ష్మణుని ద్వైమాతురు డనుట) నరులలో శ్రేష్ఠులైన రామలక్ష్మణు లిరువురును, నిన్ను జూచుటకై భూమండలమెల్ల వెదకుచు మమ్ము గలిసికొనిరి. నిన్ను వెదకు ప్రయత్నములో భూమియంతయును దిరుగుచు వారు అన్నచే రాజ్యాధికారమునుండి తొలగింప బడిన వానరరాజగు సుగ్రీవుని జూచిరి. అన్నయగు వాలివలని భయముచే పీడితుడై అనేక వృక్షములతో నిండి యున్న ఋశ్యమూక పర్వతపు వెనుక భాగమున కూర్చొని యున్నవాడును, చూచువారలకు ప్రీతి కలిగించువాడునగు ఆ సుగ్రీవుని రామలక్ష్మణులు చూచిరి. అట్లు తన అన్నచే రాజ్యమునుండి తరుమబడిన వాడైనను ప్రజ్ఞావంతుడుగు నా వానరరాజగు సుగ్రీవుని మంత్రుల మగు మేము వీడక సేవించుచునే యుంటిమి. అంత నా రామలక్ష్మణులు నార వస్త్రములు ధరించి శ్రేష్ఠములగు విండ్లను చేతులందుబూని ఋశ్యమూక పర్వతపు సుందరమైన ప్రదేశమునకు జేరిరి. వానర శ్రేష్ఠుడు సుగ్రీవుడు కోదండములు ధరించి వచ్చిన రామలక్ష్మణులను జూచి భయముచే కలత నొంది ఆ ఋశ్యమూక పర్వతము పై కెగిరి పోయెను. అట్లెగిరి పోయి సుగ్రీవు డాపర్వత శిఖరముననే నిలిచి రామలక్ష్మణుల చెంతకు వేగముగా నన్నుబంపెను. నేను సుగ్రీవునాజ్ఞగొని సౌందర్యాది శుభలక్షణములుగల వారును, నరశ్రేష్ఠులును, రాజపుత్రులును అగు రామలక్ష్మణుల చెంతకు వెళ్ళి చేతులు జోడించి నిలబడితిని. నేను వారికి మా ప్రభువైన సుగ్రీవుని యథార్థ స్థితిని దెల్పగా వారు మిక్కిలి

ప్రీతిగలవారైరి. అంతనే నా పురుష శ్రేష్ఠులను నా భుజములపై నెక్కించుకొని సుగ్రీవుడున్న ప్రదేశమునకు తీసికొని పోయితిని. సుగ్రీవునకు వారిరువురి వృత్తాంతమును యథాతథముగా వినిపించితిని. పిమ్మట ఒకరితో నొకరు మాటలాడు కొనుటచే రామసుగ్రీవుల కొకరి యందొకరికి ప్రీతి కలిగెను. అట్లొండొరులపై ప్రీతిగలిగిన యా రామసుగ్రీవులు తమ తమ కడచిన వృత్తాంతముల నొకరి కొకరు తెలుపుకొనుచు, నొండొరుల కూరట కలిగించుకొనిరి. రాముడంత స్త్రీ కారణముగా తేజశ్శాలియగు నన్నచే గెంటి వేయబడిన సుగ్రీవునోదార్చెను. లక్ష్మణుడు నీవు కనిపించకపోవుటచే రామునకు కలిగిన దుఃఖమును సుగ్రీవునకు నివేదించెను. ఆ సుగ్రీవుడును లక్ష్మణుడు చెప్పిన వృత్తాంతమును విని గ్రహణము పట్టిన సూర్యుని వలె మిక్కిలి కాంతి హీనుడయ్యెను. అంత నీవు రావణునిచే దొంగలింపబడుచున్నప్పుడు నీ శరీరము మీది యే ఆభరణములను తీసి భూమిపై పడవైచితివో వానినన్నిటిని వానర ముఖ్యులు సంతోషముతో తీసికొని వచ్చి రామచంద్రునకు చూపించిరి. కాని నీవెచ్చటనున్నది తెలియని వారగుటచే నేమియు చెప్పజాలరైరి. పూర్వము నీ వాయాభరణములు పడవైచి నపుడేదో ధ్వని వినిపించగా వానినపుడు నేనే తీసి మారాజున కిచ్చితిని. ఆ ఆభరణములనే సుగ్రీవుడు రామునకిచ్చెను. రాముడు వానిని చూడగనే దుఃఖముతో తెలివి దప్పినాడు. మేమాతనిని సేద దేర్చితిమి. దేవత వలె ప్రకాశించు రాముడాయాభరణముల నొడిలో నిడుకొని పలువిధములుగా విలపించెను. ఆ యాభరణములను చూచుచు విలపించుచు దైన్యమునందుచున్న రాముని శోకమను నగ్ని దహింపజొచ్చెను. ఆ మహాత్ముడట్లు దుఃఖపీడితుడై చాలా తడవు నేలపై బడియుండెను. నేనెన్నియో సాంత్వన వాక్కులచే ఆయనను లేవనెత్తితిని.

**శ్రీరాముని విరహతాపమును హనుమంతుడు సీతకు చెప్పుట :**

అట్లు రాముడానగలను జూచి చూచి వానర రాజుకిచ్చెను. తిరిగి వానిని లక్ష్మణునకు జూపెను. ఓ సీతా! నీ భర్త నిన్ను విడచి యెల్లప్పుడు మంటలతో

నుండు అగ్నిపర్వతమువలె తపించుచు శోకమున మునిగెను. నీ కొఱకై రాముడు నిద్రలేకుండుట, శోకము, చింత అను నీ మూడగ్నులు జ్వలించు అగ్ని గృహము నందున్నట్లు తపించుచున్నాడు. ఓ పూజ్యురాలా! నీవు కనబడకుండుటచే రాముడు భూకంపముచే గదలు పెద్ద కొండవలె కంపింపజేయబడుచున్నాడు. సుందరమైన వనప్రదేశములందును, నదీ తీరములలోను, జలపాతములు గల ప్రదేశములలోను తిరుగుచు గూడ రాముడు నిన్నుగానని కారణమున ఆనందించుట లేదు. ఓ జనకరాజపుత్రీ! మనుజ శ్రేష్ఠుడగు రాముడు రావణుని నాతని మిత్రులను గూడ చంపి నిన్ను చేరగలడు. అంతట వాలిని సంహరింతునని రాముడును, నిన్ను వెదకింతునని సుగ్రీవుడు ప్రతిజ్ఞలు చేసికొనిరి. వీరులగు రామ లక్ష్మణులు సుగ్రీవునితో కిష్కింధకు వచ్చి యుద్ధమున వానర రాజగు వాలిని సంహరించిరి. రాముడు సమస్తమైన కోతులు, ఎలుగుబంట్లు గల వానర రాజ్యమునకు సుగ్రీవుని రాజుగా జేసెను. ఓ దేవీ! ఈ విధముగా రామసుగ్రీవుల మైత్రి యేర్పడినది. నేనారామ సుగ్రీవులు పంపగా వచ్చిన దూతను. సుగ్రీవుడు తిరిగి తన రాజ్యమును బొంది మహాబలులగు వానర శ్రేష్ఠులను బిలిపించి నిన్ను వెదకుటచే వారలను దశదిశలకును బంపించెను. మహాపరాక్రమ శాలియైన వానరరాజగు సుగ్రీవునిచే ఆజ్ఞాపింపబడినవారై గొప్ప పర్వతముల వంటి పెద్ద శరీరములు గల వారైన వానరులు భూమిపై అన్ని వైపులను వెదకిరి. సుగ్రీవుని యాజ్ఞకు భయపడు వారమైన నేనును తక్కిన వానరులు నిన్ను వెదకుచు భూమిపై అన్ని చోటులను వెదకుచుంటిమి. శ్రీమంతుడును, వాలిపుత్రుడును, మహాబలశాలియు, కపి శ్రేష్ఠుడునగు నంగదుడు వానర సైన్యమున మూడింట నొకవంతు సైన్యముతో నిన్ను వెదకుటకు బయలుదేరెను. నిన్ను వెదకుచు వింధ్య పర్వత బిలములో బ్రవేశించి మళ్లి వచ్చుదారి తెలియక మిగుల దుఃఖమును బొందితిమి. అచ్చటనే కొన్ని దినములు గడచినవి. గుట్ట గుట్టను చెట్టుచెట్టును విడువక వెదకితిమి,

కాని జనకరాజపుత్రీ! నీ జాడ తెలియదయ్యెను సుమా! అట్లు దురవస్థల పాలై మేము కార్యము నెఱవేరునను ఆశను వీడి గడువు కాల మతిక్రమించుటచే మారాజైన సుగ్రీవుడు భయంకరమైన దండన విధించునని భయము చెందిన వారమై మేము ప్రాణములను విడవ సిద్ధపడితిమి.

**హనుమంతుడు సీతతో తనకామె యున్నచోటు తెలిసిన విధము చెప్పుట :**

అట్లు వానరులందరును ప్రాయోపవేశము చేయుటను చూచి అంగదుడు శోక సాగరమున మునిగి వగచెను. నీవు కనబడకుండుట, తండ్రియగు వాలి మరణించుట, మేమెల్లరము ప్రాయోపవేశము చేయుట, నీ వృత్తాంతము నెఱిగిన జటాయువు మరణించుట తలంచి అంగదుడు మిక్కిలి దుఃఖించినాడు. మా యజమానియైన సుగ్రీవు డిచ్చిన గడువు ఒక్క మాసము. ఆ లోపల తిరిగి రానిచో శిక్షింతునని ఆజ్ఞయగుటచే మాకు జీవితాశ సన్నగిల్లినది. మరణింప నిశ్చయించుకొన్నవారమైతిమి. అప్పుడు మహాత్ముడు, పరాక్రమశాలి, యగు జటాయువు యొక్క సోదరుడు పక్షిరాజగు సంపాతి మాపని కోసమే వచ్చినట్లక్కడికి వచ్చెను. అతడు తన సోదరుడు మరణించెనని విని కోపముతో నిట్లు పలికెను. "ఓ వానర శ్రేష్ఠులారా! నా తమ్మునెవరు చంపిరి? అతడెచ్చట పడియున్నాడు? ఆ విషయము నేను మీ వలన వినగోరుచున్నాను". అని అమ్మా! అంతట అంగడుడు నీ కొఱకై జనస్థానమున రాక్షసుడగు రావణుడు జటాయువును భయంకరముగా వధించుటను యథాతథముగా వర్ణించి చెప్పెను. అంత జటాయు మరణ వార్తను విని దుఃఖించినవాడై యరుణపుత్రుడగు సంపాతి నీవు రావణుని యింటిలో నున్నట్లు చెప్పినాడు. ఆ సంపాతి మాకు సీతాదేవీ! నీ యున్న చోటును చెప్పగా సంతోషముతో అంగదుడు మొదలైన మేమందఱము వేగముగా బయలు దేరితిమి. ఆనందము కలిగిన వానరుల మందఱము వింధ్య పర్వతము నుండి బయలుదేరి సముద్రపు టుత్తర తీరమును చేరితిమి. అంగదుడు మొదలగు అందఱు నీ దర్శనము చేయవలెనను కోరికతో సముద్రతీరమును

జేరి సముద్రమును జూచి భయము చెందిరి. నేనప్పుడు సముద్రమును చూచి విషాదము నందిన వానర సైన్యము యొక్క భయము తొలగించి ఈ నూఱు యోజనముల దూరము నెగిరితిని. రాక్షసులతో చుట్టబడిన ఈ లంకలో రాత్రివేళ ప్రవేశించితిని. రావణుని చూచితిని. శోకముతో నిన్ను కాంచగల్గితిని. వర్ణింప దగిన సౌందర్యము గలదానా! జరిగిన విధమెల్లను నీకు యథాతథముగా తెలియజేసితిని. నేను రాముని దూతను. నాతో మాటలాడుము. ఓ దేవీ! నేను రామకార్యార్థమై నీ కొఱకై వచ్చినవాడను. సుగ్రీవుని మంత్రిని. వాయుపుత్రుడను అని తెలిసికొనుము. సకల ధనుర్విద్యావంతలలో శ్రేష్ఠుడగు నీ భర్త రామునకు కుశలము. తన అన్న సేవలో మునిగి యున్నవాడు, యోగ్యమైన లక్షణములు గలవాడునగు నీ మరది లక్ష్మణునకు కుశలము. ఓ సీతా! పరాక్రమ శాలియగు నీ పతియొక్క హితమును గోరు మా రాజైన సుగ్రీవుని యాజ్ఞచే నేనొక్కడనే ఇచ్చటికి వచ్చితిని. నీవు కనిపించక దుఃఖించుచున్న వానరసేన యొక్క భాగ్యవశముచే నీవు కనబడితివని చెప్పి వానరుల సంతాపమును దీర్తును. అమ్మా! నా యదృష్టముచే నేనీ సముద్రమును దాటుట నిష్ఫలము కాలేదు. నా భాగ్యముచే నిన్ను దర్శించుట వలన లభించు కీర్తిని పొందెదను. మహా పరాక్రమ శాలియగు రాముడు రాక్షసరాజగు రావణుని నతని బంధుమిత్రులతోగూడ సంహరించి వేగముగా నిన్ను చేరగలడు.

(1. సాముద్రిక చిహ్నములను చెప్పుట. కొండమీద నున్న యేవురు క్రోతులము మేమే నీ సొమ్ములు దాచితిమని చెప్పుట స్నేహముకు దురుటకు సరియైన కారణము. సంపాతి కొడుకును రావణుడు మార్గమడిగి కొనుట యివి యన్నియు సీత విశ్వసింప గారణములు.)

**హనుమంతుడు సీతాదేవికి తన జన్మవృత్తాంతమును చెప్పుట :**

అని చెప్పి హనుమయిట్లనెను. "మాల్యవంతమను నొక ఉత్తమమైన పర్వతమున్నది. అచ్చటనుండి కేసరియను వానరుడు గోకర్ణ క్షేత్రమున కేగెను.

ఆ మహాకపియగు నా తండ్రి కేసరి దేవర్షులచే నియమింపబడినవాడై సముద్ర తీరమందలి పవిత్రమైన యొక తీర్థమున తీవ్రముగా నుపద్రవములు కలిగించుచున్న శంబసాదనుడను రాక్షసుని సంహరించెను. ఓ సీతా! నేనాకేసరి భార్యయగు అంజనయను నామెకు నా తండ్రి దేశాంతరమున నుండగా వాయు దేవుని వలన జన్మించితిని. నేను చేసిన యొకానొక పని చేతనే హనుమంతుడని ప్రసిద్ధినందితిని. ఓ విదేహరాజపుత్రీ! నీకు నమ్మిక పుట్టుకై నీ భర్త గుణగణములను చెప్పితిని. ఓ పుణ్యవతీ! శ్రీఘ్రమే రాముడు నిన్నిటనుండి తీసికొని పోగలడు.” అని ఈ విధముగా హనుమ చెప్పగా శోకముచే పీడింప బడిన సీతాదేవి ఇదివఱకు చెప్పబడిన హేతువులచే నమ్మకము కలిగినదై ఆ గుర్తులచే అతడు దూతయే యని తెలిసి కొనెను. సీత హనుమంతుని మాటల కమితానందము నందెను. వంకరలైన కనుబొమ్మలు గల కనులనుండి ఆనంద బాష్పములను విడువజొచ్చెను. ఎఱ్ఱని కొసలు గలిగి తెల్లనై విశాలములైన కన్నులు గల ఆ సీతాదేవి ముఖము రాహువు విడిచిన చంద్రుని వలె ప్రకాశించెను. ఈతడు వానరుడే. నేను సందేహించినట్లుగా రావణుడు కాడు అని సీత తలంచెను. అది గమనించి హనుమంతుడు సీతతో నిట్లనెను. “ఓ సీతాదేవీ! నేను విషయమంతయు విశదముగా చెప్పితిని. నీ వింక దుఃఖింపకుము. నేనేమి చేయవలయునో చెప్పుము. ఆపై నేను పోయి వచ్చెదను. ఓ మంచి శీలము గలదానా! నేను వాయునందనుడనగుటచే వేగము బలము మున్నగు గుణములచే తండ్రితో సరిపోలువాడను. కేవల వానరుడను సందేహమును బూనదగదు.”



# ముప్పది యాఱవ సర్గము

**హనుమంతుడు సీతాదేవికి శ్రీరామముద్రిక నిచ్చుట :**

మహాతేజశ్శాలియగు వాయు పుత్రుడు సీతకు విశ్వాసము కలుగుటకై మఱల నిట్లనెను. "మహాభాగ్యవతియగు నోదేవీ! నేను వానరుడను. ధీమంతుడగు రాముని దూతను. రామ నామము లిఖింపబడిన యీ యుంగర మును జూడుము. నీకు నాపై విశ్వాసము కలుగవలెనని మహాత్ముడగు రాము డీ యుంగరమును నాకీయగా తెచ్చితిని. నీ వింక నూరడిల్లుము." అనగా సీతాదేవి రాముని చేతి కలంకారముగా నుండు ఆ యుంగరమును తీసికొని చూచుచు తన పతి చెంతకు చేరిన దానివలె ముదమందెను. (మాయరూపము గాదనుటకై స్వజన్మకథనము. భాషించుట యనగా నీ వెవ్వరనిన నీవెవ్వరని క్రొత్త వారి వలె నేవో ముచ్చట లాడుట. అభిభాషించుట యనగా ఎవ్వరు నెఱుగని యంతఃపుర రహస్యముల గూడ చెప్పుటయని సంప్రదాయార్థము) కొనలయందెఱ్ఱనివై చుట్టును తెల్లని వైన విశాల నయనములతో సుందరమైన ఆమె ముఖము రాహువు విడిచిన చంద్రుని వలె ప్రకాశించెను. అంత నా సీత స్త్రీ స్వభావమగు సిగ్గు చెందినదై తన భర్త పంపిన సందేశముచే పులకించినదై మిక్కిలి సంతోషించుచు హనుమంతునిట్లు ప్రశంసించెను.

**సీతాదేవి హనుమంతుని ప్రశంసించి శ్రీరామాదుల కుశల మడుగుట :**

"హనుమా! నీవు విక్రమ శాలివి. సమర్థుడవు. ప్రాజ్ఞుడవు నగుటచే ఒంటరిగా ఈ రాక్షస స్థానమగు లంక నెదిర్చితివి. నూఱు యోజనముల వెడల్పు గలది మొసళ్ళ నివాసమైనది యగు సముద్రమును మెచ్చదగినట్లు గోష్పాదమునువలె ఎగురుచు దాటితివి. (ఇచ్చట విక్రమ సమర్థతా ప్రాజ్ఞతా

శబ్దములచే వ్యక్తమముగా జ్ఞానశక్తి బలములు చెప్పబడినవి రాక్షస స్థానమనుటచే ప్రజ్ఞను, ఒంటరిగా ననుటచే సామర్థ్యమును, ఎదిర్చితివనుటచే విక్రమమును సూచించుట జరిగినది) ఓ వానర శ్రేష్ఠా! నేను నిన్నొక సామాన్యునిగా భావింపను. ఏలననగా రావణుడన్న నీకు భయముగాని తొట్రుపాటు గాని లేదు. ఓ కపి శ్రేష్ఠుడా! నీవు విష్ణు సమానుడగు రామునిచే పంపబడినవాడ వగుటచే నాతో మాటలాడ దగుదువు. ఎదిరింపరాని పరాక్రమము గలిగిన ఆయన పరీక్షింపక యెవ్వరిని పంపడు. విశ్లేషించి నాకడకు పరాక్రమము తెలిసికొనకుండ ఎవ్వనిని బంపడు. ధర్మాత్ముడు సత్యమైన ప్రతిజ్ఞ కలవాడునగు రామచంద్రుడు నాభాగ్యవశముచే కుశలముగనున్నాడు. మహా తేజశ్శాలి సుమిత్రాదేవి యానందమును పెంపొందించువాడు నగు లక్ష్మణుడును క్షేమముగ నున్నాడు. ఆ రాముడు క్షేమముగ నున్నచో సముద్రముచే చుట్టబడిన యీ భూమిని విజృంభించిన ప్రళయాగ్నివలె దహింపగలడు. రామలక్ష్మణులు దేవతలనైనను రాక్షసులనైనను దహింపగల సమర్థులు. అట్లయ్యును వారు రావణుని వధింపకుండుటచే నా దుఃఖమున కిక అంతము లేదని తలంతును. రాముడు నన్నెడబాసి కృశింపలేదు గదా. దుఃఖించుట లేదుగదా. నన్ను తిరిగి సంపాదించుటకై ఆ పురుషోత్తముడైన రాముడు ప్రయత్నింప కుండనా? నన్ను తిరిగి సంపాదించుటకు రాముడు ప్రయత్నించుచున్నాడా? రాముడు దైన్యమును పొందడు గదా? మనస్సు విభ్రమము పొంది కార్యములు పాడు చేయడు గదా? ఆ రాజపుత్రుడు పురుష కారము నేమరుట లేదు గదా? శత్రువులను పీడించు వాడగు ఆ రాముడు మిత్రులయెడ ప్రీతుడై దానమును నుపాయమును సేవించుచున్నాడా? శత్రువుల విషయమున భేదమను మూడవ యుపాయమును ప్రయోగించుచున్నాడా? (మిత్రుల యెడ భేదదండములను, శత్రువులయెడ సామోపాయమును ప్రయోజనము లేని వని భావము) మిత్రులకుపయోగపడుచు వారికడ కేగునా? మిత్రులనాదరించునా? రాజపుత్రుడగు రాముడు దేవతల యనుగ్రహమును కోరుచున్నాడా? తన బలముతో బాటు దైవబలమును గూడ

పొందుచున్నాడా? చిరకాలము నన్నెడబాయుటచే నాయందనురాగమును విడువలేదు కదా? వానరశ్రేష్ఠా! నన్నీ కష్టముల నుండి రాముడు విడిపించునా? రాముడెల్లప్పుడు సుఖములనుభవింప దగినవాడు. దుఃఖములనుభవింప దగినవాడు కాదు. భరింపరాని యిట్టి దుఃఖమును పొంది ఆయన నశింపడు గదా? కౌసల్యకు సుమిత్రకు భరతునకు కుశలమే గదా? మంచివాడగు రాముడు నా కొఱకు శోకముతో పరితాపమునందడు గదా? ఆయన కార్యాంతరాసక్తుడు కాడు గదా? నన్నీ యాపద నుండి దాటించునా? అన్నపై యనురాగము గల భరతుడు భయంకరమైనదియు, మంత్రులచే కాపాడబడునదియు, ఒక అక్షౌహిణీ పరిమాణము గలదియునగు సేనను నా కొఱకు పంపునా? శ్రీమంతుడును వానరరాజును అగు సుగ్రీవుడు దంతములు గోళ్లు ఆయుధములుగా గల వానరవీరులతో గూడి నన్ను కాపాడుటకై వెడలివచ్చునా? శూరుడును, సుమిత్ర యానందమును వృద్ధినందించువాడును వివిధ శస్త్రాస్త్ర కోవిదుడును అగు లక్ష్మణుడు బాణ సమూహములతో రాక్షసులను చెండాడునా? భయంకరముగా ప్రజ్వలించు నస్త్రములతో కొట్టబడి రావణుడు కొద్దిరోజులలోనే మిత్ర బృందములతో నశించునా? బంగారు వర్ణము గలదియు పద్మమువలె సువాసన గలదియు నగు రాముని ముఖము నేను దగ్గరలేకుండుటచే వేసవి యెండ వేడిమిచే పద్మమువలె వాడిపోలేదు గదా. ధర్మమును దృష్టిలో నుంచుకొని రాజ్యమును విడచి నన్ను కాలినడకన అడవికి తీసికొని పోయినపుడు కూడ భయమును శోకమును పొందని ధైర్యశాలియగు రాముడిప్పుడు కూడ మనస్సునందు ధైర్యమును కలిగియున్నాడా? రామునకు తల్లిగాని, తండ్రిగాని, మరెవ్వరు గాని స్నేహముచే నాతో సమానులుగాని శ్రేష్ఠులుగాని కాజాలరు. రామునకు నాపైనను, నాకాయన పైనను గలయను రాగమట్టిది. ఓ దూతా! నా ప్రియుడగు రాముని వార్త వినువరకే నేను జీవింపగోరుచున్నాను." అని యిట్లు సీతాదేవి వానర శ్రేష్ఠుడగు హనుమంతునితో అర్థవంతముగా మధురమగు మాటలను పల్కి రామ ప్రయోజనమునకై ఉపయోగపడు హనుమంతుని యొక్క

ప్రీతికరములగు మాటలను వినుటకై తాను చెప్పుట మానెను. భయంకరమైన పరాక్రమముగల హనుమంతుడు సీతకడ చేతులను జోడించి శిరసు నందుంచుకొని తరువాతి మాటలనిట్లు పలికెను.

**హనుమంతుడు సీతాదేవికి ధైర్యోక్తులు చెప్పుట :**

"కమలముల పంటి కన్నులు గల సీతాదేవీ! నీవిట నున్నట్లు రాముడెరుగడు కావుననే దేవేంద్రుడు శచీదేవిని వలె నిన్ను వెంటనే తీసికొని పోలేదు. నీవున్న చోటును నావలన విని రాముడు కోతులు ఎలుగుబంట్లతో గూడిన పెద్ద సేనను తీసికొని వెంటనే రాగలడు. రాముడు తన బాణ సమూహములచే సముద్రమును స్తంభింపజేసి లంకానగరమునకేతెంచి రాక్షసులను జంపగలడు. అట్లు రాముడు శత్రువులను సంహరించుటకు ప్రయత్నించుచుండగా మధ్యలో స్వయముగా యముడే యెదురైనను, రాక్షసులతో గూడి దేవతలే వచ్చి అడ్డుపడినను వారిని గూడ రాముడు సంహరింపగలడు. పూజ్యురాలా! రాముడు నిన్ను చూడక దుఃఖమున మునిగినవాడై సింహముచే పీడింపబడిన ఏనుగువలె సుఖమును పొందుట లేదు. నీవు శీఘ్రకాలములోనే చక్కని కన్నులు గలదియు, సుందర మైనదియు, దొండపండు వంటి పెదవి గలదియు సుందరములగు కుండల ములు గలదియునగు రాముని ముఖమును ఉదయించిన పూర్ణచంద్రునివలె చూచెదవని మేము సంచరించు మలయ పర్వతము, వింధ్యము, మేరువు, మందరము, దర్దురము అను పర్వతముల పైనను మేము తిను కంద మూల ఫలముల పైనను శపథముచేసి చెప్పుచున్నాను. దేవీ! నాకస్థానమున దేవేంద్రుని వలె ప్రస్రవణ పర్వతము నధిష్ఠించియున్న రాముని చూడగలవు. రాముడిప్పుడు విరక్తిచే మాంసము భుజించుట లేదు. మద్యము త్రావుట లేదు. వానప్రస్థులకు యోగ్యమైన యన్నమును ప్రాతస్సు, సంగవము, మధ్యాహ్నము, అపరాహ్ణము, సాయాహ్నము అను నైదు కాలములలో నాల్గు కాలములను విడచి కేవలము సాయంకాలము ప్రాణములు నిల్పుటకై తినుచున్నాడు. (1. ముద్రికవలె కుండలములను విడువలేదు. 2. మాంసము రుచికరముగ వాసన ద్రవ్యములతో

గృహంబున భోగ్యముగా పక్వము చేసిన మాంసము శ్రీరాముడు భుజింప లేదనియు, ఆపద్ధర్మముగా ఆకలి వేళకు పచ్చిదో వెచ్చిదో యెప్పుడేని గ్రహించె ననియు, క్షత్రియులకు మాంసాహారము నిషిద్ధము కాదనియు గ్రహింపవలెను.) తేనెను త్రావడు. రాముడు నిన్నే తలంచుచు శరీరముపై వ్రాలిన అడవి యీగలను గాని, దోమలను గాని, కీటకములను గాని తోలుకొనుట లేదు. పాములు మున్నగు సరీసృపములను గూడ గమనించుట లేదు. రాముడెల్లప్పుడు నిన్నే తలంచుచున్నాడు. ఎల్లప్పుడును నీకై శోకించుచున్నాడు. ఆయన కామపరవశుడై వేరేమియు స్మరించుట లేదు. ఆయన నిద్రించుటే లేదు. ఆ పురుష శ్రేష్ఠుడొకప్పుడు నిద్రించినను అకస్మాత్తుగా సీతా! యని మధురముగా పల్కుచు మేలుకొను చున్నాడు. పండుగాని, పూవు గాని, అందమైన మతే వస్తువుగాని వెంటనే నిన్ను గూర్చియే మాటలాడుచున్నాడు. వానప్రస్థాశ్రమము నవలంబించియును మహాత్ముడైన ఆ రాముడు నిత్యమును పరితాపము నందుచు హా! సీతా! యని నిన్నే పిలుచుచు నిన్ను పొందుటకే ప్రయత్నించుచున్నాడు." అని రాముని యవస్థను హనుమంతుడు చెప్పగా విని సీత శోకమును విడచినదై రాముని విచారముతో సమానమైన విచారము గలదై శరత్కాల ప్రారంభమున తెల్లని మేఘ శకలములచే నొకింత కప్పబడిన చంద్రునితో గూడిన రాత్రివలె ప్రకాశించియు ప్రకాశింపకయు నుండెను.



# ముప్పది యేడవ సర్గము

**సీతాదేవి హనుమంతునకు రావణుడు పెట్టినగడువును చెప్పుట :**

పూర్ణచంద్రుని బోలు మోముగల సీతాదేవి ఆ హనుమంతుని వాక్యములను విని హనుమంతునితో నిట్లు ధర్మయుక్తముగా పలికెను. "ఓ వానరుడా! నన్ను దక్క రాముడన్యులను తలంపకున్నాడనియు, శోక పరాయణుడయ్యెననియు నీవు చెప్పిన మాటలు నాకు విషము కలిపిన అమృతము వలె నున్నది. (నన్నే తలంచుట అమృత తుల్యము. శోకముతో నుండుట విష తుల్యము) నిండు నైశ్వర్యము కలిగినప్పుడు కాని, దారుణమైన కష్ట సమయమునందుగాని దైవము త్రాటితో గట్టిగా లాగినట్లు పురుషుని బంధించుకొని పోవును. ఓ వానరోత్తమా! నిశ్చయముగా దైవశక్తి నివారింప శక్యము గానిది. కావుననే రాముడు, లక్ష్మణుడు, నేను ఆపదలలో చిక్కినాము. చూడుము. సముద్రమున ఓడ మునిగిపోగా నీటియందీదవలసిన వానివలె రాముడీ శోకము నెప్పుడు గడవగలడు? రాక్షసులను వధించి రావణుని జంపి, లంకను నాశనమొనర్చి రాముడు నన్నెప్పుడు చూడగలడు? నీవింక తొందరపడుమని రామునకు చెప్పుము. రావణుడిచ్చిన గడువు కాలమగు సంవత్సరము ముగియు వఱకే నేను జీవింతును. ఓ వానరుడా! ఇప్పుడు పదియవ మాసము జరుగుచున్నది. ఆ గడువులో ఇంక రెండు నెలలు మిగిలియుండెను. రావణుని తమ్ముడగు విభీషణుడు నన్ను విడిపించి రామునకు సమర్పింపవలెనని ప్రయత్న పూర్వకముగా అన్న ననునయించినాడు. రావణుడా మాటలు పెడచెవిని బెట్టినాడు. నన్ను మఱల రామునకు సమర్పించుట రావణున కిష్టము గాదు. కాలాధీనుడైన యా రావణుని యుద్ధమున వశపరచుకొనుటకై మృత్యువు వెదకుచున్నది. ఓ వానరా! విభీషణుని

భార్య తన పెద్ద కూతురైన అమల యను నామెను నా యొద్దకు పంపగా ఆమె నాకీ విషయము తెలియజేసెను. ఓ వానర శ్రేష్ఠా! నిస్సంశయముగా నాపతి రాముడు వేగముగా నన్ను పొందగలడు. ఏలననగా నా యంతరాత్మ పరిశు ద్ధమైనది. రాముడును బహు కళ్యాణ గుణములు గలవాడు. వానరుడా! నిస్సంశయముగా లోకమందెవరును చేయలేని కార్యమును చేయుటయందు స్థిరమగు ప్రయత్న రూపమగు నుత్సాహమును, అట్టిదేయైన కార్యరూపమగు పౌరుషమును, బలము, క్రౌర్య రాహిత్యము, ఉపకారము చేయనెఱుగుట, శౌర్యము, శక్తి యను నీ గుణ విశేషములన్నియు రాముని యందున్నవి. జనస్థానమున తమ్ముని సహాయము కూడ లేకుండగనే పదునాలుగువేల రాక్షసులను సంహరించిన రామునకు ఎదురై పీడింపబడని శత్రువుండునా? ఆ పురుష శ్రేష్ఠుడైన రాముని ధైర్యమును ఆపదలు పోగొట్టజాలవు. దేవేంద్రుని ప్రభావమును శచీదేవివలె, నేనాయన సామర్థ్యము నెఱింగినదానను. ఓ కపీ! బాణ సమూహములను కిరణములు గల రాముడను సూర్యుడు శత్రువులను రాక్షసులనెడి నీటిని ఎండింపజేయగలడు.” అని యిట్లు రాముని గూర్చి దుఃఖ పీడితయై కన్నులనీరు నింపికొని పలుకుచున్న సీతతో హనుమంతుడిట్లు పలికెను.

## హనుమంతుడు సీతాదేవిని తన వీపున మోసికొని పోయెదననుట :

“అమ్మా! నా మాట రాముడు వినినతోడనే కోతులు భల్లూకములు గల గొప్ప సైన్యమును తీసికొని శీఘ్రమే బయలువెడలును. అందమైన ముఖము గలదానవు. నిందింపదగనిదానవు నగు ఓ సీతాదేవీ! లేదా నీవు నా వీపు నధిరోహింపుము. నిన్నిప్పుడే యీ దుఃఖము నుండి విడిపింతును. నిన్ను నా వీపుపై గూర్చుండ బెట్టుకొని సముద్రమును దాటెదను. ఈ లంకను రావణునితో గూడ మోసికొని పోవుటకు నాకు శక్తియున్నది. ఓ సీతా! అగ్నియందు హోమము చేయబడిన ద్రవ్యమును అగ్ని మోసికొని పోయి దేవేంద్రున కిచ్చినట్లు నేనిప్పుడే నిన్ను ప్రస్రవణ గిరిపైనున్న రామునితో చేర్చెదను. ఓ విదేహ రాజపుత్రీ!

నీవిప్పుడే మున్ను రాక్షసుల వధింప సన్నాహములు చేయు విష్ణుని వలె లక్ష్మణ సమేతుడై సన్నాహము చేయుచున్న రాముని జూడగలవు. నిన్ను చూడగోరుచున్న వానిని పర్వతాశ్రమము నందున్నవానిని మహాబలశాలియగు రాముని స్వర్గమున అత్యున్నత స్థానమున నున్న దేవేంద్రుని వలె నీవిప్పుడే దర్శింపగలవు. మంగళ స్వరూపిణివగు నోదేవీ! నీవు నా వీపుపై నెక్కుము. ఉపేక్ష సేయకుము. చంద్రునితో గూడిన రోహిణి వలె రామునితో గూడుము. చంద్ర సూర్యులతో సంభాషించుచు నావీపు పై నెక్కి ఆకాశమును, మహాసముద్రమును గూడ దాటుము. నేనిచ్చట నుండి బయలుదేరి నిన్ను తీసుకొనిపోవు చుండగా ఈ లంకలో నివసించు వారెవ్వరును నన్ను వెంటనంట జాలరు. కాన నా భుజములపై నెక్కుము. ఓ విదేహరాజపుత్రీ! నేనిచటికెట్లు వచ్చితినో అట్లే నిన్నెత్తుకొని యాకాశ మార్గమున పోగలను. చూడుము. నీకు సంశయింప బనిలేదు."

**హనుమంతుడు సీతాదేవికి తన దేహమును పెంచి చూపుట :**

సీత హనుమంతుడు చెప్పిన ఆశ్చర్యమును గొల్పు మాటలను విని హర్ష పులకితమైన దేహము గలదై హనుమంతునితో నిట్లనెను. "హనుమంతా! నీవు గొప్ప దూరము గల మార్గమున నన్ను మోసికొని పోగోరుచున్నావు. ఓ వానర సంఘ నాయకుడా! నీవిట్లు తలంచుటచే నీ వానరత్వము స్పష్టముగా తెలియుచున్నది. నాపతి యగు రాజశ్రేష్ఠుని కడకు చిన్న శరీరము గల నీవు నన్నెట్లు మోసికొని పోదలంచుచున్నావు" అని పల్కుచున్న సీతాదేవి మాటల నాలకించి వాయుపుత్రుడు శ్రీమంతుడు నగు హనుమంతుడు మునుపెన్నడును పరాభవము నెరుగని వాడగుటచే తనకు సీత చేసిన పరాభవమును గురించి యిట్లు తలంచెను. "ఈ సీతాదేవి నా బలముగాని, ప్రభావము గాని ఎఱుంగదు. కాన ఈమెకు నా నిజరూపమును చూపెదను" అని తలంచి వానరశ్రేష్ఠుడును, శత్రువులను మర్దించువాడును అగు హనుమంతుడు సీతకు తన నిజరూపమును

చూపించెను. ఆయన సీతాదేవికి నమ్మిక పుట్టునట్లు తానున్న చోటునుండి తన శరీరమును పెంచదొడగెను. అట్లు తన శరీరమును పెంచి మేరు పర్వతమును మందర పర్వతమును దలపించుచు ఉన్నతుడై ప్రజ్వలించిన అగ్నివలె ప్రకాశించుచు హనుమంతుడు సీతాదేవి యెదుట నిలిచెను. పర్వతము వలె ఉన్నతుడును, ఎఱ్ఱని ముఖము గలవాడును, మహా బలుడును, వజ్రము వలె కఠినములైన కోరలు గోళ్లు గలవాడును, భయంకరుడునగు హనుమంతుడు సీతాదేవి కిట్లనెను. "పర్వతములు, వనములు, కోట బురుజులు, ప్రాకారములు, ద్వారములతో గూడిన యీ లంకను లంకాధిపతియగు రావణునితో గూడ తీసికొనిపోవు శక్తి నాకున్నది గావున నోదేవీ! మనస్సును స్థిరము చేసికొనుము. భయము నందవలదు. నీ రాకచే రామ లక్ష్మణుల విచారమును పోగొట్టుము."

**హనుమంతునితో సీత తాను రాకుండుటకు కారణము చెప్పుట :**

తామర రేకులవంటి కన్నులు గల సీతాదేవి భయంకరాకారుడైన వాయు నందుని జూచి యిట్లనెను. "ఓ మహాకపీ! నీ ధైర్యమును, బలమును, వాయు వేగమును, అగ్ని సమానమైన అద్భుత తేజమును నేను తెలిసికొంటిని. ఓ వానర శ్రేష్ఠుడా! అంతులేని సముద్రము దాటి సామాన్యుడెవ్వడైన నీ భూమికి రాగలడా? నీవీ సముద్రముపై ప్రయాణము చేసి ఆవలి యొడ్డు చేరగలవని, నన్ను గూడ మోసికొని పోగలవని నేనెరుగుదును అయినను మహాత్ముడైన రాముని కార్యము చెడకుండగా అనుకూలమగునట్లా లోచింపవలెను. పాపరహితుడగునో కపిశ్రేష్ఠా! నేను నీతో బయలుదేరి వచ్చుట తగదు. వాయు వేగముతో పోవు నీ వేగమునకు నేను తెలివి తప్పవచ్చును. నీవాకాశమున సముద్రపు పైభాగమున వేగముగా పోవుచుండ నీ వీపుపై నుండి భయముచే నేను పడిపోవచ్చును. అట్లు పడిన నన్ను తిమింగలములు, మొసళ్లు, పెద్దచేపలు మొదలగు జలచరములు ఆహారముగా గొనవచ్చును. ఓ శత్రువులను నశింపజేయువాడా! కాన నేను నీతో రాజాలను. నన్ను రక్షించు ప్రయత్నములో

నీ జీవితము గూడ సంశయితమగును గదా! నీవు నన్ను తీసికొని వెళ్లుటను చూచి భయంకర పరాక్రమము గల రాక్షసులు దుర్మార్గుడగు రావణు ఆజ్ఞచే నిన్ను వెంటాడెదరు. ఓ హనుమంతా! శూలములు ముద్గరములు చేత ధరించినట్టి ఆ రాక్షసులు నిన్ను చుట్టుముట్టగా రక్షింపదగిన వస్తువగు నేను నీ చెంత నుండుటచే నీవు వీరిని నేను జయింపగలనో లేనోయని సంశయమున పడెదవు. ఆకాశమున ఆయుధములు దాల్చిన పలువురు రాక్షసులు చుట్టుముట్టగా నీవు నిరాయుధుడవై వారితో పోరుటకు నన్ను కాపాడుటకు నెట్లు సమర్థుడ వయ్యెదవు? ఓ వానరశ్రేష్ఠుడా! క్రూర కర్ములైన రాక్షసులతో నీవు పోరుచుండగా నేను భయముచే పీడింపబడినదాననై నీ వీపుపై నుండి పడిపోవచ్చును. ఓ వానరోత్తమా! భయంకరులు, అధిక సంఖ్యలో నున్నవారు బలవంతులు నగు రాక్షసులు నిన్ను చుట్టుముట్టి యుద్ధమున జయింతురు. యుద్ధమున జయాప జయములు నిశ్చయించి చెప్పరానివి. కనుక నీవోడినచో నీకడనుండి నన్ను తీసికొనిపోయి ఈ రాక్షసులు చంపివేయుదురు. ఓ వానరశ్రేష్ఠుడా! నేనా రాక్షసులచే భయపెట్టబడినదాననై ఆపదనందెదను. ఏ విధముగా చూచినను నన్ను తీసికొనిపోవు ప్రయత్నము వృథా అగును గదా! రాక్షసులందఱను చంపుటకు నీవొక్కడవే చాలుదువు. అయినను దూతవగు నీవట్లు రాక్షసులను చంపుటచే ఈ కార్యమును సాధింపవలసిన రాముని కీర్తి సన్నగిలిపోవును. లేదా నన్నా రాక్షసులు తీసికొనిపోయి వేరొక చోట దాచియుంచినను ఉంచ వచ్చును. ఆ చోటును వానరులు గాని రామలక్ష్మణులు గాని తెలిసికొనజాలక పోవచ్చును. దీనిచే నాకై నీవు చేసిన పని వృథా కాగలదు. ఇట్లుకాక రాముడు నీతో గలిసి వచ్చిన నెంతయో ప్రయోజనమున్నది. రాముని ప్రాణములు ఆయన సోదరుని జీవితము, నీ రాజైన సుగ్రీవుని వంశ క్షేమమును నేను బ్రతుకుటపై ఆధారపడియున్నవి. రామలక్ష్మణులకు నా ఆశ లేకున్నచో శోకముచే తప్తులై కృశించి ఎలుగులు, కోతులతో సహా ప్రాణములను వీడెదరు. వానరశ్రేష్ఠుడా! నా భర్తపైనున్న భక్తిచే నేను రాముని దప్ప వేఱొక పురుషుని ముట్టను.

బలాత్కారముగా రావణుడంటి తీసికొని రాలేదా? యందువేమో. శరీర స్పర్శ తగుల లేదాయనుకొందువేమో? అప్పుడు నేనమితమైన దుఃఖముచే పరవశు రాలనై శక్తిలేనిదాననై యుంటిని. నా భర్తయు చెంత లేకుండెను. అటువంటి సమయమున అప్పుడు నేనేమి చేయగలను? రాముడు యుద్ధమున రావణుని బంధువులతో గూడ వధించి నన్నిచటి నుండి కొనిపోవుట ఆయనకు తగినపని. మహాత్ముడు యుద్ధమున శత్రువుల నణచువాడునగు ఆ రాముని పరాక్రమమును నేను వినియుంటిని, చూచితిని గూడ. దేవతలు గాని, గంధర్వులు గాని, భుజగులు గాని, రాక్షసులు గాని యుద్ధమున రామునకు సాటి గానేరరు. మహాబలశాలియు, దేవేంద్రునకు సాటియగు పరాక్రమము గలవాడును ఆశ్చర్యము గొలుపు కోదండ పాండిత్యము గలవాడును లక్ష్మణ సమేతుడును అయిన రాముని గాలిచే ప్రజ్వరిల్లు అగ్నిని వలె నెవ్వడును ఎదిరింపలేడు. వానరశ్రేష్ఠుడా! శత్రువులను యుద్ధమున మర్దించువాడును దిగ్గజము వంటివాడును, ప్రళయకాల సూర్యునివలె బాణములను కిరణములచే ప్రకాశించువాడు నగు రాముని తేజమును యుద్ధమున సహింప గలవాడెవ్వడు? ఓ వానరోత్తమా! నీవు నా భర్తయగు రాముని లక్ష్మణునితో తక్కిన వానరయూధ పతులతో నిచ్చటకు తీసికొని రమ్ము. చాల కాలముగా శోకముచే పీడింపబడిన నన్ను సంతోషింప జేయుము. వేరుపాయముల చేత కార్యము లేదు. ఇచ్చటకు వేగముగా నా భర్తను లక్ష్మణ సమేతముగా వానర సేనలు కొలుచుచున్న వానరరాజుతో గూడ గలిపి నీవెటులైనను తీసికొని రమ్ము. రాజైన రామచంద్రుని గూర్చి భరింపరాని దుఃఖముతోనున్న నన్ను కడతేర్చుము. వాయుపుత్రా! నీకు పుణ్యము కలుగు గాక."



# ముప్పది యెనిమిదవ సర్గము

**అం**తట మాటలాడుటలో కుశలుడును కపిశ్రేష్ఠుడునగు నా హనుమంతుడు సీత మాటలకు సంతోషించినవాడై యామె కిట్లనెను. “చూచువారలకు మంగళము కలిగించు ఓ సీతా! నీవు పలికినదెంతయో యుక్తముగా నున్నది. నీవంటి యువతి శ్రేష్ఠురాలికి స్త్రీ స్వభావమునకు పతివ్రతకు తగిన మాటలు పల్కితివి (ఇంతకు మున్ను సీత పల్కిన కోతివను హేళనమునకు స్త్రీ స్వభావమను మాట సమాధానము) నావీపు పైనెక్కి నూఱు యోజనములు వెడల్పైన సముద్రమును దాటుటకు స్త్రీలు సమర్థులు కారనుట సత్యము. వినయము గల ఓ జానకీ! రామునికంటె ఇతరులను ముట్టనొల్లనని యే రెండవ కారణమును చెప్పుచుంటివో అట్టి మాటను మహాత్ముడగు రాముని భార్యవగు నీవు దక్క వేఱెవ్వతె పలుక గలుగును? ఓ జానకీదేవీ! నీవు నా యెదుట నేమేమి చేసితివో యేమేమి మాటలను పలికితివో సర్వమును రామునకు వినిపింతును. దేవీ! అనేకములగు ఉపాయములతో రామునకు ప్రియము గూర్పవలెనను నిశ్చయముతో ఆయన యందలి ప్రీతి మనస్సున నిండియుండగా నిన్ను నాతో తీసికొనిపోయెదనంటిని. లంకలో ప్రవేశించుట చాల కష్టము కనుకను, సముద్రమును దాటుట దుష్కరమగుట చేతను, నిన్ను సముద్రము దాటించు సామర్థ్యము నాకుండుటచేతను ఇట్లు చెప్పితిని. ఇప్పుడే నిన్ను రఘువంశు ్యడగు రామునితో కూర్పగోరితిని. రామునిపై స్నేహముచేతను, భక్తిచేతను నేనిట్లు పలికితిని గాని వేఱొండు గాదు. ఓ సాధ్వీ! నీవు నాతో వచ్చుటకుత్సహింపనిచో నేదేని రాముడు గుర్తింప గలుగు (అభిజ్ఞానము) ఆనవాలును నాకొసంగుము” అని యిట్లు హనుమంతుడు పలుకగా దేవకన్యను బోలిన సీతాదేవి బాష్పోద్దమముచే మాటలు తడబడుచుండ మెల్లగా నిట్లు పలికెను.

**సీతాదేవి హనుమంతునకు కాకాసుర వృత్తాంతమును చెప్పుట :**

"నేనిప్పుడు చెప్పు నభిజ్ఞానమును నీవు రామునకు దెల్పుము. ఇది నాకెంతయా ప్రియమైనది. 'పూర్వము మనము చిత్రకూట పర్వతమునందు ఈశాన్య దిశయందు గంగానదీ తీరమున గల తాపసాశ్రమములందు నివసించుచున్నప్పుడు వివిధ పుష్పములతో పరిమళించు వనములలో విహరించి అలసి నీతొడపై పరుంటిని. అప్పుడు మాంసమునందు లోభము గల కాకి యొకటి వచ్చి నా స్తనము యొక్క చివఱను పొడిచెను. నేనొక మట్టిగడ్డ నెత్తి దానిని త్రోలసాగితిని. ఆ కాకి నన్ను స్తనాంతరమున మాటిమాటికి పొడుచుచు అచ్చటనే యొక్కచో దాగుచుండెను. అంతియే గాని మాంస భక్షణము నందాస విడువలేదు. నేనంతట ఆ కాకిపై కోపించి దానిని త్రోలి వేయుటకు నా మొల యందలి యొడ్డాణమును తీయ బోవుచుండగా నా చీరముడి యొకింత జారినది. ఆ సమయముననే రామా! నీవు నిద్రలేచి నన్ను చూచితివి. నన్ను చూచి నవ్వితివి. దానికి నేను మొదట కోపము చెందియు పిమ్మట సిగ్గుపడితిని. అంతలో ఆహారమునందాశతోనున్న యాకాకి మఱల నన్ను గీరినది. నేను వెంటనే వచ్చి నీ చెంత చేరితిని. అట్లు కాకిని తోలి వచ్చి అలసి నీ యొడిలో పరుంటిని. కోపముతోనున్న నన్ను నీవూరడించితివి. నేను కన్నులలో నిండిన నీటిని మెల్లగా తుడుచుకొనుచుండగా నీవు కాకి కారణముగా కోపించిన నన్ను జూచితివి గదా! యని చెప్పుము. హనుమా! నేనా కాకిని పారద్రోలుటకై పోయి వచ్చుటచే శ్రమ కలిగి చాల సేపు రాముని తొడపై నిద్రించితిని. నేను తిరిగి లేచితిని. మఱల రాముడు కొంతసేపు నా తొడపై నిద్రించెను. అప్పుడు మఱల నా కాకి వచ్చి వ్రాలినది. అప్పుడే నిద్రనుండి మేల్కొని రాముని తొడపై నుండి లేచిన నన్నకస్మాత్తుగా ఆ కాకి స్తనాంతరమున గీరినది. అది మాటి మాటికి నాపైబడి అధికముగా గీరినది. అప్పుడచ్చట నుండి రక్తము కారగా నా రక్త బిందువులచే రాముడు తడుపబడినాడు. ఆ విధముగా ఆ కాకి నన్ను బలాత్కారముగా బాధ పెట్టునప్పటి వఱకును సుఖముగా నిద్రపోవుచున్న రాముని

నేను మేలుకొల్పితిని. గొప్ప భుజములు గల ఆ రాముడు స్తనముల నడుమ కాకిచే గాయము చేయబడిన నన్ను జూచి సర్పమువలె పెద్దవైన నిట్టూర్పులను విడచుచు నాతో నిట్లనెను. “ఓ కరభోరూ! ఎవరు నీ స్తనములపై గాయమును జేసిరి? కోపించిన ఐదు తలల పాముతో ఆడువాడెవ్వడు? అని పలికి వాడిగా నుండి రక్తముతో తడిసిన గోళ్లతో నా కభిముఖముగా నిలిచియున్న యా కాకిని చూచెను. వేగముగా పోవు వారిలో శ్రేష్ఠుడగు ఆ కాకి యింద్రుని తనయుడు (ఇంద్రు డహల్యను చెఱుపదలచి యొకరాత్రి గౌతమాశ్రమమున కాకియై కూసెను. గౌతముడది ప్రాతఃకాల సూచనమని పొరబడి స్నానమునకై నదికేగెను. నది యింకను నిద్రించుచుండుటను జూచి యిది యింద్రుని దుష్కృత్యమని యూహించి నీకు కాకి రూపమే శాశ్వతమని శపించెను. పిమ్మట దేవతలు, ఋషులు ప్రార్థింపగా నీ శాపము నీ కొడుకునకు గలుగుననియు, రామబాణముచే పీడింపబడి యతడాయన చేతనే రక్షింపబడి శాపము వీడునని గౌతముడు మహేంద్రునకు శాపమోక్షణము కలిగించెను.) వాయువు వలె వేగముగా సంచరించువాడగు ఆతడు వేగముగా నేలకు దిగి వచ్చెను. అంతట బుద్ధి మంతులలో శ్రేష్ఠుడును, మహాభుజుడును అగు రాముడు కోపముతో నా కాకిపై దృష్టి మరల్చి దానిని తీవ్రముగా దండింపదలంచెను. ఆయన కూర్చున్న ఆసనము నుండి యొక దర్భను తీసి బ్రహ్మాస్త్రముగా నభిమంత్రించెను. అది ప్రకాశించు కాలాగ్నివలె ఆ పక్షికెదురై ప్రజ్వలింప జొచ్చెను. అట్లు ప్రజ్వలించుచున్న యాదర్భను రాముడా కాకిపై విసరెను. ఆ దర్భయు నాకాశమున నాకాకి ననుసరించెను. ఆ దర్భ వెంబడించుచుండగా ఆ కాకి అనేక మార్గముల రక్షింపుమనుచు పరువులెత్తెను. అదియు అన్ని లోకము లందును దానిని వీడక వెంటాడెను. తండ్రిచేతను తక్కిన దేవతలచేతను ఋషుల చేతను గూడ విడువబడినదై అది ముల్లోకములు తిరిగి తుదకు రామునే శరణుజొచ్చెను. అట్లు తన్ను శరణుగోరి వచ్చి నేలబడిన యా కాకి చంపదగినదే యయినను శరణాగత రక్షకుడగు రాముడు దయతో దానిని కాపాడెను.

లోకములలో నెచ్చటను అపాయము నుండి రక్షణ లభింపక పరితాపము నొంది దుఃఖితుడై తన యొద్దకు వచ్చిన ఆ కాకిని జూచి రాముడు నేను విడచిన బ్రహ్మాస్త్రము వ్యర్థము కారాదు కావున దానినేమి చేయుమందువనెను. నీ బాణము నా కుడి కంటిని హింసించుగాక యని కాకి పల్కెను. అపుడా దర్భ కాకి యొక్క కుడి కంటిని పోగొట్టెను. అట్లా కాకి చావు తప్పి కన్ను లొట్టబోయినదై రామునకును దశరథునకును సమస్కరించుచు వీరుడగు రామునిచే విడువ బడినదై తన నివాసమున కేగెను. (శరణాగత రక్షణ ధర్మము మా వంశ ధర్మము. కావున శ్రీరామునే శరణు వేడి బ్రదుకుమని దశరథుడు స్వర్గమున బోధించెనని తెలియునది) రామా! నాకై కాకిపై గూడ బ్రహ్మాస్త్రమును వేసినవాడవే. నన్నుపహరించిన వానిని క్షమించుచుంటివేల? పురుష శ్రేష్ఠుడవగునోరామా! నీవు గొప్ప యుత్సాహము గలవాడవుకమ్ము. నాపై దయ జూపుము. నీవు నాకు నాథుడవై యుండగనే నే ననాథవలె నున్నాను. ఇతరుల దుఃఖమును సహింప లేకుండుట పరమ ధర్మమని నీవలననే కదా వింటిని. నీవు పరాక్రమ వంతుడవని, గొప్ప యుత్సాహము గలవాడవని మహాబలవంతుడవని, అనేక ఘన కార్యములను సాధించితివని, ధైర్యము గలవాడవని, గాంభీర్యమున సముద్రముతో సాటియైన వాడవని, సముద్రముచే చుట్టబడిన సకల భూభాగము లకు ప్రభుడవని, దేవేంద్రునకు సాటియైన వాడవని నేనెఱుంగుదును అని నా మాటగా చెప్పుము. హనుమంతా! అస్త్ర ప్రయోగమునందు శ్రేష్ఠుడు, సత్యవంతుడు, బలవంతుడునై యుండియు రాముడు రాక్షసులపై అస్త్రములనేల వేయడు? నాగులు గాని, గంధర్వులు గాని, అసురులు గాని, మరుత్తులు గాని, యుద్ధమున ఆ రాముని వేగము నాపుటకు సమర్థులు గారు. పరాక్రమశాలియగు రామునకు నా విషయమున నేమాత్రము త్వరయున్నను వాడి బాణములతో రాక్షసులనేల చంపడు? మహాబలుడును, శత్రువులను పీడించువాడును అగు లక్ష్మణుడైన అన్నగారి యాజ్ఞను పొంది నన్నేల కాపాడడు?

అగ్ని వాయువులతో సమానమగు పరాక్రమముగల పురుష శ్రేష్ఠులగు రామలక్ష్మణులు కలిసియున్నచో దేవతలకైన నెదిరింప శక్యముగాని వారగు వారేల నన్నుపేక్షించుచున్నారు? నేను పూర్వము చేసిన మహా పాపమేదియో కొంత మిగిలియున్నది. కావుననే నన్ను కాపాడగల సమర్థులయ్యును శత్రువులను తపింపజేయు వారగు రామలక్ష్మణులు నన్ను చూడరా కున్నారు.” మహా తేజశ్శాలియగు వాయుపుత్రుడు దయగలిగించుచు కన్నీరు కార్చుచున్న సీతయొక్క యీ మాటలను విని యిట్లు బదులు పలికెను. “ఓ సీతాదేవీ! నీ యెడబాటువలని శోకముచే రాముడు పనుల యందు విముఖుడై యున్నాడు. నీ యందే మనస్సు నిల్పియున్నాడు. నేను సత్యముపై శపథము చేసి చెప్పుచున్నాను. రాముడు దఃఖమునందుట చూచి లక్ష్మణుడును దుఃఖము పొందుచున్నాడు. నేను మహా ప్రయత్నముచే నిన్ను చూడగలిగితివి. నీ విప్పుడు దుఃఖింప సమయము గాదు. ఓ నిందింపరాని చరిత్ర గలదానా! అల్పకాలములో నీ దుఃఖములు నశింపగా చూచెదవు. మహా బలవంతులు రాజపుత్రులు శ్రేష్ఠులు నగు రామలక్ష్మణులు నిన్ను చూడవలయునని యుత్సాహము నందినవారై లంకను తగుల బెట్టుదురు. ఓ విశాలమైన కన్నులు గలదానా! రాముడు యుద్ధమున క్రూరుడగు రావణుని వాని బంధువులతో గూడ సంహరించి నిన్ను తన నగరమునకు గొనిపోగలడు” అని చెప్పి, హనుమంతుడు తిరిగి “నేనచ్చటికేగి రామునకును, మహాబలవంతు డగు లక్ష్మణునకును, తేజశ్శాలియగు సుగ్రీవునకును నన్ను కలిసికొనిన యితర వానరులకును ఏమని చెప్పవలయునో తెల్పుము” అని పలుకగా దేవకన్యకు సాటియైన సీతాదేవి శోక పీడితయై యా హనుమంతున కిట్లనెను.

**సీతాదేవి రామునకు హనుమంతునితో సందేశము నంపుట :**

“విశాల హృదయ యగు కౌసల్యాదేవి కన్న కుమారుడు లోకపతి యగు రాముని నా కొఱకై కుశలమడుగుము. (లోకమున తల్లిదండ్రులు తమ్ము భరించుటకై బిడ్డలను గందురు. కౌసల్య లోకములన్నిటిని భరించగల మంచి

మనస్సు గల కొడుకును లోకోపకారమునకై కనెను. నేను లోకములోని దాననే కావున శ్రీరాముడు నన్ను భరింపక మానునా? సీతను తప్ప తక్కిన లోకమును భరింతునని నియమము లేదు గదా) శిరము వంచి ప్రణమిల్లితి ననుము. సుమిత్ర సత్సంతానమగు లక్ష్మణుడు పుష్పమాలలను, సకల రత్నములను, ప్రియురాలగు నూర్మిళను శ్రేష్ఠ వనితలను, భూమియందు దుర్లభమగు నైశ్వర్యమును పరిత్యజించి తండ్రిని తల్లిని గౌరవించి వారి వారిని, మంచి మాటలచే ననునయించి రాముని వెంటనంటెను. ధర్మాత్ముడగు లక్ష్మణుడు భక్తితో పరమ సుఖములను వీడి అడవిలో తనయన్న యగు రాముని కాపాడుచు అన్న ననుసరించినాడు. అతడు సింహపు మూపువంటి మూపు గలవాడు. గొప్ప బాహువులు గలవాడు, మానధనుడు, చూచువారికి ప్రీతి గలిగించువాడు. అట్టి లక్ష్మణుడు రాముని యెడల తండ్రివలెను, నాయందు తల్లివలెను ప్రవర్తించుచున్నవాడు. రావణుడప్పుడు నన్ను తీసికొనిపోవుటను లక్ష్మణుడెరుగడు. అతడు పెద్దలను సేవించువాడు, శ్రీమంతుడు, సమర్థుడు, మితభాషి అతడు రాచబిడ్డ, ఎల్లరకు ప్రీతిపాత్రుడు, మా మామగారికి సాటియైనవాడు, రామునకు తమ్ముడు. నాకెల్లప్పుడును మిక్కిలి ప్రీతి గూర్చువాడు. తనకు చెప్పిన పనిని చక్కగా నిర్వహించువాడు. (కష్ట కార్యమును సాధించుటే గాదు సీతాదేవి నలభై రెండు చీరలు, గడ్డపార, కవచములు, ఆయుధములు ఇంత బరువు మోసి తిరుగుచుండుటచే సమర్థుడు) లక్ష్మణునిపై ప్రీతిచే రాముడు గతించిన తండ్రియగు దశరథుని గూడ తలంపడు (తండ్రివలె కాపాడుచున్నాడు) అట్టి లక్ష్మణునితో నామాటగా కుశలమును దెలుపుము. అతడు మృదు స్వభావుడు. కపటము లేనివాడు. సమర్థుడు. రామునకు ప్రీతిపాత్రుడు. ఓ వానరుడా! ఎట్లు చేసిన నా దుఃఖము తొలగునో, అట్లు చేయుటకు నీవే సమర్థుడవు. రాముడుత్సాహము పొంది నా విషయమున ప్రయత్నము చేయునట్లు చేయుము. నా నాథుడు శూరుడునగు రామునకు మాటి మాటికి నా మాటగా నిట్లు చెప్పుము. “రామా! నేనింక నొక్కనెల జీవించెదను. ఆ పైన

జీవింపను. నేను నీతో సత్యమునే చెప్పుచున్నాను. వీరుడవగు ఓ రామా! వంచనచేత పాపాత్ముడగు రావణునిచే అడ్డగింపబడిన నన్ను పాతాళము నుండి ఇంద్రుని రాజ్యలక్ష్మిని తెచ్చిన విధముగా రక్షింపదగుదువు.”

**సీతాదేవి హనుమంతుని చేతికి తన చూడామణినిచ్చుట :**

అని పల్కి ఆమె తన చీర కొంగున కట్టుకొనిన దివ్యము శుభమునగు చూడామణిని తీసి రామున కిమ్మని హనుమంతున కిచ్చెను. వీరుడగు హనుమంతుడప్పుడు శ్రేష్ఠమైన ఆ మణిని స్వీకరించి దానిని తన వ్రేలికి బెట్టుకొనెను. ఆ సమయమున హనుమంతుడు తిరిగి వెళ్లుటకు దగిన సూక్ష్మ రూపమును ధరించి యుండుటచే అతని చేయి లావుగా లేకుండుటచే ఆ మణిని చేతికి తొడిగి కొనుటకు వీలయ్యెను. హనుమంతుడా మణి శ్రేష్ఠమును సీత నుండి స్వీకరించి ఆమెకు ప్రదక్షిణము చేసి నమస్కరించి చేతులు జోడించి ఆమెకడ నిలిచెను. ఆ సీతాదేవిని చూచుటచే కలిగిన మహానందముతో నిండినవాడై రాముని మనస్సునందు తలంచెను. (మనస్సుచే రాముని చేరెను. శరీరముచే నిచ్చట నిలిచెను) హనుమంతుడా విధముగా సీతాదేవి తన ప్రభావముచే ధరించిన చూడామణిని తీసికొని పెద్ద గాలిచే కదలిన కొండగాలి తగ్గిన తరువాత స్తిమితమయినట్లు హర్షముచే నుప్పొంగి స్తిమితమైన మనస్సు గలవాడై తిరుగు ప్రయాణము చేయ సమకట్టెను (ఉద్యుక్తుడయ్యెను).



# ముప్పది తొమ్మిదవ సర్గము

## సీతాదేవి తన్ను గుఱించి శ్రీరామునికి దెల్పహనుమంతుని వేడుట :

సీతాదేవి హనుమంతునకామణి నిచ్చి యిట్లనెను. “ఈ అభిజ్ఞానము రామునకు బాగుగా తెలిసినట్టిది. వీరుడగు రాముడీ మణిని జూచి మా తండ్రిని, నన్ను, దశరథుని స్మరింపగలడు. ఓ వానరోత్తమా! నీవెట్టైన రాముని ప్రేరేపించి కార్యము నెరవేరునట్లు చేయుమని మఱల చెప్పుచున్నాను. నీవీ పని గురించి యికపై చేయవలసినదేమియో ఆలోచింపుము. ఈ కార్యము నెరవేరుటకు నీవే కర్తవు. ఓ వానరశ్రేష్ఠా! హనుమంతా! నీవు ప్రయత్న పూర్వకముగా నా దుఃఖమును తొలగించువాడవుకమ్ము. మహాత్ముడవగు నీవు బాగుగా ఆలోచించి కార్యము చేయుదువేని నీ ప్రయత్నము నా దుఃఖమును తప్పక పోగొట్టును”. అతి భయంకరమగు పరాక్రమము గల హనుమంతుడట్లే యని సీతాదేవి యొద్ద ప్రతిజ్ఞ చేసి తల వంచి యామెకు నమస్కరించి బయలుదేర నుద్యమించెను. వాయుపుత్రుడగు హనుమ బయలుదేర నుండుట తెలిసి సీతాదేవి బాష్పములచే రుద్ధమైన కంఠముతోనిట్లు చెప్పెను. “హనుమా! రామలక్ష్మణుల నిరువురను క్షేమ మడుగుము. వానరశ్రేష్ఠుడా! సుగ్రీవుని నతని మంత్రులను సకల వానర వృద్ధులను ధర్మ యుక్తముగా కుశలమడిగితిననుము. గొప్ప భుజములు గల రాముడు నన్నీ దుఃఖ సముద్రము నుండి దాటించునట్లు నీవాయనను సమాధాన పరచుము. హనుమా! కీర్తిమంతుడగు రాముడు నన్ను జీవములతోనున్న దానినిగా జేయునట్లు నీవతనితో మాటలాడుము. అట్లు నీవు రామునితో చెప్పి (వాచిక ధర్మము) మాటలాడిన ధర్మమును పొందుము. నీవు నిత్యము

నుత్సాహము కలిగించు మాటలను రామునితో పలుకవలెను. వానిని విని నన్ను సంపాదించుటకు రాముని పౌరుషము పెరుగ గలదు. నా (సందేశము) మాటలు వినుట తోడనే వీరుడైన రాముడు యథావిధిగా పరాక్రమము చూపగలడు". వాయుపుత్రుడగు హనుమంతుడు సీతాదేవి పలికిన మాటలు విని చేతులు జోడించి శిరస్సుపై నుంచుకొని తరువాత తానిట్లు పలికెను. "అమ్మా! రాముడు వేగమే వానరశ్రేష్ఠులతో, భల్లూకపతులతో గూడి రాగలడు. ఆయన యుద్ధమున శత్రువులను జయించి నీ దుఃఖమును పోగొట్టగలడు. మనుష్యులలో గాని, రాక్షసులలో గాని, దేవతలలో గాని రాముడు బాణములు విడుచుచుండగా అతని యెదుట నిలుచుట కిష్టపడువానిని నేనింతవఱకు చూడలేదు. రాముడు యుద్ధమున సూర్యునిగాని, ఇంద్రునిగాని, యమునిగాని జయింపగల సమర్థుడు. నీ కొఱకై ఈ రాక్షసులను జయింపగలడని వేరుగా చెప్పబనిలేదు. ఆయన ఈ సముద్ర పర్యంతమున్న భూమిని పాలింపగలవాడు. రాముని పరాక్రమమునకు, విజయమునకు కారణము నీవే సుమా."

**సీతాదేవి తన సందేహమును హనుమంతునితో చెప్పుట :**

అని చెప్పిన యూరడించునవియు, సత్యములును, చెవులకింపు గలిగించు నవియునగు వాక్కులను విని సీత అతనిని మిక్కిలి గౌరవించి యిట్లనెను. "శత్రువుల నణచునట్టి ఓ వీరా! నీకిష్టమైనచో ఇచ్చుట ఏదైన చాటుగా ఉన్న చోటున విశ్రమించి రేపు వెళ్లవచ్చును. ఓ వానరుడా! నీ వట్లొక్క దినమైన నిచ్చుట నాచెంత నున్నచో మందభాగ్యురాలనగు నాకు కలిగిన దుఃఖమును కొద్ది సమయమైనను మఱచి యుండెదను. ఓ వానరశ్రేష్ఠుడా! అట్లుగాక నీ విప్పుడే పోయి వచ్చెదవేని నా ప్రాణములు నిలుచుట కూడ సంశయమే. ఇందేమియును సంశయము లేదు. వానరుడా! నీవు కనబడకపోవుటచే కలుగు దుఃఖము ఇదివఱకు కలిగిన దుఃఖము కంటే ఎక్కువగా పరితపింప జేయును. వీరుడా! నీకు సహాయులగు వానరులు భల్లూకముల విషయమున నాకొక

సందేహము మనస్సునందు కలిగి రూపమునంది నా యెదుట నిలిచియున్నట్లు తోచుచున్నది. ఆ కోతులు గాని, ఎలుగుబంట్లు గాని, ఆ రాజుపుత్రులు గాని అపారమగు ఈ సముద్రమునెట్లు దాటెదరు? ఈ సముద్రమును దాటగలవారు నీవు, నీ తండ్రియగు వాయుదేవుడు గరుత్మంతుడు తప్ప ఇంకొకరు సమర్థులు గారు. ఓ వీరుడా! ఇట్లు కష్ట సాధ్యమగు ఈ కార్యమును నిర్వహించుటకేదైన నుపాయమాలోచించితివా? నీవీ కార్యము సాధించువారలలో శ్రేష్ఠుడవుగదా. శత్రువీరులను సంహరించువాడా! సకల రాక్షసులను సంహరించి నన్ను కాపాడుటయను గొప్ప కార్యమును చేయుటకు నీవొక్కడవే చాలుదువు. కాని దానివలన సమర్థుడవగు ఈ శక్తి నీకు కీర్తినిచ్చునే కాని నాకు మాత్రము గాదు సుమా! అట్లుగాక సర్వ సేనలు సేవించుచుండగా యుద్ధమున రావణు నోడించి జయము పొంది రాముడు నన్ను తీసికొని తన నగరమునకు వెళ్లినచో అది నాకు కీర్తి కలిగించునదగును. శత్రు కర్శనుడగు రాముడు లంకను బాణములతో నింపి నన్ను తీసికొనిపోవుట ఆయనకు తగిన పనియై యుండును. కాన యుద్ధమున శౌర్యమును చూపింపగలవాడు మహాత్ముడగు రాముడు కాన ఆ విధముగా ఆయన తన పరాక్రమమును ప్రదర్శించునట్లు చేయుట నీకు తగియుండును. అదియే అర్థయుక్తమైన పని. ఇరువురకు అది సబబైనది." అని యిట్లు యుక్తియుక్తముగా పలికిన సీతాదేవి మాటను విని, హనుమంతుడు తానిదివఱకు చెప్పియుండని యుత్తమమైన మాటలనట్లు చెప్పెను.

**హనుమంతుడు సీత సందేహమును దీర్చుట :**

"ఓ దేవీ! కోతులు, ఎలుగుబంట్లు గల సేన కధిపతి బలవంతులలో శ్రేష్ఠుడగు సుగ్రీవుడు ఈ కార్యమును సాధించుటకు దృఢ నిశ్చయముతో నున్నాడు. ఓ సీతాదేవీ! యుద్ధమున రాక్షసులను సంహరింపగల ఆతడు వేలకోట్ల వానరులతో బయలుదేరి రాగలడు. పరాక్రమమే సంపదగా గలవారు, ధైర్యశాలురు, మహాబల సమన్వితులు, మనోవేగముతో సమానమైన వేగము

గలవారు కోటానుకోట్లుగా ఆయన ఆజ్ఞకు లోబడియున్నారు. వారలు పైకిగాని క్రిందకుగాని అడ్డముగా గాని అడ్డు లేకుండ సంచరింపగలరు. అమిత పరాక్రమము గలవారు. పెద్ద కార్యములను చేయబూనియు విఫలత్వ మొందని వారు. అధికమైన యుత్సాహము గల యా వానరులు పలుమారులు సముద్రము లతో పర్వతములతో గూడిన యీ భూమిని ప్రదక్షిణము చేసినవారు. ఆ సుగ్రీవుని యొద్ద నాకంటే గొప్పవారు, నాతో సమానులు నగు వానరులనేకులు గలరు. నాకంటే తక్కువ బలము గలవాడు అందొక్కడును లేడు. నేనే యీ విశాలమైన సముద్రమును దాటి యిక్కడకు రాగలిగితిని. ఇక మహాబలవంతులైన తక్కిన వానరుల మాట వేరుగా చెప్పవలయునా? ఇట్టి చిన్న పనికి రాజులు సామాన్యుల నంపుదురు గాని గొప్పవారిని బంపరు గదా? కాన మారాజు కనుసన్నలలో మెలగువారు చాలమంది నాకంటెను గొప్పవారే సుమా! ఓ దేవీ! కావున నీవింక పరితాపము చెందకుము. ఇంక నీవు దుఃఖపడు సమయము దాటిపోయినది. ఆ వానర యూథపతులందఱు నొక్కగంతులో ఈ లంకా పట్టణమును చేరగలరు. గొప్ప బలవంతులు, పురుష శ్రేష్ఠులునగు రామలక్ష్మణులు నా వీపు పైనెక్కి ఉదయించిన సూర్య చంద్రులవలె నీ యొద్దకు వచ్చెదరు లెమ్ము. పిమ్మట వీరులు నరశ్రేష్ఠులునగు రామలక్ష్మణులిరువురును లంకా నగరమును బాణ పరంపరలతో నాశనమొనర్తురు. ఓ సుశ్రోణీ! రఘువంశమున బుట్టిన రాముడు రావణుని, ఆతని బంధువులతో గూడ చంపివైచి నిన్ను తీసికొని తన పురమునకేగ గలడు. కావున ఓ సీతాదేవీ! నీవింక విచారింపకుము. నిన్ను నీ భర్త విడిపించుకొను సమయమున కెదురు చూడుము. వేగముగా నీవు ప్రజ్వలించుచున్న అగ్నివంటి నీ పతియగు రాముని చూడగలవు. ఆ రావణుడును, అతని పుత్రులును, బంధువులును, మంత్రులును యుద్ధమున చచ్చిన తరువాత రోహిణి చంద్రునితో గూడిన విధముగా నీవు రామునితో గూడగలవు. ఓ సీతాదేవీ! వేగముగా నీవీ దుఃఖ సముద్రము నుండి యొడ్డు చేరెదవు. రాముడు రావణుని కొలది

కాలములోనే చంపుట చూడగలవు” అని చెప్పి వాయుపుత్రుడగు హనుమంతుడు సీత నోదార్చి ప్రయాణము చేయదలంచి తిరిగి సీతతో నిట్లనెను. “అమ్మా! శత్రువులను నాశనము చేయువాడగు రాముడు, కృత నిశ్చయుడై విల్లు చేత ధరించిన లక్ష్మణుడు నచిర కాలముననే లంకా ద్వారమును సమీపించుట చూడగలవు. గోళ్లు, కోటలు ఆయుధముగా గల వానరులు, సింహము, పెద్దపులి వంటి పరాక్రమము గలవారు గజరాజుల వలె పెద్ద శరీరములు గలవారునగు వానరులు శీఘ్రమే లంకా ద్వారమును చేరుట చూచెదవు. ఆర్యురాలా! నీవు వేగమే పర్వతములవలెను, మబ్బులవలెను ఉన్నతులైన వానరులను, లంకా నగరము నందలి చల్లనిగాలి వీచు పర్వత ప్రదేశముల నుండి సింహనాదములను చేయుచుండగా చూచెదవు గాక! ఆ రాముడును తీవ్రమైన మన్మథుని బాణములచే పీడింపబడి సింహముచేత పీడింపబడిన యేనుగువలె సుఖము చెందుట లేదు. ఓ దేవీ! నీవింక శోకింపకుము. నీ మనస్సునకింక కష్టము కలుగకుండు గాక! దేవేంద్రునితో శచీదేవి వలె నీవు నీ భర్తతో గలిసినట్లే అని తలంపుము. రాముని కంటె గొప్పవాడెవ్వడు? లక్ష్మణునకు సాటియైన వాడెవ్వడు? నీ కాశ్రయులైన వారిరువురు సోదరులు అగ్నిదేవునితో వాయుదేవునితో సమానులు, ఓ సీతాదేవీ! రాక్షస సమూహములకు నివాసమై యెంతయో భయంకరమైన యీ లంకలో నీవిక నెంతో కాలముండవు. నీ ప్రియుడు శీఘ్రమే రాగలడు. నే నాయనను కలిసికొను వఱకు నీవీ దుఃఖమును సహింపుము” అని హనుమంతుడు సీతాదేవితో బలికెను.



# నలువదియవ సర్గము

## సీతాదేవి శ్రీరాము నుద్దేశించి హనుమంతునితో బలుకుట :

దేవకన్యను బోలు సీతాదేవి మహాత్ముడైన హనుమంతుని మాటలాలించి తన దుఃఖము తీరునట్లుగా నిట్లు పలికెను. "ఓ వానరుడా! సగము వయస్సు వఱకు పెరిగి ఆ పైన నీరందకపోవుటచే ఎండిపోవుచున్నదై దైవికముగా కురిసిన వానచే తిరిగి కోలుకొనిన పైరువలె మంచిమాటలను చెప్పుచున్న నిన్నుజూచి మిక్కిలి సంతోషించుచున్నాను. మదన పరవశురాలనగు నేను పురుష శ్రేష్ఠుడగు రామునే తలంచుచున్నాను. శోకముచే పీడింపబడిన అవయవములచే ఆయనను తాకగలుగునట్లు నాయందు దయజూపుము. వానరశ్రేష్ఠుడా! కాకి పై కోపముతో దానియొక కన్ను హరించుటకు తృణమును ప్రయోగించినట్టి గుర్తును రామునకు జ్ఞాపకము చేయుము. పూర్వము నేను నా నుదుట నలంకరించుకొన్న తిలకము అరణ్యమున సంచరించుటవలని అలసటచే చెమటలో కరగి చెక్కిలిపై జారగా చూచి మణిశిలతో నీవు ప్రేమగా తిలకము నలంకరించితివని రెండవ గుర్తును గూడ రాముని తలంపుమని చెప్పుము. మరియు రామా! నీవు పరాక్రమ వంతుడవు. దేవేంద్రునకు వరుణునకు సాటియైన నీవు నేను రావణునిచే దొంగలింపబడి రాక్షసుల నడుమ చిక్కియుండగా ఈ తిరస్కారమునెట్లు సహించుచున్నావు? ఓ యనఘుడా! దివ్యమగు ఈ చూడామణిని నేను బాగుగా కాపాడుకొనుచుంటిని. కష్టములలో దీనిని చూచుకొని నిన్ను చూచినట్లు సంతోషించుచున్నాను. శ్రీమంతము రత్నాకరమునైన సముద్రమున బుట్టినదగు ఈ మణిని నీకు ప్రతిగా అర్పించుచున్నాను. నేనిట్లు శోకముచే పీడింపబడుచు

చిరకాలము జీవింపజాలను. భయంకరాకారులగు ఈ రాక్షసులు పెట్టుబాధలు భరింపరానివి. వారి మాటలు గుండెలలో నాటుకొనిన ములుకులవలె నున్నను నీ కొరకై వీని నన్నిటిని సహించుచున్నాను. ఓ శత్రు మర్దనుడగు రామా! నేనింక ఒక మాసము జీవింతును. నీవు లేకుండ ఆ పైని జీవింపజాలను. ఈ రాక్షస రాజు చాల భయంకరుడు. అతనిని జూచినంతనే గుండెలు తకతకలాడును. ఇంత చెప్పికొన్నను అకటా! నీ మనస్సు కరగనిచో అదియంతయు నా దురదృష్టమని భావింతును."

**హనుమంతుడు మఱలిపోవుటకు సీతాదేవిని సెలవడుగుట :**

మహా తేజశ్శాలి, వాయుపుత్రుడునగు హనుమంతుడు కనులయందు నీరు నిండగా దయ కలుగునట్లుగా సీతాదేవి చెప్పుచున్న యీ మాటలను విని యిట్లనెను. "ఓ దేవీ! నీ యెడబాటువలని శోకముచే రాముడు సర్వ కార్యముల యందు విముఖుడై యున్నాడు. నేను సత్యముపై శపథము చేసి చెప్పుచున్నాను. రాముని దుఃఖమును చూచిన తోడనే లక్ష్మణుడును దుఃఖించుచున్నాడు. ఓ సీతాదేవీ! చాల ప్రయత్నము చేసిన మీదట నీవు కనబడితివి. ఇది నీకు దుఃఖింపదగిన సమయము కాదు. నీవీ క్షణమునందే దుఃఖము తొలగిపోవుటను చూచెదవు. నరశ్రేష్ఠులు, రాజపుత్రులు, శత్రుభంజనులునగు రామలక్ష్మణులు నిన్ను చూడవలెనను నుత్సాహముతో లంకను భస్మము చేయుదురు. విశాల లోచనములుగల ఓ సీతా! రామలక్ష్మణులు యుద్ధమునందు రావణుని, అతని బంధువులను సంహరించి నిన్ను తమ నగరమునకు తీసికొనిపోయెదరు. ఓ పతివ్రతా! రామునకు గుర్తింప వీలగునది. ఆయనకు ప్రీతి కలిగించునదియగు వేరొక గుర్తును కూడ నీయవలసినది" అనెను. ఆమెయు "హనుమంతా! నేనుత్తమమైన యభిజ్ఞానము (గుర్తు) నిచ్చియే యుంటిని. నేను నా శిరోజముల కలంకారముగా నుంచుకొను ఈ చూడామణిని చూచినచో రాముడు నీ మాటలపై విశ్వాసముంచును" అని పలుకగా శ్రీమంతుడగు హనుమంతుడా

శ్రేష్ఠమైన మణిని స్వీకరించి సీతాదేవికి ప్రణమిల్లి లేచి వెడల దలచెను. అట్లు వెడలిపోవదలంచిన వాడై తన శరీరమును బెంచి యెగురుటకు సిద్ధపడుచుండ అతనిని జూచి సీత కన్నుల నీరు పెట్టుకొని దీనముగా బాష్పరుద్ధ స్వరముతో నిట్లనెను. (హనుమ తన శరీరమును పెంచినపుడు చూడామణి వ్రేలియం దిముడదు గాన దానిని కట్టు వస్త్రమునందు కట్టుకొనెనని యెంచవలెను)

**సీతాదేవి హనుమంతుని తిరిగి వెళ్లుట కనుమతించుట :**

"హనుమంతా! సింహసదృశులగు ఆ సోదరులైన రామలక్ష్మణులను మంత్రి సహితుడగు సుగ్రీవుని, ఎల్లరను కుశలమడిగితి ననుము. మహాభుజుడగు రాముడే రీతిగా నన్నీ దుఃఖ సముద్రము నుండి దాటించునో అందులకు తగిన విధముగా చెప్పుము. ఓ వానరవీరా! నా యీ తీవ్రమైన దుఃఖమును రాక్షసుల బెదరింపులను రాముని యొద్దకు వెళ్లిన వెంటనే తెలియ జేయుము. వెడలిరమ్ము. నీకు మార్గమున సుఖము కలుగు గాక".



# నలువది యొకటవ సర్గము

## హనుమంతుడు కార్యశేషము నాలోచించుట :

అని యీ విధముగా సీతాదేవి తెలిపిన విషయములను, గుర్తులను తెలిసికొనినవాడై సీతను చూచుటచే తాను కృతార్థుడనైతినని యుప్పొంగుచు తానింకను చేయవలసిన పని స్వల్పముగా మిగిలి యుండుటను తలపోసి హనుమంతుడు తన మనస్సులో “నీ లంకాధిపతిని సామ దాన భేదోపాయము లతో గాక నాల్గవదియైన దండోపాయముచేతనే సాధింపదగునని యెంచెను. రాక్షసుల యెడ సామోపాయము ప్రయోజనకారి కాజాలదు. సమృద్ధిగా సంపదలు గలవారగుటచే దానోపాయము గూడ నుపయోగపడదు. బలగర్వితు లైన యీ రాక్షసులు భేదోపాయమునకు సాధ్యపడరు. కావున నాకీ రాక్షసుల విషయమున పరాక్రమమే తగినదిగా తోచుచున్నది. మరియు ఈ పనికి పరాక్రమము తప్ప వేరొకటి సాధనము కానేరదు. రాక్షసులలో ముఖ్యులు కొందఱు మరణింతురేని తక్కిన వారెట్లైనను సాధుత్వము నందుదురు. తనకు నియమింపబడిన పని చెడకుండ దానితో బాటనేక కార్యములను సాధించువాడు కార్యము చేయగల సమర్థుడనబడును. ఒకే కారణముచే చిన్నపని గూడ సాధింప శక్యము గాదు. అట్టిచో మహాకార్యమెట్లు సాధింపదగును? ఎవడొక్క పనికే అనేక విధముల చేయ తల పెట్టునో ఆతడా పనిని చేయుటలో సమర్థుడగును. నేనిచ్చట నుండగనే ఇతరుల బలమును, మన బలమును, యుద్ధమున తారతమ్యా మెట్లుండునో తెలిసికొని బలాబలములను నిశ్చయము చేసికొని సుగ్రీవుని కడకు వెళ్లెదనేని అప్పుడు నా స్వామి యాజ్ఞను చక్కగా నెరవేర్చినట్లగును. నాకిప్పుడెట్లు రాక్షసులతో అప్రయత్నముగా యుద్ధమొనగూడునో గదా! ఇట్లు యుద్ధము

జరుగుచో రావణుడు తన పక్షపు బలమును నా బలమును చక్కగా తెలిసికొన గలుగును. అట్లు నేను మంత్రులతో అనుచరులతో సైనికులతో గూడిన రావణుని యుద్ధమున నెదిరించి అతని మనస్సులోని భావమును, బలమును సులభముగా తెలిసికొని యిచ్చటి నుండి వెడలెదను. ఇది యా క్రూరాత్ముడగు రావణుని యుద్యానవనము. దేవేంద్రుని నందనవనమునకు సాటియైనది. ఇది కన్నులకు మనస్సునకు సంతోషము కలిగించునది. హాయి గూర్చు ననేక వృక్షములతో తీగలతో కూడినది. అగ్ని యెండిన కట్టెలను తగుటబెట్టినట్లు నేనీ వనమును పాడుచేసెదను. ఈ వనము పాడైనచో రావణుడు కోపించును. అప్పుడు రావణుడు గుఱ్ఱములు, ఏనుగులు, రథములతో గూడిన తన సేనను త్రిశూలములు, కాలాయసములు, పట్టిసములు మొదలగు ఆయుధములతో యుద్ధము చేయ నాజ్ఞాపించును. అప్పుడు పెద్ద యుద్ధము జరుగగలదు. నేనపుడు యుద్ధమున తీవ్రమైన పరాక్రమము గల రాక్షసులతో కలబడి వారు సహింపరాని పరాక్రమము ప్రదర్శించిసను వారలను తుండెములుగా నరకెదను. అట్లు రావణుడు పంపిన సేనలను చంపి ఆ పైన సుఖముగా కిష్కింధకు వెళ్లెదను".

**హనుమంతుడశోక వనమును పాడు చేయుట :**

(హనుమంతుని యుద్దేశము రావణాసురునితో ముష్టీ ముష్టి యుద్ధము చేసి వాని బలమును తెలిసికొనవలెనని. రావణాసురునికి తాను యుద్ధమునకు వెళ్లకుండ హనుమంతు నితరులచే నెట్టైన గట్టి తెప్పించవలెనని) అని యిట్లు కార్య నిశ్చయము చేసికొని భయంకరమగు పరాక్రమము గల హనుమంతుడు వాయుదేవుని వలె విజృంభించి తన యూరువుల వేగముతో ఆ వనమందలి చెట్లను విరువ నారంభించెను. అట్లా వీరుడగు హనుమంతుడు మదించిన పక్షుల కిలకిలారావములతోను, పెద్ద పెద్ద చెట్లతోను, తీగలతోను, గూడిన యా ప్రమదావనమును (స్త్రీలు విహరించు వనమును) విరిచెను. ఆ వనము విరిగిన చెట్లతోడను, గట్లు తెగిన కొలనుల తోడను, పిండి చేయబడిన

కొండకోనలతోడను, చూచువారల కసహ్యముగా కనిపించెను. అనేక విధములైన పక్షుల అరపులతో, గట్లు తెగిన కొలనులతో వాడిన చిగురుటాకులతో, వాడిన చెట్లతో తీగలతో ఆ దావానలముచే తగుల బెట్టబడిన దానివలెనయ్యెను. లతా గృహములు, చిత్ర గృహములు నశించుట చేతను, గొప్ప సర్పములు మొదలయిన దుష్ట జంతువులు అన్నిచోట్లను పడి చచ్చుట చేతను, శిలాగృహములు పడిపోవుట చేతను, ఆ పెద్దదైన వనము తన స్వరూపమునే కోల్పోయెను. పూర్వము రావణుని స్త్రీ జనమునకు సంతోషము కలిగించునదై వారలకెంత మాత్రమును బాధ కలిగించనిదైన ఆ యంతఃపురోద్యానమునకు సంబంధించిన గడ్డి పొదలు తీగలు గలిగిన ప్రదేశము హనుమంతుని బలముచే విరువబడినదయ్యెను. విపత్తు నందినదై తెగిన తీగెల సమూహములు కలిగినదయ్యెను. ఇట్లు హనుమంతుడు రావణునకు గొప్ప మనోవ్యథ గలిగించి మహాబలశాలురగు పలువురు రాక్షసులతో తానొక్కడే యుద్ధము చేయదలంచి ఆ యశోకవన బహిర్ద్వారమును చేరెను.



# నలువది రెండవ సర్గము

## రాక్షస స్త్రీలు హనుమంతుని వృత్తాంతమును సీతనడుగుట :

అంతతట పక్షుల కూతలచేత, చెట్లు విరుగుటచే వచ్చిన శబ్దములచేతను లంకలో నివసించు వారందఱును భయపడిరి. భయముతోబెదరిన మృగములు, పక్షులును తమ తమ చోటులను వదలి పారిపోవుచు అరచుచుండెను. రాక్షసులకు దుశ్శకునములు గనిపించెను. వికృతమైన ముఖములు గల రాక్షసాంగనలాధ్వని విని నిద్ర లేచినవారై విరిగిన యశోక వనమును, వీరుడగు హనుమంతుని చూచిరి. మహాభుజుడు ధైర్యశాలి, మహాబలవంతుడు నగు హనుమంతుడా రాక్షసాంగనలను చూచి వారు భయము చెందునట్లు పెద్ద రూపమును దాల్చెను. అంతవారలు కొండవలె పెద్ద శరీరముతోనున్న గొప్ప బలవంతుడగు ఆ హనుమంతుని జూచి సీతాదేవి నిట్లు ప్రశ్నించిరి. "ఓ సీతా! అతడెవ్వరు? ఎచ్చటినుండి వచ్చినాడు? ఓ నల్లని కన్నులదానా! నీతో ఆ వానరుడేమి మాటలాడెను?" అనగా ఆ పతివ్రత సర్వాంగసుందరియగు సీత యిట్లనెను. "భయంకర రూపములను ధరించిన రాక్షసులను గురించి తెలిసికొను శక్తి నాకెక్కడిది? (ఆశ్రిత రక్షణార్థమై, స్వప్రాణ రక్షణార్థమై కార్య రక్షణార్థమై పలికెడి బొంకు బొంకు గాదు) అతడెవ్వడో మీరే తెలిసికొనుడు. పాము కాళ్లు పాములకే గదా తెలియును. ఇతనిని చూచి నేనును భయపడితిని. ఈతడెవ్వరో నేనెఱుగను. ఈతడు కామరూపమున వచ్చిన రాక్షసుడనియే నేను తలంచుచున్నాను" అని పల్కెను. సీతాదేవి మాటలు విని కొందఱు రాక్షస స్త్రీలు భయముతో నలుదెసలకు పరువెత్తిరి. కొందఱచ్చట కావలి యుండిరి. మఱికొందఱా వృత్తాంతమును రావణునకు తెలియజేయుటకై వెడలిరి.

వికృతములగు ముఖములు గలిగిన యా రాక్షస స్త్రీలు రావణుని యొద్దకేగి వికృత రూపముగల్లి భయము గలిగించుచున్న వానరుని గూర్చి యిట్లు చెప్పిరి. "రాజా అశోకవనమందు భయంకర శరీరము గలిగి అంతులేని పరాక్రమముగల వానరుడొకడు సీతతో మాటలాడి యచటనే యున్నాడు. లేడి కన్నులంటి కన్నులుగల యా సీత మేమెంత యడిగినను వానరుని గూర్చి యేమియు దెల్పుట కిష్టపడలేదు. ఆ వానరుడు దేవేంద్రుని దూతయో, కుబేరుని దూతయో కావచ్చును. లేదా అతడు సీతను వెదకుటకై శ్రీరాముడంపిన దూతయేమో తెలియరాకున్నది. ఆశ్చర్యము గలిగించు పెద్ద శరీగముగల యాతడు వివిధ మృగములతో గూడి మనోహరమగు నీ ప్రమదావనమును విరిచివేసెను. అతడు పాడుచేయని ప్రదేశములు లేవు. సీతాదేవి యున్న ప్రదేశమును మాత్రమాతడు నాశనము చేయలేదు. అట్లా ప్రదేశమును నాశనము చేయకుండుట సీతను కాపాడుటకో లేక అంతవఱకు వనమును విరుచుటచే గలిగిన శ్రమవలననో తెలియకున్నది. ఐనను అంతటి శక్తిశాలికి శ్రమ యెక్కడిది? అతడామెను కాపాడుటకే అట్లు చేసినాడు. అందమైన చిగురాకులు పువ్వులతో కొనియాడదగి నదియు, మిక్కిలి పెద్దదియు నగు ఏ శింశుపా వృక్షము క్రింద సీత కూర్చొని యున్నదో ఆ వృక్షమును మాత్రమాతడు విరువలేదు. సీతాదేవితో మాటలాడి అశోకవనమును విరిచిన యీ భయంకరాకారుడగు వానరునకు నీవు తీవ్రమైన దండన విధింపదగుదువు. ఓ రాక్షసరాజా! నీ మనస్సునందు నిలిపుకొన్న సీతతో ప్రాణములందాశ లేనివాడు తప్ప వేరెవ్వడు మాటలాడగలుగును?"

**రావణుడు హనుమంతుని మీదికి కింకరుల బంపుట :**

అని చెప్పగా రాక్షసరాజగు రావణుడు రాక్షస స్త్రీల మాటలు విని కోపముతో కన్నులు త్రిప్పుచు సమము చేయబడిన అగ్నివలె ప్రజ్వలించెను. ప్రజ్వలించు దీపము నుండి మండుచున్న మంటలతో గూడి రాలు నూనెబొట్లు వలె కోపించిన రావణుని కనుల నుండి కన్నీటి బిందువులు రాలెను. అంతట తేజశ్శాలియగు

రావణుడు బలమందు తనతో సమానులును, పరాక్రమశాలురును అయిన కింకరులగు రాక్షసులను హనుమంతుని పట్టి తెండని యాజ్ఞాపించెను. వేగనంతులైన యా కింకరులగు యెనుబదివేలమంది రాక్షసులు, కూటములు, ముద్గరములు మున్నగు నాయుధములను చేతులందు ధరించి రావణ భవనము నుండి బయలుదేరిరి. పెద్ద పొట్టలు గలవారు, పెద్ద కోఱలు గలవారు, భయంకర మైన రూపము గల వారు, గొప్ప బలము గలవారు నగు ఆ కింకరులెల్లరును యుద్ధము చేయనుత్సాహముగలవారై హనుమంతుని పట్టుకొనుటకు సిద్ధపడిరి. బహిర్ద్వారముపై నెక్కి మిడుతలగ్నిపై బడునట్లు మహావేగముతో – యుద్ధమునకు సిద్ధముగానున్న హనుమంతుని పైకి పోయిరి. వారనేక విధములైన గదలచేతను, బంగారముతో మణులతో చేయబడిన ఇనుప గుదియలచేతను, సూర్యునివలె ప్రకాశించు బాణములతోను వానరశ్రేష్ఠుడైన హనుమంతుని గొట్టిరి. ఇనుప గుదియలు, అడ్డకత్తులు, శూలములు, ఈటెలు, తోమరములు, చిల్లకోలలను ఆయుధములను దాల్చి వారా హనుమంతుని చుట్టుముట్టి నిలిచిరి.

**హనుమంతుని జయ ఘోషము :**

శ్రీమంతుడును, తేజస్సు గలవాడును, పర్వతాకారుడునైన హనుమమంతుడును తన తోకను నేలపై గొట్టి పెద్ద ధ్వని కలుగునట్లు గర్జించెను. వాయు పుత్రుడగు హనుమంతుడు పెద్ద శరీరముదాల్చి లంకనెల్ల శబ్దములతో నింపుచు స్వేచ్ఛగా తన తోకను విదిల్చెను. తన తోకను విదిలించుటచే పుట్టిన ధ్వని ప్రతి ధ్వనులీనుచుండగా పక్షులాకాశమున కెగిరెను. అంత హనుమంతుడిట్లు ప్రకటించెను. “అత్యంత బలశాలియగు రామునకు జయము జయము. మహాబలశాలియగు లక్ష్మణునకు జయము. రామునిచే వాలివధ ద్వారా కాపాడబడిన సుగ్రీవునకు జయము. నేననాయాసముగనే మహాకార్యములు సాధించునట్టి కోసలరాజగు రాముని దూతను. హనుమంతుడను పేరు గలవాడను. వాయుదేవుని పుత్రుడను. శత్రు

సైన్యములను సంహరించువాడను. ఇటువంటి రావణులను వేయిమందినైనను సంహరింపగలవాడను. నేను వేలకొలది రాళ్ల తోడను, వృక్షములతోడను గొట్టుచుండగా వేయిమంది రావణులైనను యుద్ధమున నాకు సరికాజాలరు. అందఱు రాక్షసుల ముందరనే నేనీ లంకను బాధించి సీతాదేవికి నమస్కరించి నా ప్రయత్నమును ఫలవంతము చేసికొని పోయెదను" ఇట్లా హనుమంతుని గర్జనలచే ఆ కింకర రాక్షసులు ఆశ్చర్యపడిరి. వారికా హనునుంతుడు ఎత్తైన సంధ్యాకాలపు మబ్బువలె గనిపించెను. అంతవారలు తమ ప్రభువు నాజ్ఞను పొందిన వారగుటచే దానిని మీరజాలక ఏ మాత్రము జంకులేని వారగుచు వివిధాయుధములతో హనుమంతునిపై కురికిరి. మహాబలుడగు హనుమంతుడు శూరులగు నా రాక్షసులు తనను చుట్టుముట్టగా బయటి ద్వారమునున్న భయంకరమగు ఇనుప గుదియను చేత ధరించి సర్పమును పట్టిన గరుడునిపలె ఆకాశమున తిరుగుచు దానితో రాక్షసులను మోదెను. ఆ గుదియతో వాయుపుత్రుడు తనమీదకు వచ్చిన రాక్షసుల నందఱిని చంపివేసి యుద్ధమునే కోరుచు మఱల నా బహిర్ద్వారముపై కూర్చుండెను. అప్పుడా హనుమంతుని జూచి భయపడి తప్పించుకొనిన రాక్షసులు కొందఱు పారిపోయి రావణుని యొద్దకు వెళ్లి కింకరులందఱు మరణించిరని చెప్పిరి. రావణుడు తన కింకరులగు రాక్షసుల మహా సైన్యమట్లు మడియుట విని కన్నులు త్రిప్పుచు పరాక్రమమున సాటిలేనివాడును, యుద్ధమున జయింప నసాధ్యుడు నయిన ప్రహస్త పుత్రుని హనుమంతునితో తలపడ నాజ్ఞాపించెను.



# నలువది మూడవ సర్గము

## హనుమంతుడు ప్రాసాదమును విరుగదన్నుట :

హనుమంతుడట్లా రాక్షసులను బరిమార్చి యిట్లాలోచించెను. అశోక వనమును విరిచితిని. చైత్య ప్రాసాదమునింక పాడు చేయవలసియున్నది. కాన నీ యున్నతమగు ప్రాసాదమును గూడ నాశనము చేసెదను. అని మనస్సునందు తలచి హనుమంతుడు తన బలమును ప్రదర్శించుచు మేరు పర్వత శిఖరమువలెనున్న చైత్య ప్రాసాదము నెక్కెను. అట్లు కొండవలెనున్న ప్రాసాదము నధిరోహించి మహాతేజశ్శాలియగు హనుమంతుడు ఉదయించిన రెండవ సూర్యబింబమో యనునట్లు ప్రకాశించెను. ఎత్తైన ఆ ప్రాసాదము నెక్కిన మారుతి మిక్కిలి ప్రకాశించుచు పారియాత్రమను కులపర్వతమువలె నుండెను. ప్రకాశమానుడగు హనుమానుడు పెద్ద శరీరము గలవాడై ఆ లంకా పట్టణమంతయు ధ్వనించునట్లు పెద్దగా తొడలు చరచుకొనెను. ఆ శబ్దము పెద్దదై శ్రవణ రంధ్రములను బద్దలు చేయుచుండ పక్షులచటి నుండి పారిపోయెను. ఆ వనగృహపు కావలివాండ్రందఱు తెలివి తప్పిరి. వెంటనే తిరిగి హనుమంతుడిట్లు పెద్ద శబ్దముతో బలికెను. "అస్త్రములను ప్రయోగించుటయందు నేర్పరియగు రామునకు జయము. మహాబలవంతుడైన లక్ష్మణునకు జయము. రామునిచే కాపాడబడిన మారాజగు సుగ్రీవునకు జయము. అనాయాసముగా రాముని కార్యములను సాధించు రాముని దాసుడను, వాయుపుత్రుడను, హనుమంతడనువాడను. శత్రు సైన్యములను నాశనము చేయువాడను. నేను వేలకొలదిగా రాళ్లను విసరుచు వృక్షములతో కొట్టుచుండగా వేయిమంది రావణులైనను యుద్ధమందు నాతో సాటి కాజాలరు. నేనీ లంకాపురమును ధ్వంసము చేసి సీతాదేవికి నమస్కరించి సర్వ రాక్షసులును చూచుచుండగనే కార్య సాఫల్యమునంది వెళ్లెదను."

**హనుమంతుడు వనపాలకులను జంపుట :**

అని చెప్పుచు ప్రాసాదము మీదనున్న హనుమంతుడా వన మందిరమున నున్న వారలకు తెలియజేయుచు భీకరముగ గర్జించెను. ఆ గొప్ప శబ్దమును విని పెద్ద శరీరములుగల వనపాలకులు నూర్వురు ప్రాసములు, కత్తులు, గండ్రగొడ్డళ్లు మున్నగు వివిధాయుధములను విసరుచు హనుమంతుని చుట్టుముట్టిరి. వారు గదలతోడను, బంగారముతో నలంకరింపబడిన యినుప గుదియలతోడను, సూర్యునివలె ప్రకాశించు బాణములతోడను హనుమంతుని గొట్టసాగిరి. గంగానదిలో నేర్పడిన సుడిగుండమువలె హనుమంతుని చుట్టు ముట్టిన యీ రాక్షస సమూహము ప్రకాశించెను. అప్పుడు హనుమంతుడు కోపించి భయంకరమైన రూపమును ధరించెను. బంగారముతో అలంకరింప బడిన నూరంచులు గల యా మహాప్రాసాదపు స్తంభమును వాయుపుత్రుడు వేగముగా పెళ్లగించి దాని గిర గిర త్రిప్పెను. అప్పుడందుండి యగ్నిపుట్టి యా ప్రాసాదమును తగులబెట్టెను. ఆ ప్రాసాదమును తగుల బెట్టుచున్న మంటలను జూచి హనుమంతు డుత్సాహముతో ఇంద్రుడు వజ్రాయుధముతో రాక్షసులను చంపినట్లు వందమంది రాక్షసులను స్తంభముతో గొట్టి జంపి శ్రీమంతుడై ప్రకాశించుచు ఆకాశమున నిలిచి యిట్లనెను. "సుగ్రీవుని యాజ్ఞతో నడచువారు, మహాత్ములు, వానరశ్రేష్ఠులు నావంటివారు వేలకొలదిగా సకలమైన భూమండలమునందు తిరుగుచున్నారు. తక్కిన వానరులందఱు నావంటివారే. అందు కొందఱు పదియేనుగుల బలము గలవారు. మఱి కొందఱు వంద యేనుగుల బలము గలవారు. ఇంకను గొందఱు వేయి యేనుగులతో సమాన మయిన బలము గలవారు. ఈ వానర సేనాపతులలో కొందఱు వాయువేగము గలవారు. కొందఱింతింతని చెప్పరాని బలముగలవారు. దంతములు, గోళ్లు ఆయుధములుగా గల యిట్టి వానరులు వందలు, వేలు, లక్షలు, కోట్ల సంఖ్యతో మారాజైన సుగ్రీవునితో - మిమ్మంత మొందించుటకు రాగలరు. ఇక్ష్వాకు వంశజుడు మహాత్ముడునగు రామునితో విరోధము పెంచుకొన్న కారణముచే నీ లంకా నగరముగాని, మీరుగాని, రావణుడు గాని యింక లేనటులే తలంపుడు" అని చెప్పెను.

# నలువది నాలుగవ సర్గము

**హనుమంతుడు జంబుమాలిని వధించుట :**

అంతట రాక్షస రాజగు రావణునిచే నాజ్ఞాపింపబడి పెద్ద పెద్ద కోఱలుగలవాడగు ప్రహస్త పుత్రుడు జంబుమాలి ధనుస్సు చేత ధరించి యుద్ధమునకు వెడలెను. అతడెఱ్ఱని మాలలు, వస్త్రములు దాల్చి యుండెను. మెడలో హారములు, చెవులకు సుందరములైన కుండలములు దాల్చెను. అతడు తన కన్నులను గిర గిర త్రిప్పుడు పెద్ద శరీరముగలవాడును యుద్ధమున జయింపరాని వాడునై యుండెను. అతడింద్ర ధనువు వంటి పెద్ద ధనువు దాల్చియుండెను. ఒక బాణమును చేతబట్టి దిక్కులను వణకజేయు పిడుగులకు సాటియైన ధ్వని కలుగునట్లు వింటి నారిని మ్రోగించెను. అట్లు అల్లె త్రాటిని మ్రోగించుచు గాడిదలు పూన్చిన రథమునెక్కి వచ్చిన ఆ జంబుమాలిని చూచి గొప్ప వేగముగల హనుమంతుడు సంతోషమునంది గర్జించెను. ద్వారముపై భాగముననున్న హనుమంతుని, గొప్ప భుజపరాక్రమముగల జంబుమాలి వాడియైన బాణములతో ముఖముపై గొట్టెను. ఒక బాణముతో తలపై గొట్టెను. సహజముగా నెఱ్ఱనిదైన హనుమంతుని ముఖము ఆ జంబుమాలి బాణపుదెబ్బలచే రక్తసిక్తమై మఱింత యెఱ్ఱదనము నొంది శరత్కాలమునందు రక్తచందన బిందువులతో నొప్పు ఎఱ్ఱకలువ వలె నుండెను. ఆ రాక్షసుని బాణములచే దెబ్బతిన్న హనుమంతుడు మిక్కిలి కోపించెను. అంతట తన ప్రక్కనే యొక పెద్దరాయి యుండుటను చూచి బలవంతుడగు హనుమంతుడా రాతిని పెళ్లగించి జంబుమాలిపై విసరెను. దానిని జూచి కోపించి యా రాక్షసుడు వేగముగా పదిబాణములను వేసి యా రాతిని పగులగొట్టెను. తాను చేసిన

పని చెడుటను జూచి హనుమంతుడు భయంకర పరాక్రమముతో ఒక పెద్దదైన వృక్షమును పెకలించి గిరి గిర త్రిప్పెను. మహాబలవంతుడైన హనుమంతుడట్లు వృక్షమును త్రిప్పుచుండగా జంబుమాలి అనేక బాణముల నాతనిపై విసరెను. నాల్గు బాణములతో దానిని ఖండించి, ఐదు బాణములతో హనుమంతుని భుజము పైనను, ఒక్క బాణముతో హృదయమునందును, పదిబాణములతో రొమ్మునందును గొట్టెను. అంత హనుమంతుడా విధముగా బాణములతో నిండిన శరీరముగలవాడై మహాగ్రహమునొంది ఆ ప్రాసాదపు ఇనుప గుదియను లాగి వేగముగా త్రిప్పెను. మహాబలము, మహావేగము గలవాడగు హనుమంతుడా గుదియను వేగముగా త్రిప్పి విశాలమగు జంబుమాలి రొమ్ముపై దానిని బడవేసెను. అప్పుడచ్చట జంబుమాలి యొక్క తలగాని, చేతులు గాని, కాళ్లుగాని, విల్లుగాని, రథముగాని, గాడిదలు గాని, బాణములు గాని కనబడవయ్యెను. అట్లు వేగముగా హనుమంతుడు కొట్టగా మహాబలవంతుడగు జంబుమాలి, అవయవములు పిండి పిండి కాగా ఆభరణములన్నియు చూర్ణములు కాగా నేలబడి మరణించెను. జంబుమాలియు మరణించుట విని రావణుడు కోపముచే నెఱ్ఱబడిన కన్నులు గలవాడయ్యెను. అట్లు ప్రహస్త పుత్రుడగు జంబుమాలి చంపబడగా కోపముచే నెఱ్ఱబడిన కన్నులు గల రావణుడు గొప్ప బల పరాక్రమములు గల మంత్రిపుత్రులను వేగమే హనుమంతునితో పోర నాజ్ఞాపించెను.



# నలువది యైదవ సర్గము

**హనుమంతుడు మంత్రిపుత్రుల నేడుగురిని చంపుట :**

అగ్నివంటి తేజస్సుగల మంత్రిపుత్రులేడుగురును రాక్షసరాజగు రావణుని యాజ్ఞను పొందినవారై రాజభవనము నుండి బయలుదేరిరి. వారలతో గూడ పెద్దసేన బయలు వెడలెను. వారత్యంత బలము గలవారు. అస్త్ర విద్యయందు గొప్ప శిక్షణ పొందినవారు. అస్త్రములు ప్రయోగించుటలో శ్రేష్ఠులు. ఒకరితో ఒకరు పందెములు వేసికొని శత్రువులను జయింపగోరువారై యుండిరి. వారి గొప్ప రథములకు గుఱ్ఱములు గట్టబడి యుండెను. తమ తమ చిహ్నములతో గూడిన ధ్వజములు చిత్రవిచిత్రములైన వస్త్రములచే నలంకరింపబడిన జెండాలు రథములకు గట్టబడి యుండెను. ఆ రథముల ధ్వనులు మేఘ ధ్వనులను బోలియుండెను. గొప్ప బలపరాక్రమ సంపన్నులైన వారా రథములలో గూర్చుండి మేలిమి బంగారుతో చిత్రిపంబడిన విండ్ల మ్రోయించుచు మెరపులతో గూడిన మేఘములవలె ప్రకాశించుచుండిరి. అంతనా మంత్రిపుత్రుల తల్లులు కింకరులు యుద్ధమున చంపబడుటను విని మా పుత్రులేమి యగుదురో యని బంధువుల తోను, మిత్రులతోను కలిసి మిక్కిలి చింతాక్రాంతలైరి. మేలిమి బంగారముతో చేయబడిన శ్రేష్ఠమైన యాభరణములను ధరించిన ఆ మంత్రిపుత్రలేర్వుడును నేను నేనని పందెము వేసికొనుచు ద్వార సమీపముననున్న హనుమంతుపైకి వెళ్ళిరి. రథ ధ్వనులే గర్జనలుగను, బాణములే వర్షముగను నొప్పుచున్న రాక్షసులనెడు మేఘములు తన్ను గప్పగా వాయుపుత్రుడు కొండవలె నేమాత్రమే తొందరపాటు చెందక కడువేగముగా బాణములు తనను తాకని విధముగా

ఆకాశమున తిరుగుచు వానిని వ్యర్థ మొనర్చెను. ఆంజనేయుడు ధనుస్సులు ధరించిన రాక్షసవీరులతో క్రీడించుచు ఇంద్ర ధనుస్సులతో గూడిన మేఘములతో ఆకాశమున ఆటలాడు వాయువువలె ప్రకాశించెను. పరాక్రమశాలియైన హనుమంతుడు పెద్దగా గర్జించుచు రాక్షససేనను భయ పెట్టుచు వారిపై తన బలమును వేగమును కనబరచుచుండెను. శత్రువులను పీడించువాడగు హనుమంతుడు కొందరిని చేతులతోను, కొందరిని పాదములతోను, కొందరిని పిడికిళ్లతోను కొట్టెను. ఆ హనుమంతుడు కొందరిని గోళ్లతో చీరెను. కొందరిని రొమ్ముతోడను, కొందరిని తొడలతోడను గొట్టి పడగొట్టెను. కొందఱు హనుమంతుని అరపులచేతనే నేలబడిరి. ఆ విధముగా మంత్రిపుత్రులు చచ్చి నేలబడగా సైన్యమంతయును భయము చెందినదై దశదిశలకును పరువులెత్తెను. ఏనుగులు పెద్ద బాధతో ఘీంకరించెను. గుఱ్ఱములు నేలబడెను. ఆ యుద్ధభూమి యంతయును విరిగిన రథములు, టెక్కెములు, గొడుగులు మున్నగువాని భాగములతో వ్యాపింపబడి యుండెను. మార్గములు రక్తసిక్తములై కనిపించెను. లంకా నగరమున వివిధములైన వికృత శబ్దములు విననయ్యెను. మహా బలవంతుడు గొప్ప పరాక్రమము గలవాడునగు హనుమ అట్లు విజృంభించి యా రాక్షసులను చంపి యింకను కొందఱు రాక్షసులతో యుద్ధము చేయదలచి తోరణ స్తంభమునే యాశ్రయించి యుండెను.



# నలువది యాఱవ సర్గము

## హనుమంతుని మీదకు రావణుడు సేనా నాయకుల నైదుగురును బంపుట:

తన మంత్రి కుమారులను హనుమంతుడు మట్టు పెట్టెనని తెలిసికొనినవాడై రావణుడు ధీరుడగుటచే తన విషాదమును పైకి కనబడనీయక యించుక ఆలోచించి వీరులు నీతి విశారదులు, హనుమంతుని పట్టుకొనుటయం దుత్సాహము చూపుచున్న వారు, యుద్ధమున వాయువేగముతో సంచరింప గలవారు అయిన విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘనుడు, భాసకర్ణుడు అను ఐదుగురు సేనాపతులకు నిట్లా జ్ఞాపించెను. "ఓ సేనాపతులారా! మీరు గొప్ప సైన్యమును, గుఱ్ఱములు, ఏనుగులు, రథములు మున్నగువానిని తీసికొని ఆ వానరుని పైకి యుద్ధమునకు వెళ్లుడు. అతని నెట్లైనను అదుపులోనికి తెండు. మీరు వానిని సమీపించి తగు జాగరూకులై యుండవలెను. దేశ కాల విరోధము కాకుండునటులాలోచించి పనిని చేయ వలయును. అతని ఘోర కృత్యములను బట్టి నేనతనిని కోతియని తలంపను. గొప్ప బలముతో గూడిన యే భూతమో కావచ్చును. దాని నింద్రుడే మనలను బాధించుటకు తన తపోబలముచే సృష్టించి యుండవచ్చును. నేను పూర్వమే మీతో గలిసి నాగులు, యక్షులు, గంధర్వులు, దేవతలు, అసురులు, మహర్షులు మున్నగువారిని జయించి యుంటిని. కాన వారే మనకీ యుపద్రవమును కల్పించి యుందురు. ఇందు సందేహము లేదు. కావున మీరా కోతిని గట్టిగా పట్టుకొనుడు. ధీరుడు పరాక్రమశాలియునగు ఆ వానరుని మీరవమానింపకుడు.

నేను పూర్వ మిట్టి పరాక్రమశాలురగు వానరులను జూచి యుంటిని. వాలి, సుగ్రీవుడు, మహాబలుడగు జాంబవంతుడు సేనాపతియగు నీలుడు, ఇంకను ద్వివిదుడు మొదలగు వానరులున్నారు. కాని వారి గమనమిట్లు భీకరము గాదు. వారలకి ఆట తేజముగాని పరాక్రమము గాని, ఆలోచనగాని, బలోత్సాహములు గాని, యిట్టి యధేచ్ఛారూప ధారణముగాని కనిపింపవు. ఇది వానర రూపములో వచ్చినట్టి పెద్ద భూతమని తోచుచున్నది. కావున మహా ప్రయత్నముతో దీనిని పట్టవలెను. యుద్ధరంగమున మిమ్ము సురులు, అసురులు, మానవులు మూడు లోకములున' ఎంపజాలవు. ప్రమాదము (పొరబాటు) నందక సంచరింపుడు. నీతి తెలిసినవాడు, యుద్ధమున జయము గోరువాడు, మిక్కిలి ప్రయత్నముతో తన్నుదాను రక్షించుకొనవలెను. యుద్ధమున మేమే జయింతుమని యనుకొనరాదు" అని రావణుడు చెప్పగా తమరాజు నాజ్ఞను గైకొని అగ్నితో సమానమగు తేజము గలవా? ఆ సేనాపతులు వాడియైన వివిధాయుధముల దాల్చి రథములు, మదగజములు, వేగవంతములగు గుఱ్ఱములు, కాల్బలము తీసికొని మహావేగముగా హనుమంతుని మీదకు వెళ్లిరి.

**హనుమంతుడు సేనానాయకుల నైదుగురను జంపుట :**

అంతట వీరులగు ఆ సేనా నాయకులు గొప్ప యుత్సాహముగలవాడును, మహా బలపరాక్రమ సంపన్నుడును, గొప్ప బుద్ధిశాలియు, గొప్ప వేగము గలవాడును, పెద్ద శరీరము గలవాడును, ఉదయించుచున్న సూర్యునివలె ప్రకాశించుచున్నవాడును, తన తేజస్సుచే సూర్య సమానుడుగా నున్నవాడును, బహిర్ద్వారము పై నున్నవాడును అగు హనుమంతుని జూచిరి. వారలా హనుమంతుని చూచుచునే అన్ని వైపులను చుట్టుముట్టి నిలిచి భయంకరములైన వివిధాయుధములతో హనుమంతు నెదుర్కొనిరి. అప్పుడు దుర్ధరుడు ఇనుముతో

చేయబడినవియు, క్రూరమైనవియు, వాడియైనవియు, పసుపు వన్నె గలవియునగు నైదు బాణములను వేసి హనుమంతుని తలపై గొట్టెను. హనుమంతుడా యైదు బాణములచే గొట్టబడినవాడై పది దిక్కులు మారుమ్రోగునట్లు సింహనాదము చేయుచు ఆకాశమున కెగిరెను. అంతట మహా బలవంతుడు వీరుడునైన దుర్గగుడు రథమునెక్కి, ధనుస్సు నెక్కు పెట్టి వందలకొలది వాడి బాణములను హనుమంతునిపై ప్రయోగించెను. చిన్ని మేఘమును వాయువు తూలించునట్లు ఆకాశమున బాణములను గురియించుచున్న దుర్ధరుని తూలించి, అతని బాణములచే పీడింపబడినవాడై, తన శరీరమును పెంచి, వేగముగా ఆకాశమునకెగసి కొండపై పడు పిడుగుల గుంపువలె అతని రథముపై బడెను. ఆ పాటునకు గుఱ్ఱము లెనిమిదియును నలిగినవి. రథపు కండ్లను నొగయు విరుగగా దుర్ధరుడా రథమునందే మరణించెను. రథము నుండి పడిపోయెను. అట్లు దుర్ధరుడు మరణించి నేలబడుటను గాంచి శత్రువులను జయించెడి విరూపాక్ష యూపాక్షులు మిక్కిలి కోపించి హనుమంతునిపై కురికిరి. అప్పుడు నిర్మలాకాశముపై నిలిచియున్న హనుమంతుడు ఒక్కసారిగా నెగిరి, విరూపాక్ష యూపాక్షుల వేగమును నిరోధించి, గరుత్మంతునకు సాటియగు పరాక్రమము గలవాడై మఱల భూమి పైకి దిగెను. దిగి వాయుపుత్రుడొక్క సాలవృక్షము కడకేగి దానిని పెళ్లగించి దానితో నారాక్షసుల నిరువురను చంపెను. అట్లా సేనాపతులు మువ్వురును వేగవంతుడైన హనుమంతునిచే చచ్చుటను జూచి ప్రమసుడు, మహావేగము గలవాడై హనుమంతునిపై కురికెను. అట్లే పరాక్రమశాలియగు భాసకర్ణుడు శూలముతో వేరొక వైపు నుండి కీర్తిమంతుడగు హనుమంతుని పైకి పోయెను. ప్రఘసుడు వాడియగు అడ్డకత్తితోడను, భాసకర్ణుడు శూలముతోడను యుద్ధము చేసిరి.

ఆ విధముగా ప్రఘస భాసకర్ణులిరువురును ఆయుధములతో గొట్టగా బాలసూర్యునితో సమానమగు కాంతిగల హనుమంతుడు కోపించెను. వీరుడు కపిశ్రేష్ఠుడునగు హనుమంతుడు జంతువులతో, పాములతో, చెట్లతో గూడియున్న యొక పర్వత శిఖరమును పెకలించి దానితో ఆ రాక్షసులను గొట్టెను. వారలు ప్రాణహీనులై నేల వ్రాలిరి. సేనాపతు లైదుగురును నశింపగా మిగిలిన సైన్యమును గూడ హనుమంతుడు నాశనము చేసెను. హనుమంతుడప్పుడు దేవేంద్రుడు రాక్షసులను సంహరించినట్లు ఏనుగుల నేనుగులతోడను, యోధులను యోధులతోడను, రథములను రథములతోడను నాశనము చేసెను. మరణించిన యేనుగులతో, చచ్చిన గుఱ్ఱములతో, విరిగిన మహా రథములతో, మృతిచెందిన రాక్షసులతో యుద్ధ మార్గమంతయు నడ్డగింపబడెను. వీరుడగు హనుమంతుడట్లు వీరులగు రావణుని సేనాపతులను, వారి సైన్యమును, వాహనములను నాశనమొనరించి మఱల నా వన బహిద్వారమును జేరి జీవులు నశించు సమయమున కెదురు చూచు యముని వలె నిలబడెను.



# నలువది యేడవ సర్గము

## హనుమంతుని మీదికి రావణు డక్షకుమారుని బంపుట :

రాక్షసరాజగు రావణుడట్లు సేనానులైదుగురును, వారి యనుచరులును, వాహనములును, హనుమంతునిచే నశించుటను తెలిసికొని, ఎల్లప్పుడును యుద్ధమున నేనే జయింతునని గర్వపడువాడును, యుద్ధమునకు ముందుగా పోవదలంచువాడును అగు అక్ష కుమారుని పై తన చూపులను ప్రసరింపజేసెను. ప్రగల్భములు పల్కు వాడగు నక్షుడును తన తండ్రి యట్లు చూచుటచేతనే ప్రేరేపింపబడినవాడై బంగారు రంగు గలిగి యాశ్చర్యము కలిగించు విల్లు ధరించి, బ్రాహ్మణ శ్రేష్ఠులు హవిస్సుల నగ్నియందర్పించుచుండగా వృద్ధి చెందిన యగ్నివలె వేగముగా లేచెను. పరాక్రమవంతుడగు ఆ రాక్షసుడు బాల సూర్యునివంటి కాంతిగలవాడై మేలిమి బంగారము జాలీలతో నలంకరింపబడిన రథమునెక్కి హనుమంతుని పైకి బయల్వెడలెను. అది వాడు తపస్సులనేకములు చేసి సంపాదించినదియు, మేలిమి బంగారు జాలరులతో నలంకరింపబడి నదియు, సామాన్యములగు జెండాలును, రత్నములతో నలంకరింపబడిన జెండాలు గలదియు, మనోవేగముతో సమానమైన వేగముగల యెనిమిది గుఱ్ఱములు గట్టబడినదియు, సూర్యునివంటి కాంతిగలదియు, ఆకాశమున ప్రయాణము చేయగలదియు, చక్కగా సిద్ధము చేయబడిన అమ్ముల పొదులు గలదియు, ఎనిమిది కత్తులు గలదియు, ఆ యా స్థానములందు వరుసలుగా నుంపబడిన శక్తి, తోమరములను ఆయుధములు గలదియు, సక్రమమైన యుపకరణములతో గూడినదియు, బంగారముతో చేయబడినదియు, సూర్య

చంద్రులవలె ప్రకాశించుచున్నదియు, గుఱ్ఱములు మొదలగువాని కట్టుత్రాళ్లు గలదియు, అగు రథము నెక్కి దేవతలకు సాటియైన పరాక్రమము గలవాడై బయలుదేరెను. అక్షుడు గుఱ్ఱముల, యేనుగుల, రథముల ధ్వనులచే ఆకాశమును భూమిని నింపించుచు వెంటవచ్చు సేనలతో అశోకవన బహిద్వారముననున్న సమర్థుడగు హనుమంతుని సమీపించెను. ప్రళయ కాలాగ్నివలెనున్న అక్షుడు ప్రజా నాశనము చేయుటకు ప్రయత్నించుచున్న హనుమంతుని యొద్ద కేగెను. హనుమంతుని చూడగనే ఆశ్చర్యము, ఒకింత తత్తరపాటు నొంది అక్షుడాయనను గౌరవముతో చూచెను. బలవంతుడగు ఆ అక్ష కుమారుడు మహాత్ముడగు హనుమంతుని బలమును, తన బలమును నిర్ధారణ చేసికొని, వసంతరువు నందలి సూర్యునివలె వృద్ధి నందెను. అట్లా రాక్షసుడు హనుమంతుడు యుద్ధమునం దసాధ్యుడని అతని పరాక్రమమును బట్టి గ్రహించి కోపము నందుచు తిరిగి స్థైర్యమును పొందినవాడై ఏకాగ్రతతో (అవహితుడై) మూడు వాడి బాణములతో హనుమంతుని గొట్టెను.

**హనుమంతు డక్ష కుమారుని జంపుట :**

అప్పుడక్ష కుమారుడు మనస్సు నందు గర్వమునంది, ధనుర్బాణములు చేత ధరించి, హనుమంతుని జూచి ఆతడు గర్వముగలవాడనియు, శ్రమను లెక్కచేయడనియు, శత్రువులను జయింపజాలినవాడనియు దలంచెను. అతడు బంగారు బాహుపురులు, సుందరములైన కుండలములు దాల్చి వేగముగా పరాక్రమించుచు హనుమంతు నెదుర్కొనెను. వారి యుద్ధము సాటిలేనిదై దేవ దానవులకు భయము కల్గించెను. అక్ష హనుమంతుల యుద్ధమును జూచి భీతి జెంది భూమి పెద్ద ధ్వని చేసెను. సూర్యుడు తపింపడయ్యెను. వాయువు వీచడయ్యెను. పర్వతములు వడకెను. ఆకాశము పెద్ద ధ్వని చేసెను. సముద్రము క్షోభించెను. లక్ష్యము తెలిసి బాణములను చక్కగా సంధించు అక్షుడు చక్కని

అగ్రభాగము గలవియు, రెక్కలు గలవియు, బంగారు వర్ణము గలవియు, విష సర్పముల వలె నున్నవియు నగు మూడు బాణములను హనుమంతుని తలపై నాటెను. ఆ మూడు బాణములు సమానముగా శిరస్సున నాటి రక్తము కారుటచే తడిసిన హనుమంతుడప్పుడే ఉదయించిన సూర్యునివలె, ప్రకాశించు బాణములే కిరణములమాలగా గల సూర్యుని వలె ప్రకాశించెను. సుగ్రీవుని మంత్రులలో శ్రేష్ఠుడగు హనుమంతుడు వివిధములైన, శ్రేష్ఠములైన ఆయుధములను, ఆశ్చర్యమును గలిగించు విల్లును ధరించిన రాక్షస రాజకుమారుడగు అక్షుని చూచి సంతోషించి యుద్ధము చేయతలంచినవాడై తన శరీరమును పెంచెను. మందర పర్వత శిఖరము పై వెలుగు సూర్యునివలె వృద్ధినందిన కోపము గలవాడై హనుమంతుడు బలపరాక్రమములను కూడగట్టుకొని అక్ష కుమారుని, అతని సేనను, వాహనములను తన కంటి నుండి వెడలు వేడి చూపులతో దహించెను. అక్షుడను మేఘము వానరశ్రేష్ఠుడను కొండ పై బంగారు ఆకారమైన ధనుస్సనెడు ఇంద్రధనసునతో గూడినదై, బాణములనెడు వర్షధారలను కురిపించెను. యుద్ధమున భీకరమైన పరాక్రమము గలవాడై, తేజస్సు వృద్ధి నందినవాడై, బలపరాక్రమములు గలవాడై, వర్షించు మేఘమువలె ఆకాశమున దిరుగుచున్న లక్ష కుమారుని చూచి హనుమ సంతోషించి సింహనాదము చేసెను. రాక్షసుడు బాలుడగుటచే యుద్ధమున తన పరాక్రమమునకు తానే గర్వించుచు, పెరిగిన కోపముతో నెట్టబడిన కన్నులు గలవాడై, ఏనుగు గడ్డితో కప్పబడిన పెద్ద గుంట కడకు వెళ్లినట్లు సాటిలేని పరాక్రమముగల హనుమంతుని మీదకు పోయెను. అక్షుని బాణముల దెబ్బలు సోకిన హనుమంతుడు పెద్దగా మేఘమువలె గర్జించెను. అతడు వెంటనే భుజములు, తొడలు విదలించుకొని, శత్రువులకు భయము కలిగించు రూపముతో ఆకాశమున కెగిరెను. బలవంతుడును, రాక్షస శ్రేష్ఠుడును, పరాక్రమశాలియు, రథికులలో గొప్పవాడును అగు అక్షుడు మేఘము కొండపై వడగండ్ల వాన కురిపించినట్లు బాణవర్షము

కురిపించుచు, ఆకాశమున నెగురుచున్న హనుమంతుననుసరించి తానును ఆకాశమున కెగిరెను. మనోవేగము గలవాడును, వీరుడును అగు హనుమంతు డక్షుడు ప్రయోగించిన బాణముల నడుమ వాయువు వలె సంచరించి బాణపు దెబ్బలను తప్పించుకొనుచు ఆకాశమున దిరిగెను. అట్లు యుద్ధ సన్నద్ధుడై విల్లు ధరించి ఆకాశమును బాణములతో నింపుచున్న అక్షు నాదరముతో చూచుచు వాయుపుత్రు డిట్లాలోచించెను. "మహా బలుడగు ఈ అక్షుడు బాలుడయ్యు బాలసూర్యునివలె ప్రకాశించుచు గొప్ప కార్యమునే చేయుచున్నాడు. సకల యుద్ధ విధానములను ప్రయోగించుచు, ప్రకాశించు ఈ అక్షుని జంపుటకు మనసు రాకున్నది. ఈతడు మహాత్ముడు. గొప్ప పరాక్రమము గలవాడు. యుద్ధమున నేమరుపాటు లేనివాడు. మిక్కిలి సహనశక్తి గలవాడు. తన యుద్ధ విద్యా కౌశలముచే నాగులు, యక్షులు, మునులు మున్నగువారిచే మెప్పుపొందిన వాడు. పరాక్రమము నుత్సాహము మనస్సు నందు పెల్లుబుకుచుండగా ఈతడు నా యెదుట నిలిచి నన్ను చూచుచున్నాడు. మిక్కిలి వేగము గల నితని పరాక్రమము దేవతలకైనను, రాక్షసులకైనను మనస్సున బెదురు పుట్టించును. యుద్ధమున నీతని పరాక్రమము పెరుగుచున్నది కావు. నాకితనిని చంపుట తప్పని దగుచున్నది. అగ్ని పెరుగుచుండగా ఉపేక్షించుట పాడిగాదు గదా!" పరాక్రమశాలియు, మహాబలవంతుడు నగు హనుమంతుడిట్లు తన శత్రువు యొక్క పరాక్రమమును తలంచుచు తన కర్తవ్యము నూహించుకొని యా రాక్షసుని జంపవలెననియే నిశ్చయించుకొనెను. వీరుడగు నా వాయుపుత్రుడు వెంటనే గొప్పవేగము గలవియు, ఏమరుపాటు లేనివియు, కుడియెడమలకు తిరిగినప్పుడు కూడ రథము బరువును మోయజాలినవియునగు అక్షుని గుఱ్ఱముల నెనిమిదింటిని ఆకాశముననే అరచేతితో గొట్టి చంపెను. పిమ్మట అక్షుని రథము గూడ సుగ్రీవుని మంత్రి యగు హనుమంతుని అరచేతి దెబ్బచే నొగ తొలగి చక్రములు విరిగి ఆకాశమునుండి నేలబడెను. అంతట మహారథుడగు అక్షుడు

తీవ్రమైన పరాక్రమమున నొప్పుచు రథమును విడచి, విల్లు ధరించి, కత్తిని చేతబట్టి, ఋషి తన తపః ప్రభావముచే శరీరమును వీడి స్వర్గమున కేగినట్లుగా ఆకాశమున కెగిరెను. వాయువుతో సమానమైన పరాక్రమము గల హనుమంతుడు, గరుత్మంతుడు, వాయుదేవుడు, సిద్ధులు సంచరించునట్టి ఆకాశమున దిరుగుచున్న అక్షుని సమీపించి యాతని పాదముల నొడిసి పట్టుకొనెను. ఇట్లు వానరశ్రేష్ఠుడు తన తండ్రియగు వాయుదేవునకు సాటియైన పరాక్రమముతో గరుత్మంతుడు మహా సర్పమును బట్టునట్లు అక్షుని బట్టి వేయి మారులు గిరగిర త్రిప్పి యుద్ధభూమి పైకి వేగముగా విసరి వైచెను. రాక్షసుడు భుజములు తొడలు నడుము మెడ విరిగి, కారుచున్న రక్తముచే దేహము తడిసి, ఎముకలు కండ్లు నలిగి, సంధి బంధములు విడిపోయి, హనుమంతునిచే చచ్చెను. అట్లా మహాబలవంతుడగు హనుమంతుడు అక్షుని నేలపై గొట్టి చంపి రాక్షసరాజగు రావణునకు మహాభయము కలిగించెను. అక్ష కుమారుడు మరణింపగా జ్యోతిశ్చక్రమున సంచరించు మహర్షులు, భూతములు, యక్షులు, ఉరగులు, దేవేంద్రుడు, దేవతలు మిక్కిలి యాశ్చర్యముతో హనుమంతుని జూచిరి. వీరుడైన హనుమంతుడట్లు తేజస్సుచే దేవేంద్రుని కుమారునకు సాటియైనవాడు, నెత్తురువలె నెఱ్ఱనైన నేత్రములు గలవాడును అగు అక్ష కుమారుని జంపి ప్రళయకాల యమునివలె మఱల వన బహిర్ద్వారము మీదకే విశ్రమింప వెడలెను.



# నలువది యెనిమిదవ సర్గము

## రావణుడింద్రజిత్తును హనుమంతుని మీదికి బంపుట :

హనుమంతునిచే అక్ష కుమారుడు చంపబడగా రావణుడెట్లో తన మనస్సును సమాధానపరచుకొని, కోపముతో మండిపడుచు, ఇంద్ర సమానుడగు నింద్రజిత్తున కిట్లా జ్ఞాపించెను. "ఓయీ నీవస్త్రముల నెరిగినవాడవు. శస్త్రములను ప్రయోగించుట తెలిసిన వారిలో శ్రేష్ఠుడవు. దేవతలకు, రాక్షసులకు గూడ యుద్ధమున దుఃఖము గలిగింపగలవాడవు. నీ పరాక్రమము దేవతలకును, రాక్షసులకును చిరపరిచితమైనదే గదా! బ్రహ్మ నారాధించి బ్రహ్మాస్త్రమును బడసినవాడవు. నీ యస్త్ర బలము నెదిరించి దేవాసురులు నిలువజాలరు. ఇంద్రుడు కూడ నిలువజాలడు. మాయాజాలమును ప్రయోగించుట యందు నీకు సమానులెవ్వరును లేరు. మూడు లోకములందును యుద్ధమున నిన్నెదిరించి శ్రమచెందని వాడుగాని, తన భుజబలముచే తన్ను రక్షించుకొనగలవాడు గాని, తన తపోబలముచే రక్షింపబడువాడుగాని లేడు. నీవు దేశకాలముల సంవిధానము తెలిసినవాడవు. ప్రజ్ఞ గలవాడవు. యుద్ధములో నాలోచించి నీవు సాధింపలేని పనిలేదు. మూడు లోకములలోను నీ యస్త్ర బలమును, భుజ బలమును నెఱుగని వీరుడు లేడు. నీ తపోబలమును, యుద్ధమునందు నీ పరాక్రమమును, నీయస్త్రముల బలమును నీవు నా పుత్రుడవై నందులకు తగియున్నవి. యుద్ధ రంగమున నీవు నిలిచియుండగా జయము నిశ్చయమగుట చేత నా మనస్సు కొంచెమైనను కలతనందదు. కింకర రాక్షసులెల్లరును, జంబుమాలియు చచ్చినారు. వీరులగు మంత్రిపుత్రులు ఏడుగురును, సేనానులైదుగురును మరణించినారు. సమర్థములైన సైన్యములు, గుఱ్ఱములు,

ఏనుగులు, రథములు నశించినవి. మనకెంతో ప్రీతిపాత్రుడగు నీ సహోదరు దక్షకుమారుడు చంపబడినాడు. శత్రువులను నాశనమొనర్చువాడా! నాకితరుల మీదికంటె నీయందే విశ్వాసమధికము. కనుక నిన్ను పంపుచున్నాను. ఓయి బుద్ధిమంతుడా! నీవిప్పుడు మన గొప్ప సేనాబలమును, వానరుని ప్రభావమును, పరాక్రమమును నీ బలమును గూడ విమర్శించి తగు విధముగా బ్రవర్తింపుము. అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడా! శత్రువులను నాశనము చేయు స్వభావము గల నీవండగా నుండ మన సైన్యమునకెట్లు వినాశము కలుగకుండునో ఆ విధముగా బలాబలములను పరిశీలించి కర్తవ్యము ననుసరింపుము. ఓ వీరుడా! ఒక్కుమ్మడిగా యోధులను బరిమార్చు ఆ వానరుని యెదుట సేన ప్రయోజనకారి గాదు. వజ్రమువంటి కఠినమైన ఆయుధముతో వాని నెదిరించుట నిష్ప్రయోజనము. వానితో ముష్టి యుద్ధము కూడ యోగ్యము కాదు. హనుమంతుని గమనశక్తి వాయుదేవునకు గూడలేదు. అతడగ్నివంటి తేజోమూర్తి యగుటచే పిడికిటి పోటులకు చావడు. కాన నీవీ విషయముల నేకాగ్రతతో నాలోచించి, శత్రువు నీకు తీసిపోడని నిశ్చయము చేసికొని, దివ్యమగు నీ యస్త్రముల ప్రభావమును తలంచుచు వెడలుము. అపాయము కలుగని విధముగా కర్తవ్యమును నిర్వర్తింపుము. (ఇదివఱకు హనుమంతునితో యుద్ధము చేసినవారు భుజ శస్త్ర బలములను నమ్మినవారు. అక్ష కుమారుడస్త్ర విద్య తెలిసియు ఆ మార్గమున బోయినవాడు కాదు. అతికాయమకరాక్షాదులు అస్త్ర విద్య తెలిసియు, హనుమంతుని జయించునంత విద్య తెలిసినవారు కారని రావణుడు బ్రహ్మాస్త్రాది సర్వాస్త్రవేదియైన ఇంద్రజిత్తుని నస్త్రములతోనే పోరుమని యుద్బోధించెను) పిన్నవగు నిన్ను పంపవలెనని నిశ్చయించుట తండ్రినగు నాకుచితమగు ఆలోచన కాదు కాని యిది రాజధర్మము. క్షత్రియుని యాలోచనము క్షత్ర ధర్మముననుసరించి, యోధుని బంపుటలో బంధుత్వము చూచుట జరుగదు. ఓ శత్రు సూదనుడా! కుశలుడగువాడు యుద్ధమున

వివిధాయుధములను తప్పక ఉపయోగింపవలెను. యుద్ధమున విజయము కోరవలెను. విజయము కొఱకు సర్వాస్త్రములను సహింపవలెను."

**ఇంద్రజిత్తు హనుమంతుని మీదికి యుద్ధమునకు పోవుట :**

దేవతలతో సమానమగు ప్రభావము గలవాడును, మహాబలశాలియు, వీరుడు నగు ఇంద్రజిత్తు తండ్రి చెప్పిన ఆ మాట విని, యుద్ధము చేయుటకు కృతనిశ్చయుడై యుత్సాహముతో యుద్ధభూమికి గదలెను. శ్రీమంతుడు. తామరరేకులవంటి కన్నులు గలవాడును, మహాతేజశ్శాలియు, రాక్షస రాజైన రావణుని పుత్రుడు నయిన ఇంద్రజిత్తు సర్వకాలమున సముద్రము వలె నుప్పొంగుచు యుద్ధమునకు వెడలెను. ఇంద్ర సమానుడగు నింద్రజిత్తు పక్షిరాజగు గరుత్మంతునితో సమానమయిన వేగము గలవియు, తెల్లనై వాడియైన కోఱలు గలవియు అగు నాలుగు వ్యాఘ్రములు పూన్చిన మహా వేగముగల రథముపై నెక్కెను. రథికులలో నుత్తముడును, విలుకాండ్రలో శ్రేష్ఠుడును, శస్త్రాస్త్ర కుశలుడును అగు ఇంద్రజిత్తు, హనుమంతుడున్న చోటునకు శీఘ్రమే రథమెక్కి వెడలెను. హనుమంతుడు నింద్రజిత్తు రథ ధ్వనిని, వింటినారి సవ్వడిని విని మిక్కిలి యానందించెను. యుద్ధ కుశలుడగు నింద్రజిత్తు పెద్ద వింటిని, తీక్షణములగు ములుకులు గల బాణములను దాల్చి హనుమంతునితో పోరుటకేగెను. అటులా ఇంద్రజిత్తు మిక్కిలి సమరోత్సాహము గలవాడై బాణములు చేత దాల్చి వెడలుచుండగా దిక్కులన్నియు ధూళిచే కలుషితములయ్యెను. క్రూర మృగము లనేక విధముల నఱచెను. ఆ సమయమున నాగులు, యక్షులు, మహర్షులు, సిద్ధులు గుంపులు గుంపులుగా నచటకు వచ్చి చేరిరి. పక్షి సంఘములును ఆకాశమును గప్పివైచి మిక్కిలి భీతితో బిగ్గరగ నరచుచుండెను. రథమెక్కి వచ్చుచున్న ఇంద్రజిత్తును జూచి వేగవంతుడగు హనుమ వెంటనే సింహనాదము చేసి తన శరీరమును బెంచెను.

ఇంద్రజిత్తు దివ్యమగు రథమెక్కి చిత్రమైన విల్లును చేతబట్టి పిడుగుపాటువలె పెద్దగా ధ్వని చేయుచు ధనుష్టంకారము చేసెను. మిక్కిలి దుస్సహమగు వేగము గలవాడును, మహాబలశాలురును, యుద్ధమున భయము నెఱుగనివారును అగు మేఘనాద హనుమంతులిరువురును, పరస్పరము విరోధము నూనినవారై దేవరాజగు నింద్రుడు రాక్షసరాజగు బలివలె ప్రకాశించిరి. హనుమంతుడు తన శరీరమునుబెంచి వీరుడు, మహారథుడు, విల్లుదాల్చిన వాడు, యుద్ధ కుశలుడునగు ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణముల వేగము నడ్డుకొనుచు సంచరించెను. శత్రువీరులను సంహరించువాడగు ఇంద్రజిత్తు పొడవైన వాడిమొనలు గలవి, చక్కని యీకలు కట్టినవి, బంగారముతో నిర్మింపబడిన వెనుక భాగములు గలవి, కొంచెము వంగియున్నవి యగు బాణములనా హనుమంతునిపై ప్రయోగించెను. హనుమంతుడు రథ ధ్వనిని, తూర్య నాదమును, భేరీ పటహాదుల నాదమును, ధనుష్టంకార శబ్దమును విని మఱల పైకెగిరెను. గుఱి చూచి బాణమునేయగల ఇంద్రజిత్తు యొక్క లక్ష్య దృష్టిని నిష్ఫలమొనర్చుచు హనుమంతుడాతడు ప్రయోగించిన బాణముల నడుమ సంచరించెను. హనుమంతుడు ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణములకెదురు నిలుచుచు అవి తన్ను చేరులోపలనే చేతులు చాచి పైకెగయుచుండెను. అట్లు మహావేగము గలవారును యుద్ధ కుశలురునగు వారిరువురు సకల ప్రాణుల మనస్సుల కాశ్చర్యముగలుగజేయు యుద్ధ మొనర్చిరి. రాక్షసునకు హనుమంతుని గొట్టు నవకాశముగాని, వానరున కింద్రజిత్తును కొట్టు వీలుగాని కలుగదయ్యెను. దేవతలకు సాటియగు పరాక్రమముగల వారిద్దరును ఒకరినొకరు జయింప నసాధ్యులై యుండిరి. అట్లు పలుమార్లు గుఱి తప్పుచు అమోఘములగు బాణములు నిష్ఫలములగుచుండగా చూచి, మహాత్ముడగు నింద్రజిత్తు వింటినెక్కు పెట్టుటలో మఱింతగా దృష్టి నిల్పి మిక్కిలి చింతాక్రాంతుడయ్యెను.

**ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రమున బంధించుట :**

ఈ హనుమంతుడిట్లు శర యుద్ధముచే సాధ్యము కాదని నిశ్చయించి, ఇంద్రజిత్తు ఇతనినెట్లు పట్టుటయా యని యాలోచించెను. అప్పుడు మహాతేజస్సు గలవాడు, వీరుడు, అస్త్రముల, తెలిసినవారిలో శ్రేష్ఠుడునగు నింద్రజిత్తు కపిశ్రేష్ఠుడగు నా హనుమంతునిపై బ్రహ్మాస్త్రమును సంధించెను. మహాభుజుడును అస్త్ర ప్రయోగ కుశలుడును అగు నింద్రజిత్తు హనుమంతుడు చంపుటకు శక్యముగానివాడని తెలిసికొని బ్రహ్మాస్త్రముతో బంధించెను. హసుమంతుడు రాక్షసుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే బంధింపబడినవాడై చేష్టలుడిగి నేల పైబడెను. పిమ్మట హనుమంతుడు తాను బ్రహ్మాస్త్రముచే బంధిపబడినట్లు తెలిసియు బ్రహ్మదేవుని వరముచే వించుకంతయు బాధలేనివాడై, తనకు పూర్వము బ్రహ్మ బ్రహ్మాస్త్ర బంధము నుండి నీవు ముహూర్త కాలముననే విముక్తుడవు కాగలవని యిచ్చిన వరమును తలంచుకొనెను. “ఈ బ్రహ్మాస్త్రము నుండి విడిపించుకొను సామర్థ్యము నాకు లేదని తలంచి ఇంద్రజిత్తు ఈ యస్త్రమును నాపై ప్రయోగించినాడు. కావున నేనా బ్రహ్మదేవుని యాజ్ఞచే నీ యస్త్రము ననుసరించుట యుక్తము.” అని హనుమంతుడు బ్రహ్మాస్త్ర బలమును, తనకు బ్రహ్మ దయతోనిచ్చిన వరముచే విడిపించుకొను శక్తిని తలచి, బ్రహ్మాస్త్రమును గౌరవింపదలచి, యూరకుండెను. (సూర్యుని మ్రింగి విడచిన పిమ్మట బ్రహ్మ, మహేంద్రుడు, నా తండ్రియగు వాయుదేవుడు నన్ను రక్షించిరి గాన నిపుడు బ్రహ్మాస్త్రము నన్ను బంధించినను భయపడను) ‘నన్నీ రాక్షసులు పట్టుకొన్నను నాకందువలన పర్యవసానము మంచియే కనబడుచున్నది. ఏలనన ఈ విధముగనైనను నేను రావణునితో మాటలాడ గలుగుదును. కావున శత్రువులు నన్ను బంధింతురు గాక’! అని తన కర్తవ్యమును నిశ్చయించు కొనినవాడై శత్రువులను సంహరించువాడును, ముందు వెనుక లాలోచించి తన కర్తవ్యమును నిర్ణయించుకొనువాడును అగు హనుమంతుడు చేష్టలుడిగి

శత్రువులు తన్ను బంధించునప్పుడు మాత్రము తన కోతి గుణము తెలియునట్లు పెద్దగా గర్జించెను. శత్రువులను సంహరించువాడగు హనుమంతుడట్లు చేష్టలుడిగి యుండుటను జూచి రాక్షసులు జనుపనారతో పేనిన త్రాళ్లతో బంధించిరి.

**రాక్షసులు హనుమంతుని గట్టి రావణునొద్దకు గొనిపోవుట :**

హనుమంతుడట్లు సంతోషముతో వారిచే కట్టువడుట కిష్టపడెను. రాక్షసరాజగు రావణుడు తన్ను జూడ దలంచుచున్నాడని నిశ్చయించుకొని యూరకుండెను. హనుమంతు నా రాక్షసులు నారతో బంధించుటచే బ్రహ్మాస్త్ర బంధము తొలగిపోయెను. బ్రహ్మాస్త్ర బంధము వేరొక బంధనము తరువాత నిలువదు గదా! తరువాత వీరుడగు ఇంద్రజిత్తు హనుమంతుని రాక్షసులు నారత్రాళ్లతో బంధించుటచే బ్రహ్మాస్త్ర బంధము తొలగిపోవుట తెలిసి 'అయ్యో! నేనొనర్చిన మహా కార్యమిట్లు విఫలమయ్యెనే! ఈ రాక్షసులు మంత్ర ప్రభావ మెట్టిదో ఆలోచింపలేదు. ఒకమారు విడచిన తరువాత మఱియొక మారది యతనిపై బనిచేయదు. కనుక ఇపుడందఱమును సంశయమున బడితిమి' అని చింతించెను. హనుమంతుడు బ్రహ్మాస్త్రము వలన విడువబడినవాడయ్యును ఆ విషయమును గమనింపడయ్యెను. తన్నా రాక్షసులు లాగికొని పోవుచున్నను అట్లే బంధనములచే బాధింపబడుచుండెను. క్రూరాత్ములగు నా రాక్షసులు హనుమంతుని కర్రలతో కొట్టుచు, పిడికిళ్లతో పొడుచుచు రాక్షసరాజగు రావణుని చెంతకు తీసికొనిపోయిరి. అంతట నింద్రజిత్తు పూర్వము బ్రహ్మాస్త్రముచే బంధింప బడి వృక్ష సంబంధమైన త్రాళ్లచే గట్టబడుటచే బ్రహ్మాస్త్రముచే విడువబడిన వానరశ్రేష్ఠుడగు హనుమంతుని రాక్షసగణములచే పరివేష్టింబడిన రాక్షసరాజగు రావణునకు చూపించెను. మదించిన యేనుగువలె నా వానరశ్రేష్ఠుడు బంధింపబడుటను రాక్షసులు తమ రాజునకు తెలియజేసిరి. 'ఇతడెవ్వడు? ఎక్కడ నుండి వచ్చెను? ఇక్కడి కేల వచ్చెను? ఇతని పేరేమి?' అని యిట్లు హనుమంతుని గూర్చి రాక్షసవీరులు తమలో తాము ఒకరితో నొకరు

ప్రశ్నించుకొనుచుండిరి. 'ఇతనిని చంపుడు – కాల్చుడు, తినివేయుడు' అని ఈ ప్రకారముగా కోపించిన రాక్షసు లొండొరుతో చెప్పుకొన జొచ్చిరి. మహాత్ముడగు హనుమంతుడట్లు రాజమార్గము గడచి మహారత్నములతో నలంకరింపబడిన సౌధమును, అందు రావణుని పాదముల చెంతనున్న మంత్రులను జూచెను. మహాతేజశ్శాలియగు రావణుడును, వికృతాకారులగు రాక్షసులచే నిటురా! అటురా! యని యిటు నటు లాగబడుచున్న హనుమంతుని జూచెను. వానర శ్రేష్ఠుడగు హనుమంతుడు తేజో బల సమన్వితుడై ప్రజ్వలించు చున్న సూర్యునివలె నున్న రావణుని జూచెను. రావణుడెఱ్ఱని నేత్రములను గుండ్రముగా త్రిప్పుచు, హనుమంతుని చూచి, యచ్చట కూర్చొని యున్న కులవృద్ధులు, శీలవృద్ధులు నగు మంత్రి ముఖ్యులను హనుమంతుని గూర్చి తెలిసికొన నాజ్ఞాపించెను. మంత్రులును హనుమంతుడే కర్తవ్యము నాచరించుటకు వచ్చినాడో? అతని నెవ్వరు పంపిరో? తెల్పుమని అడుగగా హనుమంతుడును 'నేను దూతను. వానర రాజగు సుగ్రీవునికడ నుండి వచ్చితిని' అని వక్ష్యమాణ ప్రకారముగా తెలియజేసెను.



# నలువది తొమ్మిదవ సర్గము

## హనుమంతుడు రావణుని సభలో జూచుట :

భయంకర పరాక్రమవంతుడగు హనుమంతుడు 'రావణుడు నాతో యుద్ధము జేయరావలెనని తలంచితిని గాని ఆతడు నీతి శాస్త్రము నెరిగిన వాడగుటచే తాను సింహాసనము వీడకయే, ఇంద్రజిత్తునంపి నన్ను బంధించి తనయొద్దకు రప్పించినాడ'ని యతని రాజనీతికి ఆశ్చర్యమునందినవాడై రోషముతో కన్నులెఱ్ఱవడగా రాక్షసరాజగు రావణుని జూచెను. సహజముగనే తేజశ్శాలియగు ఆ రావణుడు గొప్ప విలువైనదియు, ప్రకాశించునదియు, బంగారముతో చేయబడినదియు. ముత్యములు పొదిగినదియు అగు కిరీటముచే మరింతగా ప్రకాశించెను. రావణుడు వజ్రముచే చిల్లులు పొడిచి మాలగా కూర్చబడిన వెలలేసి మణుల విగ్రహములు మనస్సునందు సంకల్ప మాత్రము చేతనే సృష్టింపబడినవి వలె ఆశ్చర్యమును గలిగించు ఆభరణములు దాల్చి ప్రకాశించుచుండెను. ఆతడు గొప్ప వెలగల పట్టు వస్త్రములను ధరించెను. ఒడలికి రక్త చందనము పూసికొని యుండెను. ఆ చందనపు పూతలు పంక్తుల వలె విచిత్రములై యుండెను. చక్కగా తెరువబడిన నోళ్లు గలవియు, చూచుట కింపైనవియు, ఎఱ్ఱనైన కన్నులు గలవియు, చూచువారలకు భయము కలిగించు నవియు, ప్రకాశించువాడియైన పెద్ద కోటలు గలవియు, వ్రేలాడు పెదవులు గలవియు అగు పదితలలతో ప్రకాశించువాడును, వీరుడును, మహా తేజశ్శాలియునగు ఆ రావణుడు అనేక క్రూరమృగములతో నిండిన శిఖరములు గల మందర పర్వతమువలె నుండెను. కాటుక ప్రోవు వలె నల్లనైనవాడును, వక్షఃస్థలమున హారములతో విరాజిల్లువాడును, పూర్ణచంద్రుని బోలు ముఖకాంతి గలవాడును అగు ఆ రావణుడు బాహువులందు భుజకీర్తులను ధరించి

యుండెను. శ్రేష్ఠమైన చందనపు పూతలు, భుజకీర్తులు, మున్నగు నాభరణములు గల యతని బాహువులు ఐదు తలల పాములవలె ప్రకాశించు చుండెను. మిక్కిలి పెద్దదియు, స్ఫటిక శిలా నిర్మితమును, చిత్ర వర్ణములు గలదియు, అచ్చటచ్చట రత్నములు కూర్చి సుందరముగా చేయబడినదియు, శ్రేష్ఠమైన ఆస్తరణము గలదియు నగు శ్రేష్ఠమైన సింహాసనము నతడు అధిరోహించి యుండెను. చక్కగా అలంకరించుకొనిన సుందరులైన స్త్రీలాయన చుట్టును చామరములు చేత ధరించి, విసరుచు సేవించుచుండిరి. రావణుడు దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అను మంత్రాలోచన దక్షులగు నలుగురు రాక్షస మంత్రులచే పరివేష్టింపబడినవాడై నాలుగు సముద్రములచే చుట్టబడిన భూమివలె నుండెను. ఇతర మంత్రులు దేవతలు, దేవేంద్రుని వలె అతనిని సేవించుచుండిరి. హనుమంతుడు మేరు శిఖరము నధిరోహించి జలములతో నిండిన నల్లని మేఘమువలెనున్న మహా తేజశ్శాలియగు రాక్షసరాజు రావణుని జూచెను. భయంకరమగు పరాక్రమముగల రాక్షసులు తన్ను బాధించుచున్నను లెక్కచేయక హనుమంతుడాశ్చర్యముతో ఆ రాక్షసరాజునే చూచుచుండెను. హనుమంతుడట్లు ప్రకాశించుచున్న రాక్షసరాజగు రావణుని చూచి, ఆయన తేజస్సుచే మోహితుడై మనస్సులో నిట్లు తలంచెను. "ఆహా! ఏమి రూపము! ఏమి ధైర్యము! ఏమి బలము! ఏమి కాంతి! ఆహా! యీ రాక్షసరాజు సకల ప్రశస్త లక్షణములతో నలరారుచున్నాడే! ఈ రావణుడు ఇట్టి బలీయమగు సీతనపహరించుట యను నధర్మ కార్యము నాచరించి యుండనిచో, దేవేంద్ర సహితమగు దేవలోకమునకే యేలిక కాదగిన వాడు గదా! ఇతడాచరించిన భయంకరములును, పరద్రోహకరములును, దుశ్శీలము లును అగు కార్యములచే దేవతలతో, రాక్షసులతో గూడిన లోకములన్నియును భయపడుచున్నవి. ఈతడు కోపించినచో లోకమంతయు నేకసముద్రముగా చేయగలడు" అని హనుమంతుడు రాక్షసరాజగు రావణుని ప్రభావము చూచి అనేక విధములయిన యాలోచనములు చేసెను.

# ఏబదియవ సర్గము

**రావణుడు హనుమంతుని జూచి ఆలోచించుట :**

గొప్ప భుజములు గలవాడు, లోకములను పీడించువాడు నగు రావణుడు, గోరోచనపు వర్ణము గల కన్నులు గలవాడు, తేజస్సుచే ఆవరింపబడినవాడును, వానరశ్రేష్ఠుడు నగు హనుమంతుని జూచి సంశయాకుల చిత్తుడై యిట్లు చింతింపదొడగెను. "ఈతడు సాక్షాత్తుగా ఇందు వచ్చిన భగవంతుడగు నందీశ్వరుడు కాదు గదా! పూర్వము నేను కైలాసమును గదల్చినప్పుడు నాకు శాపమిచ్చిన నందీశ్వరుడుగాని లేక బాణుడను రాక్షసుడుగాని యీ వానర రూపముతో వచ్చెనా?" అని యిట్లాలోచించి రావణుడు కోపముతో కన్ను లెఱ్ఱపడగా మంత్రి శ్రేష్ఠుడగు ప్రహస్తునితో అప్పటికి తగిన విధముగా నిట్లనెను. "ప్రహస్తా! ఇతడే దేశము నుండి వచ్చెనో అట్లు వచ్చుటకేది హేతువో, నాతోట పాడుచేయుటలన నీతనికేమి ప్రయోజనమో, రాక్షస స్త్రీలను భయపెట్టిన కారణమేమియో యీ దుర్మార్గునడుగుము. ఎదిరింపరాని యీ పట్టణమునకు వచ్చుటకేమి హేతువో, యుద్ధము చేయుటకేమి కారణమో దుర్మతియగు నీ వానరు నడుగుము. వీనినిచ్చటి కెవ్వడు పంపెనో తెలిసికొనుము" అని చెప్పుచున్న రావణుని మాటలను విని ప్రహస్తుడిట్లనెను.

**ప్రహస్తుడు హనుమంతుని ప్రశ్నించుట :**

"ఓ వానరుడా! నీవూరట నందుము. నీకేమియు గాదు. భయపడకుము. నీ గురించిన విషయము నున్నదున్నట్లుగా చెప్పుము. నిజము చెప్పినచో పో విడుతుము. అట్లుగాక అసత్య కల్పనలు చెప్పితివా నిన్ను శరీరముతో విడువము.

నీవింద్రునిచే ఈ లంకకు పంపబడితివా? లేక కుబేరుని దూతవా? యమకుబేరులలో నొకరంపగా వచ్చితివా? లేదా రాక్షసులపై విజయమునంద గోరుచున్న విష్ణువుచే పంపబడిన దూతవా? నీది వానర రూపమయ్యును నీ తేజము సామాన్య వానరులందుండునది కాదు. నీవిటకెందులకు వచ్చితివో నిజము చెప్పుము. వెంటనే నిన్ను విడిపింతును. అట్లుగాక నీవు సత్యము చెప్పనిచో నీవు బ్రతుకుట దుర్లభము. కనుక నీవెందులకీ రావణుని లంకలో ప్రవేశించితివో చెప్పుము.

**హనుమంతుడు రావణునకు తన వృత్తాంతమును చెప్పుట :**

అని ప్రహస్తుడడుగగా హనుమంతుడు రాక్షసరాజగు రావణుని జూచి "నేను దేవేంద్రుడుగాని, యముడుగాని, వరుణుడుగాని పంపగా వచ్చిన దూతను గాను. నాకు కుబేరునితో స్నేహమెన్నడును లేదు. విష్ణువు నన్నిచ్చటికి బంపలేదు. జాతిచే గూడ వానరుడనే. కాని వానర రూపము దాల్చి వచ్చిన వేఱొకడను గాను. రాక్షస రాజగు రావణుని దర్శనము సుకరముగ దొరకని దగుటచే ఆయనను చూచుటకే యీ వనమును పాడుచేసితిని. అప్పుడు బలవంతులు, యుద్ధము కోరువారునగు రాక్షసులు నా పైకి వచ్చిరి. ఆత్మరక్షణకై నేను వారితో తలపడి పోరితిని. దేవతలకు, రాక్షసులకు గూడ నేనస్త్రములచే బంధింప శక్యముగాని వాడను. నాకీ వరము బ్రహ్మదేవుని వలననే లభించినది. రాక్షస రాజును చూడవలెననియే నేను బ్రహ్మాస్త్ర బంధనమునట్లే నిలుపుకొంటిని. రాక్షసులు నన్ను త్రాళ్లతో గట్టి పీడించుటచే ఆ బ్రహ్మాస్త్ర బంధము తొలగినది. (బ్రహ్మచే వరములు పొందినవాడవు నీవొక్కడనే కాదు. నేను కూడ నెట్టి యస్త్రము చేతను మృతి లేకుండ వరము పొందిన వాడను సుమా!) నేనొక రాజకార్యముచే నీకడకు వచ్చితిని. నేనమిత పరాక్రమశాలియగు రాముని దూతను. ఓ రాజా! నీ హితము కోరి నేను చెప్పు వచనము వినుము".

# ఏబది యొకటవ సర్గము

**హనుమంతుడు రావణునకు తాను లంకకు వచ్చిన కారణము చెప్పుట :**

బలవంతుడు వానర శ్రేష్ఠుడునగు హనుమంతుడు మహాబలశాలియగు రావణుని జూచి యెంతమాత్రము తొణకక అర్థవంతముగా నిట్లు మాటాడెను. "ఓ రావణా! నేను రామదూతనైనను సుగ్రీవుని యాజ్ఞనుగొని నీ యీ లంకకు వచ్చితిని. ఓ రాక్షస రాజా! వానర రాజగు సుగ్రీవుడు నీకు సోదరుని వలె హితము గోరువాడు. ఆయన నిన్ను కుశలమడిగినాడు. మహాత్ముడైన సుగ్రీవుడు సోదరునివలె మంచిబుద్ధితో నీకు పంపిన సందేశమును వినుము". ఇది ఈ లోకమునను, పరలోకమునను గూడ నీకభివృద్ధిని కలుగజేయును. 'దశరథుడను ప్రసిద్ధి చెందిన రాజు రాజ్యము చేసెడివాడు. ఆయన రథములు, ఏనుగులు, గుఱ్ఱములు సమృద్ధిగా గలవాడు. ప్రజలను కన్నతండ్రివలె పాలించువాడు. దేవేంద్రునితో సమానమైన కాంతి గలవాడు. ఆయన పెద్ద కుమారుడు రాముడు. గొప్ప భుజములు గలవాడు. మహా తేజస్వి. రాజునకు ప్రీతి గల్గించువాడు. తండ్రి యాజ్ఞను తలదాల్చి తమ్ముడగు లక్ష్మణునితో, భార్యయగు సీతతో ధర్మమార్గము నాశ్రయించి పురమును విడచి దండకారణ్యమున ప్రవేశించినాడు. ఆయన భార్య సీతాదేవి పతి ననుసరించి నడచునది. మహాత్ముడైన విదేహరాజగు జనకుని కూతురు. ఆమె అడవిలో అపహరింపబడినది. రాజపుత్రుడగు రాముడు తమ్మునితో గూడి సీతాదేవిని వెదకుచు, ఋష్యమూక పర్వతమునకు వచ్చి సుగ్రీవుని గలిసికొనెను. సుగ్రీవుడు సీతను వెదకించెదనని రామునితో ప్రతిజ్ఞ చేసెను. నిన్ను వానర రాజ్యమున కభిషిక్తుని చేసెదనని రాముడు సుగ్రీవునకు

మాట యిచ్చెను. పిమ్మట రాజపుత్రుడగు రాముడు యుద్ధమున వాలిని జంపి సమస్తమైన కోతుల, యెలుగుబంట్ల రాజ్యమునకు సుగ్రీవుని రాజుగా జేసెను. వానర శ్రేష్ఠుడగు వాలి నీకు చిరపరిచితుడు గదా! ఆ వాలినొక్క బాణము చేతనే రాముడు చంపినాడు. సత్యముగా ప్రతిన తీర్చువాడగు వానరరాజగు సుగ్రీవుడు సీతను వెదకింప దలంచినవాడై అన్ని దిక్కులకు వానరులను బంపెను. ఆమె కొఱకు వందలు వేలు లక్షల కొలది వానరులు పది దిక్కులందును వెదకుచున్నారు. ఆ వానరులు వేగము నందు గరుత్మంతునితో కొందఱు, వాయువుతో కొందఱు సాటి వచ్చువారు. మహా బలవంతులైన వానరవీరులు ఎవరికి వారే వేగముగా పోగలవారు. అందు నేను హనుమంతుడనువాడను, వాయుపుత్రుడను. నేను సీతాదేవిని వెదకుటకై నూఱు యోజనములు పొడవైన సముద్రమును వేగమే దాటి ఇచ్చట చేరితిని. ఈ లంక యందెల్లెడల దిరుగుచు నీ నివాసమున సీతాదేవిని చూచితిని. రాక్షసరాజా! ఇదియంతయు సత్యము.

**హనుమంతుడు రావణునకు బుద్ధి చెప్పుట :**

కావున ఓ మహాప్రాజ్ఞుడా! నీవు శాస్త్ర సమ్మతమయిన ధర్మ స్వరూపము నెఱిగినవాడవు. మహా తపస్సంపన్నుడవు. పరుల భార్యను నీవిట్లు నిర్బంధించుట తగినపని కాదు. నీవంటి బుద్ధిమంతులు ధర్మ విరుద్ధమైనవియు, అనే కపాయములు గలవియు, ఆత్మ వినాశకరములు నగు పనులలో తలదూర్చరు. రాముని కోపమును సార్థకము చేయుటకై లక్ష్మణునిచే విడువబడిన బాణముల కెదురుగా నిలువగల సమర్థులు దేవతలలోగాని, రాక్షసులలోగాని లేరు. రాజా! రామునకు కీడు గలుగజేసి సుఖము పొందగలవాడు మూడు లోకములలో నొక్కడు నుండబోడు. కావున (సీతా నిరోధ మధర్మము గనుకను, రామాపచారము పరిహరింప దగినది కనుకను) ధర్మ సమ్మతమైనదియు, అర్థము గలదియునగు నామాట జరిగిన, జరుగబోవు, జరుగుచున్నవగు మూడు కాలములందును మేలు కలిగించునదిగా తలంచి సీతాదేవిని రామునకిచ్చి

వేయుము. మిక్కిలి కష్టసాధ్యమైన సీతాదేవి దర్శనము నాకు లభించినది. ఇటుపై సీతాదేవిని తీసికొనిపోవుట యను కర్తవ్యమును రాముడే నిర్వహించుకొనగలడు. నాకు సీతాదేవి శోకమూర్తియై కనిపించినది. ఈమెను నేను తెచ్చితిని గదాయని వశము చేసికొనదలచితివేమో? నీవు తీసికొని వచ్చిన యీమె ఐదు తలల పాము వలె నీ ప్రాణములు తీయునని యెఱుంగకున్నావు. ఆహారమును జీర్ణము చేయగల జఠరాగ్నికి విషము కలిసిన ఆహారమును జీర్ణించుట యెట్లు కష్టసాధ్యమో, అట్లే యీమె దేవతలకుగాని, రాక్షసులకుగాని వశపరచుకొన శక్యమైనది కాదు. గొప్ప తపస్సుచే లభించిన ధర్మ ఫలము – ఆయువును, తేజమును పెంచునది. దానిని నీవు నాశనము చేసికొనదగునా? రాక్షసులు గాని, దేవతలుగాని నిన్నెవ్వరు యుద్ధమున జయింపలేరనెడు గర్వమును వీడుము. తపస్సుచే సంపాదించిన వరములచే నిన్నెవ్వరును చంపలేరని తలంచినను దోషమే. నీకు మృత్యు వపరిహార్యమే సుమా. (నీవు తపస్సుచేసి సంపాదించిన పుణ్యఫలము నేటితో ముగిసినది. నీవు గంధర్వాదులచేత చావు లేకుండ వరము గోరితివి. సుగ్రీవుడు వారిలో చేరినవాడు కాడు. వానరులచే మృతి లేకుండ నీవు కోరినవాడవు కావు. కావున నీకు నరవానరులచే చావు తప్పదు) ఎట్లనగా సుగ్రీవుడు దేవుడు కాడు. అసురుడు గాడు. రాక్షసుడు గాడు. దానవుడు గాడు. గంధర్వుడు గాడు. యక్షుడు గాడు. ఉరగుడు గాడు. రాజా! నీవతని నుండి నీ ప్రాణములనెట్లు కాపాడుకొందువు? సుఖకరమైన ధర్మఫలమును అధర్మఫలముతో గలిపి యనుభవించుట కనువు పడదు. ధర్మ ఫలము వెంట ధర్మఫలము ననుభవించుచున్నప్పుడు ధర్మ ఫలమునకు విరోధియై ధర్మఫలముండగా వ్యాపించు శక్తి యుండదు. ధర్మమధర్మమును నశింపజేయును. నీ విప్పటి వఱకు ధర్మ ఫలితమును పూర్తిగా ననుభవించితివి. ఇందు సందేహము లేదు. నీవు చేసిన యధర్మములకిటుపై వేగమే ఫలముననుభవించెదవు లెమ్ము. దేవతలు, అసురులు, రాజులు, యక్షులు, రాక్షస్సులు, విద్యాధరులు, గంధర్వులు,

ఉరగులు, సిద్ధులు, కిన్నరులు, పక్షులు, వీరందరిలోను సర్వభూతములందును, సకల ప్రదేశములందును, సర్వకాలములందును, విష్ణువుతో సాటి వచ్చు పరాక్రమము గల రాముని కెదురు నిలువగలవారు లేనే లేరు. సర్వలోకముల నేలగలవాడును, రాజశ్రేష్ఠుడునగు రామునకిట్టి యపకారము చేసి నీవు జీవించుట దుర్లభము. ఓ రాక్షస రాజా! దేవతలు గాని, దైత్యులు గాని, గంధర్వులు గాని, విద్యాధరులు గాని, ఉరగులు గాని, యక్షులు గాని, యుద్ధ రంగమున మూడు లోకములకు నాయకుడగు రాముని యెదుట నిలువజాలరు. స్వయముగా బుట్టిన బ్రహ్మయేగాని, మూడుకన్నులు గల త్రిపురాసుర సంహారియగు శివుడే గాని, త్రిదివ నాయకుడు సకలైశ్వర్య సంపన్నుడునగు దేవేంద్రుడే గాని రాముడు చంపదలచిన వానిని కాపాడజాలరు. జన స్థానమున సకల రాక్షసులు రాముడొక్కనిచేతనే చచ్చుటను, మహా బలశాలియగు వాలి రామునిచేత చంపబడుటను, రామ సుగ్రీవుల స్నేహమును నీవు తెలిసికొని నీ హితము నాలోచింపుము. తలచుకొన్నచో నేనొక్కడనే గుఱ్ఱములు, ఏనుగులు, రథములతో గూడిన నీ లంకను నాశనము చేయగలను. కాని నాకట్లు చేయుటకు రాముని యాజ్ఞ లేదు. సీతను చెరబట్టిన శత్రువులను నాశనము చేయుదునని రాముడు కోతులు, ఎలుగుబంట్ల యెదుట ప్రతిన బూనినాడు. రామున కపకారము చేసి సాక్షాత్తు దేవేంద్రుడే సుఖమును పొందజాలడన్నచో నీవొక లెక్కయా? నీవెవ్వతెను సీతయని తలంచుచుంటివో ఆమె మీ లంకా నగరమును నాశనము చేసెడి కాళరాత్రియను శక్తిగా తలంపుము. సీతయను రూపమును దాల్చిన యమపాశమును స్వయముగా నీ మెడకు చుట్టుకొనకుము. నీవు తగిన విధముగా ఆలోచింపుము. సీతాదేవి యొక్క తేజముచే తగులబడి రాముని కోపాగ్నిచే పీడింపబడి ఈ లంకా నగరము మేడలు, మిద్దెలు మున్నగువానితో గూడ అచిర కాలముననే కాలిపోవుట చూడుము. నీ మిత్రులను, మంత్రులను, బంధువులను, సోదరులను, కుమారులను, హితులను, భోగములను, భార్యలను

ఈ లంకను నాశనము చేసికొన దలంపకుము. ఓ రాక్షస రాజా! నా మాటను వినుము. విశేషించి రామదూతనై వచ్చిన వానరుడను. నా మాట పాటింపుము. (నీవు రాక్షసుడవు. రాముడు మానవుడు. నేనుభయ జాతులకు చెందని కోతిని. అందును దూతగా వచ్చినవాడను. లాభ నష్టములు నన్నంటవు కాన మధ్యవర్తిగా పక్షపాతము లేకుండ చెప్పుచున్నానని తెలిసికొనుము) బ్రహ్మచే సృష్టింపబడిన స్థావర జంగమాత్మకమైన సమస్త సృష్టిని మహా కీర్తిగల రాముడొక్కడే సృష్టించి, పోషించి, లయింపజేయగల సమర్థుడు సుమా!" అని యిట్లు గంభీరముగా మాటలాడు హనుమంతుని యుక్తియుక్తములు సాటిలేనివి యగు మాటల నాలకించి రావణాసురుడు కోపముతో కన్నులు త్రిప్పుచు ఆ వానర శ్రేష్ఠుని చంపుట కాజ్ఞాపించెను.



# ఏబది రెండవ సర్గము

**విభీషణుడు రావణునితో దూతను చంపరాదనుట :**

మహాత్ముడైన హనుమంతుని మాటలను వినిన రావణుడు కోపముతో మూఢుడై యతనిని జంప నాజ్ఞాపించెను. దుర్మార్గుడైన రావణుడట్లా జ్ఞాపించగా దూత వాక్యములు తాను చెప్పవలసిన విధముగా చెప్పిన హనుమంతుని చంపుటకు విభీషణు డంగీకరింపలేదు. కర్తవ్యము నాచరించుటలో నిశ్చితమైన మనస్సు గల్గిన విభీషణుడు, రాక్షస రాజగు రావణుడు కోపించి దూతను వధింప నాజ్ఞాపించుటను తెలిసికొని, తరువాత కార్యక్రమము నాలోచించెను. అట్లు తరువాతి కర్తవ్యము నాలోచించుకొని, శత్రువులను జయించువాడగు విభీషణుడు తమ యన్నను సామ వచనములచే అనునయించి, మాటలాడుటలో నేర్పుగలవాడగుట చేత తన అన్నకు మిక్కిలి హితము గూర్చు మాటలనిట్లు చెప్పెను. "ఓ రాక్షసరాజా! నీవీ వానరుని క్షమింపుము. అతనిపై కోపమును విడువుము. నా మాటలను వినుము. ఏ కార్యములు చేయక విడువవలెనో, ఎట్టి పనులు విడువక చేయవలెనో యెఱిగిన రాజశ్రేష్ఠులు దూతను వధింపరు. వీరా! ఈ వానరుని వధించుట రాజధర్మమునకు విరుద్ధము. లోక వ్యవహారములలోను నిందింపదగినది. నీవంటి వీరునకు తగని పని. నీవు ధర్మజుడవు. కృతజ్ఞుడవు. రాజధర్మములలో కుశలుడవు. ఇది కర్తవ్యము, ఇది కాదు అని తెలిసిన వాడవు. నీవంటి పండితుడు గూడ రోషముచే కలుషితుడైనచో ఇంక వివిధ శాస్త్రములు చదివి చేయు జ్ఞాన సంపాదనము కేవలము శ్రమయే కాగలదు. కావున శత్రు సంహారకుడవు, ఇతరులచే తేరి చూడరాని తేజస్సు కలవాడవు నగు ఓ రాక్షస రాజా! యుక్తాయక్తములు తెలిసి దూతను

దండింపుము, అనగా రాక్షసరాజగు రావణుడు విభీషణుని మాటలు విని మిక్కిలి కోపము నందినవాడై యిట్లు పలికెను "శత్రువులను నాశనము చేయగల విభీషణా! పాపులను చంపినచో పాపము కలుగదు, కావున రాజద్రోహి యగుటచే పాపాచరణ గల యీతని చంపి వేయుదును." అని పల్కగా విభీషణుడు అధర్మమే మూలముగా గలదియు, బహు దోషములతో గూడినదియు, అనార్యులు చేయదగినదియు నగు ఆ మాటలను విని చేయవలసిన కార్యమును సూటిగా నిట్లు పల్కెను. "లంకాధిపతివగు ఓ రాక్షసరాజా! ప్రసన్నుడవు కమ్ము. ధర్మ సమ్మతమైన యీ మాటను వినుము. తమ యజమాని యాజ్ఞను నిర్వహించు సందర్భములో ఎచ్చటను ఏ జాతిలోను దూతను చంపుట యన్నది తగదు. ఇతడు బలవంతుడగు శత్రువనుటలో సందేహము లేదు. ఇతడు మనకు చేసిన యపకార మింతింత యనరానిది. అట్లయ్యును, సత్పురుషులు దూతను వధించుట తగని దండనముగా పేర్కొందురు. దూతలకు విధింపదగిన దండనములు గలవు. అంగ వైరూప్యము కలిగించుట, కొరడాలతో గొట్టుట, ముండనము చేయించుట, వీనిని దూతలకొసగు దండనములని చెప్పుదురుగాని, దూతను వధించుటనింతవఱకు విననైనను లేదు. ధర్మార్థములందు సుశిక్షితమైన బుద్ధి గలవాడు, ఉత్కృష్టము అపకృష్టముల నెరిగి కార్య నిశ్చయము చేయగల వాడు అగు నీవంటివాడు కోపించుటెట్లు? ధీరులైన వారలు కోపమును నిగ్రహించుకొందురు గదా! వీరుడా! ధర్మ శాస్త్రమునగాని, లౌకికాచారమున గాని, శాస్త్రార్థ జ్ఞానమున గాని, దాని నాచరించుట యందు గాని, నీతో సమానుడెవ్వడు నుండడు. నీవు రాక్షసులలోను, దేవతలలోను ఉత్తముడవు. ఈ వానరుని చంపుటలో గుణ విశేషమేమియును నాకగపడలేదు. నీవిచ్చు దండన మితనికి గాక యితనిని బంపినవారికే చెందును. ఇతడు యోగ్యుడుగాని, అయోగ్యుడు గాని, పరులచే బంపబడినవాడు. పరులకు సంబంధించిన విషయమును పరుల అధీనుడై పలుకునట్టి దూత దండింప దగినవాడు గాదు.

రాజా! అంతేగాక ఈతనిని జంపినచో ఆకాశమున ప్రయాణము చేసి యొక సముద్రమును దాటి ఇటకు రాగలుగు దూతను కానకున్నాను. ఓ శత్రు నగరములను జయించు రావణా! ఈ కారణముచే నీవీ దూతను చంపు ప్రయత్నము చేయకుము. అట్టి ప్రయత్నము నింద్ర ప్రముఖులైన దేవతలపై చూపించుము. యుద్ధమందాసక్తిగల ఓ రావణా! ఇతడు మరణింపగా దూరదేశమగుటచే నిచటకు రాజాలనివారగు ఆ రామలక్ష్మణులను యుద్ధమునకు ప్రోత్సహింపగల వేఱొక దూతను నేను చూడలేకున్నాను. రాక్షసుల మనస్సులను రంజింపజేయు ఓ రావణా! పరాక్రమము, నుత్సాహము, అభిమానము కల దేవాసురులకైనను జయింపశక్యముగాని నీవు ఈ యుద్ధావకాశమును పోగొట్టు కొనదగునా? నీ మేలు కోరువారు, పరాక్రమశాలురు, ఏకాగ్రత గలవారు, మహా గుణముగల యుత్తమ వంశమున బుట్టినవారు, మానధనులు, ఆయుధ ధారులలో శ్రేష్ఠులు, యోగ్యులునగు యోధులు, సేవకులు నీ యొద్ద కోట్ల కొలదిగనున్నారు. (శ్రీరాముడు దండెత్తి వచ్చినప్పుడు సంధి కుదుర్పవలయునని విభీషణుని తలంపు. దూతను చంపినచో అది కుదరదు) అట్టి నీ మహా సైన్యములో కొలది భాగము తీసికొని నీ ఆజ్ఞ పొందివారు కొందఱు వెళ్లి మూఢులగు ఆ రామలక్ష్మణులను బంధించి శత్రువులకు నీ ప్రభావమెట్టిదో చూపుదురు గాక" అని చెప్పగా మహాబలశాలియు, రాక్షసుల రాజును, దేవతలకు శత్రువునగు రావణుడు తన తమ్ముడగు విభీషణుడు పల్కిన యుత్తమ వాక్యమును విని బుద్ధిపూర్వకముగా దానినంగీకరించెను.



# ఏబది మూడవ సర్గము

**రావణుడు హనుమంతుని తోకగాల్ప నాజ్ఞాపించుట :**

మహాబలశాలియగు రావణుడు విభీషణుడు పలికిన వాక్యమును విని దేశకాలములకు తగిన విధముగా అతనికిట్లు బదులు పలికెను. "విభీషణా! నీవు చక్కగా చెప్పితివి. దూతను వధించుట నింద్యమే. ఇతనికిది గాక వేఱొండు దండన విధింపవలెను. కోతులకు తోక ప్రీతి గూర్చు నలంకారము గదా! దానిని శీఘ్రమే కాల్చుడు. అట్లు కాలుచున్న తోకతో నితడు వెళ్ళుగాక. అట్టి దీనావస్థలో నుండగా, అంగ వైరూప్యముచే కృశించుచుండగా, ఇతనిని ఆప్తులు, సోదరులు మొదలైన బంధువులు, మిత్రులు మున్నగు వారెల్లజును చూచెదరు గాక!" యని సోదరునితో బల్కి యారాక్షసరాజు "నాల్గు మార్గముల కూడలు లన్నింటను లంకానగర మందెల్లడలను కాలుచున్న తోకలోనున్న యీ వానరుని త్రిప్పుదురు గాక!" యని యాదేశించెను. కోపముతోనున్న రాక్షసులు రావణునాజ్ఞ విని హనుమంతుని తోకను చినిగిన గుడ్డ పేలికలతో చుట్టిరి. అట్లు రాక్షసులు తన తోకను గుడ్డ పేలికలతో చుట్టుచుండగా హనుమంతుడు అడవులలోని యెండు కట్టెలకు నిప్పు ముట్టినట్లుగా శరీరమును పెంచసాగెను. రాక్షసులా హనుమంతుని తోకను నూనెతో తడిపి దాని కగ్ని నంటించిరి. హనుమంతుడు తీవ్రమైన కోపముతో బాలసూర్యునివలె ముఖమెఱ్ఱవారగా మండుచున్న తన తోకతో ఆ రాక్షసులను మోదెను. మండుచున్న హనుమంతుని తోకను చూడవలెనని స్త్రీలు వృద్ధులతో గూడ రాక్షసులెల్లరు నానందముతో వచ్చిరి.

**రాక్షసులు తోకను గాల్చుచుండగా హనుమంతు డాలోచించుట :**

మఱల నాక్రూర రాక్షసు లెల్లరును గలిసి తన్ను బాధించుచుండగా, హనుమంతుడు కాలమునకు తగిన విధముగా నిట్లాలోచించెను. "నేనిపుడు బంధింపబడియున్నను, నన్నీ రాక్షసులు నిగ్రహింపజాలరు. బంధములను ఛేదించుకొని పైకెగిరి వీరలను చంపెదను. నేను నా యజమాని మేలు గోరి ఆయన నేను ప్రతీకారము చేయనైతిని. యుద్ధమున నీ సకల రాక్షసులను సంహరించుటకు నేనొక్కడనే చాలుదును. కాని నేనట్లు చేయుట రామున కభిమతము గాదు. కావున ఆయన ప్రీతికై వీరుచేయునిట్టి యాగడములను సహింతును. నేను రాత్రి లంకలో దిరిగినను నగరమందలి రహస్య స్థానములను దెలిసికొన వీలుపడదయ్యెను. కావున నేను లంకలో దిరుగవలసి యున్నది. ప్రాతః కాలమున నా యాస్థాన విశేషములతో గూడిన లంకను నేను తప్పక పరిశీలింపవలయును. నన్ను బంధించినది చాలక తిరిగి తోకను గాల్చి రాక్షసులు నన్ను పీడించిన పీడింతురు గాక! నా మనస్సున కెంతమాత్రము శ్రమ కలుగదు" అని యిట్లాలోచించుచుండగా నా రాక్షసులు గూఢ స్వభావము గలవాడును, బలవంతుడును, బుద్ధిమంతుడును, తన జాతివారలలో శ్రేష్ఠుడును నగు హనుమంతుని బట్టుకొని సంతోషముతో వెడలిరి. క్రూర కార్యములు చేయువా రగు రాక్షసులు శంఖముల నూదుచు, భేరులు వాయించుచు, సింహనాదములు చేయుచు, హనుమంతుని లంకలో త్రిప్పిరి. ఆ విధముగా రాక్షసులచే ననుసరింప బడుచున్నవాడై, శత్రువుల నణచువాడగు హనుమంతుడు, రాక్షస రాజధాని యగు లంకానగరమును సుఖముగా బరిశోధించెను. మహాకపియగు హనుమ ఆశ్చర్యము కలిగించు సౌధోపరి భాగములను, ఆయుధాదికములు దాచి మూసియుంచబడిన భూ ప్రదేశములను, చక్కగా నలంకరింపబడిన యిండ్ల ముంగిళ్లను చూచెను. వాయుపుత్రుడగు హనుమ యిరువైపుల నిండ్లతో గూడిన వీధులను, చతుష్పథములను, మహా వీధులను, సందు గొందులను, చిన్న

యింద్లను, అంతర్ద్వారములను, మేఘములవలె పెద్దవైయున్న యింద్లను జూచెను. ముంగిళ్లలో, నాల్గు మార్గముల కూడళ్ల (చతుష్పథముల)లో, రాజ మార్గములలో, ఆ రాక్షసులందఱకును హనుమంతుని జూపుచు ఇతడు చారుడు అని చెప్పసాగిరి. అట్లు కాలుచున్న తోకతోనున్న హనుమంతుని చూచు కోరికతో అచ్చటచ్చట రాక్షసులు, స్త్రీలు వృద్ధులు గృహముల నుండి బయటకు వచ్చిరి. హనుమంతుని తోక కాలుచుండగా వికృతమైన కన్నులుగల ఆ రాక్షస స్త్రీలు కొందఱు సీతకా దుఃఖవార్తను ఎఱిగించిరి. “సీతా! నీతో మాటలాడి వెళ్లిన ఆ యెఱ్ఱమూతి గల కోతి తోకకు నిప్పు పెట్టి రాక్షసులు తీసికొని పోవుచున్నారు” అని చెప్పగా తన ప్రాణముల నపహరించినంతగా బాధించునట్టి వారి మాటలను వినిన సీత శోకపీడితయై అగ్ని దేవుని ధ్యానించెను. ఆమె మహాకపియగు హనుమంతునికి శరీరము కాలకుండుటయను శుభము కలుగవలెనని తలంచి పరిశుద్ధమైన మనస్సుతో అగ్ని నుపాసించెను.

**సీతాదేవి అగ్ని హోత్రుని ప్రార్థించుట :**

“ఓ అగ్నిదేవా! నేను పతి సేవ చేసియుంటినేని, తపస్సు నాచరించితినేని, నీవు హనుమంతుని శరీరమును కాల్పక చల్లగా నుండుము. ధీమంతుడగు నా భర్తకు నాయందించుకయైన దయ యుండెనేని, నాకేమైన భాగ్యము మిగిలి యుండెనేని, నీవు హనుమకు చల్లనై యుండుము. నేను పాతివ్రత్యము కలిగియున్నట్లు, రాముని సమాగమమునకై పరితపించుచున్నట్లు ధర్మాత్ముడగు రాముడెఱుగునేని నీవు హనుమంతుని యెడ చల్లనగుము. సత్య ప్రతిజ్ఞ కలవాడు పూజ్యుడునగు సుగ్రీవుడు నన్నీ దుఃఖ సాగరమునుండి తరింపజేయునేని, నీవు హనుమంతుని బాధింపక చల్లనగుము” అని యామె ప్రార్థింపంగా, వేడియైన జ్వాలలు గలవాడగు హనుమంతుని తోకయందలి యగ్ని, బాధింపనివాడై, సీతాదేవితో హనుమంతుని కుశలము నెఱిగించువానివలె ప్రదక్షిణము తిరుగుజ్వాలలు గలవాడయ్యెను.

**అగ్ని చల్లనైనందులకు హనుమంతుడాశ్చర్యపడుట :**

హనుమ తండ్రి వాయుదేవుడును హనుమంతుని తోకయందున్న అగ్నితో గూడి, మంచుగాలి వలె చల్లనై సీతాదేవికి సుఖము కలుగునట్లుగా వీచెను. తన తోక యట్లు మండుచు చల్లనైయుండుట చూచి హనుమంతుడిట్లు తలంచెను. "మండుచున్న అగ్ని ఏల నన్ను గాల్పకున్నది? చూచుటకీ జ్వాల చాల పెద్దదిగా నున్నది. కాని నాకెంత మాత్రమును బాధ కలిగించుట లేదు. చందన గంధము పూసిన విధముగాను, వట్టివేళ్ల నీరు సోకిన విధముగను, నా తోక చివఱ చల్లదనమే కనిపించుచున్నది. ఇది రామప్రభావము వలననేయని స్పష్టమగు చున్నది. పూర్వము కూడ నేను సముద్రమును దాటునప్పుడు రాముని ప్రభావము చేతనే సముద్ర మధ్యము నుండి యాశ్చర్యకరముగ పర్వతమొక్కటి నాకు సహాయము చేయుటకై పైకి వచ్చెను గదా! సముద్రునకు, ధీమంతుడగు మైనాకునకు గూడ రామకార్యమందాసక్తి యుండగా అగ్ని యేల సహకారము చేయకుండును? సీతాదేవి యొక్క సౌమ్యత చేతను రాముని తేజస్సు చేతను, దహించు స్వభావము గలవాడయ్యు నీ యగ్ని నన్ను కాల్పకున్నాడు" అని యా కపిశ్రేష్ఠుడు కొంచెమాలోచించెను. పిమ్మట హనుమ వేగముగా పైకెగిరి సింహనాదమొనర్చి పర్వత శిఖరమువలె నున్నతమును, రాక్షస సంచారము లేనిదియునగు పురద్వారము కడకేగెను. పర్వతాకారుడు బుద్ధిమంతుడునగు హనుమంతుడు క్షణకాలములో చిన్నరూపమును పొంది, కట్లను జారవిడచెను. అట్లు బంధవిముక్తుడైన పిమ్మట, శ్రీమంతుడగు హనుమ మఱల పర్వతాకారుడై పరిశీలించుచు, పురద్వారము కడనున్న యినుప గుదియను చూచెను. మహాభుజుడగు హనుమంతుడు ఆ యినుప గుదియను తీసికొని కావలివాండ్రను మోదెను. యుద్ధమున తిరుగులేని పరాక్రమముగల హనుమంతుడట్లు వారిని జంపి, తిరిగి లంకా పట్టణమును జూచుచు, తగులబడుచున్న తోకనుండి వెడలుచున్న అగ్నిజ్వాలలను మాలగా ధరించినవాడై, కిరణ సమూహములతో గూడిన సూర్యునివలె ప్రకాశించెను.

# ఏబది నాలుగవ సర్గము

**హనుమంతుడు లంకను గాల్చుట :**

హనుమంతుడట్లు లంకను జూచుచు, తన కోరిక తీరగా పెరుగుచున్న యుత్సాహము కలవాడై మిగిలిన కార్యమును గూర్చి యిట్లాలోచించెను. "ఇప్పుడే రాక్షసులకు దుఃఖము కలుగునట్లు నేను చేయవలసిన పని యేమి మిగిలియున్నది? నేనశోకవనమును పాడు చేసితిని. కొంత రాక్షస సైన్యము నశించినది. ఇంక నగరమును పాడుచేయుటే మిగిలియున్నది. ఈ నగరమును నశింప జేసినచో నేనాచరించిన యశోకవన భంజనము, సముద్ర లంఘనము, దౌత్యము వలన ఆయాసము సఫలమగును. స్వల్ప ప్రయత్నముచే సాధింపగల యీ పనిచే నా శ్రమ యెల్ల సఫలము కాగలదు. నా తోకయందు వెలుగుచున్న యగ్నికీ శ్రేష్ఠములను గృహములతో సంతర్పణము చేయుట న్యాయము". వానర శ్రేష్టుడగు మారుతి మండుచున్న తోక కలవాడై, మెరుపులతో గూడిన మేఘము వలె లంకా నగరపు భవనముల పైభాగములందు సంచరించెను. ఆ హనుమంతుడు నిర్భయముగా ఒక రాక్షస గృహము నుండి వేఱొక రాక్షస గృహమునకు పోవుచు, ఉద్యానవనములను చూచుచు, మహా భవనములలో గూడ సంచరించెను. వేగమున వాయుదేవునితో సాటియగువాడును, బలవంతుడును అగు హనుమంతుడు మహావేగముతో ప్రహస్తుని యింటి యొద్ద దిగి, దానికి చిచ్చు పెట్టి అటనుండి మహాపార్శ్వుని యింటి యొద్దకు పోయి యందు ప్రళయాగ్ని సమానమగు అగ్ని జ్వాలలను ప్రజ్వలింప జేసెను. అట్లే హనుమంతుడు వజ్రదంష్ట్రుని యింటికి, మహా తేజశ్శాలియగు శుకుని యింటికి, ధీమంతుడగు సారణుని యింటికి చిచ్చు పెట్టెను. పిమ్మట వానరయూధ

పతియగు హనుమంతు డింద్రజిత్తు భవనమును, జంబుమాలి, సుమాలి అను రాక్షసుల భవనములను తగులబెట్టెను. పిమ్మట ఆ కపిశ్రేష్ఠుడు రశ్మికేతువు, సూర్యశత్రువు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, విద్యుజిహ్వుడు, ఘోరుడు, హస్తిముఖుడు అను రాక్షసుల యిండ్లకు నిప్పు పెట్టెను. పిమ్మట కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు, కుంభకర్ణుడు, మకరాక్షుడు, యజ్ఞ శత్రువు, బ్రహ్మ శత్రువు, నరాంతకుడు, దురాత్ముడగు నికుంభుడు అను వారి యిండ్లకు క్రమముగా పోయి తగులబెట్టెను. ఒక్క విభీషణుని యింటిని మాత్రము కాల్పక విడచెను. మహాకీర్తిశాలియు, పరాక్రమశాలియునగు హనుమంతుడు అన్ని రాక్షస గృహములను దాటి రాక్షసరాజగు రావణుని గృహమును చేరెను. పిమ్మట వీరుడగు హనుమంతుడు బహురత్నములతో నలంకరింప బడినదియు, సకల శుభ లక్షణములతో శోభిల్లునదియు, మేరు మందర పర్వతములవలె నెత్తైనదియు నగు రావణుని ప్రధాన భవనమును తన తోక చివరల ప్రజ్వలించుచున్న అగ్నితో కాల్చి ప్రళయకాల మేఘమువలె గర్జించెను. పుత్రునకు సహకరించుటకో యనునట్లు గాలి వేగముగా వీచుచుండుటచే యగ్ని మిగులవేగము బలము పొందినదై వృద్ధిచెంది ప్రళయాగ్నివలె విజృంభించెను. మండుచున్న అగ్నిని వాయువన్ని యిండ్లకును ప్రాకించెను. బంగారు ద్వారములు గలవై, ముత్యములు మణులు రత్నములతో నిండినవైన మహాభవనములు పెళ్లుమని ధ్వనులు చేయుచు అగ్నిదాహముచే నేలగూలెను. పుణ్యము క్షీణించుటచే ఆకాశము నుండి నేలబడిన సిద్ధుల వలె ఆ భవనముల విమానములు విరిగి నేల కూలెను. తను తమ యిండ్లను కాపాడుకొనుటకై ఉత్సాహము శోభయు తొలగినవారై అయ్యో! అగ్నియే యిట్లు వానర రూపము దాల్చి వచ్చిపడినదని విలపించుచు, పారిపోవు చున్న రాక్షసులు చేయు భయంకరములైన యార్తనాదములు వినవయ్యెను. పాలు త్రాగు పసిపాపలను చంకనెత్తుకొని, జుట్లు చెదరిన పెక్కండ్రు స్త్రీలు

రోదనముచేయుచు, అగ్ని చుట్టుముట్టిన గృహముల నుండి నేలపై బడిరి. వారట్లు పడి ఆకాశమునుండి నేలగూలు మెరుపు తీగలవలె నుండిరి. కాలుచున్న యా భవనముల నుండి వజ్రములు, పగడములు, వైడూర్యములు, వెండి, ముత్యములు, బంగారము కరగి ప్రవహింపగా హనుమంతుడు చూచెను. అగ్ని కట్టెలు, తృణములు మున్నగు ఇంధనములచే తృప్తి నందని విధముగా హనుమంతుడును, రాక్షస గృహములందగ్ని పెట్టుటయందు తృప్తినందుట లేదు. అగ్నిశిఖలు తగులబెట్టబడిన వస్తువులను బట్టి మోదుగు పువ్వులవలెను, కుంకుమ వలెను ప్రకాశించెను. త్రిపురములను దహించిన రుద్రునివలె వాయుపుత్రుడు లంకాపురమునంతయు గాల్చగా, ఆ మంటలు క్రమ క్రమముగా త్రికూట పర్వతమునందు గూడు వ్యాపించెను. వాయువుతో గలసిన యగ్ని ప్రళయకాలమందలి యగ్నితో సమానమైన వేగముగలదై పొగలేక ప్రకాశించుచు, రాక్షస భవనములందు తగిలియున్నదై, రాక్షస శరీరములను నేతిచే ప్రజ్వలించు జ్వాలలు గలదై, ఆకాశమునంటునట్లు వృద్ధినందెను. ఆ యగ్ని కోటి సూర్యుల వలె దేదీప్యమాన మగుచు సమస్తమగు లంకా నగరమును ఆవరించి యున్నదై, పిడుగులు పడినట్లు తీవ్ర ధ్వనులతో బ్రహ్మాండమును బద్దలు చేయుచున్నదివోలె ప్రకాశించెను. అటులాకాశ పర్యంతము వృద్ధినందిన అగ్ని తీక్షమగు కాంతి గలదై, మోదుగుపూల గుత్తులవంటి జ్వాలలు గలదయ్యెను. అనంతరమా మంటలు శమించుటచే నేర్పడిన పొగలచే వ్యాప్తములైన మేఘములు నల్లకలువల కాంతితో ప్రకాశించెను.

**రాక్షసుల విలాపము :**

“ఇతడు దేవరాజగు నింద్రుడో, యముడో, వరుణుడో, అగ్నియో, సూర్యుడో, కుబేరుడో, చంద్రుడో కావచ్చును. ఇతడు వానరుడు మాత్రము కాదు. స్వయముగా నీతడు యముడేయై యుండును. సకల లోకములకు తాతయు, సకలమైన జీవరాసులకు పోషకుడును అగు బ్రహ్మయొక్క కోపము సకల

రాక్షసులను సంహరించునట్టిదై యీ రూపమున వచ్చిదేమో గదా! కనులకు గనిపించనిది, మనస్సునకు తెలియరానిది, అద్వితీయమైనది యగు వైష్ణవ తేజమే తన యసాధారణమగు ఆశ్చర్యకర శక్తితో వానరరూపమును దాల్చి యిప్పుడిటకు వచ్చినదా?” అని యీ విధముగా ప్రాణులు, గృహములు, వృక్షములతో గూడ తగులబడిన లంకా నగరమును జూచి జ్ఞానముగల రాక్షసులెల్లరు నొక్కచో జేరి తలపోసిరి. పిమ్మట రాక్షసులు, అశ్వములు, ఏనుగులు, పక్షులు, మృగములు, రథములు, వృక్షములు మున్నగునవి కాలుట వలన యేర్పడిన అరపులలో, ధ్వనులతో లంక దీనపరిస్థితి నంది భీకరధ్వని గలదయ్యెను. “అయ్యో! తండ్రీ! అయ్యో! కొడుకా! అయ్యో! ప్రియుడా! మిత్రుడా! పోయితివా! యని, ఎంతో పుణ్యము చేయుట వలన లభించిన ఓ సుఖజీవనమా ముగిసితివా! యిట్లనేక విధములుగా పలుకుచు, రాక్షసులు చేయు ధ్వను లంతటను వ్యాపించి భయంకరములై వినిపించెను. హనుమంతుని కోపబలముచే తిరస్కరింపబడిన యా లంకా నగరము అగ్ని జ్వాలలచే ఎల్లడల నాకర్షింబడినదై, వీరులు మరణింపగా వెనుకకు మరలిన భటులు గలదై శాపముచే వినాశనము పొందిన సేనవలె నుండెను. గొప్ప మనస్సు గల హనుమంతుడు దిక్కు తోచక భయముతో పరువెత్తుచున్న రాక్షసులతోడను, పెరిగి యాకాశము నంటుచున్న అగ్ని జ్వాలల వరుసలతోడను ప్రళయ కాలమున భగవంతుని కోపముచే నాశనము చేయబడిన భూమివలెనున్న లంకను జూచెను. వాయుపుత్రుడగు హనుమంతుడట్లు శ్రేష్ఠమైన చెట్లతో నిండియున్న వనమును విరిచి, మహాబల పరాక్రమములు గల రాక్షసులను యుద్ధమున సంహరించి, శ్రేష్ఠములగు గృహములు గల లంకానగరమును గాల్చి, బయలుదేరి ఆశ్చర్యమును గలిగించు త్రికూట పర్వత శిఖరముపై నుపవిష్టుడయ్యెను. మండుచున్న తోకనుండి వెడలు జ్వాలల వరుసలతో కిరణ సమూహములతోనున్న సూర్యుని వలె ప్రకాశించెను. అట్లు కృతకృత్యుడై హనుమంతుడు శ్రీరాముని దర్శింప దలంచెను.

వానరవీరులలో శ్రేష్ఠుడును, మహాబలవంతుడును, వాయువేగము గలవాడును, మహాబుద్ధిశాలియు, వాయుపుత్రుడును నగు హనుమంతుని దేవతలందఱును పొగడిరి. గొప్ప తేజము గల హనుమంతుడు అశోకవనమును విరిచి, యుద్ధమున రాక్షసులను బరిమార్చి, సుందరమైన లంకా నగరమును గాల్చి, మిక్కిలి ప్రకాశించెను. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు లంక యట్లు తగుల బడుటను జూచి మిక్కిలి యాశ్చర్యము నందిరి. వానరశ్రేష్ఠుడగు హనుమంతుని జూచి, ప్రళయ కాలాగ్నియని, తలంచి సర్వభూతములును భయమందెను. సర్వ దేవతలు మునిశ్రేష్ఠులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, రక్షస్సులు, మహా భూతములు నా సన్నివేశమును గాంచి సాటిలేని యానందమును బొందిరి.



# ఏబది యైదవ సర్గము

**హనుమంతుడు సీతాదేవి దగ్ధమయ్యెనని చింతించుట :**

హనుమంతు డట్లు లంకాపురిని గాల్చి పిమ్మట తనతోకనున్న అగ్నిని సముద్రమున చల్లార్చెను. మంటలు మండుచున్నదియు, నాశనము నందినదియు, భయపడిన రాక్షస సమూహములు గలదియు నగు ఆ లంకను జూచి హనుమంతుడించుక ఆలోచనలో పడెను. అతనికి మిక్కిలి భయము కలిగెను. తన్ను తానే నిందించుకొనసాగెను. "అయ్యో! నేనీలంకను గాల్చుచు ఎంత నిందింపదగిన పనిని చేసితిని. ఎవరు ప్రజ్వలించు అగ్నిని నీటితో చల్లార్చినట్లు తమ కోపమును బుద్ధితో నిగ్రహింతురో, అట్టి మహాత్ములగు పురుషులు ధన్యులు గదా! కోపమునంది పాపముచే యని వాడెవ్వడు? కోపించినవాడు పెద్దలను గూడ చంపును. కోపించినవాడు సత్పురుషుల నాక్షేపించును. ఎక్కువ కోపమును పొందినవాడు ఏది పలుకవలెనో యేది పలుకరాదో ఎరుగడు. కోపించినవారికి చేయరాని పనిలేదు. ఎవడు తనలో పెచ్చు పెరిగిన క్రోధమును, పాము నలిగిపోయిన తన కుబుసమును ఓర్పుతో విడచినట్లు విడచునో, అతడే పురుషుడనబడును. నేనెంత దుర్బుద్ధిని! ఎంత సిగ్గులేనివాడను! నేను గొప్ప పాపము చేసినవాడను. పూర్వాపరములలోచింపక సీతాదేవిని గాల్చి స్వామి ఘాతుకుడనైన నాకు నిందయగు గాక! లంక పూర్తిగా కాలిపోయినచో అందు జానకియు తగులబడియుండును. కావున తెలియకయే నేను నా ప్రభు కార్యమును పాడు చేసితిని. ఏ సీతాదేవిని వెదకుచు ఈ లంకాపురికి వచ్చితినో, ఆ పనిని సంపూర్ణముగా చెరచి వేసితిని. నేను లంకను గాల్చుచు సీతను రక్షింపనైతిని. నిస్సంశయముగా నేను చేసిన పనిని అఱకొఱగా

చేసితిని గాని, సంపూర్ణముగా చేయనైతిని. కోప పూరితుడనై నేను నా కార్యము నకు మూలమెవ్వరో ఆ సీతాదేవినే నాశనము చేసికొంటిని. నా అవివేకము వలననే నా స్వామి కార్యము చెడినచో నాకిచ్చటనే ప్రాణములు విడచుట యిష్టమైన పని. సీతాదేవి తప్పక నశించియుండును. ఏలననగా ఈ లంకాపురమున తగుటబడకుండ నే ప్రదేశమును మిగులలేదు. నగరము సర్వమును బూడిదయైనది. నేనిప్పు డగ్నిలలో బడుదునా? లేక బడబాగ్ని నోట బడుదునా? సముద్రమందుండు జీవరాసులకు నా శరీరము నాహారముగా సమర్పింతునా? సర్వ కార్యములను చెడగొట్టిన నేనెట్లు వానరరాజైన సుగ్రీవుని గాని ఆ రాజశ్రేష్ఠులగు రామలక్ష్మణులను గాని చూడగలను? నేను నా రోషము చేసిన దోషముచే కోతుల స్వభావమందు మూడు లోకములలో ప్రఖ్యాతి చెందిన చంచలత్వమును ప్రదర్శించితిని. రజో గుణముచే ప్రకోపింపజేయబడిన యీ చేష్టలెందుకును కొఱగానివి. నేనీ రజో గుణమూలమైన క్రోధమునకు లోబడి, సమర్థుడనయ్యును సీతాదేవిని రక్షింపనైతిని. సీతాదేవి మరణించినచో రామ లక్ష్మణులు జీవింపరు. వారు జీవింపనిచో సుగ్రీవుడును, వారి బంధువులును నశించెదరు. ఈ వార్త విన్నచో అన్నయందనురాగము గల ధర్మాత్ములగు భరతుడును శత్రుఘ్నుడును జీవింపరు. ధర్మ నిష్ఠ గల యిక్ష్వాకు లందఱు నశించినచో, ప్రజలందఱును శోకముచే పీడింపబడుదురు. కావున భాగ్యహీనుడ నైన నేను ధర్మార్థ సంగ్రహము చేయక రోషము దోషము పట్టి పీడింపగా, లోకమునకే చేటు తెచ్చితి ననునది స్పష్టమగుచున్నది". ఈ ప్రకారముగా హనుమంతుడు లోకదృష్టితో నాలోచించి తిరిగి తత్వ దృష్టితో నిట్లాలోచించెను".

**సీతాదేవిని అగ్ని కాల్చదని హనుమ తలంచుట :**

అయినను అనవద్య సౌందర్యవతియు, మంగళరూపిణియునైన సీతాదేవి కామె తేజమే రక్షయై యుండగా ఆమె నశించదు. అగ్ని అగ్నిని దహింపదు గదా! ధర్మాత్ముడును, అమిత తేజశ్శాలియునగు రాముని భార్య సీతాదేవి నామె నిర్మలమైన నడవడియే రక్షించును. అగ్ని యామెను ముట్టనైన ముట్టలేదు.

నిశ్చయముగా అగ్ని దహించు స్వభావము గల వాడయ్యును రాముని మహాత్మ్యము చేతను, సీతాదేవి పుణ్యఫలము చేతను నన్ను గాల్పలేదు గదా! భరత లక్ష్మణ శత్రుఘ్నులకు దేవతవలె పూజ్యురాలును, రాముని మనస్సున కాహ్లాదము గలిగించునదియు అగు సీతాదేవిని అగ్ని యెట్లు దహింపగలుగును? అగ్నికి కాల్చుట స్వభావము. దానికి నాశనమన్నది లేదు. అది సర్వకాల సర్వావస్థలలోను దహించు శక్తి కలది. అట్టిది నాతోకనే కాల్పక యుండెనే? పూజింపదగిన సీతను గాల్చునా?" అని తలపోసి హనుమంతుడు పూర్వము సముద్ర మధ్యమున తనకు మైనాక పర్వతము దర్శనమిచ్చుటను స్మరించి ఆశ్చర్యపడి మఱల నిట్లు తలంచెను. "సత్యవచనము చేతను, తపస్సుచేతను, భర్తయందనన్య భక్తిచేతను, సీతాదేవియే యగ్నిని దహింపగలుగును. కాని అగ్ని ఆమెను దహింపదు" అని హనుమంతుడు సీతాదేవి యొక్క ధర్మ పరాయణత్వమును దలంచుచు, మహాత్ములగు ఆకాశ సంచారులగు చారణులు తమలో తాము చెప్పుకొనుచున్న మాటలను వినెను. "ఆహా! యేమి యాశ్చర్యము. హనుమంతుడు రాక్షసుల గృహములలో భయంకరమగు అగ్ని నంటించి, ఆశ్చర్యము దుష్కరమునగు కార్యము నాచరించినాడు. పారిపోవుచున్న రాక్షస స్త్రీలు, బాలురు, వృద్ధులతో నిండినదై, జనుల కలకలముచే పెద్ద ధ్వని కలదై, కొండ గుహలందు ప్రతి ధ్వనించ నాదములచే ఆక్రందనము చేయుచున్నదివలె నున్నదై, ఈ లంకా నగరము మిద్దెలు ప్రాకారములు, ద్వారములతో గూడ సమస్తము తగులబడినది". అందరు హనుమంతుడట్లు పూర్వము తలంచుకొని నిశ్చయించుకొన్న శుభ సూచనల చేతను, సీతాదేవి యొక్క పాతివ్రత్యము, రామునియొక్క ప్రభావము మున్నగు గొప్ప గుణముల కారణము చేతను, చారణులు చెప్పుకొన్న మాటలచేతను మనస్సు నందానందము నందెను. హనుమంతుడట్లు తన కోరికలు తీరగా సీతాదేవికే యాపదయు గలుగ లేదని తెలిసికొని, తిరిగి యొక్క మారు ఆమెను సందర్శించి మఱలిపోవలయునని నిశ్చయించుకొనెను.

# ఏబది యాఱవ సర్గము

## హనుమంతుడు మఱల సీతాదేవిని దర్శించుట :

హనుమంతుడంత అశోకవనమునందు శింశుపా వృక్షము క్రింద కూర్చొనియున్న సీతాదేవి కడకేగి యామెకు నమస్కరించి "అమ్మా! నా భాగ్యముచే నిన్నే యాపద లేకుండ చూచుచున్నాను" అనెను. అట్లు చెప్పుచున్న హనుమంతుని తిరుగు ప్రయాణమునకై సిద్ధముగానున్న వానిని సీత చూచెను. అతనిని మాటిమాటికి చూచుచు తన భర్తయందలి భక్తితో నిట్లు పలికెను. "ఓ శత్రు వీరులను సంహరించు హనుమంతుడా! నీ వొక్కడవే సర్వ రాక్షసులను వధించి నన్ను రామునకు సమర్పింప జాలుదువు గాని ఆ విధమమయిన బల ప్రదర్శన నీకు కీర్తిని గలిగించునే గాని రామునకు గాదు. అట్లుగాక శత్రు సైన్యములను చెండాడువాడగు రాముడు లంకను తన బాణములచే బాధించి నన్నిచటి నుండి తీసికొనిపోవునేని, యది ఆయనకు తగినదిగా నుండును. కావున యుద్ధ వీరుడు, మహాత్ముడునగు రామునకేది తగునో ఆ విధముగా చేయుము" అని యామె పల్కిన అర్థము కలిగినవియు, సహేతుకములునగు మాటలను విని హనుమంతుడామెతో నిట్లనెను. "అమ్మా! రాముడు కోతులు, ఎలుగుబంట్ల సేనతో గూడి వేగముగా నిచ్చటకు రాగలడు" అని పల్కి వాయుపుత్రుడు సీతాదేవి నోదార్చి వెడలిపోవ దలంచి యామెకు ప్రణమిల్లెను.

## సీతాదేవిచే సెలవుకొని హనుమ యరిష్టాద్రి నెక్కుట :

అనంతరమా కపిశ్రేష్ఠుడును శత్రువులను పీడించువాడును అగు హనుమంతుడు తన ప్రభువైన శ్రీరాముని దర్శింపవలెనని కోరికగలవాడై

అరిష్టమను పర్వత శ్రేష్ఠము నధిరోహించెను. ఆ పర్వతము అధికమైన లతలతో, వృక్షములతో నిండి సింహగర్జనలు గల గుహలతో కూడి, యక్షులు, గంధర్వులు, మునీశ్వరులు, సర్పములు గలదై, రుచికరములైన కందమూలములు గలదై యొప్పుచుండెను. మఱియు ఆ పర్వతము ఉన్నతములైన పద్మ కాష్ఠములనెడు ఓషధీ విశేషములతో గూడిన నీలములైన వనప్రదేశములు, మూలికలు గలదై, సూర్య కిరణములచే మేలుకొలుపబడుచున్న గైరికాది ధాతువులే కన్నులుగా గలదై, సెల్లయేళ్ల మ్రోతలే మంద్ర స్వరముతో నుచ్చరింపబడుచున్న వేద మంత్రములుగా గలదై, ప్రవాహముల గలగలలే మధుర గానములుగా గలదై, ఎత్తైన దేవదారు వక్షములే ఎత్తిన చేతులవలె గలిగియున్నదై, నేలబడుచున్న నీటి ధ్వనులచే నేడ్చు ధ్వనులు గలదై, యొప్పుచుండెను. శ్యామలమైన శరన్మేఘములు కదలుచుండుటచే వార్ధకము చేతనో యనునుట్ల వణకుచున్నదై, గాలిచే గదల్పబడుచున్న కీచకముల (వెదుళ్ల) ధ్వనిచే కూయుచున్నదై, శ్రేష్ఠములగు సర్పములు బుసలు కొట్టుటయే ఉచ్ఛ్వాస నిఃశ్వాసములుగా గలదై, మంచుతో నిండిన గుహలతో ధ్యానము చేయుచున్నట్లున్నదై, మేఘ పాదములవలెనున్న ప్రత్యంత పర్వతములచే నడువ నుంకించుచున్నది వలెనున్నదై, మద్ది, తాడి, అశ్వకర్ణము, వెదుళ్లు మొదలగు వృక్షములచే వ్యాపింపబడినదై ప్రకాశించు చుండెను. అంతటను పూచిన తీగలచే అలంకరించుకొన్నట్లున్నదై, అనేక విధ మృగసమూహములచే పరివ్యాప్తమై, వివిధ వర్ణములు గల ధాతువుల రంగులు గల జల ధారలచే అలంకరింపబడినదై, అనేక ప్రవాహముచేతను, రాళ్ల చేతను, నిండి దుర్గమమైనదై, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, ఉరగులు మున్నగువారి నివాసమై, బెబ్బులులు, సింహములు మున్నగునవి నివసించు గుహలు గలదై యొప్పుచున్న ఆ యరిష్టాద్రిని హనుమంతుడ ధిరోహించెను. సుందరమైన కొండ చరియలపై హనుమంతుడు కాలు మోపగనే అందలి రాళ్లు పిండి యయ్యెను. వానరశ్రేష్ఠుడైన మనుమంతుడా పర్వతము నెక్కి సముద్ర దక్షిణ

తీరము నుండి యుత్తర తీరమును జేరగోరుచు తన శరీరమును పెంచెను. హనుమంతుడచ్చటి నుండి చేపలతో, పాములతో, నితర జలజంతువులతో నుండిన భీకరమైన సముద్రమును జూచెను. వాయుదేవుని తనయుడగు హనుమంతుడు వాయుదేవుని వలెనే పయనించి, దక్షిణము నుండి యుత్తర దిక్కునకు పోయెను. ఆ సమయమున హనుమంతునిచే గట్టిగా పీడింపబడిన అరిష్టమను నా పర్వతము కదలుచున్న శిఖరములతో, పడిపోవుచున్న చెట్లతో, పాతాళమున దిగబడుచు, అందలి సకల ప్రాణులకు భయంకరమగు పెద్ద నాదము చేసెను. పూచిన చెట్లు హనుమంతుని తొడల వేగముచే పీడింపబడినవై విరిగి వజ్రాయుధము తాకున గూలినట్లు నేలబడెను. గుహల లోపలనున్న మహాబలముగల సింహములు ఆ హనుమంతుని పాదఘట్టనచే పీడింపబడినవై అరవగా, ఆ ధ్వని యాకాశమును చీల్చునట్లు విననయ్యెను. విద్యాధర స్త్రీలు భయముచే తమ వస్త్రములు జారి చిందర వందరలు కాగా, ఆభరణములు స్థానములు తప్పగా ఆ కొండనుండి పైకెగసిరి. పెద్ద శరీరములు గలవి, బలవంతములైనవి, ప్రకాశించు నెఱ్ఱని నాలుకలు గలవి, ఘోరమైన విషము గలవియునగు సర్పములు, తమ తలలు మెడలు పీడింపబడినవై చుట్టలు చుట్టుకొని పోయెను. కిన్నరులు, ఉరగులు గంధర్వులు, యక్షులు, విద్యాధరులు నప్పుడట్లు తొక్కబడిన యా పర్వతమును విడచి ఆకాశమును చేరుకొనిరి. శుభప్రదమై, వృక్షములతో, శిఖరములతో నొప్పు ఆ అరిష్టమను పర్వతము, బలవంతుడగు హనుమంతునిచే పీడింపబడి పాతాళమును జొచ్చెను. పది యోజనముల వెడల్పు, ముప్పది యోజనముల యెత్తు గలిగిన యా పర్వత మప్పుడు భూమితో సమానముగా అణగెను. హనుమంతుడట్లు తరంగములతో గొట్టబడిన తీర ప్రదేశముగల భయంకరమగు నా సముద్రము నవలీలగా దాటగోరినవాడై ఆకాశముపై కెగిరెను.

# ఏబది యేడవ సర్గము

**హనుమంతుడు మఱల సముద్రమును లంఘించుట :**

అప్పుడు చంద్రుడు కలువగా, సూర్యుడు నీరుకోడిగా, పుష్య శ్రవణ నక్షత్రములు హంసలుగా, మేఘములు నాచుగా, పచ్చిక బయళ్లుగా, పునర్వసు నక్షత్రము పెద్ద చేపగా, అంగారక గ్రహము పెద్ద మొసలిగా, ఐరావతము మహాద్వీపముగా, స్వాతి నక్షత్రము హంసగా, గాలితాకిడిచే గదలునట్టి అలలతో గూడిన చంద్రకిరణములు చల్లని నీరుగా, సిద్ధులు, యక్షులు, గంధర్వులు వికసించిన పద్మములుగా నొప్పుచున్న ఆకాశమనెడి సముద్రమునందు పెద్ద నావ వలె, హనుమంతుడు వాయువేగముతో అలసట లేక వెడలజొచ్చెను. శ్రీమంతుడగు నా వాయుపుత్రు డాకాశమును మ్రింగునో, చంద్రుని బట్టి గాయము చేయునో, నక్షత్రములు సూర్యమండలముతో గూడిన ఆకాశమును హరించునో యనునట్లు, మేఘములను చీల్చునట్లును వెడలసాగెను. అప్పుడా మేఘములు హనుమంతుని సంపర్కముచే తెల్లనివిగా, కొంచె మెఱ్ఱనివిగా, నల్లనివిగా, పసుపు వన్నె గలవిగా ఆకుపచ్చనివిగా మిక్కిలి ప్రకాశించెను. హనుమంతుడా మేఘ సమూహములోనికి బోవుచు, వచ్చుచు, కొంతసేపు కనబడి, కొంత సేపు కనబడక చంద్రుని వలె కనపించెను. మాటిమాటికి మేఘసమూహములను చీల్చుకొని లోనికి బోనుచు మఱల వెలుపలికి వచ్చుచు హనుమంతుడు ఆకాశమున గరుత్మంతుని వలె ప్రకాశించెను. తేజశ్శాలియగు హనుమంతుడు శ్రేష్ఠులగు రాక్షసులను జంపి, తన పేరు ప్రకటించుకొని, లంకానగరమును కల్లోలపరచి, భయంకరమగు రాక్షస సేనను బరిమార్చి, సీతాదేవికి ప్రణమిల్లినవాడై, మఱల సముద్రమును దాటసాగి నడుమకు వచ్చెను. పరాక్రమవంతుడగు హనుమంతుడట్లు మహా వేగము గలవాడై పర్వత శ్రేష్ఠుడగు మైనాకుని తన హస్తస్పర్శచే తృప్తినందించి, వింటి నుండి వెలువడిన బాణము వలె మహావేగముతో పోయెను. వానర శ్రేష్ఠుడగు హనుమంతుడట్లు మహా

వేగమున జనుచు ఒకింత దూరము గడచి, మేఘమువలె ఎత్తె యెప్పుచున్న మహేంద్రపర్వతమును చూచి యానందముతో సింహనాదుము చేసెను. మేఘ గర్జనను బోలు మహాధ్వని గలవాడగు హనుమంతుడట్లు గొప్పనాదముచేసి యా ధ్వనిచే దశాంశలు నిండించెను.

**హనుమంతుని సింహనాదమును విని కపులు హర్షించుట :**

హనుమంతుడల్లా ప్రదేశమునకు వచ్చి, తన మిత్రులను చూడవలెనను వేడుక కలవాడై సింహనాదము చేసి, తన తోక నల్ల నల్లన గదల్చెను. ఆ నాదముచే సూర్యమండల సహితమగు ఆకాశము బ్రద్దలగుచున్నదా? అనిపించెను. దీన వదనములతో సముద్రపుటుత్తర తీరముననున్నవారును, బలశాలురును, హనుమంతుని రాకకై యెదురు చూచుచున్నవారునగు కపిశ్రేష్ఠులుబీ వాయువుచే వ్యాపింప జేయబడిన మేఘ గర్జనవలెనున్న హనుమంతుని గర్జనమును, తొడలవేగముచే నేర్పడిన ధ్వనిని వినిరి. హనుమంతుడింకను రాలేదని యంతవఱకు నిరుత్సాహులైయున్న ఆ వానరులందరు ఆ సింహనాదమును విని, తమ మిత్రుడగు హనుమంతుని చూచుటకు మిక్కిలి కోరిక గలవారైరి. ఎలుగుబంట్లలో శ్రేష్ఠుడగు జాంబవంతుడు సంతుష్టిచెందిన మనస్సు గలవాడై వానరులందఱను బిలిచి యిట్లనెను. “హనుమంతుడన్ని విధముల కార్యము సాధించి వచ్చుచున్నాడు. ఇందేమాత్రము సందేహము లేదు. కార్యము సాధింపనిచో హనుమంతుని సింహనాద మిట్లుండదు” అని చెప్పగా విని, వానరులు హనుమంతుని బాహు వేగమును, తొడల వేగమును, సింహనాదమును విని యానందము నందినవారై యటనట గంతులు వైచిరి. హనుమంతుని జూడగోరినవారై వారొక చెట్టుకొన నుండి వేరొక చెట్టుకొనకు, ఒక కొండ కొన నుండి వేరొక కొండ కొనకు ఆనందముతో దుముకసాగిరి. వారట్లు సంతోషమునంది చెట్ల చివరల కెగబ్రాకి, కొమ్మలను పట్టుకొని కూర్చుండినవారై, దూరమందున్న తమవారిని పిలుచుటకు వస్త్రముల

నాడించినట్లు హనుమంతు నాహ్వానించుచు పెద్దకొమ్మల నాడించిరి. బలవంతుడును, వాయుపుత్రుడు నగు హనుమంతుడు కొండగుహలో దాగి యుండి శబ్దించుచు నీవలికి వచ్చు గాలివలె గర్జించుచు వచ్చుచుండెను. ఆకాశమార్గమున మేఘ సమూహము వలె వచ్చుచున్న వానరశ్రేష్ఠుడగు హనుమంతుని జూచి వానరులందరు చేతులు జోడించి నిలిచిరి.

**హనుమంతుడు మందరాద్రిపై దిగుట :**

వేగము గలవాడును, పర్వతమువలె పెద్ద శరీరము గలవాడును అగు హనుమంతుడట్లు వృక్షములతో నిండిన మహేంద్ర పర్వత శిఖరముపై వ్రాలెను. తిరిగి తనవారిని కలిసికొంటినని సంతుష్టిగల మనస్సు గలవాడై అందమై సెలయేళ్ళను ప్రవహింపజేయునది యగు నా పర్వత శిఖరముపై రెక్కలు తెగిన కొండవలె ఆకాశమునుండి వ్రాలెను. హనుమంతుని రాకచే ఆనందించిన వానరశ్రేష్ఠులందరును, మహాత్ముడగు ఆయన చుట్టును నిలిచిరి. అట్లాయనను వారు పరివేష్టించి యెంతో ప్రీతినందరి. ముఖమున ఆనందము కనబడుచుండగా వారందఱును ఏ బాధయును లేక క్షేమముగా తిరిగి వచ్చిన హనుమంతునకు పండ్లను, దుంపలను కానుకలిచ్చి పూజించిరి. మహాత్ముడగు హనుమంతుడు పూజింపదగిన పెద్దలగు జాంబవంతుడు మొదలగువారికి, యువరాజగు అంగదునకు నమస్కరించెను.

**హనుమంతుడు తాను సీతాదేవిని జూచితినని చెప్పుట :**

తిరిగి ఆ జాంబవంతుని చేతను, అంగదుని చేతను సత్కరింపబడినవాడై హనుమంతుడు "చూచితిని సీత"నని సంక్షేపముగా నివేదించెను. అంతట హనుమంతుడు వాలి తనయుడగు అంగదుని కౌగలించుకొన్నవాడై, ఆ మహేంద్ర పర్వతముపై నుపవిష్టుడయ్యెను. హనుమంతుడు సంతోషముతో వానరశ్రేష్ఠుల కిట్లనెను. "అశోకవనమందు భయంకర రాక్షస స్త్రీలచే కాపాడబడుచున్న అనిందితయగు సీతాదేవిని చూచితిని. ఆమె యొంటి జడ ధరించి రాముని

దర్శనమునకై పరితపించుచు ఉపవాసములచే అలసి జడలు దాల్చి మలినవస్త్రము ధరించి కృశించుచున్నద"ని చెప్పెను. గొప్ప అర్థము గలది, అమృతమునకు సాటియైనది యగు "చూచితిని సీత"నను హనుమంతుని మాటను విని వానరులందఱు నానందించిరి. అందు కొందఱు సింహనాదము చేసిరి. కొందఱేవేవియో ధ్వనులు చేసిరి. మహా బలవంతులగు వానరులు కొందఱు గర్జించిరి. మఱికొందఱు తమ జాతి స్వభావమగు కిచికిచ ధ్వనులు చేసిరి. తక్కినవారు దానికి ప్రతిగర్జన మొనర్చిరి. అట్లు మిక్కిలి యానందించిన వానర ముఖ్యులు కొందఱు సుందరములు, బలిష్ఠములు దీర్ఘములునైన తమ తోకలనెత్తి నేలకు గొట్టిరి. మఱికొందఱు వానరులు కొండకోనల నుండి క్రిందకు దూకి ఏనుగువలెనున్న హనుమంతుని ముట్టుకొనిరి. హనుమంతుడట్లు పల్కిన పిమ్మట, వాన వీరుల నడుమ అంగదుడు ఉత్తముడగు హనుమంతునితో నిట్లనెను. "ఓ వానరవీరుడా! నీవు పెద్దదైన యీ సముద్రమును దాటిపోయి మఱల అట్లే రాగలిగితివి. బలపరాక్రమములలో నీకు సాటియైనవాడు కనబడడు. ఆహా! ఏమి నీ ప్రభు భక్తి! ఏమి పరాక్రమము! ఏమి ధైర్యము! అదృష్టవశముచే రాముని భార్యయైన సీతాదేవిని చూడగలిగితివి. అదృష్టవశముచే రాముడిప్పుడు సీతా వియోగముచే గలిగిన శోకమును విడువగలడు". అనగా అంత తక్కిన వానరులందఱు అంగదుని, జాంబవంతుని, హనుమంతుని చుట్టుముట్టి పెద్ద పెద్ద రాలపై కూర్చుండిరి. ఆ వానరశ్రేష్ఠులెల్లరును హనుమ సముద్రమును దాటుటను, లంకను, రావణుని, సీతను చూచుటను గూర్చి వినగోరినవారై, చేతులు జోడించి హనుమంతుని జూచుచుండిరి. అంత అంగదుడు స్వర్గమున దేవతలచే పరివేష్టింపబడిన దేవేంద్రునివలె, వానరులనేకులచే పరివేష్టింపబడి నిలిచియుండెను. బుద్ధి కౌశలముతో కలిగిన కీర్తితో గూడిన వాడును, శౌర్యముతో, యశస్సుతో గూడిన వాడును, భుజములందు బాహుపురులు గలవాడును అగు హనుమంతునిచేత అధిష్ఠింపబడిన పెద్దదగు ఆ మహేంద్ర పర్వతము, మిక్కిలి శోభతో ప్రకాశించెను.

# ఏబది యెనిమిదవ సర్గము

## హనుమంతుడు తాను లంకకుపోయి వచ్చిన విధమంతయు కపులకు చెప్పుట :

అప్పుడు మహాబలవంతుడగు హనుమంతుడు మొదలుగా గల వానరు లందఱు మహేంద్ర పర్వతశిఖరముపై కలిసికొని మిక్కిలి సంతోషించిరి. అంత జాంబవంతుడు పులకించిన శరీరము గలవాడై, సంతుష్టి పొందినవాడై హనుమంతుని సీతాదేవిని చూచి వచ్చిన విధమును చెప్పుమని యిట్లడిగెను. "ఓ హనుమంతా! నీవెట్లు సీతను జూచితివి? ఆమె యెచ్చటనున్నది? క్రూర కర్ముడగు రావణుడామె యెడనెట్లు ప్రవర్తించుచున్నాడు? ఓ మహావానరా! నీవీ విషయము నున్నదున్నట్లుగా మాకు తెలియజేయుము. దానిని విని మఱలనేమి చేయవలెనో ఆలోచింతము. మనము కిష్కింధకు వెళ్లి రాము సన్నిధిలో దేనిని చెప్పవలయునో దేనిని చెప్పరాదో బుద్ధిమంతుడవగు నీవు మాకు వినిపింపుము". అనగా హనుమంతుడట్లు జాంబవంతునిచే అడుగ బడినవాడై, సంతోషముచే ఒడలు పులకింపగా సీతాదేవికి శిరసా ప్రణమిల్లి యిట్లు చెప్పసాగెను. "నేను మీరందఱు చూచుచుండగనే సముద్ర దక్షిణ తీరమును చేరదలచినవాడనై, యేకాగ్రతతో మహేంద్ర పర్వతము నుండి ఆకాశమున కెగిరితిని. నేనట్లాకాశమున బోవుచుండగా, బంగారు శిఖరములు గలిగిన అందమైన పర్వతమొకటి నా యాకాశ మార్గమును నిరోధించు దానివలె నాకు కనిపించినది. నా మార్గమునకడ్డు వచ్చిన యా బంగారు కొండ దగ్గరకు వెళ్లి, దానిని నా ప్రయాణమునకు విఘ్నము కలిగించు దానినిగా తలంచి, దానిని పగులగొట్ట వలెనని యెంచి, వెంటనే నాతోకతో కొట్టగా సూర్యునివలె

ప్రకాశించు ఆ కొండ వేయి ముక్కలయ్యెను. అప్పుడా పర్వతము తనను ముక్కలు చేయదలంచిన నా ప్రయత్నమును తెలిసికొని 'పుత్రా!' యని మధురముగా బలికి నా మనస్సున కానందము కలుగరీతిగా నిట్లనెను. నేను నీ తండ్రియగు వాయుదేవునకు స్నేహితుడనగుటచే నీకు పినతండ్రిని, నా పేరు మైనాకుడు. ఈ సముద్రము నా నివాసము. నాయనా! పూర్వము శ్రేష్ఠములగు పర్వతముల కన్నింటికిని ఱెక్కలుండెడివి. అవి ఆ రెక్కలతో సంచరించుచు భూమిపై వ్రాలి ప్రాణులను బాధించుచుండెడివి. భగవంతుడును, పాకాసురుని జంపినవాడునగు దేవేంద్రుడా పర్వతముల దుష్టచేష్ట నెరిగి వాని రెక్కలను తన వజ్రాయుధముచే వేయి ముక్కలుగా నరకెను. నాయనా! మహాత్ముడగు నీ తండ్రి వాయుదేవుడు నన్నా దేవేంద్రుని బారి నుండి విడిపించినాడు. ఆయనయే నన్నప్పుడీ సముద్రమున బడవైచి దేవేంద్రునికి కనబడకుండ గాచినాడు అని చెప్పిన మైనాకుని మాటలను విని, నేనాయనకు నా కార్యమును జెప్పి తిరిగి ప్రయాణము చేయ నుద్యమించితిని. మహాత్ముడగు మైనాకుడును నేనట్లు పోవుట కనుమతించెను. అంతవఱకు మనుష్య శరీరము దాల్చి నాతో మాటలాడిన యా కొండ మానవ రూపమును విడచి పెద్దకొండ రూపముతో సముద్రమున నిలిచెను. నేనును మిగిలిన మార్గమున మహావేగముతో పోవుచుంటిని. అట్లు చాల సేపాకాశమున వెడలితిని. అట్లు వెళ్లుచు సర్పములకు తల్లియైన సురసాదేవి నా సముద్ర మధ్యమున జూచితిని. ఆమె నాతో నిట్లనెను. "ఓ వానరశ్రేష్ఠుడా! నిన్ను దేవతలు నాకాహారముగా ప్రసాదించినారు గావున నేను చిరకాలమునకు దొరకిన నిన్ను భక్షింతును అని పలుకగా నేనామెకు చేతులు జోడించి నమస్కరించి, అయ్యో! మరల రామకార్యమునకు విఘ్నము కలిగినదే యని ముఖమున కళ తప్పగా నిట్లంటిని. శత్రువులను పీడించువాడును దశరథుని కుమారుడును, శ్రీమంతుడునైన రాముడు, తమ్ముడగు లక్ష్మణుని తోడను, భార్యయగు సీత తోడను గలిసి దండకారణ్యమునకు వచ్చి సంచరించుచుండగా రావణాసురుడు సీతాదేవిని దొంగలించెను. రామాజ్ఞను తలదాల్చి దూతనై

నేనామె కడకు పోవుచున్నాను. ఆ రాముని రాజ్యమున నివసించుదానవగు నీవాతనికి సహాయము చేయదగియున్నావు. అట్లు సహాయము చేయుట నీకిష్టము గాకున్నచో నేను లంకకు వెళ్లి సీతను జూచి అనాయాసము కార్యములను సాధించువాడగు రామునకా వార్త నెఱింగించి నీ నోటియందు పడెదను. ఇది నిజము. ఇట్లని ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను" అని నేను చెప్పగా కామరూపిణియగు సురస 'నన్నెవ్వరును దప్పించుకొని పోజాలరు. నాకట్టి వరమున్నది' యనెను. అంత నేను నా శరీరమును పదియోజనముల పొడవు, నైదు యోజనముల వెడల్పుగా బెంచితిని. ఆమెయు దానికి తగినట్లు తన నోటిని పెద్దదిగా తెరచెను. అట్లు పెద్దదిగా తెరచిన ఆమె నోటిని చూచి నేను నా శరీరమును తగ్గించుకొని క్షణకాలములోననే బొటనవేలంత రూపము గలవాడనైతిని. అంత ఆమె నోటియందు వెంటనే ప్రవేశించి క్షణకాలములో ఆ నోటినుండి బయలు వెడలితిని. అప్పుడు సురసాదేవియు తన వెనుకటి రూపమును ధరించి నాతో నిట్లనెను. 'శాంతమూర్తివగువో వానరశ్రేష్ఠుడా! నీవింక సుఖముగా పోయిరమ్ము. నీకు కార్యసిద్ధి కలుగుగాక! మహాత్ముడగు రామునితో సీతను గూర్పుము. మహా భుజుడవగు ఓ వానరుడా! నీ బుద్ధి సూక్ష్మతకు సంతసించితిని. నీవు సుఖమును పొందుము'. అని యామె పల్కగా అప్పుడు సర్వభూతములును 'లెస్స లెస్స' యని ప్రశంసించినవి. నేనప్పుడు గరుడునివలె విశాలాకాశమున కెగిరితిని. అంతలో నా నీడను పట్టి వెనుకకు లాగి నట్లైనది. కాని నాకేమియు గనిపింపలేదు. అప్పుడు నా వేగము మందగించగా దశదిక్కులను చూచియు నా గమన వేగము నాపుచున్న వస్తువును కనుగొనజాలనైతిని. నేనాకాశమున బోవుచుండగా నిట్టి విఘ్నము కలిగినదేమి? విఘ్నము కలిగించు ప్రాణి కనిపించదేమి? అని యాలోచించుచునే నేను క్రిందకు జూచితిని. భయంకరమగు రాక్షసి యొకతె నీటిలో కనబడినది. ఆ రాక్షసి నన్ను జూచి యట్టహాసము చేసి నిర్భయముగా దృఢముగా ఈ శుభప్రదమైన వాక్యమును పల్కెను. 'ఓ పెద్ద శరీరము గలవాడా! ఆకలితోనున్న నాకు నీవిష్టమగు భక్ష్యమవు.

నీవెక్కడకు పోయెదవు? చాలకాలముగా ఆహారములేని నా శరీరమును సంతుష్టి నొందింపుము' అనెను. నేనప్పుడట్లేయని అంగీకరించితిని. వెంటనే నా శరీరమును ఆమె నోటికంటే పెద్దదిగా పెంచితిని. విపులము భయంకరమునగు తన నోటిని ఆమె అంతకంటెను పెద్దదిగా పెంచెను. ఆ రాక్షసి నా సామర్థ్యమును గాని, నా కామరూపమును గాని, నేనామెకు చేయనున్న యపకారమును గాని చక్కగా తెలిసికొన దయ్యెను. అంత నేనొక్క క్షణములో నా శరీరమును చిన్నదిగా జేసికొని, ఆ రాక్షసి నోటిగుండా లోనికి ప్రవేశించి గుండెలను పెరికి వైచి ఆకాశమున కెగిరితిని. అట్లా రాకాసి గుండెలను నేను పెరికివేయగా పర్వతమువలె భయంకరముగానున్న ఆ రాక్షసియు, భుజముల యొక్క సంధులు తెగిపోగా సముద్రమున మునిగెను. అప్పుడాకాశమున నిలిచిన సిద్ధులు 'చారణులు' భయంకర రాక్షసియగు సింహికను శీఘ్రమే హనుమంతుడు సంహరించినాడని పలుకగా వింటిని. ఆమెనట్లు చంపి మఱల మఱల ప్రాణాంతకమైన సింహికను చంపుటనే తలంచుకొనుచు ఆకాశమున చాల దూరము గడచి కొండలతో ప్రకాశించు సముద్ర దక్షిణ తీరమును చేరితిని. లంకానగర మచ్చటనే యున్నది. తరువాత నేను సూర్యుడస్తమించిన పిమ్మట భయంకర పరాక్రమముగల రాక్షసులకు తెలియకుండగనే రాక్షస నివాసమగు లంకా నగరమును ప్రవేశించితిని. నేను లంకలో ప్రవేశించు చుండగా ప్రళయకాలమేఘము వలెనున్న యొక రాక్షసి యట్టహాసము చేయుచు నా ముందు నిలిచెను. మండుచున్న అగ్నివలె నెఱ్ఱనైన వెంట్రుకలు గలదై మిక్కిలి భయంకరా కారముతో నన్ను చంప జూచుచున్న యా రాక్షసి నెడమచేతి పిడికిలిపోటుతో (ఆ రాత్రి ప్రారంభమున) నోడించితిని. ఆ రాక్షసి 'ఓరీ! వానరా! నీవు నన్ను జయించితివి. ఈ లంకకు నాశనము ప్రారంభమైనది. నీ యిష్టము వచ్చిన చొప్పున లంకలో ప్రవేశింపుము'. అనగా ఆ రాత్రి ప్రారంభ సమయమున లంకలో నా యెడమపాదమును మోపితిని. పిమ్మట నేను రావణాంతఃపురమున ప్రవేశించి రాత్రియంతయు వెదకినను చక్కని నడుము గల ఆ సీతాదేవిని

చూడనైతిని. నేను దుఃఖించుచు, అతివిస్తరమైన బంగారు ప్రాకారము గల గృహోద్యానమును జూచితిని. ఆ ప్రాకారమును దాటి చాలా చెట్లతో నిండియున్న యుద్యానవనమంతయు వెదకితిని. ఆ యశోకవనము నడుమ పెద్ద శింశుపా వృక్షమున్నది. దాని పైనెక్కి బంగారు రంగు గల అరటి తోటలను జూచితిని. ఆ శింశుపా వృక్షము చెంతనే వరవర్ణినియు, నడి యవ్వనమున నున్నదియు, తామర రేకులవంటి కన్నులు గలదియు, ఉప నాసములచే కృశించిన శరీరము గలదియునగు సీతాదేవిని జూచితిని. ఆమె రావణు డపహరించిన సమయమున నే చీరతో నుండెనో ఆ చీరనే ధరించి యుండెను. ఆమె జుట్టు దుమ్ముచే మాసియుండెను. ఆమె మనస్సున కలిగిన శోకము చేతను, శరీర సంబంధమగు సంతాపము చేతను దీనురాలై, సదా భర్తకు క్షేమము గలుగవలెనని కోరుచుండెను. రక్తమాంసములను దిను ఆడపులుల నడుమనున్న లేడివలె వికృత రూపములతో భయంకరులైన రాక్షస స్త్రీలచే చుట్టుముట్టబడినదై యుండెను. ఆమె మాటి మాటికి వారిచే భయ పెట్టబడు చుండెను. ఒంటి జడను దాల్చి దీనురాలై భర్తనే తలంచుచు, భూమి పైననే శయనించుచున్నదైన ఆమె శరీరము హేమంత ఋతువునందు కమలము వలె కళ దప్పియుండెను. రావణుని యందిష్టములేనిదై ఆమె మరణింప నిశ్చయించుకొని యుండగా నేనెట్లో ఆమెను చూడగలిగితిని. రాముని పత్నియు, కీర్తిమతియునగు సీతాదేవి యిట్టి దీనావస్థలో నుండగా చూచి ఆ శింశుపా వృక్షము మీదనట్లా యుండి చూచుచుంటిని. అప్పుడు మొలనూలి చిరుగజ్జెలు అందెల మ్రోతతో గూడిన మిక్కిలి గంభీరమగు కోలాహలము ఆ రావణుని భవనము నుండి విననయ్యెను. నేను మిక్కిలి కలవరపడి నా రూపమును చిన్నదిగా చేసికొని యా శింశుపా వృక్షమున పక్షివలె దట్టమైన ఆకులు గల ప్రదేశమున గూర్చుంటిని. రావణుని భార్యలును, మహాబలుడగు రావణుడును సీతాదేవియున్న చోటునకు వచ్చిరి. రాక్షసుని చూచినంతనే సీత తన తొడలను ముడుచుకొని పుష్టిగలిగిన తన స్తనములను చేతులతో గప్పుకొనెను. రావణుడు

మిక్కిలి భయపడి నదియు, అధికముగా కళవరపడుచున్నదియు, అటునిటు చూచుచు, తనను రక్షించు వారెవ్వరు కనిపింపకపోవుటచే వణకుచున్నదియు, శోచనీయమగు స్థితి గలదియు, మిక్కిలి శోకించుచున్నదియునగు సీతాదేవికి తలవంచి నమస్కరించి, తన్నాదరింపుమని కోరెను. 'ఓ గర్వము గలదానా! అట్లు నీవు నన్నంగీకరింపనిచో నే నిచ్చిన రెండు నెలల గడువు ముగియగనే నీ రక్తము త్రావెదను' అని దుర్మార్గుడైన రావణుడు పల్కిన మాటలను విని మిక్కిలి కోపించినదై సీతాదేవి గడ్డిపరకను మధ్యనుంచుకొని యిట్లుత్తమము ఆ చెప్పెను. 'ఓరీ! రాక్షసాధమా! అమిత తేజశ్శాలియగు రాముని భార్యను. ఇక్ష్వాకు కులనాథుడగు దశరథుని కోడలిని అగు నన్ను అనరాని మాటలనుచున్న నీ నాలుక వేయి ముక్కలయి యూడి పడకున్నదేమి? ఓ పాపిష్ఠివాడా! నీవు నా భర్త దగ్గఱ లేని సమయమున నన్ను దొంగిలించి తెచ్చితివి. నీ పరాక్రమమెంత యల్పమైనదో దీనివలననే తెలియుచున్నది. నీవు రామునితో సమానుడవు కాజాలవు. ఆయనకు దాస్యము చేయుటకైనను తగవు. రాముడనేక యాగములు చేసినవాడు. సత్యమునే పలుకువాడు. యుద్ధములందు నిపుణుడు' అని సీత పల్కగా, ఆ పరుషోక్తులు విని రావణుడు చితియందలి యగ్నివలె కోపముతో నొక్కమారుగా మండిపడెను. ఆతడు భయంకరములైన తన కన్నులను త్రిప్పుచు సీతను చంపనుద్యమింపగా తక్కిన స్త్రీలు హాహాకారములొనర్చిరి. దుర్మార్గుడగు ఆ రావణుని భార్యలలో శ్రేష్ఠురాలైన మండోదరి యాస్త్రీలలోనుండి లేచి (అడ్డము వచ్చినది మండోదరి కాదు. మండోదరి పేరు మాత్రము విని యుండుటచేతను, భేదము గుర్తింపజాలక ధాన్యమాలినియే మండోదరియని హనుమంతుడు భ్రమించెను. లేదా మండోదరియు వచ్చి యుండవచ్చును) వచ్చి రావణుడా క్రూర కార్యము చేయకుండ వారించెను. కామపీడితుడగు నాతనికామె యిట్లు మధురముగా పలికెను. 'పరాక్రమమున దేవేంద్రుని బోలినవాడా! నీకు సీతతో పనియేమి? ఓ నాథా! దేవకాంతలు గంధర్వ కన్యలు, యక్ష కన్యలు మున్నగు వారితో క్రీడింపుము. సీతతో నీకేల?' అని పలుకుచుండగా తక్కిన రాక్షసాంగన

లందఱు గలిసి మహాబలశాలియగు రావణుని బుజ్జగించి యతనిని వెంటనే భవనమునకు తీసికొనిపోయిరి. రావణుడట్లు వెళ్లగనే వికృతములైన ముఖములు గల రాక్షస స్త్రీలు భయంకరములు కర్ణ కఠోరములునగు మాటలతో సీతను బెదరించిరి. సీత వారి మాటలను గడ్డిపోచలతో సమానముగా భావించెను. వారి గర్జన లామె కడ ఎందుకును కొఱగాని వయ్యెను. మాంసమును దినునట్టి రాక్షసాంగనలట్లు వ్యర్థముగా గర్జించి యూరకున్నవారై రావణుని కడకేగి సీత పట్టుదలను తెలియజేసిరి. పిమ్మట యా రాక్షస స్త్రీలు సీత తమ మాటను వినునను నమ్మకము లేకున్నవారై సీతాదేవి కన్నివైపులను పరివేష్టించి కూర్చొని కొంతవడికి నిద్రించిరి. వారట్లు నిద్రింపగా పతిహితమునే కోరునట్టి సీతాదేవి జాలి కల్గునట్లేడ్చి మిక్కిలి శోకించెను. అపుడా రాక్షస స్త్రీల నడుమ నుండి త్రిజట యనునది నిద్ర మేల్కని యిట్లనెను. 'ఓ పాపాత్ములారా! కావలసినచో మీరలు నన్ను తినివేయుడు. జనకుని కుమార్తెయు, పతివ్రతయు, దశరథుని కోడలును అగు సీత మాత్రము మరణింపదు. భయము కలిగించునట్టి కలను గంటిని. రాక్షసుల వినాశమును, రాముని విజయమును ఆ కల తెలియజేయు చున్నది. రాముని బారినుండి మనలను కాపాడుటకీమెయే సమర్థురాలు. కావున మమ్ము కాపాడుమని యీమెను ప్రార్థింతము. ఇపుడిట్లు చేయుటే నాకు నచ్చిన పని. దుఃఖములోనున్న యీ సీతను గూర్చి నాకు వచ్చిన కలను బట్టి యీమె శీఘ్రముగనే సర్వ దుఃఖములనుండి విముక్తురాలై గొప్ప సుఖములను పొందును' అని చెప్పగా వారందఱును సీతను రక్షింపుమని వేడుకొనిరి. ఆమె తనకు ప్రణమిల్లిన వారి అపరాధములను మన్నించి వారి యెడ ప్రసన్నురాలయ్యెను. పిమ్మట ఆ సీత తన భర్త విజయము పొందునని త్రిజట పల్కిన వాక్యములను విని సంతోషమును స్త్రీ సహజమగు సిగ్గునుబొంది, ఆ రాక్షస స్త్రీలతో 'త్రిజట పల్కినది నిజమైనచో నేను మిమ్ములను కాపాడెదన'ని యభయ మొసగెను. సీత యొక్క దారుణ దీన దశను జూచి చింతాక్రాంత చిత్తుడనైన నామనస్సున కానందము గలుగదయ్యెను. సీతతో సంభాషించు విధానము నాలోచించితిని.

దానికను కూలముగా నిక్ష్వాకు వంశజులను కీర్తించితిని. రాజులకు, ఋషులకు నామోదకరములైన నామాటలను విని సీతాదేవి కన్నుల కన్నీరు నిండగా నాతో నిట్లు పలికెను. 'ఓ వానరశ్రేష్ఠుడా! నీవెవ్వరవు? ఇచ్చటికెట్లు వచ్చితివి? నీకు రామునికై నభిమానమేల కలిగినది? నీ వీ విషయము తెలియజేయుము' అని పల్కగా నేనిట్లు ప్రత్యుత్తరమిచ్చితిని. 'నీ భర్తయగు రామునకు సహాయుడును, మహా బలపరాక్రమములు గలవాడును అగు సుగ్రీవుడనెడు వానరరాజు కలడు. నేనాయన సేవకుడను. నా పేరు హనుమంతుడు. మహా కార్యముల నవలీలగా సాధింపగల నీ పెనిమిటియైన రాముడు నీకడకు బంపగా వచ్చితిని. ఓ కీర్తిశాలినీ! పురుష శ్రేష్ఠుడగు రాముడీ యుంగరమును నీకు గుర్తుగా నిచ్చి యున్నాడు. కావున నన్నిపుడేమి చేయుమందువు? నీ యాజ్ఞ ననుసరించి చేసెదను. నేను నిన్ను రామలక్ష్మణుల కడకు తీసికొనిపోయెదను. నీకభిమతమో కాదో తెలుపుము అని' నేనడుగగా విని జనకరాజపుత్రియగు సీత కర్తవ్యమును దలంచి 'రాముడు రావణుని జంపి నన్ను తీసికొని పోవును గాక' యనెను. నిందలేనిది పూజ్యురాలునగు సీతాదేవికి ప్రణమిల్లి రాముని మనస్సును సంతోషపెట్టగలిగిన గుర్తునిమ్మని కోరితిని. అప్పుడు సీత 'హనుమంతుడా! నీవు ఉత్తమమగు నీ చూడామణిని గ్రహింపుము. దీనిని జూచి మహాభుజుడగు రాముడు నిన్ను చాల గౌరవింపగలడు' అని ఆశ్చర్యకరము శ్రేష్ఠమునైన మణిని నాకిచ్చెను. తిరిగి రామునకు దెల్పవలసినదని కొన్ని మాటలను గూడ తెలియ జెప్పెను. నేనంత సీతాదేవికి ప్రదక్షిణ చేసి వందనమొనర్చి, యేకాగ్ర చిత్తుడనై యటనుండి పోదలంచితిని. మఱల సీతాదేవి తన మనస్సులో నిశ్చయించుకొని నాకిట్లు చెప్పినది. 'ఓ హనుమంతుడా! నీవు నా సంగతిని రామునకు దెలుపుము. నీవెట్లు చెప్పిన వీరులగు రామలక్ష్మణులు, సుగ్రీవునితో గలిసి యిచ్చటికి వచ్చెదరో అట్లు చెప్పుము. ఆ విధముగా వారు రానిచో నేనింక రెండు మాసములే జీవింతును. ఆ పైన రాముడు నన్ను చూడజాలడు. నేనాథవలె మరణింతును' అని ఆమె పలికిన దయగలిగించు మాటలు వినిన నాకు రావణునిపై కోపము

గలిగెను. అనంతర కర్త్యము నాలోచించితిని. తరువాత నా శరీరమును పర్వతముతో సమానముగా పెంచితిని. యుద్ధము చేయగోరుచు అశోక వనమును పాడుచేయ నారంభించితిని. అప్పుడు వికృతములగు ముఖములు గల రాక్షస వనితలు మేలుకొని ఆ వనము విరువబడుటయు, అందలి పక్షులు, మృగములు బెదరిపోవుటయు చూచిరి. వారావనమును విరుచుచున్న నన్ను జూచి అచ్చటనుండి బయలుదేరి రావణునికడకేగి యిట్లనిరి. 'మహా బలుడగు ఓ రాజా! ఇతరులకు ప్రవేశింపరాని యీ వనమును నీ పరాక్రమము నెఱుగక దురాత్ముడగు నొక వానరుడు పాడుచేసినాడు. నీ కభిమతము గాని పనిని చేసిన యాదుర్బుద్ధి శీఘ్రమే నశించునట్లుగా అతనికి మరణదండన విధింపుము' అనగా ఆ మాటలను వినిన రావణుడు, అజేయ పరాక్రములగు కింకరులను రాక్షసులను నాపైకి పంపినాడు. శూలములు, ముద్గరములు దాల్చిన ఎనుబదివేల కింకరులను ఆ వన ప్రదేశముననే పరిఘముతో చంపివేసితిని. చావగా మిగిలినారు కొలదిమంది వేగముగా వెళ్లి ఆ కింకర సైన్యమంతయు నశించెనని రావణునకు చెప్పిరి. అప్పుడు నాకొక ఆలోచన కలిగినది. తదనుసారము నేనచ్చటి చైత్యప్రాసాదము పైకెగిరితిని. అచ్చటి స్తంభముతోనే చైత్య ప్రాసాద రక్షకులగు రాక్షసులను చంపి లంకా నగరమున కలంకారమగు ఆ ప్రాసాదమును నాశనము చేసితిని. అపుడా రావణుడు భయంకర రూపముగల యనేక రాక్షసులతోపాటు ప్రహస్త పుత్రుడగు జంబుమాలిని నాపైకి పంపెను. మహాబల సమన్వితుడును యుద్ధ విద్యా విశారదుడునగు ఆ రాక్షసుని, నతని యనుచరులను భయంకరమగు పరిఘతో సంహరించితిని. వారట్లు నశించుట విని రాక్షసరాజు రావణుడు మంత్రిపుత్రులను కాల్బలముతో గూడ నాపైకి పంపెను. నేను వారిని పరిఘముతోనే యమపురికి పంపితిని. యుద్ధమున పరాక్రమమును చూపునట్టి మంత్రిపుత్రులు మరణించిరని విని రావణుడు సేనానాయకుల నైదుగురిని నాపైకి బంపెను. నేను వారందఱిని వారి సైన్యములతో గూడ చంపివేసితిని. అటు తరువాత రావణుడు తన కుమారుడగు

అక్షుని పంపెను. అతడనేక రాక్షసులతో గూడ యుద్ధమునకు వచ్చెను. మండోదరి కుమారుడు యుద్ధ విద్యా విశారదుడగు అక్ష కుమారుడు కత్తి, డాలు ధరించి ఆకాశమున కెగిరెను. అప్పుడు నేనతని పాదముల నొడిసిపట్టి నూరుమారు లాకాశమున త్రిప్పి నేలపై పడగొట్టి పిండి పిండి చేసితిని. అప్పుడు రావణుడు మిక్కిలి కోపముతో బలవంతుడు యుద్ధోన్మత్తుడునగు ఇంద్రజిత్తను పుత్రుని బంపెను. నేనింద్రజిత్తును, అతని సైన్యమును, తేజస్సు లేనివారినిగా జేసి మిక్కిలి సంతసించితిని. ఆ యింద్రజిత్తు నేనెంత కును సాధింపరానివాడననియు, తన సైన్యము నష్టమైనదనియు తెలిసికొని వెంటనే బ్రహ్మాస్త్రముతో నన్ను బంధించెను. అటుపై రాక్షసులు నన్ను త్రాళ్లతో బంధింపసాగిరి. రాక్షసులట్లు నన్ను బంధించి రావణుని చెంతకు తీసికొనిపోయిరి. నేనప్పుడు రావణుని జూచి దురాత్ముడగు నాతనితో మాటలాడితిని. వారు నేనేల లంకకు వచ్చితినో, రాక్షసులనేల వధించితినో, చెప్పుమని నన్నడిగిరి. నేనదియంతయును సీతాదేవిని జూచుటకేయని చెప్పితిని. 'ఓ రాజా! నేను సీతను చూచుటకే యిచ్చిటికి వచ్చితిని. నేను వాయుపుత్రుడను. హనుమంతుడను వానరుడను. నేను రాముని దూతను. సుగ్రీవుని మంత్రిని. రాముని దూతగా నీకడకు వచ్చితిని. మహాతేజశ్శాలియగు సుగ్రీవుడు నిన్ను కుశలమడిగినాడు. ధర్మార్థకామ సహితమును, ఇహ పరార్థోపకారమును అగు హితమును నీకిట్లు చెప్పినాడు. 'ఋష్యమూకమను పర్వతమునందు యుద్ధకోవిదుడైన రాముడు నాకు మిత్రుడయ్యెను'. ఆయన 'నా భార్యను రాక్షసుడపహరించినాడు ఆ విషయమున నాకు నీవన్ని విధముల సహాయము చేయవలయు'నని నన్ను కోరెను. నేనును రాముని వాలిని వధింపవలసిన దనియు, ఆ విషయమున నీవు నాకు సహాయము చేయవలెనని కోరితిని. అప్పుడు వాలిచే రాజ్యమును కోల్పోయిన నాతో మహాప్రభువగు రాముడు లక్ష్మణ సమేతుడై అగ్ని సాక్షికముగా స్నేహము చేసెను. అంతట రాముడొకే బాణము వేసి యుద్ధమున వాలిని జంపి నన్ను వానరులకు మహారాజుగా జేసెను. మేమా రామున కన్ని విధములుగను సహాయము

చేయవలసి యున్నది' అని సుగ్రీవుడు నిన్ను కుశలమడిగినాడు. వానరులు వచ్చి నీ సైన్యమును నాశనము చేయకముందే సీతను తీసికొని వచ్చి రామున కర్పింపుము. వానరుల ప్రభావము నీ వెఱుంగవేమో కాని యెల్లరు నెఱుంగుదురు. వారు పిలువబడినవారై దేవతలకడకు కూడ పోవుచుందురు. ఇది వానరరాజుగు సుగ్రీవుడు పంపిన సందేశము అని నేను రావణునకు తెలిపితిని. వాడు కోపముతో నన్ను కాల్చువానివలె తీక్షముగా చూచెను. దుర్మార్గుడును, క్రూరుడునగు రావణుడు నా పరాక్రమము తెలియక నన్ను చంపుట కాజ్ఞ యిచ్చెను. అప్పుడా రావణుని సోదరుడును మహాబుద్ధిశాలియునగు విభీషణుడు నా కొరకై తన యన్న నిట్టు ప్రార్థించెను. ఓ రాక్షసోత్తమా! ఇట్లు చేయుట పాడిగాదు. నీ నిశ్చయమును వీడుము. రాజనీతి విరుద్ధమగు మార్గమును నీవవలంబించుచున్నావు. ఓ రాక్షసరాజా! నీతిశాస్త్రములందెచ్చటను దూతను వధించుట చెప్పబడలేదు. దూతయన్న వాడు తన యజమాని శ్రేయమును గోరి యథార్థము చెప్పవలెను. ఓ సాటిలేని పరాక్రమము కలవాడా! గొప్ప అపరాధమే చేసినను దూత కవయవ లోపము చేయుటే విధింతురు గాని మరణదండనము శాస్త్రమున చెప్పబడలేదు అని విభీషణుడు చెప్పగనే రావణు'డా వానరుని తోకను గాల్చుడు' అని రాక్షసుల కాజ్ఞాపించెను. రాక్షసులు నాతోక నన్నివైపుల నుండియు జనుపనారతో గుడ్డపీలికలతో చుట్టిరి. నూనెలతో తడిపిరి. అట్లు సన్నాహమొనర్చి తీవ్రమైన పరాక్రమముగల రాక్షసులు నన్ను కట్టలతోడను, పిడికిళ్లతోడను కొట్టుచు, కట్టువడి తమకు లోబడియున్న నా తోకను గాల్చిరి. మండుచున్న తోకగల నన్ను తీసికొని రాక్షసులు నగర ద్వారము కడకు వచ్చి యీ వానరుడు చేసిన నేరమునకు దండనగా ఈతని తోక గాల్పబడుచున్నదని చాటించిరి. పిమ్మట నేను నా పెద్ద రూపమును చిన్నదిగా చేసికొని కట్లను జారవిడుచుకొని, మఱల ఎప్పటివలె నా శరీరమును పెంచుకొన్నవాడనై యినుప గుదియను చేతబట్టి, దానితో నా వెంటన్ను కొందఱు రాక్షసులను జంపితిని. తరువాత వేగముగా ఆ నగర ద్వారము పైకెగిరితిని.

మండుచున్న నా తోకతో మిద్దెలు, గోపురములతో గూడిన లంకానగరమును ప్రళయాగ్ని ప్రజలను గాల్చునట్లుగా నేభయమును లేక గాల్చితిని. 'సీతాదేవి యీ మంటలో నశించియుండునేమో. ఏలనన లంకలో తగులబడని ప్రదేశమే లేదు. నగరమంతయు బూడిద చేయబడినది. నేనీ లంకను గాల్చుటచే సీతయు కాలిపోయి యుండును. ఇందు సందేహము లేదు. రాముని మహా కార్యమును నేనిట్లు నిష్ఫలమొనరించితిని అని శోకాక్రాంతుడనై ఆలోచించుచుంటిని. అట్టి సమయమున సీతాదేవి తగులబడలేదని ఆశ్చర్యముతో చారణులు చెప్పుకొను శుభవాక్యములను నేను వింటిని. వారి మాటల వలన సీత కాల్చబడలేదని నిశ్చయమునకు వచ్చితిని. ఆ నిశ్చయమును శుభ శకునములును బలపరచినవి. తోక తగులబడుచున్నను అగ్ని నన్ను కాల్చుట లేదు. నా హృదయము ప్రసన్నముగా నున్నది. గాలులు పరిమళములను ప్రసరించుచు వీచుచున్నవి. మంచి శకునముల చేతను, చారణుల వాక్యముల చేతను నా మనస్సు సంతసించుచున్నది. అందువలన సీతాదేవికే యాపదయు కలిగియుండదని యూహించి ఆమెను మఱల దర్శించి ఆమె యొద్ద సెలవు గైకొంటిని. అటుపై నరిష్ట పర్వతము కడకేగి మిమ్ములను జూచు కోరికతో తిరుగు ప్రయాణమునకై పైకెగిరితిని. పిమ్మట వాయువు, చంద్రుడు, సూర్యుడు, సిద్ధులు, గంధర్వులు తిరుగుచుండునట్టి యాకాశమార్గమును గడచి మిమ్మిచ్చట చూడగలిగితిని. శ్రీరాముని ప్రభావము, మీ తేజము కారణములుగా మనరాజు సుగ్రీవుని కార్యమంతయు నెరవేర్చితిని. నేను లంకకు వెళ్లినది మొదలుగా యే యే పనులను చేసితినో ఉన్నది యున్నట్లుగా తెలిపితిని. ఇంక నేనేమీ చేయక విడచితినో దానినంతయును చేయవలసి యున్నది" అని హనుమంతుడు వానర ముఖ్యులకు తెల్పెను.

# ఏబది తొమ్మిదవ సర్గము

## హనుమంతుడు సీతను తీసికొని వచ్చి రామున కిచ్చుట ధర్మమని చెప్పుట:

వాయుపుత్రుడగు హనుమంతుడీ విధముగా సవిస్తరముగా తాను సీతను వెదకిన వృత్తాంతమును చెప్పి మఱలనిట్లు పలికెను. “శ్రీరామని కార్యము సఫలమైనది. సుగ్రీవుని యుత్సాహమును ఫలించినది. సీతాదేవి పాతివ్రత్యమును జూచి నా మనస్సు పరవశించినది. రాక్షస రాజైన రావణుడు గొప్ప తప స్సంపన్నుడు. తపస్సుచే వృద్ధి నందిన యాతడు లోకములనే భరింపజాలినవాడు. కోపించినచో లోకములనే తగులబెట్టగలడు. అంతటి తనస్సంపన్నుడగుట చేతనే సీతాదేవిని తాకినను అతని శరీరము దగ్ధము కాలేదు. (సీతను తాకిన రావణుడు తన తపోబలముచేతనే చెడిపోకుండ నుండెనేని సీతాదేవి పాతివ్రత్యముకంటెను రావణుని తపోబలమే గొప్పదని తెలియుచున్నది. అట్లైనచో రావణునకు రాగల భయమేమి యున్నదని వానరులు సందేహింపగా, ఇంగితము తెలిసిన హనుమంతుడది తెలిసికొన్నవాడై సీతకు కోపము రాకుండుట చేతనే రావణాసురుడు బ్రతికెను కాని వాని తపోబలము చేతగాదని చెప్పుచున్నాడు.) కావున ఇప్పుడు జాంబవంతుడు మొదలగు పెద్దల యనుజ్ఞను పొంది జరిగిన కార్యమంతయు మీకు చెప్పితిని. సేవకుని విజయమే యజమానుని విజయము గదా! ఇప్పుడు లంకకేగి సీతాదేవిని తీసికొని వచ్చి ఆమెతో గూడ రామలక్ష్మణు లను చూచుట యుక్తమని తోచుచున్నది. నేనొంటరిగనే నా బలముతో సర్వ రాక్షసులతో గూడిన లంకానగరమును జయించి మహాబలశాలియగు రావణుని సంహరింపగలను. అట్టిచో వీరులు బలవంతులు, ధీమంతులు, శస్త్రాస్త్ర

ప్రయోగములు తెలిసినవారలు, శూరులు, విజయమును కోరువారలు అగు మీతో కలిసి జయింపగలనని వేరుగా చెప్పవలెనా? నేను యుద్ధమున రావణుని అతని సైన్యమును, అనుచరులను, పుత్రులను, సోదరులను కూడ చంపెదను. యుద్ధమున నింద్రజిత్తు ప్రయోగించెడు బ్రహ్మాస్త్రము, ఇంద్రాస్త్రము, రౌద్రాస్త్రము, వాయవ్యాస్త్రము, వారుణాస్త్రము మున్నగు భయంకరములైన మహాస్త్రములను గూడ వ్యర్థము చేసి రాక్షసులను జంపెదను. మీరలు అనుమతించినచో నా పరాక్రమముతో ఆ రావణుని కూడ నాశనము చేయుదును. యుద్ధమున విడువ కుండగా నేను కురిపించు రాళ్లవాన దేవతలనే సంహరించునన్నచో రాక్షసుల విషయము వేరుగా చెప్పవలెనా? సముద్రమైనను చెలియలి కట్టను దాటవచ్చును. మందర పర్వతమైనను చలింపవచ్చును. కాని యుద్ధమున శత్రు సైన్యము జాంబవంతుని కంపింప జేయజాలవు. సకల రాక్షస సమూహములకు నాయకులగు వారినెల్లరను మట్టు పెట్టుటకొక్క వాలిసుతుడగు అంగదుడే చాలును. మహాత్ములైన పనసుని, నీలుని తొడల వేగముచే మందర పర్వతమే నశించుననగా యుద్ధమున రాక్షసుల విషయము వేరుగా చెప్పవలెనా? దేవతలలో, అసురులలో, యక్షులలో, గంధర్వులలో, ఉరగులలో ద్వివిదునితో తలపడు వీరుడున్నచో చెప్పుడు? మహాబలులగు మైంద ద్వివిదులశ్వినీ దేవతలకు పుట్టిన వానరశ్రేష్ఠులు. యుద్ధ రంగమున వీరలతో తలపడగల యోధులు నాకగపడలేదు. పూర్వము బ్రహ్మదేవు డశ్వినీ దేవతలకు సంతోషము కలిగించుటకై మైంద ద్వివిదుల కెవ్వరిచేతను చావు లేకుండునట్లు సాటిలేని వరమిచ్చెను. అట్లు బ్రహ్మచే పొందబడిన వరముచే మదించిన యీ మైంద ద్వివిదులు పెద్ద శత్రుసేనను చెండాడి దేవతల యమృతమును ద్రావిరి. వీరిద్దఱు కోపించిన మాత్రముననే గుఱ్ఱములు, ఏనుగులతో గూడిన లంకనెల్ల నాశనము చేయజాలుదురు. తక్కిన వానరుల మాట యట్లుంచుము. నేను లంకను పాడుచేసితిని. కాల్చి బూడిద చేసితిని. రాజ మార్గములందెల్ల నా పేరును

పెద్దగా చాటించినాను. మహాబలశాలియగు రామునకు జయము. మహా బలవంతుడగు లక్ష్మణునకు జయము. రామునిచే కాపాడబడుచున్న వానరరాజు సుగ్రీవునకు జయము. నేను కోసల దేశాధిపతియగు రాముని దాసుడను. వాయుపుత్రుడను. హనుమంతుడనని నా పేరంతటను ప్రకటించితిని.

**హనుమంతుడు సీతాదేవి స్థితిని వానరులకు జెప్పుట :**

ఇంకను పతివ్రతయగు సీతాదేవి దుర్మార్గుడగు రావణుని యశోకవన మధ్యమందు శింశుపా వృక్షము క్రింద దుఃఖము పొందియున్నది. ఆమెను రాక్షసులు చుట్టుముట్టియున్నారు. ఆమె శోకముతో మనస్తాపముతో పీడింప బడినదై మేఘ సమూహముచే గప్పబడిన చంద్రరేఖవలె కాంతి తొలగియున్నది. పతివ్రతయగు నామె గర్వితుడైన రావణుని తలంపనైన తలంపదు. రావణుని నిర్బంధమున నుండియు రామునే ధ్యానించుచున్నది. మంగళ రూపిణియగు సీత శచీదేవి దేవేంద్రుని యందువలె ఎల్లప్పుడును తన మనస్సున రాముని యందే యనురాగము గలదై రాముని యందు తప్ప వేరొకనియందు మనస్సు లగ్నము చేయకున్నది. సీతాదేవి ఒకే వస్త్రమును విడువక ధరించినది. అట్లే ఆమె శరీరము దుమ్ముచే మలినమై యున్నది. దుఃఖముచే పీడింపబడుచు ఆమె పతి హితమునే కోరుచున్నది. అశోకవనమునందు విరూపలగు రాక్షస స్త్రీల నడుమ నుండి వారిచే ఆమె మాటిమాటికి భయపెట్టబడుచుండగా చూచితిని. ఒకే జడ కట్టిన కేశములు గలదై దీనయై భర్తను గూర్చియే ధ్యానించుచు, నేల పైననే పండుకొనుచు, తేజోవిహీనమై, శిశిర ఋతువునందలి తామర తీగెవలెనున్నదై, రావణుని యందు విముఖతల గలదై మరణింప నిశ్చయించుకొనిన ఆ లేడిపిల్ల కనులవంటి కనులు గలిగిన సీతకెట్లో నా యందు విశ్వాసము కలిగించితిని. ఆపై ఆమెతో మాటలాడి విషయమంతయును దెలిపితిని. రామ సుగ్రీవుల మైత్రి విని ఆమె సంతోషించినది. సీతయొక్క

మంచి ప్రవర్తన మార్పులేక యున్నది. అట్లే ఆమె యనురాగము భర్త యందచంచలముగా నున్నది. అట్టి యామె పాపియగు రావణుని తన ప్రభావముతో చంపలేదన్నచో ఆతడు నిజముగా మహానుభావుడే గదా. (శాపము వలన అతనికి మృత్యువు విహితము కాలేదు గనుక) కావున రావణుని వధించుటకు రాముడు నిమిత్తమాత్రుడు కాగలడు. సీతకు చేసిన అపచారమే రావణుని వినాశమునకు మూలకారణము. సహజముగనే కృశాంగియగు సీత రామునెడబాసి మఱింత కృశించినదై పాడ్యమినాడు చదువు వాని విద్యవలె (పాడ్యమినాడు చదువగూడని వేదములను, శాస్త్రములను అధ్యయనము చేసినవాని విద్యవలె) కృశించుచున్నది. ఇట్లు సీతాదేవి సదా శోకించుచున్నది గాన నిప్పుడేది కర్తవ్యమో దాని నాచరింపుడు" అని హనుమ వానరులతో జెప్పెను.



# అఱువదవ సర్గము

## అంగదుడు సీతాదేవిని తోడ్కొని వచ్చుటకు సమ్మతించుట :

అట్లు చెప్పిన హనుమంతుని మాటలను విని వాలి తనయుడగు అంగదు డిట్లనెను. "ఓ వానరులారా! సీతాదేవిని దర్శించి యామెను తీసికొనిపోవకయే మహాత్ముడగు రాముని యొద్దకు వెళ్లుట యుక్తము కాదని తలంతును. ప్రసిద్ధమైన పరాక్రమముగల మీరందఱును రామునికడ సీతాదేవిని చూచితిమిగాని తీసికొని రాలేదని పలుకుట తగదని నాకు తోచుచున్నది. ఎగురుటలో గాని, పరాక్రమములోగాని దేవతలలోను, దైత్యులలోను ఎవ్వరును హనుమంతునకు సాటిరారు. అట్టి హనుమంతుడే లంకలోని రాక్షసవీరులను సంహరించును గాన మనకిక వేరు కర్తవ్యమేమున్నది? సీతాదేవిని తీసికొనియే రాముని సన్నిధికి పోవుదము". కర్తవ్యము చక్కగా నెఱిగిన వానర శ్రేష్ఠుడగు జాంబవంతుడు ఆ విధముగా సీతాదేవిని తీసికొనిపోయి రాముని చూడవలెనన్న యంగదునితో ప్రీతి పూర్వకముగా, నిట్లు పలికెను. "ఓ రాజపుత్రా! నీవు పల్కినదెంత మాత్రము చెడ్డది గాదు. అట్లది సమంజసమయ్యును, మనమెంత సమర్థులయ్యును, రామాజ్ఞ చొప్పుననే నడచుకొనవలెను గాని స్వతంత్రముగా కాదు. ఆ విధముగా కార్యసిద్ధి యగునట్లాచరింపు" మని పల్కెను.



# అఱువది యొకటవ సర్గము

## వానరులు కిష్కింధకు పోవుచు మధువనమును జూచుట :

అట్లు పలికిన జాంబవంతుని వాక్యములను విని అంగదుడు మొదలగు వీరులును, మహాకపియగు హనుమంతుడును, తక్కిన వానరులును, సరిసరియని యంగీకరించిరి. అప్పుడా వానర శ్రేష్ఠులందఱును హనుమంతుని ముందుంచు కొని మహేంద్ర పర్వతమును వీడి పైకెగసిరి. వారు మేరు పర్వతమువలెను, మందర పర్వతమువలెను, మహా శరీరము కలవారై మదించిన ఏనుగుల వలె ఆకాశమును గప్పివేయుచు మహాబలవంతులై, బుద్ధిమంతుడును, మహా బలశాలియు, మహా వేగము గలవాడును, సీతా దర్శనము చేసి వచ్చుటచే అందరిచే గౌరవింపబడుచున్నవాడును అగు హనుమంతుని తమ చూపులతో మోయుచున్నారో యనునట్లు ఆదరముతో చూచుచు, రాముని కార్యము సాధించి గొప్ప కీర్తిని సాధింపదలంచినవారై, తాము కృతార్థులగులచే తక్కిన దిక్కులకు పోయిన వానరులకంటె కార్య సాఫల్యముచే అధికులై, రామునకు ప్రియము తెలుపవలెనను ఉత్సాహముతో వెడలసాగిరి. రాక్షసులతో యుద్ధము చేయ గోరుచు రామునకు ప్రత్యుపకారము చేయ నిశ్చయించినవారై పొంగిపోవుచున్న మనస్సులు గలవారై ఆకాశమున నెగురుచు, దేవేంద్రుని నందనవనమునకు సాటియై చెట్లతో నిండిన యొక వనము కడకేగిరి. అది సుగ్రీవుని యాజ్ఞచే కాపాడబడుచు ఏ ప్రాణికైనను ప్రవేశింపరానిదై సకల ప్రాణులకు మనోహరమైన మధువనము. దానిని మహాత్ముడగు సుగ్రీవుని మేనమామయు, మహా పరాక్రమశాలియునగు దధిముఖుడను వానరుడు సదా రక్షించుచుండెను. ఆ వానరులు మధువనము కడకేగి వానర రాజగు సుగ్రీవున కానందము గలిగించు

ఆ వనమందలి మధువును ద్రావుట యందిచ్ఛగలవారైరి. అంత తేనెవలె పింగళవర్ణముగల వారైన వానరులు ఆ పెద్దదైన మధువనమునట్లు చూచి, తేనె త్రావుట కనుమతి నిమ్మని యంగదుని ప్రార్థించిరి. యువరాజగు అంగదుడు వృద్ధుడగు జాంబవంతుడు మొదలగువారియనుమతి వడసి వానరులను తేనెలు గ్రోలుట కనుమతించెను.

**వానరులు మధువనంబు ప్రవేశించుట :**

అంగదునిచే మధువు తావుట కనుమతింపబడినవారై తేనెలు త్రావుచు, ఆనందపరవశులై వానరులు నృత్యము చేయ దొడగిరి. ఆనందముతో కొందఱు పాడసాగిరి. కొందరు నృత్యము చేసిరి. కొందఱట్టహాస మొనర్చిరి. కొందరు వంగిరి. కొందఱు క్రింద పడిరి. కొందఱిటునటు తిరిగిరి. కొందఱరచిరి. వారిలో కొందఱితరుల నాశ్రయించిరి. కొందఱొకరినొకరు పట్టుకొనిరి. కొందఱొకరితో నొకరు మాటలాడుకొనిరి. కొందఱు పరస్పరము కలిసి విహరించిరి. కొందఱొక చెట్టు నుండి వేరొక చెట్టుపైకి పరువెత్తిరి. కొందఱు చెట్టుకొన కొమ్మలనెక్కి క్రిందకు దుమికిరి. కొందఱు గొప్ప వేగముతో క్రింద నుండి చెట్లచివఱల కెగిరిరి. ఒకడు పాడుచుండగా వేఱొకడు నవ్వుచు నతని యొద్దకు వెళ్లును. అట్లు నవ్వుచున్నవాని చెంతకు వేఱొకడు ఏడ్చుచు పోవును. అట్లేడ్చుచున్న వానిని వేఱొకడు త్రోయుచు చెంతచేరును. వేఱొకడరచుచు ఆ త్రోసినవాని చెంత కేగును. ఇట్లా వానరులెల్లరును మధువు నధికముగా త్రావుటచే మత్తెక్కినవారై విపరీత చేష్టలు చేయుచు గోల గోల చేయుచుండుటచే నా వానర సైన్యమంతయు వ్యాకులమై కనుపట్టెను. వారిలో మత్తెక్కనివాడుగాని, తేనెలుగ్రోలి తృప్తి చెందనివాడుగాని లేరయిరి. అప్పుడా వనపాలుడగు దధిముఖుడు వనమందలి తేనె అట్లు త్రాగబడుటయు, చెట్టు విరువబడుటయు, ఆకులు, పూవులు రాల్పబడుటయు చూచి కోపముతో వారి నడ్డుకొనెను.

**దధిముఖుడు కపులను వారించుట :**

వన రక్షకుడును, ఉగ్ర ప్రభావుడును, వానర వీరులలో వృద్ధుడును అగు దధిముఖుడట్లు వానరులను నివారించి వారు తన్ను లక్ష్యము చేయక బెదరింపగా, మఱల నా వనమును కాపాడుటకు యత్నించెను. కొందఱినతడు కఠినమైన మాటలతో వనమును విరువవలదని పలికెను. కొందఱినరచేత గొట్టెను. కొందటితో జగడమాడెను. కొందఱిని బుజ్జగించి వనమును పాడు చేయ వలదనెను. అప్పుడు మధుపానముచే మత్తెక్కిన వానరులా దధిముఖుని లెక్కచేయక, భయములేనివారై ఆతనిని చుట్టుముట్టి మాటలతో తిరస్కరించుచు ఇతడు వనరక్షకుడని, అతనినేమియు చేయరాదనియైన తలంపక అతని నిటునటు లాగి పీడించిరి. పిమ్మట వారాదధిముఖుని గోళ్లతో గీరుచు పండ్లతో కరచుచు చేతులతో కాళ్లతో మోదుచు ఆ మధువనమందలి సకల భక్ష్య పదార్థములను మిగులకుండ త్రాగి, తిని వేసిరి.



# అఱువది రెండవ సర్గము

## అంగద జాంబవంతుల ప్రాపున వానరులు మధువనమున ఇచ్చకొలది సంచరించుట :

అంత వానర శ్రేష్ఠుడగు హనుమంతుడు వానరుల కిట్లనెను. "ఓ వానరులారా! మీరే జంకును లేక తేనె త్రావుడు. అట్లు త్రాగుటలో మీ కడ్డువచ్చు వారిని నేను వారింతును. అనగా వానరులలో శ్రేష్ఠుడగు అంగదుడు, ఆ హనుమంతుని వాక్యమును విని ప్రసన్నచిత్తుడై యిట్లనెను. ఓ వానర వీరులారా! మీరు తేనె తావుడు. రామ కార్యము సాధించిన హనుమంతుడు చేయరాని కార్యము చేయుడని పలికినను దాని నాచరించవలెను. అట్టిచో ఈ వాక్యము విషయమున వేరుగా చెప్పవలెనా?" అని అంగదుని నోటినుండి వెడలిన యా మాటలను విని వానరులు ఆ మాటలను బాగు బాగని ప్రశంసించిరి. అట్లు వానర శ్రేష్ఠులందఱు నానందముతో అంగదుని కొనియాడి నదీ ప్రవాహ వేగము తీరమందలి చెట్లను పడ ద్రోయునట్లు మధువనమును పాడు చేయుటకు వెడలిరి. సమర్థులగు వానరులట్లు మధువనమున ప్రవేశించి అంగదుని యనుమతి చేతను, హనుమంతుడు సీతను చూచెనన్న యానందము చేతను, తమ బలముచే నా వనపాలుర నాక్రమించి తేనెలు త్రాగిరి. రుచిగల పండ్లను కోసికొని తినిరి. అట్లు మధువనమున విహరించు వందలకొలది వానరులు తమ పైకి వచ్చిన వన రక్షకుల పైబడి బాదిరి. వారు తూమెడు తేనె తుట్టల నొక్కొక్కడు చేత బట్టి యొక చోట చేరి తేనెను త్రాగసాగిరి. అట్లు త్రావగా మిగిలిన తుట్టెలను త్రుంచివేసిరి. తేనె వలె పింగళవర్ణము గల కొందఱు తేనె త్రాగి ఆ తేనె పట్టులను విసరసాగిరి. మఱికొందఱు తేనె త్రాగి మత్తెక్కి, త్రాగగా మిగిలిన తేనె తుట్టెలతో ఒకరినొకరు కొట్టుకొనిరి. మఱికొందఱధికముగా తేనె త్రావుటచే మదించిన వారై చెట్ల మొదట చేరి కొమ్మలను పట్టుకొని వానియాకులు నేలపై పరచి వానిపై పరుండిరి. వారు సంతోషముతో ఒకరినొకరెత్తి క్రింద పడవైచు

కొనిరి. కాళ్ళతో త్రోసికొనిరి. కొందఱుమత్తెక్కి సింహనాదములు చేసిరి. మఱికొందఱు సంతోషముతో పక్షులవలె అరచిరి. మఱికొందఱు నేల పైననే నిద్రించిరి. కొందఱు చేయరాని పనులు చేసి నవ్వసాగిరి. మఱికొందఱు వేరొక గ్రామ్యకర్మను చేయజొచ్చిరి. ఇంకకొందఱింకొక గ్రామ్యకృత్యము చేసి మేమిట్లు చేసితిమని చెప్పికొన సాగిరి. మధువనమును కాపాడుచున్న దధిముఖుని యాజ్ఞననుసరించువారు వానరులచే భయ పెట్టబడి పరుగెత్తిరి. ఇంకను కొందఱు మేమిట్లు సంకల్పించుకొంటిమని చెప్పసాగిరి. ఆ వనపాలకులు వానరుల కాళ్ళు పట్టి లాగగా వారలపాన ద్వారమును జూపగా మిక్కిలి దుఃఖముతో దధిముఖుని కడకేగి ఆ వృత్తాంతమునిట్లు తెలియజేసిరి. “హనుమంతు ననుమతి వడసి వానరులు మధువనమును పాడు చేసినారు. మోకాళ్ళుపట్టి మమ్ములాగి యపానద్వారము చూపించినారు.” అని వారలు చెప్పగా విని ఆ వరక్షకుడైన దదిముఖుడు మిక్కిలి కోపించి తన భటులైన వానరుల నోదార్చెను. అతడు వారితో ‘మీరలు నాతో రండు. మన మిప్పుడే వెళ్ళి బలముచే గర్వితులై తేనెలు గ్రోలుచున్న వానరులను మన బలగములతో నెదుర్కొందము అనెను. దధిముఖుని మాటలను వినిన వీరులగు నా వానర శ్రేష్ఠులు దధిముఖునితో గలిసి మఱల మధువనమున కేగిరి. దధిముఖుడును వేగముగా నొక చెట్టును పెరికి చేతబట్టుకొని ఆ వానరుల నడుమ నిలిచి తేనె త్రాగుచున్న వానరుల పైకి వెళ్ళెను. వాని భటులును అట్లే వెడలిరి. వారును దధిముఖుని వలెనే చెట్లను పర్వతములను చేత ధరించి కోపముతో వానర శ్రేష్ఠులున్న చోటునకు వెళ్ళిరి. ఆ మధువన పాలకులగు వానరులు తమ యజమాని యగు దధిముఖుడు చెప్పిన మాటలను మనసునందు నిల్పి కొని మద్ది, రావి మొదలగు చెట్లు, రాళ్ళు మున్నగునవి యాయుధములుగా గలవారై పరుగెత్తి చెట్లపై నేలపై బలగర్వితులై నిలిచి యున్న వానర వీరులతో తలపడ సాగిరి. అపుడు దధిముఖుడు కోపించుట చూచి హనుమంతుడు మొదలైన వానర శ్రేష్ఠులు వేగముగా అతని మీదకు వచ్చిరి.

**అంగదుడు దధిముఖుని దన్నుట :**

అంగదుడు కోపించి మహాభుజుడును, మహాబలవంతుడును వృక్షమును చేతబట్టి వచ్చి మీద బడుచున్నవాడును అగు తన తాతయగు దధిముఖుని చేతులతో చఱచెను. అంగదుడు మధుపానముచే మత్తుడై యితడు తన తాత యని తెలిసికొనడయ్యెను. కావుననే దధిముఖుని నేలపై బడవైచి భుజములతో పొడిచెను. అప్పుడు దధిముఖుడు చేతులు, తొడలు, మూపు నొప్పి కలుగగా వివశుడై యొక్క క్షణము మూర్ఛిల్లెను. శీఘ్రమే తెప్పరిల్లిన దధిముఖుడు కోపించిన వాడై, తేనె త్రావి మదించిన వానరుల నందరను దండము చేత బట్టి దూరముగా పారద్రోలెను. వానరశ్రేష్ఠుడగు దధిముఖుడా వానరులనుండి ఎట్లో తప్పించుకొని ఒక యేకాంత స్థలమున కేగ తనయొద్దకు వచ్చిన సేవకుల కిట్లనెను. “వీరలనిచ్చటనే యుండనిండు. మనమిప్పుడు మన రాజగు సుగ్రీవుని కడకు పోవుదము. రామునితో గలిసి యున్న సుగ్రీవుని యొద్దకు నేను వెళ్ళి యంగదుడు చేసిన యపకారము నంతయు దెలిపెదను. సహజముగా కోపము గలవాడగగు సుగ్రీవుడు నా మాట వినుట తోడనే వానరుల నందఱను చంపి వేయును. ఆ మధువనము మహాత్ముడగు సుగ్రీవున కిష్టమైనది గదా! ఆయనకు తండ్రి తాతల నుండి సంక్రమించినది, దివ్యమైనది. దేవతలకైనను ప్రవేశింప రానిది. ఆ సుగ్రీవుడు తేనె యందాసక్తులైనవారును, మృత్యువే స్వయముగా దగ్గర నున్న వారును అగు ఈ వానరుల కందఱకును, వారి మిత్రులందఱకును గూడ మరణదండన విధింపగలడు. రాజు నాజ్ఞ నెదిరించుచున్న యీ దురాత్ములు చంపదగినవారు. ఈ విధముగా మనకు కలిగిన సహింపరాని కోపము తీరగలదు.” మహా బలవంతుడగు దధిముఖుడు తన యనుచరులతో నిట్లు పల్కి వారితో గలిసి వెంటనే యాకాశమున కెగిరి యొక్క నిమిషములో సూర్యపుత్రుడగు సుగ్రీవుని చెంతకేగెను. రాముని, లక్ష్మణుని, సుగ్రీవుని చూచి ఆకాశము నుండి సమముగా నున్న భూమిమీదకు దిగెను. వనపాలుర కధిపతియు, మహా బలశాలియునగు ఆ దధిముఖుడట్లు సేవకులచే చుట్టబడిన వాడై సుగ్రీవుని కడ నేలకు దిగి దీన వదనుడై శిరము వంచి సుగ్రీవుని పాదముల చెంత ప్రణమిల్లెను.

# అఱువది మూడవ సర్గము

**దధిముఖుడును వనపాలకులును సుగ్రీవునితో కపుల చేష్టలు చెప్పుట :**

అందుకు వానర శ్రేష్ఠుడగు సుగ్రీవుడట్లు తన పాదముల పైబడి నమస్కరించుచున్న దధిముఖుని చూచుటతోడనే కలత నంది యిట్లనెను. 'వీరుడవగు ఓ దధిముఖుడా! నీ వేల నా పాదములపై బడితివి? లే లెమ్ము. నీ కభయ మిచ్చుచున్నాను. అసలు సంగతి యేమో పూర్తిగా తెలుపుము.' అని యిట్లు సుగ్రీవునిచే ఆశ్వాసింపబడిన వాడై మహాబుద్ధి శాలియగు దధిముఖుడు లేచి నిలబడి యిట్లు పలికెను.' రాజా! నీ తండ్రియగు ఋక్షరజసుని కాలమున గాని నీ పాలనలో గాని మధువన మింత వరకెప్పుడును పాడు చేయబడలేదు. దాని నిప్పుడు వానరులు పాడుచేసినారు. మధువన పాలకులగు. నా సేవకు లందరును వారిని నివారింపగా లక్ష్య పెట్టక వారు ఫలములను తినుచు మధువును త్రాగుచున్నారు. అట్లు త్రాగవలదని బెదరింపగా కనుబొమ్మలను చూపుచున్నారు. ఈ వన రక్షకులు పట్టుదలతో వారిని తేనె త్రాగవలదని నివారింపగా వారిని వీరు బెదరించిరి. ఓ వానర శ్రేష్ఠుడవగు సుగ్రీవుడా! పిమ్మట అనే కులగు వానర వీరులు కోపముతో కన్ను లెఱ చేయుచు నీ వనపాలురను తరిమివేసిరి. వీరలలో కొందఱిని చేతులతోను, కొందఱిని మోకాళ్ళతోను కొట్టి, కొందఱి నిటునటులాగి, కొందఱిని తల క్రిందులు చేసి అపాన ద్వారమును చూపించిరి. నీవు మాకు రాజువై యుండగా ఈ శూరులను వారు కొట్టినారు. స్వేచ్ఛగా మధువనమంతయు విరుగ గొట్టుచున్నారు.' అని దధిముఖుడు వానర శ్రేష్ఠుడగు సుగ్రీవునకు విన్నవించుచుండగా శత్రువీరులను

సంహరించువాడును, మహా బుద్ధిశాలియునగు లక్ష్మణుడు అతని కిట్లనెను. సుగ్రీవుడు లక్ష్మణునకు హనుమదాదులు మధువనమున..

**విహరించుటను దెల్పుట :**

"ఓ రాజా! మధువన పాలకుడగు నీ వానరుడు నీ యొద్ద కేల వచ్చినాడు? ఏ కార్యమును గోరి దుఃఖితుడై యిటుమాటలాడి నాడు?" మాటలాడుటలో నేర్పరియగు సుగ్రీవుడతని కిట్లనెను. 'పూజ్యుడవగు ఓ లక్ష్మణా! సీతను వెదకుటకై దక్షిణ దిక్కునకు వెళ్ళిన వానరశ్రేష్ఠులు తిరిగి వచ్చిరనియు, అంగదుడు మున్నగు నా వానర వీరులందఱు మధు వనమునందలి మధువును భక్షించిరనియు వీరుడగు ఈ దధిముఖుడు చెప్పుచున్నాడు. వారట్లు వచ్చి మధువనమును పాడు చేసినారు. అందలి మధువును ఫలములను భక్షించినారు. వారలు కార్యము సాధింపనిచో నిట్టి యుత్సాహ కృత్యములు చేయరు. వారు నా యాజ్ఞ లేదని భయపడకయే మధువనమును ప్రవేశించుటచే వానరులు కార్యమును సాధించుట స్పష్టమగు చున్నది. వేఱొక్కడు గాక హనుమంతుడే సీతాదేవిని చూచినాడు. ఇందు సందేహము లేదు. ఈ కార్యమును సాధించుటలో హనుమంతుడు కాక వేరెవ్వరు కారణము కాజాలరు. వానర శ్రేష్ఠుడగు హనుమంతుని యందు కార్యసిద్ధి తెలివితేటలు పట్టుదల, పరాక్రమము, విద్య అన్నియు నెలకొని యున్నవి. ఏ పనిలో జాంబవంతుడు, మహాబలవంతుడగు అంగదుడు నాయకులుగా నుందురో, ఏ పనియందు హనుమంతుడు తోడుగా నుండునో ఆపని నెరవేరక నూనదు. వేరు విధముగాకానేరదు. వీరులగు అంగదుడు మొదలగు వారు మధువనమును పాడు చేసిరి. వారిని వనపాలకులు కలిసి కట్టుగా వారించి, వారి చేదెబ్బలు తినినారు, ఆ విషయము నాకు తెలుపుటకే మధురముగా మాటలాడ గలవాడును, ప్రసిద్ధమగు పరాక్రమము గలవాడును అగు ఈ దధిముఖుడు వచ్చినాడు. ఓ మహాభుజుడగు లక్ష్మణా!

సీతాదేవిని వీరు చూచినారు. వీరందఱును తోటలో ప్రవేశించి తేనెలు త్రాగు చుండిరి కదా! వారి ప్రవర్తనచే నీవును దీని నూహింపదగును. ఓ పురుష శ్రేష్ఠుడా! సీతాదేవిని చూడకయే ప్రఖ్యాతి గలిగిన యీ వానరులు నా తండ్రియగు ఋక్షరజసునకు బ్రహ్మ దేవునిచే నీయబడిన యీ దివ్యమగు మధువనమును వీరు ప్రవేశింపరు." ఆ మాటలను విని రాముడును, లక్ష్మణుడును సంతసించిరి. సుగ్రీవుని నోట వెలువడిన వీనుల విందు చేయు నీ వాక్యములను విని రామలక్ష్మణులు మిక్కిలి హర్షమునందిరి.

**సుగ్రీవుడు కపులకు త్వరగా రమ్మని వార్త నంపుట :**

సుగ్రీవుడును వనరక్షకుడగు దధిముఖుని మాటలకు ప్రీతినొందిన వాడై అతనితో నిట్లు పల్కెను. 'కార్యము సాధించుకొని వచ్చిన ఆ యంగదాది వానరులు మధువనమున తేనె మున్నగువానిని భక్షించుట విని ప్రీతినొందిన వాడనైతిని. కార్యము సాధించిన వారి చిలిపి చేష్టలు క్షమియింపదగి యుండుటచే నేను వారిని క్షమించితిని, నేనును రామలక్ష్మణులును సింహములవలె గర్వము గల వారగు హనుమంతుడు మొదలగు వానరులను చూడవలెననియు, సీతాదేవిని వెదకుటలో వారి ప్రయత్నమును గూర్చి వినవలెననియు కోరు చున్నాము.' కార్యసిద్ధియైనదని సంతోషముతో పులకిత గాత్రులై వికసించిన నేత్రములుగల రామలక్ష్మణులను జూచి వానర రాజగు సుగ్రీవుడును సంతోషమునంది కార్యసిద్ధి హస్తగతమైనదని యెఱిగి మిక్కిలి యానందించెను.



# అఱువది నాలుగవ సర్గము

## అంగదాదులు సుగ్రీవుని కడకు వచ్చుట :

సుగ్రీవుడట్లు చెప్పగా దధిముఖుడు సంతోషించినవాడై రామలక్ష్మణులకు సుగ్రీవునకు ప్రణమిల్లి తనయనుచరులగు వానరులతో గూడి యాకాశమున కెగిరెను. అతడెంత వేగముగా సుగ్రీవుని యొద్దకు వెళ్ళెనో అట్లే వేగముగా వెళ్ళి ఆకాశమునుండి భూమిపై దిగి యామధువనమున ప్రవేశించెను. అచ్చట నున్న వానర శ్రేష్ఠులప్పటికి తాము త్రాగిన తేనె జీర్ణమై మూత్ర రూపమున పోగా మత్తువదలి లేచి నిలబడిరి. వీరుడగు దధిముఖుడు చేతులు జోడించి ఆ వానరుల కడ కేగి, అంగదుని చూచి సంతోషముతో నిట్లనెను. 'ఓ సౌమ్యుడా! మేము మిమ్ములను వారించితిమని కోపింపకుము. అజ్ఞానులమగుటచే నీ వన పాలకులును, నేనును మిమ్ము వారించినారము. ఓ మహాబలుడా! నీవు యువరాజువు కాన ఈ మధువనమునకు నీ వధిపతివి. మేము మూరు?లమై నీ యెడల ఆచరించిన అపచారమును క్షమింపుము. ఓ గొప్పవాడా! నేను నీ పినతండ్రి కడకేగి హనుమదాదులగు వానరులందఱు మధువనమునకు వచ్చియున్నారని విన్నవించితిని. ఆయన నీవు తక్కిన వానర శ్రేష్ఠులతో ఇచ్చుటికి వచ్చుటను, వనము పాడు చేయుటను విని సంతోషించెనేగాని కోపింపలేదు. వానర రాజగు నీపినతండ్రి సుగ్రీవుడు అట్లు సంతోషించిన వాడై, వానరు లందఱిని తన యొద్దకు పంపించుమని చెప్పెను.' అని దధిముఖుడు మధురముగా పల్కిన మాటలను విని మాటనేర్పరి యగు అంగదుడు వానర శ్రేష్ఠులతో నిట్లనెను. 'ఓ వానర యూథపతులారా! రాముడీ వృత్తాంతమును

వినెనని యూహించుచున్నాను. కాన శత్రువులను తపింపజేయు ఓ వానరులారా! మనము కార్యము సాధించియు నిచ్చట నుండదగదు. వానరులెల్లరు మధువు గ్రోలి విశ్రమించినారు. కాన పినతండ్రియగు సుగ్రీవుని కడకు పోవుటే మిగిలి యున్నది. ఓ వానర యూథపతులారా! మీరందఱు గలిసి యెట్లు నిర్ణయించిన అట్లు చేయుదము. కర్తవ్య విషయమున నేను మీ కార్యము సాధించి వచ్చిన మిమ్ము నేననాదరము చేయుట తగదు.' అని యిట్లు అంగదుడు పల్కిన ఉత్తమమైన మాటలను విని యా వానరులు సంతుష్టి నందిన వారై యిట్లనిరి. 'వానర శ్రేష్ఠుడవైన యువరాజా! ప్రభువైన వాడెవడిట్లు మాటలాడును? అధికారమదముచే మత్తిల్లి ప్రతివాడు నహంకారి యగుట సాధారణమైనది. మేమందఱమును వానరవీరుల కధిపతియగు సుగ్రీవుని యొద్దకు వెళ్ళ నవకాశమునకై ఎదురుచూచుచున్నాము. ఓ వానర శ్రేష్ఠుడా! అట్లు నిరీక్షించు వారమైనను వానరుల మందఱమును నీ యాజ్ఞలేక ఒక్క యడుగైనను ముందుకు పోవుట కశక్తులము సుమా! మేము సత్యమునే చెప్పుచున్నాము.' అని వానరులు చెప్పగా అంగదుడును 'అట్లే పోవుదము' అని వారలకు చెప్పెను. అప్పుడు వానరులందఱును ఆకాశమున కెగిరిరి. వారిననుసరించి తక్కిన యూథపతు లందఱును యంత్రములచే పైకెగుర గొట్టబడిన కొండవలె నెగిరి ఆకాశమున నేమాత్రమును చోటు విడుక ఆక్రమించి పోసాగిరి. వేగము గల వారందఱును శీఘ్రమే ఆకాశమున కెగిరి గాలిచే గొట్టబడిన మేఘముల వలె పెద్ద ధ్వని చేయుచు పో సాగిరి. అంగదాదు లెంత సేపటికిని రాకుండటచే శోకపీడితుడైన కమలముల వంటి కన్నులుగల రామునకు వానర రాజగు సుగ్రీవుడిట్లనెను.

**సుగ్రీవుడు రామునకు ధైర్యపు మాటలు చెప్పుట :**

'రామా! నీవొకింత యూరడిల్లుము. సీతాదేవి కనబడినది. ఇందు సందేహము లేదు. ఇట్లు కార్యము సాధింపక యాలస్యముగా వానరులిచ్చటికి

వచ్చుట శక్యము గాదు సుమా! వానరులలో శ్రేష్ఠుడును మహాభుజుడును, యువరాజును అగు అంగదుడు తన కార్యము చెడినచో నా కడకు రానే రాడు. అట్లుకాక కార్యము సాధింపకయే యతడొక వేళ మఱచి వచ్చినచో ఇట్లు వనభంగాది కార్యములు చేయడు. దీనమగు ముఖముతో మనస్సున కలవరము గలవాడై యుండును. సీతా దేవిని చూడక సంతోషము లేనివాడై ఉన్నచో యువరాజగు అంగదుడు మా తండ్రి తాతల నుండి సంక్రమించినది అగు మధువనమును పాడుచేయడు. రామా! కౌసల్య సత్సంతానవతి. (సీతాదేవి యునికి తెలియజేయుటచే నీ ప్రాణములు నిలిచినవి. దీని చేతనే కౌసల్య సత్సంతాన వతియునుట) ఓయీ! చక్కని యాచరణము కలవాడా! నీవూర డిల్లుము. సీతాదేవిని హనుమంతుడు దర్శించినాడు. ఇందు సందేహము లేదు. సీతను దర్శించుటయను కార్యమును సాధించుటలో హనుమంతుడు తక్క వేరొకడు సమర్థుడు కాజాలడు. ఓ బుద్ధిశాలీ! సూర్యునియందు తేజస్సువలె హనుమంతుని యందు సిద్ధి, మతి, పట్టుదల పరాక్రమము నున్నవనుటలో సందేహము లేదు. జాంబవంతుడు నాయకుడుగా, అంగదుడు సేనాపతిగా, హనుమంతుడు సహాయకుడుగా నేపని చేయబడునో యది సిద్ధింపక మానదు. కావున ఓ అపరిమిత పరాక్రమ శాలీ! రామా! నీవిప్పుడు చింతా క్రాంతుడవు కావలదు.'

**హనుమంతుడు రామునకు సీతాదేవి స్థితిని దెలుపుట :**

అంతట హనుమంతుని సీతాదర్శన కార్యముచే గర్వించిన వారును, పెద్దగా అరచుచున్న వారును, కిష్కింధకు వచ్చుచున్న వారును అగు వానరుల యొక్క కలకల ధ్వని కార్యసిద్ధిని చెప్పుచున్నదో యనునట్లాకాశమున సమీపముననే విననయ్యెను. వానరుల యానాదమును వినినవాడై సుగ్రీవుడు తన తోకను పెంచుకొని మాలవలె తలపై నిలిపికొనినవాడై సంతోషించెను. వానరులు

రాముని చూడవలె ననెడు కోరికతో అంగదుని హనుమంతుని ముందుంచుకొని వచ్చిరి. అట్లాయంగదుడు మొదలగు వీరులు పులకించిన శరీరములు గలవారై ఆనందముతో నిండిన మనస్సు గలవారై రామసుగ్రీవుల చెంత దిగిరి. అంతలో మహాభుజుడగు హనుమంతుడు రామునకు శిరము వంచి నమస్కరించి "సీతాదేవి శీలవంతురాలై ప్రాణముతో నిలిచి యున్న"దని విన్నవింపగా (సీత ప్రాణములతో నుండియు శీలము చెడియుండెనేని చచ్చినదానితో సమానము. కావున మొదట నియతః శీలవంతురాలు అని హనుమంతుడు చెప్పెను. మొదట దేవియను పదమును చెప్పినచో సీత భ్రష్టురాలయ్యెనని చెప్పుతో మరణించెనని చెప్పుతో యని శ్రీరాముడంతలో పరితపించునని ముందు నియత, ప్రాణ యుక్తయని చెప్పి తరువాత దేవియని చెప్పెను). సుగ్రీవుడు హనుమంతుడు కార్యము సాధించి వచ్చెనని తలంచెను. లక్ష్మణుడు హనుమంతుని గాంచి సంతోషించిన వాడై ఆదరముతో జూచెను. అప్పుడు శత్రువీరులను సంహరించు వాడగు రాముడు మిక్కిలి యాదరముతో హనుమంతుని గాంచెను.



# అఱువది యైదవ సర్గము

**అ**ప్పుడా వానరులందఱును, అంగదుని ముందిడుకొని చిత్రములైన అడవులుగల ప్రస్రవణగిరి యందు రామలక్ష్మణులకు సుగ్రీవునకు నమస్కరించి సీతావృత్తాంతమును చెప్ప నారంభించిరి. ఆ వానరులందఱు రాముని కడకేగి సీతాదేవి రావణుని యంతఃపురమున నిర్బందింపబడి యుండుటను, రాక్షస స్త్రీ లామెను భయ పెట్టు చుండుటను, రాముని యందామెయను రాగమును, రావణుడు పెట్టిన రెండు మాసముల గడువును, రామునకు చెప్పసాగిరి. సీతాదేవి కుశలముగా నున్నదనివిని రాముడిట్లు పలికెను. 'ఓ వానరులారా! సీతాదేవి యెచ్చటనున్నది? నాయందామె యెట్టి యభిప్రాయము కలిగి యున్నది? సీతకు సంబంధించిన విషయము నంతయు నాకు దెల్పుడు'. అట్లు రాముడు పల్కిన వాక్యములు విని యా వానరులు రామునికడ సీతావృత్తాంతమును తెలిసిన హనుమంతుని సమాధానమిమ్మని ప్రోత్సహించిరి. మాటల నేర్పుగలిగిన వాయుపుత్రుడగు హనుమంతుడు వానరుల మాటలను విని దక్షిణ దిక్కునకు తిరిగి సీతాదేవికి నమస్కరించి సీతాదర్శనమెట్లయ్యెనో యీ విధముగా తెలియ జెప్పెను. (హనుమంతుడు సీతను చూడకముందు శ్రీ రాముడు ఋష్యమూకము నందు పడుచున్న విరహతాపమును చూచి 'యింతటి వాడుకూడ నొక స్త్రీకై యేడ్చుచున్నాడే! యీయన జితేంద్రి యత్వమిదియేనా?' యని తలంచుచుండెను. సీతను జూచిన పిమ్మట ఆమెను దేవతగా భావించుటయే గాక 'శ్రీరాముడు రావణుని చంపుటయందు నిమిత్త మాత్రుడేయనియు నామె మహిమ చేతనే లంకయంతయు ముందే దగ్ధమైనద'నియు తలంచిన వాడాయెను. ఆకారణముచే శ్రీరాముని యందుకంటె సీతయందు హనుమంతున కెక్కువ భయభక్తులు కలవు)

**హనుమంతుడు సీత లంక యందున్నదని రామునకు జెప్పుట :**

హనుమంతుడు 'రామచంద్రా! నేను నూఱు యోజనముల పొడవు గల సముద్రమును దాటి సీతాదేవిని వెదకుచు ఆమెను చూడ వలెనను కోరికతో పోయితిని. అచ్చట సముద్రమున కావల దక్షిణ తీరమున దురాత్ముడగు రావణుని లంకానగరమున్నది. రామా! అచ్చట రావణుని యంతఃపురమునందు సీతాదేవి తన యభిలాషను నీయందే నిల్పుకొని యున్నదై జీవించుటను చూచితిని. ఆమె రావణుని ప్రమదావనమున వికృతాకారములు గల రాక్షస స్త్రీలచే కాపాడబడుచు, వారిచే మాటిమాటికి భయ పెట్టబడుచు వారి నడుమ నుండగా జూచితిని. పతివ్రత యగు నామె దుఃఖము లనుభవింపదగినది కాదు. సుఖముల ననుభవింప దగినట్టిది. కాని ఆమె దుఃఖము ననుభవించు చున్నది. ఒంటి జడ గలదై దీనురాలై నిన్నే తలంచుచు రావణునంతఃపురమున నిరోధింపబడి యున్నది. ఆమెకు రాక్షస స్త్రీలు కావలియున్నారు. ఆమె నేలపైననే శయనించు చున్నది. హేమంత ఋతువునందు తామర తీగవలె ఆమె శరీరము కాంతి తరిగియున్నది. ఆమె రావణుని యందు వైముఖ్యము గలిగి మరణింప నిశ్చయించి యున్నది. నీ యందే మనసు నిల్పుకొన్న యామె నెట్లో వెదుక గలిగితిని. అనఘుడవగు రామా! నే నిక్ష్వాకువంశపు కీర్తిని ప్రస్తుతించుచు ఆమెకు నా పై విశ్వాసము కలిగించితిని. ఆ పైన ఆమె నాతో మాటలాడినది. ఆమెకు నీ పరిస్థితిని సాంతముగా దెలిపితిని. రామ సుగ్రీవుల మైత్రిని విని ఆమె సంతసించినది. సీతాదేవి యొక్క నడవడి (పరపురుషుని తలంపకుండుట మొదలైనవి) నీ యందలి భక్తి చెక్కు చెదరక యట్లే యున్నవి.

**హనుమంతుడు రామునితో సీత వాక్యములు చెప్పుట :**

ఓ పురుష శ్రేష్ఠుడా! ఈ విధముగా మహాభాగ్యవతియు జనకరాజ పుత్రియునగు సీత నీ యందు భక్తి కలదై నిరాహార రూపమగు భయంకర తపము నాచరించుచున్నది. రాఘవా! చిత్రకూటమున నీవు చెంతనుండగనే

కాకి విషయమున నెట్లు జరిగినదో దానిని గుర్తుగా చెప్పినది. ఓ వాయుపుత్రా! పురుష శ్రేష్ఠుడగు రామునకు నీ విచ్చట రావణుని రాక మున్నగునవి యేమేమి చూచితివో దానిని పూర్తిగా విజ్ఞాపనము చేయుము అని సీత నాతో చెప్పినది (నేను కన్నులార చూచి చెప్పు చున్నాను గాని యితరులు చెప్పిన ముచ్చటలను చెప్పుట లేదు) నేను ప్రయత్నముతో రక్షించుకొన్న యీ చూడామణిని రామునకిచ్చి నీవు నా వచనములు సుగ్రీవుడు వినుచుండగా చెప్పుము. శ్రీమంతమగు నీ చూడామణిని నేనెంతో శ్రద్ధగా కాపాడితిని. పూర్వము నీ వొకప్పుడు నా నుదుటి బొట్టు చెమటకు కరిగి కనబడకుండటచే మణిశిలను నానుదిటి బొట్టుగా ప్రతిఫలించునట్లుగా ఎదుటనున్న గుంఢ్రాతిపై దాని నుంచినావు. ఆ విషయమును దలంపుము. పాపరహితుడవగు ఓ రామచంద్రా! సముద్రమున బుట్టిన యీ శ్రీమంతమగు చూడామణిని నీకై బంపితిని. నేనిప్పటి వరకు దుఃఖ సమయములందు దీనిని జూచుకొని నిన్ను చూచినంతగా సంతోషించు చుంటిని. దశరథ తనయుడవగు ఓ రామా! నేనింకొక్క మాసము జీవింతును. ఆ పైన ఈ రాక్షసులకు వశమై జీవింపను. అని ఈ విధముగా కృశించినదియు, ధర్మచారిణియు, మిక్కిలి భయముచే చంచలములైన లేడికన్ను వంటి కన్నులు గలదియు అగు సీత రావణుని యంతః పురమున నిరోధింపబడియున్నదైనాతో పల్కినది. రామా! నేనీ విషయము నున్నదున్నట్లుగా తెలిపితిని. నీ విటుపై సముద్రమును దాటు నుపాయము నాలోచింపుము." అని చెప్పి వాయుపుత్రుడగు హనుమంతుడు రాజపుత్రులగు రామలక్ష్మణులు తన మాటలచే నూరడిల్లుట నెరింగి సీతాదేవి యొసగిన చూడామణిని రామునకిచ్చి ఆమె చెప్పిన దంతయు సక్రమముగా రాముని కెరింగించెను. (తన్ను తాను పొగడుకొనునట్లుండు ననియు, కార్యము తెలుపుట కది యనావశ్యకమనియు, రామునకు కావలసినది సీతావృత్తాంతమేగాన హనుమ తానుపడిన కష్టము, చేసిన కార్యము నొక్కటేనియు చెప్పినవాడు కాడు.)

# అఱువది యాఱవ సర్గము

## రాముడు సీతాదేవి చూడామణిని జూచి దుఃఖించుట :

హనుమంతుడిట్లు పలుకగా దశరథ తనయుడగు రాముడు లక్ష్మణునితో గూడినవాడై ఆ చూడామణిని హృదయమునకు హత్తుకొని మిక్కిలి విచారించెను. రాముడా శ్రేష్ఠమైన మణిని జూచి, శోకపీడితుడై కనులనీరు నిండగా సుగ్రీవున కిట్లనెను. "తన బిడ్డపై వాత్సల్యముగల ఆవు లేగను చూడగనే యెట్లు క్షీరములను స్రవించునో అట్లే చూడామణిని చూడగనే నా హృదయముకూడ ద్రవించుచున్నది. మామామ యగు జనక మహారాజు ఈ మణి రత్నమును వివాహకాలమున సీతకిచ్చెను. దాని నామె శిరమున ప్రకాశించు నట్లలంకరించు కొనెను. ఈ మణి సముద్రమునందు పుట్టినది. సజ్జనులచే నిది పూజింపబడినది. జనకుడు చేసిన యజ్ఞమునకు సంతోషించిన ధీమంతుడగు దేవేంద్రు డాయన కిచ్చినాడు. సౌమ్యుడవగు నోహనుమంతుడా! శ్రేష్ఠమగు ఈ మణిని జూచి నా తండ్రి దశరథుని, నామామయగు విదేహరాజును కూడ చూచినట్లైనది. (వీరిరువురు సీతాదేవి తలపై చూడామణి నలంకరింపజేసిన వారగుటచేత) ఈ మణి నా ప్రియురాలైన సీత తలపై శోభిల్లునది. నేనీ మణిని చూచుటచే ఆమెను సంపాదించినట్లనిపించినది. సౌమ్యుడా! విదేహ రాజపుత్రియగు సీత దప్పిక గొన్న వానికి నీటితో తృప్తినందించినట్లు నన్నుద్దేశించి యేమేమి మాటలు పలికెనో మాటి మాటికి తెలుపుము. లక్ష్మణా! సముద్రమున బుట్టిన యీ మణిని చూడగలిగితిని గాని సీతాదేవి వచ్చుటను చూడజాలనైతిని. ఇంతకంటె మిక్కిలి దుఃఖము కలిగించున దేమున్నది? ఇటు పై సీత ఒక్కమాసము జీవించి యున్న ఆమె బహుకాలము జీవించినట్లే. నేను మాత్రము నల్లని కన్నులు గల యా

సీత లేకుండగా ఇంక నొక్క క్షణమైనను జీవింపనిష్టపడను. నా ప్రియురాలగు సీత నెచ్చట చూచితివో హనుమంతా! నన్ను కూడ అచ్చటికి తీసికొని పొమ్ము. ఆమె వార్త తెలిసినది. కనుక యింకనొక క్షణమైనను నిలువ జాలను. అందమైన పిరుదులు గల నాసీత సదా మిక్కిలి బెదరుచున్నదై భయము కలిగించునట్టి రాక్షసులనడుమ నెట్లుండ గలుగుచున్నది? నిర్మలమైన వెన్నెలలు చిందు శరదృతువునందు మేఘములచే ఆవరింపబడిన చంద్రుని వలె రాక్షస స్త్రీలచే చుట్టముట్టబడిన సీత ముఖము ప్రకాశింపకున్నదేమోగదా. హనుమంతా! సీత యేమని చెప్పెనో యధాతథముగా నాకు దెల్పుము. ఔషధము సేవించిన రోగివలె దీనిచే నేను జీవింతును. హనుమంతుడా! సౌందర్యవతియు, మధురముగా మాటలాడునదియు, చక్కని నడుముగలది యునగు నాప్రియురాలైన సీత నన్నెడబాసి యుండి యేమనెనో నాకు చెప్పు"మని రాముడు హనుమంతునితో పలికెను.



# అఱువది యేడవ సర్గము

**హనుమంతుడు కాకాసుర వృత్తాంతము నానవాలుగా చెప్పుట :**

మహాత్ముడగు రాముడట్లడుగగా హనుమంతుడు సీత చెప్పిన దంతయు రామునకు విన్నవించెను. "పురుష శ్రేష్ఠుడవగు ఓ రామా! సీతాదేవి చిత్ర కూటమున పూర్వము జరిగిన యీ గుర్తును జరిగినది జరిగినట్లుగా చెప్పినది. సీతదేవి చిత్రకూట పర్వతమున నీ చెంతనే సుఖముగా నిద్రించి ముందుగా మేలుకొనినది. అప్పుడొక కాకి యకస్మాత్తుగా వచ్చి యామె స్తనములపై గీరినది. రామా! తరువాత నీవు సీత యొడిలో తలనుంచుకొని నిద్రించితివట. మఱల ఆకాకి వచ్చి సీతాదేవి నట్లే బాధించినది. ఆ కాకి మాటిమాటికి వచ్చి సీత స్తన ప్రదేశమున పొడిచెను. అపుడు సీత కచ్చుట గాయమై రక్తము కారగా దానిచే నీ శరీరము తడిసి నీవు నిద్రనుండి లేచితివి. శత్రువుల నెదిరించు రామా! సుఖముగా నిద్రించుచున్న నిన్ను కాకిచే విడువక బాధింపబడుచున్న సీత మేల్కొల్పినది. స్తనముల యొద్ద గాయము చేయబడిన యామెను జూచి నీవు కోపించిన సర్పము వలె బుసలు కొట్టుచు నిట్లంటివి. పిరికి దానా! నీ స్తనములపై నెవరు గోళ్ళచే గీకినారు. కోపగించిన ఐదు తలల పాముతో చెలగాట మాడు వారెవ్వరు? అని నీవు నాలుగు వైపుల చూచుచు వాడియై రక్తముతో తడిసిన గోళ్ళతో ఆమె కెదురుగా నిలిచి యున్నకాకిని చూచితివి. నీవట్లు చూచినంతనే ఆకాకి రూపమున నున్న యింద్ర పుత్రుడు వాయు వేగముతో పర్వతమునుండి దిగి పారిపోజొచ్చెను. మహాభుజుడవు బుద్ధిశాలివి యగు నోరామా! నీవప్పుడు కోపముతో కన్నులు పెద్దవి చేసి ఆకాకిపై ఆగ్రహము చెంది దయ లేనివాడవై వెంటనే దర్భాసనము నుండి యొక దర్భను దీసి బ్రహ్మాస్త్రముతో నభిమం

త్రించితివి. అది మండుచు ప్రళయాగ్నివలె ఆకాకి కెదురై ప్రజ్వలించెను. నీ వా మండుచున్న దర్భను కాకిపై విరితివి. అప్పుడది యా కాకిని వెంటాడెను. వానిని కాపాడజాలక వాని తండ్రియగు నింద్రుడు వానిని విడచివైచెను. దేవతలు, మహర్షులు, వానిని రక్షింపజాలక విడచిరి. అట్లది మూడులోకములు తిరిగియు రక్షించువారిని గానక ఓ శత్రువులను పీడించువాడా! భయపడి తిరిగి నీ యొద్దకే వచ్చినది. ఓ కాకుత్థుడా! అట్లు వచ్చి శరణుగోరి నేలపైబడి యున్న ఆ కాకి చంపదగిన దైనను నీవు దయతో కాపాడితివి. నీ వంతట 'నేను విడచిన యస్త్రము వృథాయగుట జరుగద'ని ఆకాకి కుడికంటిని బ్రహ్మాస్త్రముచే హింసించితివి. రామా! అప్పుడాకాకి నీకును, నీ తండ్రియగు దశరథ మహారాజునకును నమ్కరించి నీచే విడువ బడినదై తన నివామున కేగినది. ఆవిధముగా అస్త్రముల నెటిగిన వారిలో శ్రేష్ఠుడును, బలవంతుడును, శీలవంతుడును అయి యుండియు రాముడు రాక్షసులపై అస్త్రముల నేల ప్రయోగింపకున్నాడు? నాగులుగాని, గంధర్వులు గాని, యసురులు గాని, దేవతల సమూహములు గాని యుద్ధమందు రాముని యెదుట నిలువ గల సమర్థులు గారు. పరాక్రమ శాలియగు ఆయన నన్ను కాపాడవలెనను తొందర కలవాడేని వెంటనే వాడియైన బాణములను ప్రయోగించి రావణుని సంహరింప వలెను. లేదా శత్రువులను తపింపజేయు వాడును, నరులలో శ్రేష్ఠుడైనవాడును రఘు వంశమున బుట్టినవాడును అయిన లక్ష్మణుడైనను అన్నగారి యాజ్ఞను పొంది నన్నేల రక్షింపడు? పురుషులలో శ్రేష్ఠులైన రామలక్ష్మణులు ఎంతయో సమర్థులు. అగ్నికి, వాయువునకు సాటియైన తేజస్సుగలవారలు. దేవతలకైన నెదిరింప సాధ్యము గానివారు. మఱి వారలు నన్నెందుల కుపేక్ష చేయుచున్నారు. శత్రువులను బాధించువారు, సమర్థులు నయిన వారిరువును గలిసి నన్ను దయతో చూడకుండుటకు నిశ్చయముగా నేదియో బలమైన కారణముండి యుండును.

**హనుమంతుడు సీతాదేవి నోదార్చిన విధము చెప్పుట :**

జాలి కలిగించునట్లు కన్నీరు గార్చుచు సీత పలికి మాటలను విని నేను ఆ పూజ్యురాలితో నిట్లంటిని. ఓ సీతాదేవీ! రాముడు నీయెడబాటు వలన కలిగిన దుఃఖముచే నితర కార్యముల యందాసక్తి లేకయున్నాడు. రాముడు దఃఖించుచుండుటచే లక్ష్మణుడును పరితపించు చున్నాడు. చాల శ్రమతో నిన్ను నేను చూడగల్గితిని. ఇప్పుడిది దుఃఖింపదగిన సమయము కాదు. తల్లీ! నీవీ క్షణమునందే దుఃఖము తొలగిపోవుటను చూచెదవు. నరశ్రేష్ఠులు నిందిపదగని వారు రాజపుత్రులునగు వారిరువురును నిన్ను జూచి యుత్సాహముతో ఈ లంకనంతయు భస్మము చేసెదరు. చక్కని నడుము గలదానా! భయంకరుడైన రావణుని, అతని బంధువులను యుద్ధమున సంహరించి తప్పక రాముడు నిన్నయోధ్యానగరమునకు తీసికొనిపోగలడు. ఓ నిందంపబడనిదానా! రాముడు గుర్తుపట్టునట్టిదియు ఆయనకు సంతోషము గలిగించునదియునగు గుర్తు నొకదానికి నీవిమ్ము అని నేనడుగగా రామా! ఆమెయు అన్ని దిక్కులను చూచి రాక్షసులెవ్వరును చూచుటలేదని నిశ్చయించుకొని జడకు ఆభరణమగు ఈ యుత్తమమగు మణిని కొంగున నుండి తీసి నాకిచ్చినది (సీత కొన్ని యాభరణము లను పారవైచి కొన్ని చెట్టునకు తగిలించెను గాని యీ చూడామణి యింద్రునిచే నీయబడినది కావునను, ఇది సముద్రమున బుట్టినదగుట చేతను బయటికి కనిపించిన రావణుడపహరించునేమోయని దానిని మాత్రము కావలియున్న రాక్షస స్త్రీలకు దెలియకుండ చీర కొంగున దాచియుండెను) ఓ రఘుశ్రేష్ఠుడా! నేనాదివ్యమైన మణిని నీకై పుచ్చుకొని శిరస్సువంచి యామెకు ప్రణమిల్లి యిచ్చుటకు వచ్చుటకై సిద్ధపడితిని. వేసవికాలమున చల్లగాను శీతకాలమున వేడిగాను నుండు సీతాదేవి నేనట్లు వెళ్లుటకుత్సాహ పడుటను చూచి కన్నుల నిండ నీరు నిండగా, కన్నీటిచే కంఠము రుద్ధమై మాటలు తడబడుచుండగా నేను వెడలిపోవుచుంటినని మఱింతగా దిగులునొంది దుఃఖము పొంగిరాగా నాతో నిట్లనెను.

# అఱువది యెనిమిదవ సర్గము

## సీతాదేవి సందేశ వాక్యములు హనుమంతుడు రామునకు దెల్పుట :

హనుమంతుడా! సింహ సమానులైన యా రామలక్ష్మణు లిరువురను, సుగ్రీవుని, అతని మంత్రులందఱిని కుశలమడిగితినని చెప్పుము. మహాభుజుడగు రాముడు నన్నీ దుఃఖ సముద్రము నుండి దాటించునట్లు నీవు సన్నాహము చేయుము. ఓ వానరుడా! నీవు రాముని కడకేగి యెక్కువై పొంగుచున్న నా యీ శోకమును, ఈ రాక్షసులు నన్ను భయ పెట్టుచుండుటను, ఆయనకు దెల్పుము. నీకు ప్రయాణము సుఖము కలిగించు గాక! ఓ రాజశ్రేష్ఠా! పూజ్యురాలగు నీ భార్య సీతాదేవి యిట్లు విషాదముతో పల్కినది. నేను చెప్పినదంతయు నీవాలోచించి సీతాదేవి పూర్తిగా క్షేమముగా నున్నదని నమ్ముము.

## హనుమంతుడు సీతతో తాను సంభాషించిన విధమును చెప్పుట :

నరులలో శ్రేష్ఠుడవగు ఓ రామా! అప్పుడు సీతాదేని నీకు నాయందు గల అనురాగ విశేషము చేతను, తన హితము కోరువాడనను భావము చేతను ప్రయాణమునకై తొందరపడుచున్న నన్ను చూచి ఆదరముతో మఱల నిట్లనెను. 'దశరథ తనయుడగు రాముడు యుద్ధమున రావణుని సంహరించి నన్ను దీసికొని పోవునట్లు నీవనేక విధముల చెప్పవలయును. శత్రువుల నణపజాలిన పరాక్రమముగల హనుమంతుడా! నీవిటనుండ దలంచినచో నొక్క రహస్య ప్రదేశమున నొక్క దినముండుము. అట్లుండి విశ్రమించి రేపు పోవచ్చును. ఓ పరాక్రమవంతుడా! అట్లు నీవింకొక్క దినమిచ్చుట నుందువేని హితుడవగు నీ సాన్నిధ్యముచే మందభాగ్యురాలనగు నా దుఃఖమున కొకింత యుపశాంతి కలుగును. పరాక్రమశాలియగు నీవు తిరిగి వచ్చుటకై వెళ్లగానే నా ప్రాణములు

నిలుచునో లేదో యని నాకు సందేహము గలదు. ఇందు సందేహము లేదు. నా భర్త నెడబాసి దుఃఖములపాలై దుర్గతినందియున్న నాకు నీవు కనబడకపోవుట మఱింత శోకమును గలిగించును. వీరుడవు, వానరశ్రేష్ఠుడవునగు ఓ హనుమంతుడా! నీ సహాయులగు ఋక్షవానరుల విషయమున నాకు గొప్ప సందేహము కలిగియున్నది. ఆ ఋక్ష వానర సేనలు కాని, యా రాజపుత్రులు గాని, దాటరానిదగు మహా సముద్రమునెట్లు దాటుదురు? ఈ సముద్రమును దాటుటకు గరుత్మంతునకును, నీకును, వాయుదేవునకును ఈ ముగ్గురికి మాత్రమే శక్యమగును గాని తక్కినవారికట్టి శక్తియుండదు. వీరుడవు కార్యములు సాధించుటలో గొప్పవాడవు అయిన హనుమంతుడా! ఓ శత్రుమర్దనా! నీవొక్కడవే రావణుడు మొదలైన సకల రాక్షసులను సంహరించి నన్ను తీసికొని రాముని యొద్దకు చేర్చుటయను కార్యమును సాధింపజాలుదువు గాని యట్లు నీ బలమును ప్రదర్శించుట నీకు కీర్తిదాయకము గాని రామునకు గాదు సుమా! రాముడు సమస్తమగు సేనలతో వెడలివచ్చి యుద్ధమున రావణుని జంపి విజయమును పొంది నన్ను నగరమునకు తీసికొనిపోవుట ఆయనకు కీర్తి దాయకము. నన్ను రావణుడు రామునకు భయపడి మాయోపాయముతో నెట్లు రహస్యముగా నపహరించుకొని వచ్చెనో అట్లే రాముడును రహస్యముగా నన్ను దీసికొనిపోవుట యుచితమైనది కాదు. శత్రు సైన్యములను పీడించువాడగు రాముడు తన సైన్యములతో లంకను నింపి నన్ను తీసికొనిపోవునేని యది ఆయనకు తగిన పనియగును. కావున మహాత్ముడును యుద్ధమున పరాక్రమ శాలియునగు రామునకు ఎట్లాచరించుట తగియున్నదో అట్లు నీవు చేయుము. అర్థవంతమును, వినయముతో గూడినదియు, యుక్తి యుక్తము నయిన మాటను విని నేనిట్లు బదులు చెప్పితిని. ఓ సీతాదేవి! ఎలుగుల కోతుల సేనకు ప్రభువు వానరులలో శ్రేష్ఠుడు మహాబలవంతుడునగు సుగ్రీవుడు రామునకు తోడై నిన్ను తీసికొని వెళ్లుటకు కృతనిశ్చయుడైయున్నాడు. పరాక్రమ సంపన్నులు, బుద్ధి బలము శరీర బలము గలవారు మనోవేగముతో వచ్చి శత్రువులపై పడగల

వానరులు ఆయన చెప్పు చేతలలో నున్నారు. వీరాకాశమున, పాతాళమున భూమిపై నంతటను అడ్డులేని సంచారము గలవారై యున్నారు. అమితమైన తేజస్సు గలవారును, గొప్ప కార్యములు చేయుటలో భంగపడనివారును, బలముచే గర్వించినవారును, మహాత్ములును అగు వానరులు ఆకాశమార్గమున చాలమార్లు భూమిని చుట్టివచ్చిరి. ఆ సైన్యములో నాకంటె శ్రేష్ఠులు నాతో సమానులునగు వానరులే యున్నారు గాని నాకంటె తక్కువవారు లేనే లేరు. నావంటి సామాన్యుడే సముద్రమును దాటి యిచటకి రాగలిగె నన్నచో నింక మహా బలశాలురైన వారి విషయము వేరుగా చెప్పవలయునా? రాయబారము మున్నగు పనులకు సామాన్యులను బంపుదురుగాని శ్రేష్ఠులను కాదు గదా. ఓ దేవీ! కావున నీవింక చింతింపకుము. నీ దుఃఖమును విడువుము. ఆ వానరవీరు లొక్క గంతులో లంకను చేరగలరు. ఓ మహా భాగ్యవతీ! నరశ్రేష్ఠులగు నా రామలక్ష్మణులు నా వీపుపై నెక్కి పర్వతముపై నుదయించు సూర్యునివలె నీ కడకు వచ్చెదరు. శత్రువులను జంపువాడును. సింహ సదృశుడును అగు రాముని, విల్లుచేత ధరించిన లక్ష్మణుని లంకా ద్వారము చేరినవారినిగా వేగము గానే చూచెదవు. గోళ్లు, దంతములు ఆయుధములుగా గలవారును, వీరులు, సింహములు, పులుల వంటి పరాక్రమము గల వారును, శ్రేష్ఠములైన యేనుగుల వలె పెద్ద శరీరములు గలవారును, అగు వానరులు శీఘ్రమే యిచ్చటకు వచ్చుట చూచెదవు. కొండలవలె, మేఘములవలె నున్నతులై లంక యందలి మలయ పర్వత ప్రాంతముల యందు సింహనాదము చేయు వానరశ్రేష్ఠుల మహాధ్వనిని త్వరలో నీవు విందువు. శత్రువుల నణచువాడగు రాముడు వనవాస దీక్షను పూర్తిచేసి నీతో గూడి బయలుదేరి అయోధ్యలో పట్టాభిషిక్తుడగుటను త్వరలో చూచెదవు అని అట్లు పూర్వము నీవామెకై పరితపించుచుంటివని వినుటతోడనే శోకాక్రాంతయైన ఆ సీత దుఃఖము తొలగుటకై ఆమెకిష్టమైనవియు ఉచితములైనవియునగు మాటలతో ఆమెను ప్రసన్ను రాలిని చేయగా ఆమె యొకింత శాంతి వహించినది'' అని హనుమంతుడు రామునకు సీత వృత్తాంతమును దెలియజేసెను.

యతుల మనస్సులందు స్థిరనివాసము గలవాడా!
నిన్ను తలంచు జనుల యభీష్టములను నెరవేర్చు సామర్థ్యము గలవాడా!
సర్వ భూతములచే నమస్కరింపబడినవాడా!
ఇంగితజ్ఞులలో శ్రేష్ఠుడా!
పండితులచేత కీర్తింపబడిన కార్యములు గలవాడా!
ఓ రామా! నమస్కరించిన జనుల పాపములను చెదరగొట్టువాడా!
మునీంద్రుల యాత్మలకానందము గలిగించువాడా!
దయా సత్యములకు నిలయమైనవాడా!
రాక్షస సమూహములకు భీతి గలిగించు యుద్ధము గలవాడా!
పొగలేని యగ్నివలె ప్రకాశించు తేజస్సు గలవాడా!
మనోహరమైన నీలమేఘమువంటివాడా!
నల్లకలువలవలె శ్యామమైనవాడా!
పూర్ణచంద్రునివలెను, మన్మథునివలెను సుందరమైనవాడా!
చంద్రుడు మొదలయిన దేవతలచే పూజింపబడు నామము గలవాడా!
పరిశుద్ధమైన మనస్సులు గల భక్తులను రక్షించుచు అభీష్టములనిచ్చు రామా!
భూదేవి చేతను, కుమార స్వామి చేతను, బ్రహ్మదేవుని చేతను తమ ముఖముల నుండి వెల్వరింపబడిన సారస్యముగల పద్యముల సమూహములచే స్తుతింపబడిన ఆశ్చర్యకరమైన పరాక్రమము గలవాడా!
గొప్పనైన సముద్రమును లంఘించుటకు కారణమైన దేవ విమానము వంటిదగు రాముడను పేరు గలవాడా!
ఆశ్రయించిన వారికి సర్వ సౌఖ్యముల నొసగునట్టి రామచంద్రా!

ఇది

శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానసయు,

శ్రీ మొలుగు వెంకట నృసింహాచార్య తనూజయు,

శ్రీమత్పండిత మంత్ర రత్న బిరుదాంచిత

శ్రీమతిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లంగారి

ధర్మపత్నియునగు

## వెంకట సీతమ్మచే

శ్రీ వావిలికొలను సుబ్బారాయ ప్రణీత

శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణమునకు వ్రాయబడిన వచనానువాదము

నందు

సుందర కాండము.

శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధిరస్తు

శ్రీజగన్మాత్రర్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

నమోస్తు రామాయ సలక్ష్మణాయ।

నమోస్తు దేవ్యై జనకాత్మజాయై।

నమోస్తు వాతాత్మ భువే వరాయ।

నమోస్తు వల్మీక భవాయ తస్మై॥

శుభం భవతు

